# శ్రీః

మహాకవి శ్రీ కాళిదాస విరచితః

# ఋతుసంహారః



## మృణాళినీ వ్యాఖ్యా

(పదవిభాగ అన్వయ ప్రతిపదార్థ తాత్పర్య క్రియాదర్శవిశేషకాః)

**రావి మోహనరాయః**

ప్రకాశికా

**రావి కృష్ణకుమారీ**

404, జంజనం కాంప్లెక్స్, 1టౌన్ పోలీస్ స్టేషన్ ఎదురుగా,

చీరాల – 523 155



శ్రీః

మహాకవి కాళిదాస విరచితః

**ఋతుసంహారః**

**మృణాళినీ వ్యాఖ్యా**

(పదవిభాగ, అన్వయ, ప్రతిపదార్థ, తాత్పర్య, క్రియాదర్శవిశేషములు)

**రా మో రా,**

పృష్ఠ సఙ్ఖ్యా : **218**

మూల్యమ్ : రూ. **90/-**

ద్వితీయ ముద్రణమ్ : **15-08-2015**



404, Janjanam Complex,

Opp. I Town Police Station, **Chirala-523 157**

Cell : 9440115411

**Designed by :**

**విక్రమ్ గ్రాఫిక్స్, ఆంధ్రరత్న రోడ్ - చీరాల.**

☎ 08594 - 233062

ప్రకాశికా

**రావి కృష్ణకుమారీ**

404, జంజనం కాంప్లెక్స్,

1టౌన్ పోలీస్ స్టేషన్ ఎదురుగా, చీరాల – 523 155



శ్రీః

# ఆభిధానీయకమ్



**“ఋతుసంహార”** నామకమిదం కావ్యం మహాకవి కాళిదాసస్య కృతిరితి వదంతి యత్ర “ఘటకర్పర” కావ్యస్య చతురస్రశోభి చాతుర్యం వర్ప్వతీతి. ‘ఘటకర్పరం’చ కాళిదాసకృతమేవేతి తత్ర అంతిమశ్లోక గత “ఘటకర్పర” శబ్దప్రసంగేన కావ్యస్య తత్కవేశ్చ “ఘటకర్పరప్రత్యభిజ్ఞా” ఇతి తద్వ్యాఖ్యాతా శ్రీమదభినవగుప్తపాదః అభిప్రేయాయ. “యా సృష్టిః స్రష్టు .......” ఇతి శాకుంతలాగ్రిమశ్లోకే అష్టమూర్తిషు “కాలం” ప్రాస్తౌత్ కాళిదాసః యస్య నామైవ ‘కాలీం’ ఆకలయతి. కాలః శివరూపః, కాలీ శక్తి రూపా. ఉజ్జయినీ మహారాజ్ఞ్యాః మహాకాల్యాః ప్రసాదేన లబ్ధికవిత్వవిత్త్వః కాళిదాసః సంవత్సరస్వరూపస్య పురుషస్య సంతర్పణార్థం కాలీషడ్రూపాణి ఋతునామాని నవరసైః రంజయన్ షాడబీ చక్రే నూనమ్.

షాడబముద్రోద్ఘాటనం చ క్రియతే భాషావ్యాఖ్యారూపప్రక్రియా-**కుంచికయా** శ్రీరావి మోహనరాయేణ ఘటకర్పరవ్యాఖ్యానప్రాప్తఘటోత్కచ-యౌవనేన. దైవమేవాత్రానుకామీనమ్ యత్ ఏతద్వ్యాఖ్యానాత్పూర్వం ఘటకర్పరస్య లఘుగ్రంథస్య వ్యాఖ్యా మనేనాకారయత్ అశిక్షయత్ చ వ్యాఖ్యా సరణిమ్. దివస్పృథివ్యావివ నితమాం భిన్నే జియాలజీ సంస్కృతభాషే. తత్ర భూశాఖాయాం నదీష్ణోయం సంస్కృతభాషాయాం కేన సంబంధేన ప్రవిష్టః? ‘మోహన’త్వమేవ స “బంధః” ఇతి సంక్షేపతః సమాదధే. “యో యస్మిన్ ముహ్యతి స తత్ర నహ్యతి స్వమ్.” ఏతావదయం ద్యుసద్భాషాకావ్యపరంపరాముద్రణం ప్రావరీవర్తయత్. స్వద్రవ్యమాత్రవ్యయేన ముద్రాప్యమాణ తత్తన్మహన్మహాగ్రంథః తన్మహస్సమాహిత మనాః తత్క్రియాసమభిహారసంక్ష్ణుతయా మనీషయా “అల్పారంభః క్షేమకరః” ఇతి కల్పమాశ్రిత్య లఘుగాత్ర మలఘుగోత్ర మిదం కావ్యమ్ వ్యాఖ్యయా సంఖ్యాపయతి.





అయం రావి మోహనరాయః (రామోరా) సంస్కృతే వినేయః. స్వైరం కృషీవలః. స్వయం మతికృతిభ్యాం హలహాలిభ్యాం ఇవ ఇదం శంబాకుర్వన్ ద్వితీయాకుర్వన్ “కిం మృదు? కిం పటు? కిం భేద్యం? కిం వేద్యం?” ఇతి విదన్ వివిదిషూణాం వేదనాః నుదన్ జిజ్ఞాసుభిః దుర్జ్ఞానాన్ విషయాన్ సుజ్ఞానాన్ కరోతి.

ప్రాసంగ్యోపి అసావధ్వనీనస్సన్ దమ్యానాం స్వతుల్యానాం దండ మాధాయితం ఏతం గ్రంథం వ్యరీరచత్ యత్ర జిజ్ఞాసవ ఏవ ఆగ్రభోజనికాః సంస్కృతచ్ఛాత్రభోగీణోయం గ్రంథకిశోరః సంస్కృతకిశోరాన్ విద్వయతీతి నిశ్చప్రచమ్. యదత్ర తేభ్యఏవ గడవః గ్రంథయశ్చ కరీషంకషయా చికిత్సయా నిర్మ్యాల్యమానా అభూవన్. అత్ర ప్రధానతయా క్రియావిషయే పదవ్యుత్పత్తివిషయే చ భూయిష్ఠ మశ్రమ్యత. సంతి పండిత భండితాః వ్యాఖ్యాః. ఉగ్రంపశ్యాః పండితాః చండమార్తండా ఇవ అథవా పృషోదరసహోదరాః పాండిత్య విహాయసి అలభ్యడయమానాః స్వవ్యాఖ్యాభిః రత్నగర్భా మపూపులకన్. బాఢమ్. కింతు అహల్యాయా అస్యాః దంతురతాం తే న జానంతే. ఉచ్చావచం న పశ్యంతి. అతోత్ర ఏతద్వర్గీణస్య వ్యాఖ్యా ఆవశ్యకీ. అత ఇయం ఆదరణీయా. హే సుహృదః ! సపీతయే యూయ మాకార్యధ్వే. ఉభయస్యాపి విషయస్య స్వహృదయేషు లాపయితారః సహృదయా ఏవేతి ఆనందభూమికా.

తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై.

ఇతి

**మేళ్ళచెర్వు వేఙ్కటసుబ్రహ్మణ్య శాస్త్రీ**

*గోరంట వెంకన్న సంస్కృతకళాశాలా సంస్కృతాధ్యాపకః*

*తిమ్మసముద్రం*



శ్రీః

# మృణాళినీ వ్యాఖ్యా

**ఏ) ఋతువు – కాలము**

'ఇయర్తీతి ఋతుః, ఋ–గతౌ, ద్వౌద్వౌ మాఘాదిమాసౌ స్యాదృతుః' అని అమరము. కాలము భగవత్స్వరూపము, కాలవిభజనంలో వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమన్త, శిశిరర్తువులు ఏర్పడినాయి. కాలపురుషుని అంగములీ ఋతువులు. కాల ప్రభావముచేత జీవుల మనసునుండి భావాలు వెలువడుతుంటాయి. జీవులకు ప్రకృతిలో కలిగే సంబంధాన్ని నిర్ణయించేదీకాలము.

**బి) ఋతువు – వాఙ్మయము**

1) అపౌరుషేయములు, బ్రహ్మజ్ఞానస్వరూపములునైన మూడు వేదములందలి 'ఋగ్వేదము' న 'ఋతురాజో వసన్తః' అని చెప్పబడినది.

2) వేదాంతములైన ఉపనిషత్తులలోని 'నారాయణోపనిషత్తు' నందలి అరుణ కేతకము కాలచక్ర ప్రవర్తకుడైన సూర్యుని, సంవత్సర స్వరూపాన్ని వర్ణించుచూ, 'ముప్పది ముహూర్తములొక దినమని, 60 దినములొక ఋతు' వని చెప్పినది. సంవత్సరానికి ఆఱు ఋతువులని, ఋతువులకు ప్రభువు సంవత్సరమని, సంవత్సర స్వరూపుడైన కాలపురుషుని ఆజ్ఞను ఋతువులు నిర్వహిస్తాయని నిర్ధారించుకొనవచ్చును.

3) భవిష్యత్పురాణములో 'చైత్రోత్సవ' ప్రశంస ఉన్నది.

4) వాల్మీకి మహర్షి రచించిన శ్రీమద్రామాయణములోను, పంచమవేదమైన మహాభారతములోను, శ్రీమద్భగవద్గీతలోను ఋతువుల వర్ణన ఉన్నది.

**సి) ఋతులక్షణాలు – వేద వాఙ్మయము**

**1) వసన్తర్తువు –** ప్రకృతి సోయగానికి మురిసిపోని రసహృదయులుండరు. వెన్నెలలు, తుమ్మెదల ఝంకారములు, మల్లెలపరిమళములు, కోకిలల కుహూకుహూ రావములు, శుకపికముల కూజితములు ఒక్కటేమిటి ప్రకృతిలోని సర్వమూ అణువణువూ సంబరము చేసుకొంటుందీ వసన్తర్తువులో. ప్రజలు ఉపనయన, వివాహ, యజ్ఞాది శుభకర్మలాచరిస్తూ బంధుమిత్రులను పిలుచుకొని వారిని ఆనందింపచేస్తూ ఉంటారు. ఎందరో మహాకవులకు కావ్యవస్తువుగా నిలిచిందీ ఋతువు.

**2) గ్రీష్మర్తువు –** ఇది తన తీవ్రతాపముతో భూమిని తపింపచేస్తుంది. ఏకాదశ రుద్రగణము గ్రీష్మంలో ఉండటంవల్ల తాపాధిక్యం కలుగుతుంది. ఆ తాపాధిక్యంలో జీవుల్లో ఏర్పడి ఉండే వైరభావాలు సొమ్మసిల్లిపోతాయి.





**3) వర్షర్తువు –** ఇది గ్రీష్మంలో ఏర్పడ్డ భూతపనను తొలగించటానికి, ప్రాణికోటి కాధారమగు జలాన్ని సమృద్ధిగా తెస్తుంది. ఈ ఋతువుకు ప్రభువులు ద్వాదశాదిత్యులు సస్యఫలానికీ ఋతువు ప్రాతిపదికయగును. 'ఏరువాక' తో రైతులు వ్యవసాయము చేస్తారు.

**4) శరదృతువు –** జీవుల్లో ఈ ఋతువు రాకతో వసన్తర్తువులో ఏర్పడ్డ అనారోగ్యలక్షణాలు క్రమముగా శాంతిస్తాయి. నేలపై బురద ఎండుతుంది. ఈ ఋతువుకు దేవతలే ప్రభువులు. చల్లని వెన్నెలలు, మెల్ల మెల్లగావీచే పిల్లగాలులకు ప్రకృతి పరవశించి పులకరిస్తుంది.

**5) హేమన్తఋతువు –** ఈ ఋతువునందు చలి తీవ్రత అధికము.

**6) శిశిరర్తువు –** ఇందు ప్రకృతి తన సౌందర్యాన్ని కొంత తగ్గించుకొంటుంది.

**డి) ఋతువులు – ఎందరో మహానుభావులు**

సంస్కృత లాక్షణికులైన భరతుడు, భామహుడు, భోజుడు, విద్యానాథుడు, కేశవ మిత్రుడు, రాజశేఖరుడు మొదలైనవారు ఋతులక్షణాలను వివరించటమే కాక మహా కావ్యాలలో 'అష్టాదశవర్ణనలు' ఉండాలని, అందు 'ఋతువర్ణనము' ఒకటని నిర్దేశించారు. వివిధ ఋతువుల్లో ఈ చరాచర ప్రకృతి పొందే మార్పులను వర్ణించటం, అది కథకు రసమునకు అనుకూలంగా చేయబడినపుడు కావ్యానికి అమితశోభను కల్గిస్తుందని తెలియనికాదు.

తెలుగు లాక్షణికులలో విన్నకోట పెద్దన, భట్టుమూర్తి, అప్పకవి, కిళాంబి వేదాంతాచార్యులు 'ఋతువర్ణన' ప్రాధాన్యమును పేర్కొన్నారు. నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి తదితరులు 'ఋతువర్ణన' విధానాన్ని అనుసరించారు. ఇక శ్రీకృష్ణదేవరాయలు రచించిన విష్ణుచిత్తీయమను 'ఆముక్తమాల్యద' ఋతువులకు పుట్టినిల్లు.

ఇక ఆధునిక కవులలో......

1) యుగకర్తగా పేర్కొనబడిన శ్రీ గురజాడ వేంకట అప్పారావుగారి 'ముత్యాల సరాలు' లో 'ఏయే వేళల పూచేపూవులు ఆయావేళలలో, ఏయే ఋతువులో పండే పండ్లను ఆయా ఋతువులలో....'

2) కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి 'కిన్నెరసాని' లోని 'ఋతువు ఋతువున మారు రుచులలో కిన్నెరా'

3) అభినవపోతన వానమామలై వరదాచార్యులుగారి పోతన చరిత్రములోని 'శిశిరమ్ములోన దన జీర్ణవస్త్రములొల్చె నల వసంతమున నూత్నలంకృతము దాల్చె'.....

4) మహాకవి దాశరథిగారి 'తామసి' లోని 'ఇరులు కోకిలములై ఎచట కూయునో అచ్చోట ఆమని అవతరించు, ఇరులు తుమ్మెదలుగా ఏవేళ మ్రోగునో ఆవేళల వసంత మాగమించు' .......

5) జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి. నారాయణరెడ్డిగారి ఋతుచక్రములోని ఋతువర్ణనము,

6) డా॥ నాయని కృష్ణకుమారిగారి 'చైత్రలక్ష్మి' లోని ఓ చైత్రలక్ష్మీ! ఓ చైత్రలక్ష్మీ! హృత్కమల వికసనాయత సూర్యరశ్మీ....!

7) సాహిత్యంలో నోబెల్‌ప్రైజ్‌కు సిఫార్సు చేయబడిన శ్రీగుంటూరు శేషేంద్రశర్మగారి 'ఋతుఘోష' కావ్యములోని 'ఎందుజూచినన్ సదమలకాంతులం గులుకు జాజులు...., ముంచాయి',

8) దువ్వూరి రామిరెడ్డిగారి 'ఋతుసంహారము' పైడిపాడి సుబ్బరామశాస్త్రిగారి ఋతుప్రబంధము, బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారి 'ఋతుపవనము', ....... ఇలా ఎందరోమహానుభావులైన కవుల కావ్యాలన్నీ మనోహరమైన అద్భుతమైన ఋతు వర్ణనలతో నిండినవే.

వీరందఱు తేనెటీగల్లా, సంస్కృతములో మహాకవి శ్రీకాళిదాసుచే కేవలం ఋతు వర్ణనల కొఱకే వ్రాయబడిన తొలికావ్యమైన 'ఋతుసంహారము' అనే తేనెతుట్టెను ఆశ్రయించి రసాస్వాదానందాన్ని పొందినారనుట అతిశయోక్తికాదు.

**ఇ) ప్రేరణ**

1) భారతీయ సంస్కృతికి మూలస్తంభమైన సంస్కృతభాషమీదను వల్లమాలిన అభిమానముతో ఎన్నో ప్రసిద్ధమైన ప్రాచీన సంస్కృత గ్రంథములలో తెలుగున వ్యాఖ్య లేనటువాటిని ఎన్నుకొని వాటికి విస్తృతవ్యాఖ్యలను అందించవలసినదిగా కోరిన వెంటనే అలుపెరుగక నిరంతరము రచనావ్యాసంగములో మునిగి తేలుతూ రసానందాన్ని పొందుతూ వ్యాఖ్యలందించి, వాటి వెలుగును ద్విగుణీకృతము చేసినవారు పూజ్యులు వేదమూర్తులైన శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు.

2) శ్రీహయగ్రీవ భగవానుని ప్రసాదముతో జగద్గురువైన శ్రీ శఙ్కర భగవత్పాదులు అందించిన సంస్కృతవాఙ్మయమునకు దీటైన రీతిలో ఆధ్యాత్మిక గ్రంథ రచన సాగించిన వారు శతాధికగ్రంథకర్త, అపరశఙ్కరుడు అయిన శ్రీ బెల్లంకొండ రామరాయకవి .

3) సంస్కృత వ్యాకరణము, శ్రీమద్భగవద్గీతోపనిషత్తులు వ్యాకరణవిశేషములు, పాణిని శిక్షా, సంస్కృత సంభాషణమ్ వంటి గ్రంథములు రచించిన వారున్ను, 'మీకు ఎట్టి అవసరమున్ననూ నాకు వ్రాయవచ్చును' అని చేయూత నిచ్చి వాత్సల్యమును





కురిపించిన శ్రీ ఆర్.వి.ఆర్. కృష్ణశాస్త్రిగారు.

4) సంస్కృతాన్ని అధ్యయనంచేయాలన్న సంకల్పము కలిగినపుడు లభించిన 'శ్రీకాశీకృష్ణాచార్య' గారి 'క్రియాదర్శము' అనే గ్రంథము దాని నామము.

**యఫ్) ముగింపు**

ధాతు స్వరూప స్వభావాన్ని గ్రహించటానికి నేను చేపట్టిన 'ఋతుసంహార' కావ్య వ్యాఖ్యను సాంతము పరిశీలించి, తగు సూచనలిచ్చి, మెరుగుల దిద్దుటతోబాటు 'అభిధానీయకమ్' ను అందించిన శ్రీ మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి, అచ్చుతప్పులు సవరించి చేయూత నిచ్చిన డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగార్కి, ఏదడిగా ఓర్పుతో చెబుతూ చిరునవ్వులు చిందించే డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి గారికి నమస్సుమాంజలులు.

ఈ 'వ్యాఖ్యా' గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయమునందించిన శ్రీ మక్కెన అజయ్‌చంద్ర కు శ్రీహయగ్రీవభగవానుడు ఆయురారోగ్య ఐశ్వర్యములిచ్చుగాక!

ఋతు సంహార గ్రంథాధ్యయనఫలమే ఈ నా 'మృణాళినీ' వ్యాఖ్య. చిన్నప్పటి నుండి స్మరించిన వెంటనే నాలో ఏదో తెలియని మధురానుభూతులను కలిగించు చున్నవారు మహాయోగియైన శ్రీ అరవిందుడు. వారి అర్ధభాగమైన 'మృణాళినీ' దేవి పేరే ఈ నా వ్యాఖ్యకు నామమైనది. ఈ వ్యాఖ్య సంస్కృతాన్ని అధ్యయనము చేయాలనుకునేవారికి సర్వవిధముల అనుకూలముగా నుండు విధముగా చేయబడినదని భావిస్తూ వారి కుపయోగపడగలదని ఆశిస్తూ....

**సర్వులకు నమస్సులతో.....**

మీ,

**రా మో రా,**

భూవిజ్ఞానశాస్త్రశాఖాధ్యాపకుడు,
వి.ఆర్.యస్. & వై.ఆర్.యన్.కళాశాల, చీరాల



"యస్య పాండిత్యేన సంస్కృతస్యాపతే
యీభూత శాస్త్ర మాంధ్రే చకాస్తి,
యస్య సౌజన్యేన మన్యేయ వార్ధకమ్
జిజ్ఞాసు విజ్ఞాన వర్ధకమితి,
యస్య సారస్యేన దూరేత్యమాదృశా
అపి బంధవంతి, బోధం చ యంతి,
యస్య ప్రసాదేన చాధ్యాత్మిక గ్రంథ
ముద్రణాధ్వర సోమయాజకోస్మి

తస్య సార్ధక గీర్బల దోర్బలస్య
దోర్బలాన్వయవత్సస్య వత్సలస్య
**విశ్వనాథస్య** శర్మణః **"పితృసమస్య"**
పదమహోత్పలయోః **"గ్రంథ"** మర్పయామి.



# Sun, Earth, Seasons and Water: What *Rigveda* Says

*Thou dost protect and purify everything, O Sun! Praised be Thy light in which Thou dost look after and feed this world and all living things. Fire Thou art that dost originate in Ocean, Sky and Space, O Sun! Thou art Fire That divideth seasons and produceth the sequence of living beings on Earth. Thou risest from the east, O Sun! watchest the Universe and destroyest invisible, poisonous creatures. Thou art the Father, O Sun! Whom Mother Earth doth worship through 'Yajna'. Deciding to produce varieties of Crops, Thou generatest the emboyo irrigated with water inside the earth.*

*Feed on fine grass, O Cows! ; drink ye of ponds clean, safe water; procreate, and give birth to calves.*

*Water be ever the same: It riseth up and cometh down in rain. Clouds gladden the Earth and Fire pleaseth the heaven.*



శ్రీః

మహాకవి కాళిదాస విరచితః

# ఋతుసంహారః

## గ్రీష్మవర్ణనం నామ ప్రథమః సర్గః

మృణాళినీ వ్యాఖ్యా

(పదవిభాగ, అన్వయ, ప్రతిపదార్థ, తాత్పర్య, పదాదర్శవిశేషములు)

**రావి మోహనరావు**



శ్లో॥ ప్రచణ్డసూర్యః స్పృహణీయచన్ద్రమా
స్సదావగాహక్షమవారిసఞ్చయః।
దినాన్తరమ్యోఽభ్యుపశాన్తమన్మథో
నిదాఘకాలోఽయముపాగతః ప్రియే॥ 1

**పదవిభాగము:-** ప్రచణ్డసూర్యః స్పృహణీయచంద్రమాః సదా+అవగాహక్షమవారి సఞ్చయః దినాన్తరమ్యః+అభి+ఉపశాన్తమన్మథః నిదాఘకాలః+అయమ్ ఉపాగతః ప్రియే.

**అన్వయక్రమము:-** ప్రియే ప్రచణ్డసూర్యః స్పృహణీయ చంద్రమాః సదా అవగాహ క్షమ వారిసఞ్చయః, దినాంత రమ్యః అభ్యుపశాన్త మన్మథః అయం, నిదాఘకాలః, ఉపాగతః.

**ప్రతిపదార్థము:-** ప్రియే=ప్రియురాలా!, ప్రచణ్డసూర్యః=మిక్కిలితీక్ష్ణమైన సూర్యుడు గలదియు, స్పృహణీయ=కోరదగిన, చంద్రమాః=చంద్రుడుగలదియు, సదా=నిత్యము, అవగాహ=స్నానమునకు, క్షమ=తగిన, వారిసంచయః=నీటిసమూహముగలదియు, దినాంత=సాయం సమయమునందు, రమ్యః=రమణీయమైనదియు, అభ్యుపశాన్త = మిక్కిలియణగిన, మన్మథః=కామముగలదియు అగు, అయమ్=ఈ, నిదాఘకాలః =గ్రీష్మకాలము, ఉపాగతః=వచ్చినది.

**తాత్పర్యము:-** ఓ ప్రియురాలా! ప్రచణ్డమైన సూర్యుడుగలదియు, చంద్రుని రాకను కోరుచున్నదియు, నిత్యము స్నానమునకు తగిన నీటిసమూహము కలదియు, రమణీయమైన సాయం సమయముగలదియు, కామోద్రేకముపశమింపజేయునదియు యగు గ్రీష్మకాలము వచ్చినది.

**పదాదర్శవిశేషములు:-**





a) **సమాసములు:-**

1) ప్రచణ్డసూర్యః – ప్రచణ్డః సూర్యో యస్మిన్నసౌ – బహువ్రీహిః
2) స్పృహణీయచంద్రమాః–స్పృహణీయః చంద్రమాః యస్మిన్నసౌ– బహువ్రీహిః
3) సదావగాహక్షమవారిసంచయః – సదా అవగాహనే క్షమః వారిణః సంచయో యస్మిన్ సః – బహువ్రీహిః
4) దినాన్తరమ్యః – దినస్య అన్తః దినాంతః – షష్ఠీతత్పురుషః – దినాన్తే రమ్యః సప్తమీతత్పురుషః
5) నిదాఘకాలః – నిదాఘస్య కాలః – షష్ఠీతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) నిదాఘ, ఉష్ణోపగమ, ఉష్ణ, ఊష్మాగమ స్తపః, గ్రీష్మ ఊష్మకః – ఈ (7) జ్యేష్ఠాషాఢమాసములతో గూడిన ఋతువుపేళ్ళు. **నితరాం దహ్యతే జనోఽత్ర నిదాఘః, దహ భస్మీకరణే** – దీనియందు జనము మిక్కిలి దహింపబడును.
2) చంద్రేణ కర్పూరేణ మీయతే ఉపమీయత ఇతి చంద్రమాః – చంద్రమనగా కర్పూరము. దానితో బోల్చబడువాడు. **హిమాంశుశ్చన్ద్రమాశ్చన్ద్ర ఇన్దుః కుముదబాన్ధవః**
3) మననం మత్ చేతనా తాం మథతీతి మన్మథః – బుద్ధిని గలియబెట్టువాడు. **మదనో మన్మథో మారః ప్రద్యుమ్నో మీనకేతనః.....**

c) **గుణము – ప్రసాదగుణము:-** 'ప్రసిద్ధార్థపదత్వం యత్తత్ప్రసాదో నిగద్యతే' – అని లక్షణము. ప్రసిద్ధమైన అర్థముగల పదములు గలిగియుండుటయే' ప్రసాద గుణమని చెప్పబడును.

d) **రీతి – వైదర్భీరీతి:-** 'బంధపారుష్యరహితా శబ్దకాఠిన్యవర్జితా, నాతిదీర్ఘసమాసా చ వైదర్భీరీతి రిష్యతే' అని లక్షణము. క్లిష్టసంధులులేని, శబ్దకాఠిన్యములేని, దీర్ఘసమాసములులేని పదరచన వైదర్భి అనబడును.

e) **ఛందస్సు – వృత్తము:-** 'జగతీ ఛందస్సు – వంశస్థవిలవృత్తము.

**లక్షణము:** 1) పాదమునకు 12 అక్షరములు. 2) **'వదన్తి వంశస్థవిలం జతౌజరౌ'** 3) ఇందు గణములు జ, త, జ, ర, 4) యతి (5,7).

| ఉదా:- | ప్ర చ ణ్డ | సూ ర్యః స్పృ | హ ణీ య | చం ద్ర మాః |
|---|---|---|---|---|
| | I U I | U U I | I U I | U I U |
| | జ | త | జ | ర |

f) **క్రియాదర్శము:-** ఉపాగతః, ఉప + ఆ + గతః – కృదంతము – క్త ప్రత్యయాన్తము

– భూతకాలికము, ఉప, ఆ = ఉపసర్గలు.

**ధాతువు:–** గమ్ – గతౌ వెళ్ళుట, సకర్మకము, పరస్మైపది, భ్వాది(1) ప్రకరణ ధాతువు, 'అ' వ్వికరణ ప్రత్యయము.'క్త' ప్రత్యయాంతము దుర్బల ప్రత్యయము గనుక ధాతువుకు గుణ వృద్ధులు రావు. ఈ ప్రత్యయము సకర్మక ధాతువులకు కర్మార్థమునజేరును. కనుక గమ్ + త >గంత గా మారును. ధాత్వంత అనునాసిక లోపమువలన గంత>గత గా మారును. నామవాచకరూపము ననుసరించి ఆయా లింగములలోనికి మారుచుండును. పుంలింగము – ఆగతః, స్త్రీలింగము– ఆగతా, నపుంసకలింగము – ఆగతమ్.

**శ్లో॥ నిశాశ్శశాఙ్కక్షతనీలరాజయః**
**క్వచిద్విచిత్రం జలయన్త్రమన్దిరమ్।**
**మణిప్రకారాః సరసం చ చన్దనం**
**శుచౌ ప్రియే! యాన్తి జనస్య సేవ్యతామ్॥ 2**

**పదవిభాగము:–** నిశాః శశాఙ్కక్షతనీలరాజయః క్వచిత్+విచిత్రమ్ జలయన్త్రమందిరమ్ మణిప్రకారాః సరసం చ చన్దనమ్ శుచౌ ప్రియే యాన్తి జనస్య సేవ్యతామ్.

**అన్వయక్రమము:–** ప్రియే! క్వచిత్ శశాంక క్షత నీలరాజయః, నిశాః విచిత్రమ్, జల యంత్రమందిరమ్ మణిప్రకారాః చ సరసమ్ చందనమ్ జనస్య శుచౌ సేవ్యతామ్ యాన్తి.

**ప్రతిపదార్థము:–** ప్రియే=ప్రియురాలా!, క్వచిత్=ఒకానొకచోట, శశాంక=చంద్రునిచే, క్షత=పోగొట్టబడిన, నీలరాజయః=చీకటి గుంపులు గల, నిశాః=రాత్రులును, విచిత్రమ్ =ఆశ్చర్యమగు, జలయంత్రమందిరమ్=జలధారాయంత్రములుగల గృహమును, మణి ప్రకారాః=చంద్రకాంతాదిరత్న విశేషములును, చ=మరియు, సరసమ్= ద్రవరూపమైన, చందనమ్=చందనమును, జనస్య=జనులకు, శుచౌ= వేసవికాలమునందు, సేవ్యతామ్= సేవింపదగియుండుటను, యాన్తి=పొందుచున్నవి.

**తాత్పర్యము:–**ఓ ప్రియురాలా! ఒకానొకచోట చంద్రునిచే పోగొట్టబడిన చీకటిగుంపులు గల రాత్రులను,(మరియొకచోట) ఆశ్చర్యముగొల్పు నీటిధారలను చిమ్ము యంత్రములు గల ఇళ్ళును, చంద్రకాంతాది మణివిశేషములును, (ఇంకొకచోట) చందనద్రవమున్ను జనులకు వేసవికాలమునందు తాపమును దీర్చి యానందము కల్గించుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–** 1) శశాంకక్షతనీలరాజయః – శశాంకేన క్షతాః నీలాః రాజయః యాసాం తాః – బహువ్రీహిః.

2) జలయన్త్రమందిరమ్ – జలస్య యన్త్రమ్, జలయన్త్రమ్ తస్య మందిరమ్ – షష్ఠీతత్పురుషః

3) మణిప్రకారాః – మణీనామ్ ప్రకారాః – షష్ఠీతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) నితరాం శ్యతి సర్వవ్యాపారాన్ నిశా. శో తనూకరణే – అన్ని వ్యాపారములను మిక్కిలి స్వల్పముగా జేయునది. **నిశా నిశీథినీ రాత్రి స్త్రియామా క్షణదా క్షపా....**

2) చందయతీతి చందనః. చది ఆహ్లాదనే. ఆహ్లాదమును జేయునది. **గన్ధసారో మలయజో భద్రశ్రీ శ్చన్దనోఽస్త్రియామ్.**

c) **గుణము –** a) ప్రసాదగుణము

b) **మాధుర్యగుణము:–** 'యా పృథక్పదతా వాక్యే తన్మాధుర్యం ప్రకీర్త్యతే' అని లక్షణము. 'చక్కని విడివిడి పదములతో విలసిల్లుట' మాధుర్య మనబడును.

d) **రీతి – వైదర్భీరీతి**

e) **ఛందస్సు – వృత్తము:–** 'జగతీ ఛందస్సు – వంశస్థవిలవృత్తము.

f) **క్రియాదర్శము :–** యాన్తి – లట్ ప్రథమ పురుష బహువచనము.

**ధాతువు:–** 1) **యా** ప్రాపణే – పోవుట. పరస్మైపది తిజ్ ప్రత్యయము 'అన్తి' చేర్చబడినది. రెండవ వికరణమునందలి ధాతువు ఇది. పది వికరణములలో ఇది కష్టతమమైన వికరణము. దీనిలో కొన్ని ధాతువులు ఏ సూత్రమునకు కట్టుబడని రూపములను పొందును. ఈ రెండవ వికరణములో ఆకారాంత ధాతువులకు మార్పేమీ రాదు. కాని లజ్ ప్రథమపురుష బహువచనంలో అస్ కు ఉస్ వైకల్పిక రూపము. యా+అన్తి > యాన్తి

2) ప్రతిష్ఠతేఽఇచ్ఛత్యయతే వ్రజత్యయతి గచ్ఛతి, ఋణోత్యటతి **యాత్యేతి**... అని 'ఆఖ్యాతచంద్రికా' 2-3-32

**శ్లో॥ సువాసితం హర్మ్యతలం మనోహరం**
**ప్రియాముఖోచ్ఛ్వాసవికమ్పితం మధు।**
**సుతన్త్రిగీతం మదనస్య దీపనం**
**శుచౌ నిశీథేఽనుభవన్తి కామినః॥ 3**

**పదవిభాగము:–** సువాసితం హర్మ్యతలం మనోహరం ప్రియాముఖ + ఉచ్ఛ్వాస వికమ్పితమ్ మధు సుతన్త్రిగీతం మదనస్య దీపనం శుచౌ నిశీథే+అనుభవన్తి కామినః

**అన్వయక్రమము:-** కామినః శుచౌ నిశీథే సువాసితమ్ మనోహరమ్ హర్మ్యతలమ్ ప్రియాముఖ ఉచ్ఛ్వాసవికమ్పితమ్ మధు మదనస్య దీపనమ్ సుతంత్రిగీతమ్ అనుభవన్తి.

**ప్రతిపదార్థము:-** కామినః=కాముకులు, శుచౌ=వేసవి కాలమున, నిశీథే=నడిరాత్రి యందు, సువాసితమ్=సువాసనకలిగింపబడిన, మనోహరమ్=రమణీయమైన, హర్మ్యతలమ్=మేడపైభాగమును, ప్రియా=ప్రియురాలియొక్క, ముఖ=ముఖము యొక్క ఉచ్ఛ్వాస=నిట్టూర్పుచే, వికంపితమ్=కదలింపబడిన, మధు=మద్యమును, మదనస్య=మన్మథునకు, దీపనమ్=ఉద్దీపనమగు, సుతంత్రిగీతమ్=మంచి తీగెలుగల వానియొక్క పాటను, అనుభవన్తి=అనుభవించుచున్నారు.

**తాత్పర్యము:-**కాముకులు వేసవికాలమున నడిరాత్రియందు మేడ పైభాగమున సుగంధముచే పరిమళించు అందమైన, ప్రియురాలినోటి నుండి వచ్చు మద్యపు నిట్టూర్పును, మన్మథునకు ఉద్దీపనమైన మంచి తంత్రులుగల వీణాదివాద్యములపైన గానమును అనుభవించుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) హర్మ్యతలమ్ - హర్మ్యస్య తలమ్ - షష్ఠీతత్పురుషః

2) ప్రియాముఖోచ్ఛ్వాసవికమ్పితమ్ - ప్రియాయాః, ముఖమ్ ప్రియాముఖమ్- షష్ఠీ తత్పురుషః - తస్య ఉచ్ఛ్వాసః, ప్రియాముఖోచ్ఛ్వాసః - షష్ఠీతత్పురుషః - తేన వికమ్పితమ్ - తృతీయాతత్పురుషః

3) సుతంత్రిగీతమ్ - సుతంత్రిభిః గీతమ్ - తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) మధు ప్రకృతికత్వాత్ మధు. ఇప్ప పువ్వు ప్రకృతిగా గలది. **మధ్వాసవో మాధవకో మధు.**

2) గీయతి ఇతి గీతం - పాడబడునది. **గీతం గానమిమే సమే.**

3) దీప్యతే అనేన ఇతి దీపః-దీనిచే ప్రకాశింపజేయబడును. **దీపః ప్రదీపః.**

c) **గుణము - ప్రసాదగుణము** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - వంశస్థవిలము.

f) **క్రియాదర్శము :-** 'అనుభవన్తి' - లట్ ప్రథమ పురుష బహువచనము. పరస్మైపది అను ఉపసర్గ.

**ధాతువు:-** 1) **'భూ'**-సత్తాయామ్=ఉండుట, అగుట. మొదటి గణధాతువులకు





పరస్మైపది ప్రత్యయములకును నడుమ 'అ' అను వికరణ ప్రత్యయముచేరును. భూ + అ + అన్తి > భో + అ + అన్తి > భవ్ + అన్తి > భవన్తి. ఇ ఈ లకు ఏకారము, ఉ ఊ లకు ఓకారము, ఋ ౠలకు అర్ అనునది, ఌకారమునకు అల్ అనునది గుణము.ఏచోఽయవాయావః ఏ ఓ ఐ ఔ లకు అచ్చుపరమగు నపుడు అయ్, అవ్, ఆయ్, ఆవ్-అను ఆదేశములు వచ్చును. వికరణప్రత్యయము పరమగునప్పుడు మొదటి గణమునందలి ధాతువుల చివరి ఇక్కులకు, ఉపధావర్ణములగు హ్రస్వములైన ఇక్కులకు గుణమువచ్చును.

2) 'సత్తాయామస్తి **భవతి** విద్యతే' అని 'ఆఖ్యాతచంద్రికా' 1-1-1

**శ్లో॥ నితమ్బబిమ్బైస్సదుకూలమేఖలైః**
**స్తనైః సహారాభరణైః సచన్దనైః।**
**శిరోరుహైః స్నానకషాయవాసితైః**
**స్త్రియో నిదాఘం శమయన్తి కామినామ్॥ 4**

**పదవిభాగము:-** నితమ్బబిమ్బైః+సదుకూలమేఖలైః స్తనైః సహార + ఆభరణైః సచందనైః శిరోరుహైః స్నానకషాయవాసితైః స్త్రియః నిదాఘమ్ శమయన్తి కామినామ్.

**అన్వయక్రమము:-** స్త్రియః సదుకూలమేఖలైః నితంబ బిమ్బైః సహారాభరణైః సచందనైః స్తనైః స్నానకషాయవాసితైః శిరోరుహైః కామినామ్ నిదాఘమ్ శమయన్తి.

**ప్రతిపదార్థము:-** స్త్రియః=స్త్రీలు, సదుకూలమేఖలైః=పట్టుకోకలతోను, మొలనూళ్ళతోను కూడిన, నితమ్బబింబైః=గుండ్రని పిఱుదులచే, సహారాభరణైః=హారములతోను, ఆభరణములతోను కూడిన, సచందనైః=చందనముతో కూడిన, స్తనైః=స్తనములచే, స్నానకషాయవాసితైః=స్నానముచేయునపుడు వాడు వస్తువులచేత సువాసన కలిగిన, శిరోరుహైః=కురులచే, కామినామ్=కాముకులకు, నిదాఘమ్=గ్రీష్మతాపమును, శమయన్తి=పోగొట్టుచున్నారు.

**తాత్పర్యము:-** స్త్రీలు పట్టుకోకలతోను మొలనూళ్ళతోను కూడిన గుండ్రని పిరుదులచే; హారములతోను, ఆభరణములతోను చందనముతోను కూడిన స్తనములచే; స్నానము చేయునపుడు వాడు వగరు వస్తువులచే, సువాసన గలిగిన కేశములచే; కాముకులకు గ్రీష్మతాపమును పోగొట్టుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) సదుకూలమేఖలైః - దుకూలాని చ మేఖలాశ్చ, దుకూలమేఖలాః - ద్వంద్వ సమాసః - తైః సహితాని యాని తైః సదుకూలమేఖలైః - బహువ్రీహిః

2) నితంబబిమ్బైః – నితంబానాం బింబాః తైః – షష్ఠీతత్పురుషః
3) సహారాభరణైః – హారాః చ ఆభరణానిచ హారాభరణాని – ద్వంద్వః – తైః సహితాని యాని తాని తైః – బహువ్రీహిః
4) సచందనైః – చందనేన సహితాని యాని తాని తైః – బహువ్రీహిః
5) స్నానకషాయవాసితైః – స్నానస్య కషాయైః వాసితాః యే తే తైః – తృతీయా తత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:–**
1) సురతసమ్మర్దేన నితరాం తామ్యతి ఇతి నితంబః. సురత సమ్మర్దముచేత మిక్కిలి గాసి బొందునది. **పశ్చాత్ నితంబః స్త్రీ కట్యాః**
2) ప్రావారోత్తరాసంగరూపేణ ద్విధా కూల్యత ఇతి దుకూలం. కూల ఆవరణే. కట్టుకొనుటకును మీద వేసికొనుటకును రెండు విధములుగా గప్పబడునది. **క్షౌమం దుకూలం స్యాత్.**

c) **గుణము – ప్రసాదమాధుర్యగుణములు** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

f) **క్రియాదర్శము :–** 'శమయన్తి' – లట్ ప్రథమ పురుష బహువచనము.

**ధాతువు:– 'శమ్'** ఉపశమే, పరస్మైపది. ప్రేరణార్థకము. దశమవికరణ ప్రత్యయము 'అయ' దశమవికరణ క్రియారూపాలే ప్రేరణార్థక రూపములు. ఏ వికరణంలోని ధాతువైనా ప్రేరణార్థమున ఈ వికరణములోవలె మారిపోతుంది. నాలుగవ వికరణము నందలి 'శము' ధాతువు ప్రేరణార్థకమున శమయతి, శమయతః, శమయన్తిగా మారును. (పరస్మైపది). ఆత్మనేపది రూపమున శమయతే – శమయేతే, శమయన్తే, లట్ ప్రథమ పురుష రూపములు అగును.

శమ్ + అయ + అన్తి > శమయ + అన్తి > శమయన్తి

శ్లో॥ నితాన్తలాక్షారసరాగరఞ్జితై
ర్నితమ్బినీనాం చరణైః సనూపురైః।
పదే పదే హంసరుతానుకారిభి
ర్జనస్య చిత్తం క్రియతే సమన్మథమ్॥ 5

**పదవిభాగము:–**నితాన్తలాక్షారసరాగరంజితైః నితమ్బినీనామ్ చరణైః సనూపురైః పదే పదే హంసరుత + అనుకారిభిః జనస్య చిత్తమ్ క్రియతే సమన్మథమ్.

**అన్వయక్రమము:–** నితాన్త లాక్షారస రాగ రంజితైః సనూపురైః పదే పదే హంసరు తాను కారిభిః నితమ్బినీనామ్ చరణైః జనస్య చిత్తమ్ సమన్మథమ్ క్రియతే.





**ప్రతిపదార్థము:–** నితాన్త=మిక్కిలి అయిన, లాక్షారస=లత్తుకయొక్క, రాగ=ఎఱుపుచేత, రంజితైః=రంగువేయబడిన, సనూపురైః=అందెలతోకూడినవై, పదే పదే=అడుగడుగున, హంసరుతానుకారిభిః=హంసల ధ్వనిని అనుకరించుచున్న, నితమ్బినీనామ్=ఉన్నతమైన పిఱుదులుగల స్త్రీల యొక్క, చరణైః=పాదములచేత, జనస్య=జనులయొక్క, చిత్తమ్=మనస్సు, సమన్మథమ్=కామముతో కూడినదిగా, క్రియతే=చేయబడుచున్నది.

**తాత్పర్యము:–** అధికముగా లత్తుకను పూసికొనుటచేత ఎర్రనైన, అడుగడుగున హంసల ధ్వనిని అనుకరించుచు శబ్దించు నూపురములు కలిగిన ఉన్నతమైన పిఱుదులు గల స్త్రీల పాదములచే జనులయొక్క మనస్సు కామముతో కూడినదిగా చేయబడుచున్నది.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**
1) నితాన్తలాక్షారసరాగరంజితైః – నితాన్తమ్ లాక్షాయాః రసస్య రాగేణరంజితాః యే తే తథావిధైః – తృతీయాతత్పురుషః
2) సనూపురైః – నూపురేణ సహితాః యే తే తథావిధైః – బహువ్రీహిః
3) హంసరుతానుకారిభిః – హంసానామ్ రుతాని అనుకుర్వన్తి యే తే తైః – కృత్సమాసః.

b) **నిఘంటు ప్రమాణములు:–**
1) నూయతే ఇతి నూపురః ణు స్తుతౌ, స్తోత్రము చేయబడునది. **పాదాఙ్గదం తులాకోటిర్మంజీరో నూపురోஉస్త్రియామ్.**

c) **గుణము – ప్రసాదమాధుర్యగుణములు**

d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

f) **క్రియాదర్శము :– 'క్రియతే'** ధాతువు డుకృఞ్ – కృ – కరణే. 8వ వికరణ ధాతువు, కర్మణి ప్రయోగము.

**ధాతువు:– కృ**+ప్రత్యయము 'య' + తే ఆత్మనేపది తిఙ్ప్రత్యయము కర్మార్థము నందు భావార్థకమునందు మూల ధాతువుకు 'య' అను ప్రత్యయము చేర్చ బడును. వీనికి ఎల్లప్పుడు ఆత్మనేపద తిఙ్ ప్రత్యయములే చేరును. వికరణ ప్రత్యయములుచేరవు గనుక గణములవలన కలుగు భేదము లేదు. 'య' అను ప్రత్యయము పరమగునప్పుడు అసంయుక్తపూర్వకమైన ఋకారమునకు 'రి' అను ఆదేశమువచ్చును. కనుక కృ+య+తే = క్రియతే అగును. ఇది లట్ ప్రథమ పురుష ఏకవచనరూపము.

శ్లో॥ పయోధరాశ్చన్దనపఙ్కచర్చితా
స్తుషారగౌరార్పితహారశేఖరాః।
నితమ్బదేశాశ్చ సహేమమేఖలాః
ప్రకుర్వతే కస్య మనో న సోత్సుకమ్॥ 6

**పదవిభాగము:-** పయోధరాః + చన్దనపఙ్కచర్చితాః + తుషారగౌర+అర్పితహారశేఖరాః నితమ్బదేశాః + చ సహేమమేఖలాః ప్రకుర్వతే కస్య మనః న స + ఉత్సుకమ్.

**అన్వయక్రమము:-** చన్దనపఙ్కచర్చితాః తుషారగౌర+అర్పితహారశేఖరాః పయోధరాః చ సహేమమేఖలాః నితమ్బదేశాః కస్య మనః సోత్సుకమ్ న ప్రకుర్వతే.

**ప్రతిపదార్థము:-** చన్దనపఙ్కచర్చితాః=చందన గంధముచే పూయబడిన, తుషార గౌర =మంచువలె తెల్లనివియు, అర్పితహారశేఖరాః=వేయబడిన హారములు గలవియు అగు, పయోధరాః=స్తనములు, చ=మరియు, సహేమమేఖలాః=బంగారు మొలనూళ్ళతో కూడిన, నితమ్బ దేశాః=పిఱుదులు, కస్య మనః=ఎవనియొక్క మనస్సును, సోత్సుకమ్= ఉత్సాహముతో కూడిన దానినిగా, న ప్రకుర్వతే=చేయవు?

**తాత్పర్యము:-** చందన గంధము పూయబడినవియు, మంచువలె తెల్లనైనవియు ముత్యాలహారములను దాల్చినవియు అగు స్తనములు, బంగారు మొలనూళ్ళతో కూడిన పిఱుదులు, ఏమనుజుని మనస్సును రంజింపజేయవు?

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) చందనపంకచర్చితాః- చన్దనస్య పంకేన చర్చితాః యే తే తథాభూతాః- తృతీయాతత్పురుషః
2) తుషారగౌరార్పితహారశేఖరాః - తుషారవత్ గౌరాః తుషారగౌరాః - ఉపమాన పూర్వపదకర్మధారయః-అర్పితహారాః శేఖరాః యేషాం తే - బహువ్రీహిః
3) సహేమమేఖలాః - హేమ్నో మేఖలా హేమమేఖలా - షష్ఠీతత్పురుషః హేమమేఖలయా సహితా యే తే - బహువ్రీహిః
4) నితమ్బదేశాః - నితమ్బస్య దేశాః - షష్ఠీతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) పయసో ధరః పయోధరః, ధృ ధారణే, పాలను నీళ్ళను ధరించునది. **స్త్రీ స్తనాబ్దౌ పయోధరౌ.**
2) తప్తం తోషయతీతి తుషారః, తుష తుష్టౌ-తప్తుడైన వానిని సంతోషింప జేయునది. **తుషార శ్శీతల శ్శీతో హిమః......**





c) **గుణము - ప్రసాదమాధుర్యగుణములు**

d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - వంశస్థవిలము.

f) **క్రియాదర్శమ్ :-** ప్రకుర్వతే. ఆత్మనేపది. లట్ ప్రథమపురుష బహువచనము.

**ధాతువు:-** 1) **డుకృఞ్ కృ**-కరణే-చేయుట. ప్ర ఉపసర్గ. ఉభయపది 8వ వికరణ ధాతువు. దీని వికరణ ప్రత్యయము 'ఉ' ధాతువులన్ని నకారాంతముగ నుండును. 'కృ' ధాతువు విశేషమేమంటే ఇది దృఢప్రత్యయాలముందు కర్, దుర్బల ప్రత్యయాలముందు కుర్ అవుతుంది. కర్ + ఉ + తి = కరోతి (దృఢ రూపము), 'సార్వధాతుకార్ధధాతుకయోః' అనుసూత్రముచే ఉ ప్రత్యయమునకు గుణము ఓకారము రాగా **కరోతి** అను రూపమగును. కుర్ + ఉ > కురు + తే=కురుతే (దుర్బలరూపము). ఇది లట్ ప్రథమ పురుష ఏకవచనము. ప్రథమ పురుష బహువచన తిఙ్ ప్రత్యయమువలన కురు+అతే > కుర్వతే అగును.

2) ఫలే చ కర్త్రభిప్రాయే స్వరితేతో ఞితో ణిచః, పచతే **కురుతే** ... అని 'ఆఖ్యాతచంద్రికా' 3-4-62

శ్లో॥ సముద్గతస్వేదజితాఙ్గసన్ధయో
విముచ్య వాసాంసి గురూణి సామ్ప్రతమ్।
స్తనేషు తన్వంశుకమున్నతస్తనా
నివేశయన్తి ప్రమదాస్సయౌవనాః॥ 7

**పదవిభాగము:-** సముద్గతస్వేదజిత + అంగసంధయః విముచ్య వాసాంసి గురూణి సాంప్రతమ్ స్తనేషు తను + అంశుకమ్ ఉన్నతస్తనాః నివేశయన్తి ప్రమదాః సయౌవనాః

**అన్వయక్రమము:-** సముద్గత స్వేద జిత అంగసంధయః సయౌవనాః ఉన్నతస్తనాః ప్రమదాః సాంప్రతమ్ గురూణి వాసాంసి విముచ్య స్తనేషు తను అంశుకమ్ నివేశయన్తి.

**ప్రతిపదార్థము:-** సముద్గత=బయటకు వెడలిన, స్వేద=చెమటచేత, జిత=జయింప బడిన, అంగసంధయః=బాహుమూలములుగల, సయౌవనాః=యౌవనముతో కూడిన, ఉన్నతస్తనాః=ఎత్తైన స్తనములుగల, ప్రమదాః=మదవతులు, సాంప్రతమ్= ఇప్పుడు, గురూణి=బరువైన,వాసాంసి=వస్త్రములను, విముచ్య=విడిచి, స్తనేషు=స్తనముల యందు, తను=పలుచని (తేలికైన), అంశుకమ్=పైటను, నివేశయన్తి=ఉంచు చున్నారు.

**తాత్పర్యము:-** బయటకు వెడలిన చెమటచేత జయింపబడిన బాహుమూలములుగల యౌవనవంతులు, ఎత్తైన స్తనములు గల మదవతులు, ఇప్పుడు (గ్రీష్మకాలమున) బరువైన వస్త్రములను విడచి స్తనములందు తేలికైన వస్త్రములను ఉంచుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) సముద్గత.... సంధయః - సముద్గతశ్చాసౌ స్వేదః - కర్మధారయః-తేన జితాః అంగానాం సంధయో యాసాం తాః - బహువ్రీహిః
2) ఉన్నతస్తనాః - ఉన్నతాః స్తనాః యాసాం తాః - బహువ్రీహిః
3) తన్వంశుకమ్ - తను చేదమ్ అంశుకమ్ - కర్మధారయః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) అంశుభిస్తన్తుభిః, కాయతి అంశుకం, కై శబ్దే, తంతువులచే ఇంచుకంత పలుకునది. **వస్త్రమాచ్ఛాదనం వాసశ్చేలం వసనమంశుకమ్.**
2) ప్రకృష్టో మదశ్చేతోవికారో౽స్యా ఇతి ప్రమదా. మిక్కిలి మదము గలది. **ప్రమదా మానినీ కాన్తా లలనా చ నితమ్బినీ.**

c) **గుణము - ప్రసాదమాధుర్యగుణములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** జగతీఛందస్సు - వంశస్థవిలము.

f) **క్రియాదర్శము :-** నివేశయన్తి, లట్ ప్రథమపురుష బహువచనము. ణిచి ప్రత్యయము. సకర్మము, 6 వికరణ ధాతువు.

**ధాతువు :- 'విశ్'.** ప్రవేశనే, ని ఉపసర్గ. నివేశయతి - నివేశయతః - నివేశయన్తి; నివేశయతే- నివేశయేతే - నివేశయన్తే. లట్ ప్రథమ పురుష బహువచనము. పరస్మైపది రూపము. ప్రేరణార్థకము. దశమవికరణ ప్రత్యయము 'అయ'. పరస్మైపది. అన్తి లట్ ప్రథమ పురుష బహువచన తిజ్ ప్రత్యయము. కనుక 'విశ్ + అయ + అన్తి > (గుణము) వేశయ + అన్తి > వేశయన్తి'.

**శ్లో॥ సచన్దనామ్బువ్యజనోద్భవానిలై**
**స్సహారయష్టిస్తనమణ్డలార్పణైః।**
**సవల్లకీకాకలిగీతనిఃస్వనై**
**ర్విబోధ్యతే సుప్త ఇవాద్య మన్మథః॥ 8**

**పదవిభాగము:-** సచందన+అంబువ్యజన + ఉద్భవ +అనిలైః సహారయష్టిస్తనమణ్డల +అర్పణైః సవల్లకీకాకలిగీతనిఃస్వనైః + విబోధ్యతే సుప్త ఇవ అద్య మన్మథః

**అన్వయక్రమము:-** సచందనాంబు వ్యజన ఉద్భవ అనిలైః సహారయష్టి స్తనమణ్డల అర్పణైః సవల్లకీకాకలిగీత నిఃస్వనైః అద్య మన్మథః సుప్త విబోధ్యతే ఇవ.

**ప్రతిపదార్థము:-** సచందనాంబు=చందన ద్రవము (నీరు) తో కూడిన, వ్యజన=విసన కఱ్ఱలవలన,ఉద్భవ=జనించిన, అనిలైః=గాలిచేత, సహారయష్టి=ముత్యాలపేరుతోకూడిన,





స్తనమణ్డల=గుండ్రని స్తనములయొక్క, అర్పణైః=అర్పణముచేత, సవల్లకీకాకలిగీత= వీణెలయొక్క అవ్యక్తమైన మధురమైన పాటలతో కూడిన, నిః స్వనైః=ధ్వనులచేత, అద్య= ఈరోజు, సుప్త=నిద్రించిన, మన్మథః=మన్మథుడు, విబోధ్యతే ఇవ=మేలుకొల్ప బడుచున్నట్లుండెను.

**తాత్పర్యము:-** చందనోదకముతో కూడిన విసనకఱ్ఱల వలన జనించిన గాలిచేత, ముత్యాలపేరున్న గుండ్రని స్తనముల అర్పణముచేత (కౌగిలింత), ఇంపైన పాటలతో కూడిన ధ్వనులచేత, ఈరోజు నిద్రించిన మన్మథుడు మేల్కొల్పబడుచున్నట్లుండెను.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) స.. అనిలైః-చందనేన సహితం సచందనం, సచందనం యదమ్బు- సచంద నామ్బు-కర్మధారయః-సచందనామ్బు యద్ వ్యజనమ్. సచంద నామ్బు వ్యజనమ్ - కర్మధారయః సచందనామ్బు వ్యజనాత్ ఉద్భవాః - పంచమీ తత్పురుష - సచందనామ్బు వ్యజనోద్భవాశ్చేమే అనిలాః తైః - కర్మధారయః
2) సహారయష్టిస్తనమణ్డలార్పణైః - హారస్య యష్టిః హారయష్టిః - షష్ఠీతత్పురుషః - హారయష్టి సహితమ్ యత్ స్తనమణ్డలమ్ సహారయష్టిస్తనమండలమ్ - కర్మధారయః - తస్య అర్పణైః - షష్ఠీతత్పురుషః
3) సవల్లకీకాకలిగీతనిస్స్వనైః - వల్లక్యా సహితం సవల్లకి, సవల్లకి చేదం కాకలిగీతమ్, సవల్లకీకాకలిగీతమ్ - కర్మధారయః - తస్య నిఃస్వనైః - షష్ఠీ తత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) అనిలాః అన్యన్తే ప్రాణ్యన్తే లోకా ఏభిరిత్యనిలాః - వీరిచే లోకములు ప్రాణ యుక్తములుగా జేయబడును గనుక అనిలులు, అన ప్రాణనే. **ఆదిత్య విశ్వ వసవ స్తుషితా భాస్వరానిలాః.**
2) వల్లతే ధ్వని విశేషమితి వల్లకీ. వల వల్లసంవరణే - స్వరవిశేషమును ధరించునది. **వీణా తు వల్లకీ.**

c) **గుణము - ఓజో గుణము:- 'ఓజస్సమాసభూయస్త్వమ్'** అని లక్షణము. సమాస భూయిష్ఠమగు రచన ఓజో గుణమనబడును. శ్లోకమునందు మొదటిమూడు పాదములు దీర్ఘసమాస భరితములు.

d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - వంశస్థవిలము.

f) **అలంకారము:–** ఉత్ప్రేక్ష. 'సంభావనాస్యాదుత్ప్రేక్షా' అని లక్షణము. 'సంభావనయే ఉత్ప్రేక్షాలంకారమనబడును. ఈ శ్లోకమున 'చందనజలముచే తడువబడిన విసనకర్ర నుండి వచ్చు గాలులచేతను, పూలదండలతో కూడిన స్తనములను అర్పించుట చేతను, వీణల నుండి వెలువడు అవ్యక్త మధుర శబ్దములచేత నిద్రించిన మన్మథుడు మేల్కొలుపబడుచున్నట్లున్నాడని వర్ణించుటచే నిది 'ఉత్ప్రేక్షాలంకారము' గా చెప్పదగును.

f) **క్రియాదర్శము :–** విబోధ్యతే. ఆత్మనేపది. లట్ ప్రథమపురుష ఏకవచనము.

**ధాతువు :– 'బుధ్'–బోధ్** అవగమనే వి ఉపసర్గ. 4వ వికరణ ధాతువు. ప్రేరణార్థకము మీద కర్మార్థకము. య ప్రత్యయము. ఆత్మనేపది తిఙ్ ప్రత్యయము 'తే' వలన విబోధ్యతే – విబోధ్యేతే – విబోధ్యన్తేగా లట్ ప్రథమపురుష రూపములుండును. బోధ్ + య + తే > బోధ్యతే.

**శ్లో॥ సితేషు హర్మ్యేషు నిశాసు యోషితాం**
**సుఖప్రసుప్తాని ముఖాని చన్ద్రమాః।**
**విలోక్య నూనం భృశముత్సుకశ్చిరం**
**నిశాక్షయే యాతి హ్రియేవ పాణ్డుతామ్॥ 9**

**పదవిభాగము:–** సితేషు హర్మ్యేషు నిశాసు యోషితాం సుఖప్రసుప్తాని ముఖాని చంద్రమాః విలోక్య నూనమ్ భృశమ్+ఉత్సుకః+చిరమ్ నిశాక్షయే యాతి హ్రియా+ఇవ పాండుతామ్.

**అన్వయక్రమము:–** చంద్రమాః నిశాసు సితేషు హర్మ్యేషు యోషితామ్ సుఖప్రసుప్తాని ముఖాని చిరమ్ విలోక్య భృశమ్ ఉత్సుకః నిశాక్షయే నూనమ్ హ్రియేవ పాండుతామ్ యాతి.

**ప్రతిపదార్థము:–** చంద్రమాః=చంద్రుడు, నిశాసు=రాత్రులయందు, సితేషు=తెల్లనైన, హర్మ్యేషు=మేడలయందు, సుఖప్రసుప్తాని=హాయిగా నిద్రించుచున్న, యోషితామ్=స్త్రీల యొక్క, ముఖాని=మోములను, చిరమ్=చాలాసేపుగా, విలోక్య=చూచి, భృశమ్=మిక్కిలి, ఉత్సుకః=కుతూహలముగలవాడై, నిశాక్షయే=వేకువజామున, నూనమ్=నిశ్చయముగా, హ్రియేవ=సిగ్గుచే, పాండుతామ్=తెల్లదనమును, యాతి=పొందుచున్నాడు.

**తాత్పర్యము:–** (గ్రీష్మకాలమున) చంద్రుడు రాత్రులయందు తెల్లనైన మేడల యందు హాయిగా నిద్రించుచున్న స్త్రీల మోములను తరచుగా చూచి అధిక కుతూహలము గలవాడై వేకువజామున సిగ్గుచేత తెల్లదనమును (కాంతిహీనత) పొందుచున్నాడు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–** 1) సుఖప్రసుప్తాని – సుఖేన ప్రసుప్తాని – తృతీయాతత్పురుషః





2) నిశాక్షయే – నిశాయాః క్షయే – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) పండతే యాతి మన ఇతి పాండుః పడి గతౌ. మనస్సును పొందునది. **హరిణః పాణ్డురః పాణ్డుః–సిత పీత సంకర వర్ణనామాని.**

c) **గుణము:–** **ప్రసాదమాధుర్యగుణములు**

d) **రీతి:– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

f) **అలంకారము–ఉత్ప్రేక్ష:** లక్షణమునకై 8వ శ్లోకభాగము చూడదగును. ఈ శ్లోకమున 'స్త్రీలముఖపద్మములను తరచుగా చూచి ఆ అందము తనకు రానందుకు దుఃఖితుడై వేకువజామున సిగ్గుతో నిజముగా పాలిపోయినట్లు చంద్రుడు అస్తమించు చున్నాడని' వర్ణించుటచే ఉత్ప్రేక్షగా చెప్పదగును.

g) **క్రియాదర్శము :–** యాతి – పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము.

**ధాతువు :– యా** – ప్రాపణే పోవుట. మిగిలిన వివరములు '2' వ శ్లోకభాగమున చూడదగును.

**శ్లో॥ అసహ్యవాతోద్ధతరేణుమణ్డలా**
**ప్రచణ్డసూర్యాతపతాపితా మహీ।**
**న శక్యతే ద్రష్టుమపి ప్రవాసిభిః**
**ప్రియావియోగానలదగ్ధమానసైః॥ 10**

**పదవిభాగము:–** అసహ్యవాత+ఉద్ధతరేణుమండలా ప్రచణ్డసూర్యాతపతాపితా మహీ న శక్యతే ద్రష్టుమ్+అపి ప్రవాసిభిః ప్రియావియోగ+అనలదగ్ధమానసైః.

**అన్వయక్రమము:–** అసహ్య వాత ఉద్ధత రేణు మండలా ప్రచణ్డ సూర్యాతప తాపితా మహీ ప్రియా వియోగ అనల దగ్ధ మానసైః ప్రవాసిభిః ద్రష్టుమపి న శక్యతే.

**ప్రతిపదార్థము:–** అసహ్య=సహింపశక్యముగాని, వాత=వాయువుచేత, ఉద్ధత=పైకి లేపబడిన, రేణు=దుమ్ముయొక్క, మండలా=సమూహముగలదియు, ప్రచణ్డ=మిక్కిలి తీక్ష్ణమైన, సూర్యాతప=ఎండచే, తాపితా=తపింపజేయబడిన, మహీ=భూమి, ప్రియా= ప్రియురాండ్రయొక్క, వియోగ=ఎడబాటు అనెడు, అనల=నిప్పుచే, దగ్ధ=కాల్చబడిన, మానసైః=మనస్సులుగల, ప్రవాసిభిః=బాటసారులచేత, ద్రష్టుమపి=చూచుటకు కూడ, న శక్యతే=సాధ్యపడుటలేదు.

**తాత్పర్యము:–** సహింపశక్యముగాని వాయువుచే పైకి లేపబడిన ధూళి సమూహము

గల, మిక్కిలి తీక్ష్ణమైన ఎండచే తపింపజేయబడిన భూమి, ప్రియురాండ్ర యొక్క ఎడబాటు అనెడు అగ్నిచే కాల్చబడిన మనస్సులు గల బాటసారులకు చూచుటకు కూడ శక్యము కాకున్నది. (గ్రీష్మమున).

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ప్రియా... మానసైః-ప్రియాయాః వియోగః, ప్రియావియోగః-షష్ఠీతత్పురుషః - ప్రియావియోగః ఏవ అనలః, ప్రియావియోగానలః - అ.పూ.కర్మధారయః - తేన దగ్ధం మానసం యేషాం తే తథాభూతైః - బహువ్రీహిః

2) అసహ్యా.... మండలా-న సహ్యః అసహ్యః-పర్యుదాసే నఞ్- అసహ్యశ్చాసౌ వాతః అసహ్యవాతః-కర్మధారయః-తేన ఉద్ధతమ్ రేణునామ్ మండలమ్ యస్యాం సా-బహువ్రీహిః

3) ప్రచణ్డ..... తాపితా - ప్రచణ్డశ్చాసౌ సూర్యః, ప్రచణ్డసూర్యః-కర్మధారయః - తస్య ఆతపః, ప్రచణ్డసూర్యాతపః - షష్ఠీతత్పురుషః - తేన తాపితా యా సా తథావిధా - తృతీయాతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) వాతీతి వాతః. వా గతి గంధనయోః - వీచుచుండెడి వాడు. **'నభస్వద్వాత పవన పవమాన ప్రభంజనాః'.**

2) అనంతి జీవంత్యనేన లోకా ఇత్యనలః, అన ప్రాణనే. ఇతనిచేత లోకములు జీవించుచున్నవి.

c) **గుణము:-** ప్రసాదగుణము మరియు ఓజోగుణము

d) **ఛందస్సు-వృత్తము:-** జగతీ ఛందస్సు - వంశస్థవిలము.

e) **క్రియాదర్శము :-** శక్యతే - ఆత్మనేపది, లట్ ప్రథమపురుష ఏకవచనము.

**ధాతువు :- శక్** - మర్షణే సమర్థుడగుట. '4' వికరణ ధాతువు ఉభయపది. వికరణ ప్రత్యయము 'య'. శక్+య+తే > శక్యతే; అగును. శక్యతే-శక్యేతే - శక్యన్తే - ఆత్మనేపది లట్ ప్రథమపురుష ఏక, ద్వివచన, బహువచన రూపములు.

**శ్లో॥ మృగాః ప్రచణ్డాతపతాపితా భృశం**
**తృషా మహత్యా పరిశుష్కతాలవః।**
**వనాన్తరే తోయమితి ప్రధావితా**
**నిరీక్ష్య భిన్నాఞ్జనసన్నిభం నభః॥ 11**

**పదవిభాగము:-** మృగాః ప్రచణ్డ + ఆతపతాపితాః భృశమ్ తృషా మహత్యా పరిశుష్క తాలవః వనాన్తరే తోయమ్+ఇతి ప్రధావితాః నిరీక్ష్య భిన్నాంజనసన్నిభమ్ నభః.





**అన్వయక్రమము:-** మృగాః భృశమ్ ప్రచణ్డ ఆతప తాపితాః మహత్యా తృషా పరిశుష్క తాలవః వనాంతరే భిన్నాంజన సన్నిభమ్ నభః నిరీక్ష్య తోయమితి ప్రధావితాః

**ప్రతిపదార్థము:-** మృగాః=జింకలు, భృశమ్=మిక్కిలి, ప్రచణ్డ=తీక్ష్ణమైన, ఆతప=ఎండచే, తాపితాః=తపింపచేయబడినవై, మహత్యా=గొప్పదైన, తృషా=దప్పికచే, పరిశుష్క= ఎండిన, తాలవః=దవడలుగలవై, వనాంతరే=అడవినడుమ, భిన్నాంజన సన్నిభమ్= బాగుగానూరిన కాటుకతో సమానమైన, నభః=ఆకాశమును, నిరీక్ష్య=చూచి, తోయమితి =నీరని, ప్రధావితాః=పరుగెత్తుచున్నవి.

**తాత్పర్యము:-** జింకలు చుఱుకైన ఎండచే తపింపజేయబడినవై, దప్పికచే బాగా యెండిన దవడలు గలవై, అడవి నడుమ బాగుగా నూరిన కాటుకతో సమానమైన ఆకాశమును గాంచి నీరని పరుగెత్తుచున్నవి.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ప్రచణ్డాతపతాపితాః - ప్రచణ్డశ్చాసౌ ఆతపః, ప్రచణ్డాతపః - కర్మధారయః - తేన తాపితాః - తృతీయాతత్పురుషః.

2) భిన్నాంజనసన్నిభమ్-భిన్నం చేదం అంజనమ్, భిన్నాంజనమ్-కర్మధారయః -తేన సన్నిభమ్-భిన్నాంజనసన్నిభమ్ - తృతీయాతత్పురుషః.

3) పరిశుష్కతాలవః-పరిశుష్కాః తాలవః యేషాం తే-బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) మృగ్యతే లుబ్ధకైరితి మృగః. మృగ అన్వేషణే-వేటకాండ్రచే వెదకబడునది. **మృగే కురంగ వాతాయు హరిణాజినయోనయః.**

2) మేఘై ర్న భాతీతి నభః. భా-దీప్తౌ-మబ్బులచేత ప్రకాశింపనిది **నభోఽన్త రిక్షం గగనమనన్తం సురవర్త్మ ఖమ్......**

3) తలతి ప్రతిష్ఠతి జగ్ధశేషమత్రేతి తాలు. తల ప్రతిష్ఠాయాం భుక్తశేషము దీనియందు నిలుచును. **తాలు తు కాకుదమ్.**

c) కావ్యోత్కర్షమునకు హేతువులైన గుణములలోని ప్రసాదగుణము ఇందున్నది. 'ప్రసిద్ధార్థపదత్వం యత్తత్ప్రసాదో నిగద్యతే' అని లక్షణము. ప్రసిద్ధములైన అర్థములను తేటతెల్లము జేయుపదములు గలిగియుండుటయే ప్రసాదమని చెప్పబడును.

d) **ఛందస్సు - వృత్తము: జగతీ ఛందస్సు - వంశస్థవిలము**

e) **క్రియాదర్శము :-** ప్రధావిత. కృదంతము. 'క్త' ప్రత్యయాంతము. భూతకాలికము.

**ధాతువు :–** ధావ్. కర్త్రర్థకము. ధావ్+ఇ+త > ధావిత. (ఇట్, క్త ప్రత్యయాంతము) ప్ర–ఉపసర్గ నామవాచకరూపముననుసరించి ఆయా లింగములలోకి మారును. ప్రధావితః (పుం.లి.) – ప్రధావితా (స్త్రీ.లి.) – ప్రధావితమ్ (నపుం.లి.) ఇదే రూపము ధావితా 1) లుట్ ప్రథమపురుషైకవచనము, పరస్మైపదిగా, లుట్ ప్రథమపురుషైకవచనము ఆత్మనేపదిగా ఉండును.

**శ్లో॥ సవిభ్రమైః సస్మితజిహ్మవీక్షితై**
**ర్విలాసవత్యో మనసి ప్రవాసినామ్।**
**అనఙ్గసన్దీపనమాశు కుర్వతే**
**యథా ప్రదోషాః శశిచారుభూషణాః॥ 12**

**పదవిభాగము:–** సవిభ్రమైః సస్మితజిహ్మవీక్షితైః+విలాసవత్యః మనసి ప్రవాసినామ్ అనంగసందీపనమ్+ఆశు కుర్వతే యథా ప్రదోషాః శశిచారుభూషణాః.

**అన్వయక్రమము:–** శశిచారుభూషణాః ప్రదోషాః యథా విలాసవత్యః సవిభ్రమైః సస్మిత జిహ్మ వీక్షితైః ప్రవాసినామ్ మనసి ఆశు అనంగసందీపనమ్ కుర్వతే.

**ప్రతిపదార్థము:–** శశిచారుభూషణాః=చంద్రు డనెడు అలంకారము గల, ప్రదోషాః యథా=సంధ్యాసమయములవలె, విలాసవత్యః=విలాసవంతులైన స్త్రీలు, సవిభ్రమైః =విలాసముతోకూడుకొనిన, సస్మిత=చిఱునగవుతో గూడిన, జిహ్మ=కుటిల మైన (ఓర), వీక్షితైః=చూపులచేతను, ప్రవాసినామ్=విరహిజనులయొక్క మనసి= మనస్సుల యందు, ఆశు=వెంటనే, అనంగసందీపనమ్=కామోద్దీపనమును, కుర్వతే=చేయుచున్నారు.

**తాత్పర్యము:–** చంద్రుడనెడు అలంకారము గల సంధ్యసమయములవలె విలాస వతులైన స్త్రీలు చిరునగవుతో కూడిన ఓరచూపులచేతను విరహజనులయొక్క మనస్సులయందు వెంటనే కామోద్దీపనమును కలుగజేయుచున్నారు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) సస్మితజిహ్మవీక్షితైః–స్మితేన సహితాని సస్మితాని, సస్మితాని చ జిహ్మవీక్షితాని తైః, సస్మితజిహ్మవీక్షితైః – కర్మధారయః
2) శశిచారుభూషణా–శశీ ఏవ చారుభూషణం యస్యాః సా– బహువ్రీహిః.
3) అనంగసందీపనమ్ – న సన్తి అంగాని యస్యాసౌ అనంగః – బహువ్రీహిః – అనంగస్య సందీపనమ్–షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) జహాత్యార్జవమితి జిహ్మమ్. ఓ హాక్ త్యాగే. చక్కదనమును విడుచునది. **అరాళం వృజినం జిహ్మమూర్మిమత్కుంచితం నతమ్.........**





2) చరతి మనోఽస్మిన్నితి చారు. చర గతి భక్షణయోః. దీనియందు మనస్సు సంచరించును. **సుందరం రుచిరం చారు సుషమం సాధుశోభనమ్.**

c) **గుణము:–** ప్రసాదగుణము.

d) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

g) **క్రియాదర్శము :–** కుర్వతే – ఆత్మనేపది. లట్ ప్రథమపురుష బహువచనము.

ధాతు వివరములకు '6' వ శ్లోక భాగము చూడదగును.

**శ్లో॥ రవేర్మయూఖైరభితాపితో భృశం**
**విదహ్యమానః పథి తప్తపాంసుభిః।**
**అవాఙ్ముఖో జిహ్మగతిశ్శ్వసన్ ముహుః**
**ఫణీ మయూరస్య తలే నిషీదతి॥ 13**

**పదవిభాగము:–** రవేః+మయూఖైః+అభితాపితః భృశమ్ విదహ్యమానః పథి తప్తపాంసుభిః అవాఙ్ముఖః జిహ్మగతిః+శ్వసన్ ముహుః ఫణీ మయూరస్య తలే నిషీదతి.

**అన్వయక్రమము:–** రవేః మయూఖైః భృశమ్ అభితాపితః పథి తప్తపాంసుభిః విదహ్యమానః అవాఙ్ముఖః జిహ్మగతిః ముహుః శ్వసన్ ఫణీ మయూరస్య తలే నిషీదతి.

**ప్రతిపదార్థము:–** రవేః=సూర్యుని యొక్క, మయూఖైః=కిరణముల చేత, భృశమ్= మిక్కిలి, అభితాపితః=తపింపజేయబడినదై, పథి=మార్గమందు, తప్తపాంసుభిః=కాలిన దుమ్ముచే, విదహ్యమానః=బాగా దహింపబడినదై, అవాఙ్ముఖః=తలవంచుకొన్నదై, జిహ్మగతిః =వంకరగా వెడలుచున్నదై, ముహుః=తరచుగా, శ్వసన్=నిట్టూర్పుచు, ఫణీ= పాము,మయూరస్య=నెమలి యొక్క, తలే=పింఛముక్రింద, నిషీదతి=సేదదీరుచున్నది.

**తాత్పర్యము:–** సూర్యుని కిరణములచే బాగా తపింపజేయబడినదై మార్గమందు కాలిన దుమ్ముచే బాగా దహింపబడినదై, తలదించుకొన్నదై, తరచుగా నిట్టూర్పుచూ వంకరటింకరగా వెడలు చున్నపాము, నెమలి యొక్క పింఛము నీడన సేదదీరుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) తప్తపాంసుభిః – తప్తాశ్చేమే పాంసవః తైః – కర్మధారయః.
2) జిహ్మగతిః–జిహ్మా గతిర్యస్య సః – బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) రూయతే స్తూయత ఇతి రవిః. రు శబ్దే – నుతింపబడువాడు. **భానుర్హంస స్సహస్రాంశు స్తపన స్సవితా రవిః,**

2) ఫణా అస్యాస్తీతి ఫణీ. పడగ గలిగినది. **కుణ్డలీ గూఢపాత్ చక్షుశ్శ్రవాః కాకోదరః ఫణీ.**

3) మినాతి సర్పాన్ మయూరః. మీఞ్ హింసాయాం. సర్పములను హింసించునది. **మయూరో బర్హిణో బర్హీ నీల కణ్ఠో భుజంగభుక్.**

c) **గుణము:–** ప్రసాదగుణము

d) **రీతి:–** వైదర్భి

e) **ఛందస్సు–వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

g) **క్రియాదర్థము :–** నిషీదతి – లట్ ప్రథమపురుష ఏకవచనము, పరస్మైపది. ని ఉపసర్గ.

**ధాతువు :–** షద్ల్–సద్–విశరణగత్యవసాదనేషు. గమనమున సకర్మకము. 6వ గణ ధాతువు. దీని ఇంకొకరూపము–నిషీదన్. శతృప్రత్యయాంతము. ఈ ప్రత్యయము పరస్మైపద ధాతువులలో మాత్రమే సమకూరును. నామవాచక రూపము ననుసరించి మూడు లింగములలో నుండును. నిషీదన్–నిషీదతీ, నిషీదన్తీ– నిషీదత్. మరియు సద్ అనునది అనియత ధాతువు. వీటిలో వచ్చే మార్పులు వికరణ ప్రత్యయాలకు ముందు వచ్చును ఇవి సార్వధాతుక రూపాలలోనే వచ్చును కాని ఆర్ధధాతుక రూపాలలో రాదు. కనుక 'ప్రాఘ్మా.......' ఇత్యాది సూత్రముచే సద్ > సీద్ అగును. సీద్ + అ + తి > సీదతి. ఉపసర్గతో నిషీదతిగా మారును. (ఇ, ఉకారముల తరువాత వచ్చు సకారము షకారముగా మారును.)

**శ్లో॥ తృషా మహత్యా హతవిక్రమోద్యమః**
**శ్వసన్ముహుర్దూరవిదారితాననః।**
**న హంత్యదూరేఽపి గజాన్ మృగేశ్వరో**
**విలోలజిహ్వశ్చలితాగ్రకేసరః॥ 14**

**పదవిభాగము:–** తృషా మహత్యా హతవిక్రమ+ఉద్యమః శ్వసన్+ముహుః+ దూర విదారిత+ఆననః న హంతి+అదూరే+అపి గజాన్ మృగేశ్వరః విలోలజిహ్వః+ చలిత+ అగ్రకేసరః.

**అన్వయక్రమము:–** మహత్యా తృషా హతవిక్రమోద్యమః శ్వసన్ ముహుః దూర విదారితాననః విలోలజిహ్వః చలితాగ్రకేసరః మృగేశ్వరః అదూరేఽపి గజాన్ న హన్తి.

**ప్రతిపదార్థము:–** మహత్యా=అధికమైన, తృషా=దప్పికచేత, హతవిక్రమోద్యమః= పరాక్రమప్రయత్నము ఉడిగినదై, శ్వసన్=నిట్టూర్పుచు, ముహుః=తరచుగా, దూర విదారితాననః=బాగా నోరు తెఱచుకొన్నదియు, విలోలజిహ్వః=నాలుక నాడించు





చున్నదియు, చలితాగ్రకేసరః=పైనున్నజాలును విదిలించుచున్నదైన, మృగేశ్వరః= సింహము, అదూరేఽపి=దూరమునలేకున్నను, గజాన్=ఏనుగులను, న హన్తి=చంప కున్నది.

**తాత్పర్యము:–** అధికమైన దప్పికచే పరాక్రమ ప్రయత్నము సన్నగిల్లినదై తడవతడవకు నోరు తెఱచుకొనుచున్నదియు, నాలుక చప్పరించుచున్నదియు, పైనున్న జాలును విదిలించుచున్నదైన సింహము దగ్గరనున్నను ఏనుగులను చంపకున్నది.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) హతవిక్రమోద్యమః – హతో విక్రమస్య ఉద్యమో యస్యాసౌ తథావిధః –బహువ్రీహిః

2) దూరవిదారితాననః–దూరం విదారితమ్ ఆననం యేన సః–బహువ్రీహిః

3) విలోలజిహ్వః–విలోలా జిహ్వా యస్యాసౌ తథావిధః–బహువ్రీహిః.

4) చలితాగ్రకేసరః–చలితః అగ్రకేసరో యస్యాసౌ తథావిధః–బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) తృష పిపాసాయాం. పానముసేయునిచ్ఛ. **ఉదన్యా తు పిపాసా తృట్తర్షః.**

c) **గుణము:–** ప్రసాదగుణము d) **రీతి:–** వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

f) **క్రియాదర్థము :–** హన్తి. పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము.

**ధాతువు :– హన** (హన్) హింసాగత్యోః (చంపుట,వెళ్ళుట). లట్ ప్రథమపురుష బహువచనము మాత్రము ఘ్నన్తి. ఇది రెండవవికరణ ధాతువు. దీనికి వికరణ ప్రత్యయములేదు. కనుక పరస్మైపద లట్ ప్రథమపురుషతిఙ్ ప్రత్యయము చేరును. కనుక హన్+తి > హన్తి గా మారును.

2) తాడనే తాడయతి చ **హన్తి** విధ్యతి తణ్డతే – అని 'ఆఖ్యాతచంద్రికా' – 2–3–77

**శ్లో॥ విశుష్కకణ్ఠా హృతశీకరామ్భసో**
**గభస్తిభిర్భానుమతోఽనుతాపితాః।**
**ప్రవృద్ధతృష్ణోపహతా జలార్థినో**
**న దన్తినః కేసరిణోఽపి బిభ్యతి॥ 15**

**పదవిభాగము:–** విశుష్కకణ్ఠాః హృతశీకరామ్భసః గభస్తిభిః+భానుమతః+అనుతాపితాః ప్రవృద్ధతృష్ణా+ఉపహతాః జలార్థినః న దన్తినః కేసరిణః+అపి బిభ్యతి.

**అన్వయక్రమము:-** విశుష్క కంఠాః హృత శీకరామ్భసః భానుమతః గభస్తిభిః అనుతాపితాః ప్రవృద్ధ తృష్ణా ఉపహతాః జలార్థినః దన్తినః కేసరిణో ఽ పి న బిభ్యతి.

**ప్రతిపదార్థము:-** విశుష్క=బాగా ఎండిన, కంఠాః=కంఠముగలవై, హృత=తీసికొన బడిన, శీకరామ్భసః=చల్లని నీరుగలవియు, భానుమతః=సూర్యుని యొక్క, గభస్తిభిః =కిరణములచేత,అనుతాపితాః=అధికంగా తపింపజేయబడినవై, ప్రవృద్ధ=వృద్ధిచెందిన, తృష్ణా=దప్పికచేత, ఉపహతాః=పీడింపబడినవై, జలార్థినః=నీటిని కోరుచున్న, దన్తినః =ఏనుగులు, కేసరిణోఽపి=సింహమువలనను, న బిభ్యతి=భయముచెందకున్నవి.

**తాత్పర్యము:-**గొంతు ఎండినవై తొండముచే తీసుకొనబడిన చల్లని నీరుగలవై, సూర్య కిరణములచే అధికముగా తపింపబడినవై, వృద్ధిచెందిన దప్పికచే పీడింపబడినవై, నీటిని కోరుచున్న ఏనుగులు సింహమువలనను భయము చెందకున్నవి.

**పదాదర్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) భానుమతః - సన్తిభానవో యస్య అసౌ తథావిధః తస్య - తద్ధితసమాసః
2) విశుష్కకంఠాః - విశుష్కః కంఠః యేషాం తే - బహుర్రీహిః
3) హృతం శీకరామ్భోయైః తే - బహుర్రీహిః
4) ప్రవృద్ధతృష్ణోపహతాః-ప్రవృద్ధా చాసౌ తృష్ణా, ప్రవృద్ధతృష్ణా-కర్మధారయః -తయా ఉపహతాః యే తే - బహుర్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) శీతం కరోతీతి వా శీకరః శీతమును జేయునది. **శీకరోఽమ్బుకణాః స్మృతాః**
2) గః జ్ఞేయవర్గః. తం బభస్తి దీపయతీతి గభస్తిః. భసభర్త్సన దీప్త్యోః - వస్తువులను జూపునది. **కిరణోఽప్రమయూఖాంశు గభస్తి ఘృణి ఘృష్టయః**

c) **గుణము:-** ప్రసాదగుణము.

d) **రీతి:-** వైదర్భి

e) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - వంశస్థవిలము.

f) **క్రియాదర్శము :-** 'బిభ్యతి' - పరస్మైపది లట్ ప్రథమపురుషబహువచనము. అకర్మకము

**ధాతువు: 'ఞిభీ'** (భీ)-భయే-భయపడుట. 3వ వికరణమునకు చెందిన ధాతువు. 1) మూడవ వికరణమునందలి ధాతువులకు వికరణ ప్రత్యయము చేరదు. కాని ధాతువునందలి మొదటి వర్ణము ద్విరుక్తమగును. ధాతు ద్విరుక్తి నియములు.(ఏ)





ధాతువు అజాదియైనచో మొదటి అచ్చు ద్విరుక్తమగును. (బి) ధాతువు అసంయుక్త హలాదియైనచో మొదటి హల్లు అచ్చుతో కలసి ద్విరుక్త మగును. (సి) ధాతువు సంయుక్త హలాదియైనచో అందు మొదటి హల్లు మాత్రమే అచ్చుతో కలసి ద్విరుక్తమగును. (డి) ధాతువు మొదటనున్న సంయుక్తాక్షరములో మొదటిది ఊష్మవర్ణమై, రెండవది వర్గ ప్రథమ ద్వితీయాక్షరములలో నొకటియైనచో, అందు వర్గీయాక్షరము మాత్రమే అచ్చుతో కలసి ద్విరుక్తమగును. పై నియమముల ననుసరించి ధాత్వాది వర్ణము ద్విరుక్తము కాగా అందు మొదటి భాగమునకు 'అభ్యాస' మని పేరు.

**అభ్యాస నియమములు:-** (ఏ) అభ్యాసమునందలి వర్గ ద్వితీయాక్షరములకు ప్రథమాక్షరములు వర్గ చతుర్థాక్షరములకు తృతీయాక్షరములు ఆదేశములగును. (బి) అభ్యాసమునందలి కవర్గాక్షరములకు యథాక్రమముగ చవర్గాక్షరములు ఆదేశమగును. (సి) అభ్యాసమునందలి 'హ' కారమునకు జకారమాదేశమగును. (డి) అభ్యాసము నందలి దీర్ఘములకు హ్రస్వములు ఆదేశమగును. (ఇ) అభ్యాసము నందలి ఋకార ౯ కారములకు అకారాదేశమగును. మూడవ గణము ధాతువులకు చేరు లట్, లఙ్, లోట్ అను లకారముల ప్రథమ పురుష బహువచన ప్రత్యయమునందలి అనునాసికము లోపించును. కనుక 'బిభీ + అతి > భిభ్యతి' గా మారును. అజాది దుర్బల ప్రత్యయము పరమగునపుడు, ధాత్వంగము యొక్క చివరి ఇ,ఈ లకు అవి అసంయుక్తపూర్వక మగునపుడు ఇయాదేశమురాదు. యణాదేశమే వచ్చును.

**శ్లో॥ హుతాగ్నికల్పైస్సవితుర్గభస్తిభిః**
**కలాపినః క్లాన్తశరీరచేతసః।**
**న భోగినం ఘ్నన్తి సమీపవర్తినం**
**కలాపచక్రేషు నివేశితాననమ్॥ 16**

**పదవిభాగము:-** హుత+అగ్నికల్పైః + సవితుః+గభస్తిభిః కలాపినః క్లాన్తశరీరచేతసః న భోగినమ్ ఘ్నన్తి సమీపవర్తినమ్ కలాపచక్రేషు నివేశిత+ఆననమ్.

**అన్వయక్రమము:-** సవితుః హుతాగ్నికల్పైః గభస్తిభిః క్లాన్తశరీరచేతసః కలాపినః సమీపవర్తినమ్ కలాపచక్రేషు నివేశితాననమ్ భోగినమ్ న ఘ్నన్తి.

**ప్రతిపదార్థము:-** సవితుః=సూర్యుని యొక్క, హుతాగ్నికల్పైః=హుతాగ్నిచే సమానమైన, గభస్తిభిః=కిరణములచేత, క్లాన్త=వాడిన, శరీరచేతసః=శరీరము మనసు గలవియు అగు, కలాపినః=నెమళ్ళు, కలాపచక్రేషు=పురియందు, నివేశితాననమ్=మోమును చొప్పించినదై, సమీపవర్తినమ్=చేరువనున్నదైన, భోగినమ్=పామును, న ఘ్నన్తి= చంపకున్నవి.

**తాత్పర్యము:–** హుతాగ్ని సమానమైన సూర్యుని కిరణములచే వాడిన శరీరము మనసు గల నెమళ్ళు, పురియందు మోమును చొప్పించినదై చేరువనున్న పామును చంపకున్నవి.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) హుతాగ్నికల్పైః–హుతశ్చాసౌ అగ్నిః హుతాగ్నిః–కర్మధారయః–తేన సమైః–హుతాగ్నికల్పైః – తద్ధిత ప్రత్యయః 'కల్పప్'
2) కలాపచక్రేషు – కలాపానాం చక్రమ్ తేషు – షష్ఠీతత్పురుషః
3) క్లాన్తశరీరచేతసః – క్లాన్తే శరీరచేతసీ యేషాం తే తథావిధాః – బహువ్రీహిః
4) నివేశితాననమ్ – నివేశితమ్ ఆననం యేన సః – బహువ్రీహిః
5) సమీపవర్తినమ్ – సమీపే వర్తతే యః అసౌ తథావిధమ్ – కృత్సమాసః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కలాః ఆప్నోతీతి కలాపః ఆప్ల్ వ్యాప్తౌ. కళలను బొందునది. **కలాపో భూషణే బర్హే తూణీరే సంహతావపి.** ఇచట కలాపశబ్దము నెమలిపురికి పేరు.
2) భోగస్సర్పశరీరం తదస్యాస్తీతి భోగీ. భోగమనగా సర్పశరీరము. అది కలిగినది. **ఉరగః పన్నగో భోగీ జిహ్మగః పవనాశనః.**

c) **గుణము:–** ప్రసాదగుణము

d) **రీతి:–** వైదర్భి

e) **ఛందస్సు–వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

f) **క్రియాదర్శము :–** 'ఘ్నన్తి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము.

**ధాతువు :–** హన (హన్) – హింసాగత్యోః (చంపుట, వెళ్ళుట). 2వ వికరణ ధాతువు వికరణ ప్రత్యయము ఉండదు. అజాది దుర్బల ప్రత్యయము పరమగు నపుడు హన్ ధాతువు యొక్క అకారమునకు లోపము, హకారమునకు ఘకారాదేశము వచ్చును. హన్ + అన్తి > ఘ్నన్తి.

**శ్లో॥ సభద్రముస్తం పరిశుష్కకర్దమం**
**సరః ఖనన్నాయతపోత్రమణ్డలైః।**
**రవేర్మయూఖైరభితాపితో భృశం**
**వరాహయూథో విశతీవ భూతలమ్॥ 17**

**పదవిభాగము:–** సభద్రముస్తమ్ పరిశుష్కకర్దమమ్ సరః ఖనన్+ఆయతపోత్రమణ్డలైః రవేః+మయూఖైః+అభితాపితః భృశమ్ వరాహయూథః విశతి+ఇవ భూతలమ్.





**అన్వయక్రమము:–** సభద్రముస్తమ్ పరిశుష్కకర్దమమ్ సరః ఆయతపోత్రమణ్డలైః ఖనన్ రవేః మయూఖైః భృశమ్ అభితాపితః వరాహయూథః భూతలమ్ విశతీవ

**ప్రతిపదార్థము:–** సభద్రముస్తమ్=భద్రముస్తలతో కూడినది, పరిశుష్క=బాగా ఎండిన, కర్దమమ్=బురదగల, సరః=పడియను, ఆయతపోత్రమణ్డలైః=పొడవైన, వర్తులాకారమగు ముట్టెలచేత, ఖనన్=త్రవ్వుచు, రవేః=సూర్యునియొక్క, మయూఖైః=కిరణములచే, భృశమ్=అధికంగా, అభితాపితః=తపింపజేయబడిన, వరాహయూథః=అడవిపందుల గుంపు, భూతలమ్=భూప్రదేశమును, విశతీవ=ప్రవేశించుచున్న ట్లున్నది.

**తాత్పర్యము:–** భద్రముస్తలను గడ్డలను కూడిన ఎండిన బురదగలపడియను పొడవైన వర్తులాకారమగు ముట్టెలచే త్రవ్వుచు సూర్యకిరణములచే తపింపజేయబడిన అడవి పందుల గుంపు భూప్రదేశమును ప్రవేశించుచున్నట్లున్నది.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) ఆయతపోత్రమండలైః–ఆయతాని యాని పోత్రమండలాని తైః–కర్మధారయః
2) పరిశుష్కకర్దమమ్ – పరిశుష్కమ్ కర్దమమ్ యస్య తత్ – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కృణోతీతి కర్దమః. కృఞ్ హింసాయాం. పీడించునది. **నిషద్వరస్తు జమ్బాలః పంకో౽స్త్రీ శాద కర్దమౌ.**
2) పరం శ్రేష్ఠం సస్యం ఆహంతీతి వరాహః. హన హింసాగత్యోః. శ్రేష్ఠమైన సస్యమును జెఱుచునది. **వరాహ స్సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిఃకిటిః**

c) **గుణము:–** ప్రసాదగుణము

d) **రీతి:–** వైదర్భి

e) **అలంకారము–ఉత్ప్రేక్ష:–** 'సంభావనా స్యాదుత్ప్రేక్షా' అని లక్షణము. సంభావనయే ఉత్ప్రేక్షాలంకారమనబడును. ఇందు వరాహసమూహము తుంగముస్తలకై త్రవ్వు చుండుటను – అవి భూగర్భములో ప్రవేశించుచున్నట్లు భావించుటచే – ఉత్ప్రేక్షగా పేర్కొనబడును.

f) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

g) **క్రియాదర్శము :–** 'విశతి' పరస్మైపది. లట్ ప్రథమపురుష ఏకవచనము.

**ధాతువు :–** విశ (విశ్) – ప్రవేశనే – ప్రవేశించుట. 6వ వికరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. కనుక విశ్+అ+తి (పరస్మైపది ప్రథమపురుష ఏకవచన తిజ్ ప్రత్యయము) > విశతి.

**శ్లో॥ వివస్వతా తీక్ష్ణతరాంశుమాలినా**
**సపఙ్కతోయాత్సరసోఽభితాపితః।**
**ఉత్ప్లుత్యభేక స్తృషితస్య భోగినః**
**ఫణాతపత్రస్య తలే నిషీదతి॥ 18**

**పదవిభాగము:–** వివస్వతా తీక్ష్ణతర+అంశుమాలినా సపంకతోయాత్ + సరసః +అభితాపితః ఉత్ప్లుత్య భేకః+తృషితస్య భోగినః ఫణా+ఆతపత్రస్య తలే నిషీదతి.

**అన్వయక్రమము:–** తీక్ష్ణతర–అంశుమాలినా వివస్వతా అభితాపితః భేకః సపంక తోయాత్ సరసః ఉత్ప్లుత్య తృషితస్య భోగినః ఫణా+ఆతపత్రస్య తలే నిషీదతి.

**ప్రతిపదార్థము:–** తీక్ష్ణతర=చురుకైన, అంశుమాలినా=కిరణసమూహముగల, వివస్వతా =సూర్యునిచే, అభితాపితః=బాగా తపింపచేయబడినదై, సపంకతోయాత్=బురదనీళ్ళతో కూడిన, సరసః=కొలను నుండి, భేకః=కప్ప, ఉత్ప్లుత్య=ఒక్కఉదుటున ఎగిరి, తృషితస్య =దప్పిక గొనిన, భోగినః=సర్పముయొక్క, ఫణా=పడగ అనెడు, ఆతపత్రస్య=గొడుగు యొక్క, తలే=క్రింది భాగమందు (నీడన), నిషీదతి=కూర్చున్నది.

**తాత్పర్యము:–** చురుకైన సూర్యకిరణములచే తపింపజేయబడిన, బురదనీళ్ళతో కూడిన కొలను నుండి కప్ప ఒక్క ఉదుటున ఎగిరి పాము పడగ నీడన కూర్చున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) తీక్ష్ణతరాంశుమాలినా – తీక్ష్ణతరః చ అసౌ అంశుమాలీ – తీక్ష్ణతరాంశుమాలీ – తేన – కర్మధారయః.

2) ఫణాతపత్రస్య – ఫణా ఏవ ఆతపత్రం తస్య – కర్మధారయః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) బిభేతి సర్పాద్భేకః. ఞిభీ భయే. సర్పమువలన భయపడునది. **భేకే మణ్డూక వర్షాభూ శాలూర ప్లవ దర్దురాః.**

2) అంశుమాలాః కిరణరాజయః అస్య సంతీతి అంశుమాలీ. కిరణ సమూహము గలవాడు. **కర్మసాక్షీ జగచ్చక్షు రంశుమాలీ త్రయీతనుః.**

c) **గుణము:–** ప్రసాదగుణము

d) **రీతి:–** వైదర్భి

e) **ఛందస్సు–వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము. ఇందు 3వ పాదము మార్పును గమనించండి. ఇది ఇంద్రవంశా వృత్తపాదము.





| ఉ త్ప్లు త్య | భే క స్తృ | షి త స్య | భో గి నః |
|---|---|---|---|
| U U I | U U I | I U I | U I U |
| త | త | జ | ర |

f) **క్రియాదర్శము:–** నిషీదతి పరస్మైపది. లట్ ప్రథమపురుషఏకవచనము. ఈ ధాతువివరములు – 13వ శ్లోకభాగమున చూడదగును.

**శ్లో॥ సముద్ధృతాశేషమృణాళజాలకం**
**విపన్నమీనం ద్రుతభీతసారసమ్।**
**పరస్పరోత్పీడనసంహతైర్గజైః**
**కృతం సరః సాన్ద్రవిమర్దకర్దమమ్॥ 19**

**పదవిభాగము:–** సముత్+హృత+అశేషమృణాళజాలకమ్ విపన్నమీనం ద్రుతభీత సారసమ్ పరస్పర+ఉత్+పీడనసంహతైః+గజైః కృతమ్ సరః సాంద్రవిమర్దకర్దమమ్.

**అన్వయక్రమము:–** పరస్పర ఉత్పీడన సంహతైః గజైః సరః సముద్ధృత అశేష మృణాళజాలకమ్ విపన్నమీనమ్ ద్రుతభీత సారసమ్ సాంద్ర విమర్ద కర్దమమ్ కృతమ్.

**ప్రతిపదార్థము:–** పరస్పర=ఒకదానితో నొకటి, ఉత్పీడన=త్రోసికొనుటచేత, సంహతైః =గుమిగూడిన, గజైః=ఏనుగులచేత, సరః=కొలను, సముద్ధృత=పెళ్ళగింపబడిన, అశేష=సమస్తమైన, మృణాళజాలకమ్=తామరతూండ్ల సమూహముగలదిగను, విపన్నమీనమ్=నశించిన చేపలు గలదియు, ద్రుతభీత=భయముచే పరుగిడిన, సారసమ్ =బెగ్గురుపక్షులుగలదియు, సాంద్ర=దట్టముగా, విమర్ద=త్రొక్కుడు గల, కర్దమమ్=బురద గలదిగను, కృతమ్=చేయబడినది.

**తాత్పర్యము:–** ఏనుగులు ఒకదానితో నొకటి త్రోసికొనుచు తామరతూండ్లు పూర్తిగా పెకలింపబడుటతోను, త్రొక్కుడుచే నశించిన చేపలు గలదియు, భయముచే పరువెత్తిన బెగ్గురు పక్షులు గలదియునైన కొలనులో నీళ్ళను, బురదయును కలిసి మెదిగి రొంపిగా చేయబడినది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) సముద్ధృ.... జాలకమ్ – సముద్ధృతమ్ అశేషమ్ మృణాళ జాలమ్యస్యతత్ తథావిధమ్ – బహువ్రీహిః

2) ద్రుతభీతసారసమ్ – ద్రుతాః భీతాశ్చసారసా యస్య తత్ తథావిధమ్ – బహువ్రీహిః.

3) విపన్నమీనమ్ – విపన్నాఃమీనా యస్య తత్ తథాభూతమ్ – బహువ్రీహిః

4) సాంద్రవిమర్దకర్దమమ్ – సాంద్రవిమర్దః కర్దమో యస్య తత్ – బహువ్రీహిః
5) పర.. సంహతైః – పరస్పరం ఉత్పీడనేన సంహతా తైః – తృతీయాతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) మృణ్యతే భక్ష్యత ఇతి మృణాళం, మృణ హింసాయాం భక్షింపబడునది. **మృణాళం బిసం –**
2) మీయతే ధీవరేణ మీనః. మీఙ్ హింసాయాం జాలరివానిచేత హింసింప బడునది. మినోతి క్షిపతి జలమితి వా మీనః, డుమిఞ్ ప్రక్షేపణే, జలము చల్లునది. **పృథురోమాఝషోమత్స్యోమీనో వైసారిణోఽణ్డజః, .....**

c) **గుణము:–** ప్రసాదగుణము

d) **రీతి:–** వైదర్భి

e) **ఛందస్సు–వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

f) **క్రియాదర్శము :–** కృతమ్ – కృదంతము. 'క్త' ప్రత్యయాంతము. భూతకాలికము.
**ధాతువు :–** కృ–**దుకృఞ్**–కరణే–చేయుట. నామవాచక రూపము ననుసరించి ఆయా లింగములలోనికి మారును. కృతః – కృతా – కృతమ్.

**శ్లో॥ రవిప్రభోద్భిన్నశిరోమణిప్రభో**
**విలోలజిహ్వాద్వయలీఢమారుతః।**
**విషాగ్నిసూర్యాతపతాపితః ఫణీ**
**న హన్తి మండూకకులం తృషాకులః॥ 20**

**పదవిభాగము:–** రవిప్రభా+ఉద్భిన్నశిరోమణిప్రభః విలోలజిహ్వాద్వయలీఢమారుతః విష+అగ్ని సూర్యాతపతాపితః ఫణీ న హన్తి మండూకకులమ్ తృషాకులః.

**అన్వయక్రమము:–** రవిప్రభా ఉద్భిన్న శిరోమణిప్రభః విలోల జిహ్వాద్వయ లీఢ మారుతః విషాగ్ని సూర్యాతప తాపితః తృషాకులః ఫణీ మండూకకులమ్ న హన్తి.

**ప్రతిపదార్థము:–**రవిప్రభా=ఎండచేత, ఉద్భిన్న=కలిసిన, శిరోమణి=శిరోరత్నము యొక్క, ప్రభః=తేజస్సు (వెలుగు) గలదై, విలోల=చంచలమైన, జిహ్వాద్వయ=రెండునాలుకల చేత, లీఢ=నాకబడిన, మారుతః=గాలిగలదియు, విషాగ్ని=విషము అనెడు అగ్నిచేతను, సూర్యాతప=ఎండచేత, తాపితః=తపింప జేయబడినదియు, తృషాకులః=దప్పికచే వ్యాకులతచెందిన, ఫణీ=సర్పము, మండూక కులమ్=కప్పల సమూహమును, న హన్తి=చంపకున్నది.





**తాత్పర్యము:–** పడగపై నున్న శిరోమణి ఎండచేత వెలుగులు పైకి చిమ్ముచుండగా చంచలమైన రెండు నాలుకలచే గాలిని తీసుకొనునదియు, విషము అను అగ్నిచేత, ఎండచేత తపింపజేయబడినదై దప్పికచే వ్యాకులత చెందిన సర్పము కప్పలను చంపకున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) రవి.. ప్రభః–రవేః ప్రభా, రవిప్రభా–షష్ఠీతత్పురుషః – రవిప్రభయా ఉద్భిన్నా, రవిప్రభోద్భిన్నా శిరోమణేః ప్రభా యస్యాఽసౌ తథావిధః – బహువ్రీహిః
2) విలోల.... మారుతః – జిహ్వాయాః ద్వయమ్, జిహ్వాద్వయమ్ షష్ఠీతత్పురుషః – విలోలం చేదం జిహ్వాద్వయమ్. విలోలజిహ్వాద్వయమ్ – కర్మధారయః – విలోలజిహ్వాద్వయేన లీఢః మారుతో యేనాఽసౌ తథావిధః – బహువ్రీహిః
3) మండూకకులమ్ – మండూకానామ్ కులమ్ – షష్ఠీతత్పురుషః.
4) విషాగ్ని .... తాపితాః – విషస్య అగ్నిః విషాగ్నిః – షష్ఠీతత్పురుషః – సూర్యస్యాతపః – సూర్యాతపః – షష్ఠీతత్పురుషః – విషాగ్నిశ్చ సూర్యాతపశ్చ విషాగ్నిసూర్యాతపౌ – ద్వంద్వః – విషాగ్నిసూర్యాతపాభ్యాం తాపితో యః అసౌ – తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) ఆ సమంతాత్తపతీతి ఆతపః. తప సంతాపే – అంతటఁదపించునది. **ప్రకాశోద్యోత ఆతపః.**
2) ప్రకర్షేణ భాతీతి ప్రభా. మిక్కిలి ప్రకాశించునది. **స్యుః ప్రభా రుగ్రుచి స్త్విడ్భాభాశ్ఛవి ద్యుతి దీప్తయః,**
3) హ్వాయతి రసవద్వస్తు జిహ్వా. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దే చ రసయుక్తమైన వస్తువుల నిష్టపడునది. **రసజ్ఞా రసనా జిహ్వా –**

c) ఓజో గుణమున్నది. 'ఓజస్సమాసభూయస్త్వమ్' అని లక్షణము. సమాస భూయిష్ఠ మగురచన 'ఓజస్సు' అనబడును. మొదటి మూడు పాదములు దీర్ఘసమాస యుతము గాను, నాలుగవపాదము అల్పసమాసయుతముగానున్నది.

d) **రీతి:– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

f) **క్రియాదర్శము :–** హన్తి – పరస్మైపది. లట్ ప్రథమపురుష ఏకవచనము. ఈ ధాతువివరములకు '14'వ శ్లోకభాగము చూడదగును.

శ్లో॥ సఫేనలోలాయతవక్త్రసమ్పుటం
వినిస్సృతాలోహితజిహ్వమున్ముఖమ్।
తృషాకులం నిస్సృతమద్రిగహ్వరా-
దవేక్షమాణం మహిషీకులం జలమ్॥ 21

**పదవిభాగము:-** సఫేనలోల+ఆయతవక్త్రసంపుటమ్ వినిస్సృత+ఆలోహితజిహ్వామ్+ఉన్ముఖమ్ తృషాకులమ్ నిస్సృతమ్+అద్రిగహ్వరాత్+అవేక్షమాణమ్ మహిషీకులమ్ జలమ్.

**అన్వయక్రమము:-** సఫేన లోల ఆయత వక్త్రసంపుటమ్ వినిస్సృత ఆలోహిత జిహ్వామ్ ఉన్ముఖమ్ తృషాకులమ్ జలమ్ అవేక్షమాణమ్ మహిషీకులమ్ అద్రిగహ్వరాత్ నిస్సృతమ్

**ప్రతిపదార్థము:-** సఫేన=నురుగుతో కూడిన, లోల=చంచలమైన, ఆయత=పొడవైన, వక్త్రసంపుటమ్=నోరుగలదియు, వినిస్సృత=బయటికి వచ్చిన, ఆలోహిత=కొంచె మెఱ్ఱనైన, జిహ్వామ్=నాలుకగలదియు, ఉన్ముఖమ్=ఎత్తినముఖముగలదియు, తృషాకులమ్=దప్పికచేవ్యాకులముచెందినదియు అగు, మహిషీ కులమ్=బఱ్ఱెల గుంపు, జలమ్=నీటిని, అవేక్షమాణమ్ =చూచుచున్నదై, అద్రిగహ్వరాత్=కొండగుహ నుండి, నిస్సృతమ్=బయటకు వచ్చినది.

**తాత్పర్యము:-** నురుగుతో కూడిన, పొడవైన నోరు గలదియు, కొంచెమెఱ్ఱనైన నాలుకయు, దప్పికచే వ్యాకులతచెంది, ఎత్తిన ముఖమును గల బఱ్ఱెల మంద నీటిని చూచుచున్నదై కొండగుహనుండి బయటకు వచ్చినది.

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**
1) వినిస్సృతాలోహితజిహ్వామ్ - వినిఃసృతా ఆలోహితా జిహ్వా యస్య తత్ - బహువ్రీహిః
2) మహిషీకులమ్ - మహిషీణాం కులమ్ - షష్ఠీతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**
1) మహ్యతే పూజ్యత ఇతి మహిషీ. మహ పూజాయాం పూజింపబడునది.
2) గతిం హ్వారతీతి గహ్వరం. హ్వృకౌటిల్యే. శైలగమనమును కుటిలంగా జేయునది. **దేవఖాతబిలే గుహా గహ్వరమ్.**

c) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - వంశస్థవిలము.

g) **క్రియాదర్శము :-** నిస్సృతమ్, నిస్ - ఉపసర్గ.
**ధాతువు :- సృ** - వెళ్ళుట, పరస్మైపది. 3వ వికరణధాతువు.





**నిస్సృతమ్ :** కృదంతము. 'క్త' ప్రత్యయాంతము. భూతకాలికము. నామవాచక రూపము ననుసరించి ఆయా లింగములలోనికి మారును. నిస్సృతః - నిస్సృతా - నిస్సృతమ్.

శ్లో॥ పటుతరదవదాహోచ్ఛుష్కసస్యప్రరోహాః
పరుషపవనవేగోత్క్షిప్తసంశుష్కపర్ణాః।
దినకరపరితాపక్షీణతోయాస్సమన్తా
ద్విదధతి భయముచ్చైర్వీక్ష్యమాణా వనాన్తాః॥ 22

**పదవిభాగము:-** పటుతరదవదాహ+ఉత్+శుష్కసస్యప్రరోహాః పరుషపవనవేగ+ఉత్+క్షిప్తసంశుష్కపర్ణాః దినకరపరితాపక్షీణతోయాః సమన్తాత్ విదధతి భయమ్+ఉచ్చైః +వీక్ష్యమాణాః వనాన్తాః.

**అన్వయక్రమము:-** పటుతర దవదాహ ఉచ్ఛుష్క సస్యప్రరోహాః పరుష పవన వేగ ఉత్క్షిప్త సంశుష్కపర్ణాః సమన్తాత్ దినకర పరితాప క్షీణ తోయాః ఉచ్చైః వీక్ష్యమాణాః వనాన్తాః ఉచ్చైః భయమ్ విదధతి.

**ప్రతిపదార్థము:-** పటుతర=మిక్కిలి గొప్పదైన, దవదాహ=కారుచిచ్చు కాల్చుటచేత, ఉచ్ఛుష్క=బాగాఎండిన, సస్యప్రరోహాః=పైరుమొలకలు గలవియు, పరుష=బాగా వీచునట్టి, పవన=గాలియొక్క, వేగ=వేగముచే, ఉత్క్షిప్త=ఎగురగొట్టబడిన, సంశుష్కపర్ణాః =బాగా ఎండిన ఆకులు గలవియు, సమన్తాత్=అంతటా, దినకర= సూర్యుని యొక్క, పరితాప=వేడిమిచేత, క్షీణ=క్షీణించిన, తోయాః=నీరు గలవియు, వీక్ష్యమాణాః=చూడ బడుచున్న, వనాన్తాః=అటవీ ప్రాంతములు, ఉచ్చైః=అధికముగా, భయమ్=భీతిని, విదధతి=కలిగించుచున్నవి.

**తాత్పర్యము:-** కారుచిచ్చుచేత పైరుల మొలకలు ఎండినట్టివియు, ఉధృతమైన గాలి వేగముచే ఎగురగొట్టబడిన ఎండిన ఆకులు గలవియు, సూర్యుని వేడిమిచే క్షీణించిన నీరుగలవియు యునగు, అటవీప్రాంతములు చూచుటకు మిక్కిలి భీతిని కలిగించు చున్నవి.

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**
1) పటు ప్రరోహాః-పటుతరశ్చాసౌ దవదాహః,పటుతరదవదాహః-కర్మధారయః -తేన ఉచ్ఛుష్కః సస్యానాం ప్రరోహో యేషాం తే తథాభూతాః - బహువ్రీహిః
2) పరుష...... పర్ణాః - పరుషశ్చాసౌ పవనః, పరుషపవనః - కర్మధారయః- పరుషపవనస్యవేగః, పరుషపవనవేగః - షష్ఠీతత్పురుషః - తేన ఉత్క్షిప్తాని సంశుష్కాని పర్ణాని యేషాం తే తథాభూతాః - బహువ్రీహిః

3) దినకరపరితాపక్షీణతోయాః – దినకరస్య పరితాపః, దినకరపరితాపః–షష్ఠీ తత్పురుషః–దినకరపరితాపేన క్షీణాని తోయాని యేషాం తే తథాభూతాః–బహుబ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) పిపర్తివృక్షమితి పర్ణం.పౄ పాలనపూరణయోః–వృక్షమున నిండియుండునది. **పత్రం పలాశం ఛదనం దళం పర్ణం ఛదః పుమాన్.**

2) సస్తి వృక్షమధిశేతే సస్యం. షస స్వప్నే. వృక్షమందు శయనించునది. **వృక్షాదీనాం ఫలం సస్యమ్.**

c) **రీతి:–** పాంచాలీ రీతి.'పాంచాలరీతి ర్వైదర్భీగౌడీ రీత్యుభయాత్మికా' అని లక్షణము. శ్లోకమున వైదర్భి, గౌడీరీతుల కలయికయే పాంచాలీ రీతిగా పేర్కొనబడును.

d) **గుణము:–** ఓజోగుణము.

e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీ వృత్తము.

లక్షణము:– 1) అతిశక్వరీ ఛందస్సున ప్రతిపాదమున 15 అక్షరములుండును.

2) వృత్తలక్షణము:–న న మ య య యుతేయం మాలినీ భోగిలోకైః

3) ఇందు గణములు – న న మ య య 4) యతి (8, 7 )

| ఉదా:– | ప టు త | ర ద వ | దా హో చ్ఛు | ష్క స స్య | ప్ర రో హాః |
|---|---|---|---|---|---|
| | I I I | I I I | U U U | I U U | I U U |
| | న | న | మ | య | య |

f) **క్రియాదర్శము:–**'విదధతి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము వి – ఉపసర్గ.

**ధాతువు :– డుధాఞ్** (ధా) – ధారణ పోషణయోః – ధరించుట, పోషించుట. 3వ వికరణధాతువు. మిగిలిన వివరములకై 15వ శ్లోకభాగము చూడదగును.

2) ఏ) దదాతి నిర్వపతి చ దధాత్యపి చ దాశతి... అని 'ఆఖ్యాతచంద్రికా' 2–2–11

బి) దధాతి ధత్తే బిభృతే బిభర్తి భరతీతి చ... అని 'ఆఖ్యాతచంద్రికా' 2–3–7

**శ్లో॥ శ్వసితి విహగవర్గః శీర్ణపర్ణద్రుమస్థః**
**కపికులముపయాతి క్లాన్తమద్రేర్నికుఞ్జమ్।**
**భ్రమతి గవయయూథః సర్వతస్తోయమిచ్ఛ**
**ఞ్ఛరభకులమజిహ్మం ప్రోద్ధరత్యమ్బు కూపాత్॥ 23**





**పదవిభాగము:–** శ్వసితి విహగవర్గః శీర్ణపర్ణద్రుమస్థః కపికులమ్+ఉపయాతి క్లాన్తమ్+అద్రేః+నికుంజమ్ భ్రమతి గవయయూథః సర్వతః+తోయమ్+ఇచ్ఛన్ + శరభకులమ్+అజిహ్మమ్ ప్ర+ఉద్ధరతి+అంబు కూపాత్.

**అన్వయక్రమము:–** శీర్ణపర్ణద్రుమస్థః విహగవర్గః శ్వసితి క్లాన్తమ్ కపికులమ్ అద్రేః నికుంజమ్ ఉపయాతి గవయయూథః తోయమ్ ఇచ్ఛన్ సర్వతః భ్రమతి అజిహ్మమ్ శరభకులమ్ కూపాత్ అంబు ప్రోద్ధరతి.

**ప్రతిపదార్థము:–** శీర్ణపర్ణద్రుమస్థః=ఎండుటాకులున్న చెట్టుమీద, విహగవర్గః=పక్షుల సమూహము, శ్వసితి=నిట్టూర్పువిడుచుచున్నది. క్లాన్తమ్=వాడిన (అలసిన), కపికులమ్ =వానర సమూహము, అద్రేః=పర్వతముయొక్క నికుంజమ్=పొదరింటిని, ఉపయాతి =చేరుచున్నది. గవయయూథః=గోరూపమగు అడవి జంతువుల గుంపు, తోయమ్ =నీటిని, ఇచ్ఛన్=కోరుచూ, సర్వతః=అంతటా, భ్రమతి=తిరుగుచున్నది. అజిహ్మమ్ = గౌరవనీయమైన, శరభకులమ్=శరభముల గుంపు, కూపాత్=బావి నుండి, అంబు= నీటిని, ప్రోద్ధరతి=పైకి ఎత్తుకొనుచున్నది.

**తాత్పర్యము:–** ఆకులు ఎండిన చెట్టు మీద పక్షుల గుంపు నిట్టూర్పు విడుచుచున్నది. అలసిన కోతులగుంపు పర్వతమందలి పొదరింటిని చేరుకున్నది. గోరూపమగు అడవి జంతువుల సమూహము నీటిని కోరుచు తిరుగుచున్నది. గౌరవనీయమైన శరభముల గుంపు బావి నుండి నీటిని పైకి ఎత్తుకొనుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) శీర్ణ ....... స్థః–శీర్ణాని పర్ణాని యస్యాసౌ – బహుబ్రీహిః – తథావిధో ద్రుమః, శీర్ణపర్ణద్రుమః–కర్మధారయః–శీర్ణపర్ణద్రుమే స్థితః, శీర్ణపర్ణ ద్రుమస్థః –సప్తమీతత్పురుషః.

2) విహగవర్గః – విహగానాం వర్గః – షష్ఠీతత్పురుషః.

3) కపికులమ్–కపీనాం కులమ్ – షష్ఠీతత్పురుషః.

4) గవయయూథః – గవయానాం యూథః – షష్ఠీతత్పురుషః.

5) శరభకులమ్ – శరభాణాం కులమ్ – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శృణాతి సింహం ఇతి శరభః. శౄ హింసాయాం, సింహమును జంపునది. ఎనిమిదికాళ్ళు గలిగి సింహమును జంపెడు మృగము. తథాచోక్తం మహాభారతే – 'అష్టపాదూర్ధ్వనయనః శరభో వనగోచర' ఇతి. **గన్ధర్వశ్శరభో రామ స్సృమరో గవయశ్శశః.**

2) గా మయతే సదృశత్వాత్ గవయః. అయ గతౌ. గోవులను బోలునది.

3) విహాయసా గచ్ఛతీతి విహగః. ఆకాశమునబోవునది. **ఖగే విహంగ విహగ విహంగమ విహాయసః.**

c) **గుణము:–** ప్రసాదగుణము  d) **రీతి:–** వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీ వృత్తము.

g) **క్రియాదర్శము:–** ప్రోద్ధరతి – (ఉభయ) పరస్మైపది. లట్ ప్రథమపురుష ఏకవచనము.

**ధాతువు:– ధృఞ్** – ధృ – ధారణే – ధరించుట, పట్టుకొనుట. 1వ వికరణధాతువు. ఉపసర్గలు – ప్ర, ఉత్. ఇందు వికరణ ప్రత్యయము 'అ'. ధృఞ్ + అ > ధర్ + అ + తి > ధరతి (లట్ ప్రథమపురుషైకవచన తిజ్ ప్రత్యయము 'తి') కనుక ప్ర+ ఉత్+ధరతి = ప్రోద్ధరతి.

2) ధరతీత్యాత్మనేఽపి ద్వౌ భరణ్యతి ధియిత్యపి... అని 'ఆఖ్యాతచంద్రికా' 2–3–7

శ్లో॥ వికచనవకుసుమ్భస్వచ్ఛసిన్దూరభాసా
ప్రబలపవనవేగోద్భూతవేగేన తూర్ణమ్।
తటవిటపిలతాగ్రాలిఙ్గనవ్యాకులేన
దిశి దిశి పరిదగ్ధా భూమయః పావకేన॥ 24

**పదవిభాగము:–** వికచనవకుసుమ్భస్వచ్ఛసిందూరభాసా ప్రబలపవనవేగ+ఉద్భూత+ వేగేన తూర్ణమ్ తటవిటపిలతా+అగ్ర+ఆలింగనవ్యాకులేన దిశి దిశి పరిదగ్ధాః భూమయః పావకేన.

**అన్వయక్రమము:–** వికచ నవ కుసుమ్భ స్వచ్ఛ సిందూరభాసా ప్రబల పవన వేగ ఉద్భూత వేగేన తట విటపి లతాగ్ర ఆలింగన వ్యాకులేన పావకేన దిశి దిశి తూర్ణమ్ భూమయః పరిదగ్ధాః.

**ప్రతిపదార్థము:–** వికచ=వికసించిన, నవ=క్రొత్త, కుసుమ్భ=కుసుంభ పుష్పమువలె, స్వచ్ఛ=నిర్మలమైన, సిందూరభాసా=సిందూరకాంతివంటికాంతిగలదియు, ప్రబల= మిక్కిలిబలమైన, పవన=గాలియొక్క, వేగ=వేగముచే, ఉద్భూత=పుట్టిన, వేగేన=వేగము గలదియు, తట=ఒడ్డునందలి, విటపి=చెట్లయొక్క, లతాగ్ర=చిటారికొమ్మలను, ఆలింగన =తాకుటయందు, వ్యాకులేన=ఆతురతకలదియు అగు, పావకేన=అగ్ని చేత, దిశి దిశి= ప్రతిదిక్కునందును, తూర్ణమ్=శీఘ్రముగా, భూమయః=భూములు, పరిదగ్ధాః=బాగా దహింపబడినవి.





**తాత్పర్యము:–** అప్పుడే వికసించిన కుసుంబా పూవువలె నిర్మలమైన సిందూరకాంతి గల అగ్ని చేత, బలమైన గాలి వేగముచే పుట్టిన వేగముగలదియు, ఒడ్డునందలి చెట్ల చిటారికొమ్మలు తాకుటయందు ఆతురతగలదియైన అగ్నిచేత ప్రతిదిక్కునందును భూములు బాగా దహింపబడినవి.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) వికచ.... భాసా – నవశ్చాసౌ కుసుమ్భః, నవకుసుమ్భః – కర్మధారయః –వికచశ్చాసౌ నవకుసుమ్భః, వికచనవకుసుమ్భః–కర్మధారయః – వికచనవ కుసుమ్భఇవ స్వచ్ఛమ్, వికచనవకుసుమ్భస్వచ్ఛమ్ – ఉపమాన పూర్వపద కర్మధారయః–వికచనవ కుసుమ్భస్వచ్ఛస్య సిందూరస్య భా ఇవ భాః యస్యాసౌ తథావిధస్తేన – బహువ్రీహిః

2) ప్రబల..... వేగేన – ప్రబలశ్చాసౌ పవనః, ప్రబలపవనః–కర్మధారయః –ప్రబలపవనస్య వేగః, ప్రబలపవనవేగః–షష్ఠీతత్పురుషః–తేన ఉద్భూతో వేగో యస్యాసౌ తథావిధస్తేన – బహువ్రీహిః

3) తట..... కులేన – తటస్య విటపినః, తటవిటపినః – షష్ఠీతత్పురుషః – తేషాం లతాః, తటవిటపిలతాః – షష్ఠీతత్పురుషః–తాసామ్ అగ్రమ్, తటవిటపి లతాగ్రమ్ –షష్ఠీతత్పురుషః – తస్య ఆలింగనమ్ – తటవిటపిలతాగ్రా లింగనమ్ – షష్ఠీ తత్పురుషః – తస్మై వ్యాకులో యః అసౌ తేన, తటవిటపిలతాగ్రాలింగనవ్యాకులేన – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) స్యందతే ప్రస్రవతి సూక్ష్మత్వాదితి సిందూరమ్. స్యందూ ప్రస్రవణే. సూక్ష్మమౌటచేత జాఱునది. **'సిందూరం నాగసంభవమ్'.**

2) పునాతీతి పావకః. పూఞ్ పవనే – పవిత్రమును జేయువాడు. **కృశానుః పావకోఽనలః.**

c) **గుణము:– ఓజోగుణము**

d) **రీతి:– పాంచాలి**

e) **ఛందస్సు–వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు–మాలినీ వృత్తము.

f) ఈ శ్లోకమున అగ్ని లతాగ్రముల ఆలింగనమందు ఆతురతగలదని చెప్పుటచే ఉత్ప్రేక్షగా చెప్పదగును.

g) **క్రియాదర్శము :– పరిదగ్ధాః** కృదంతము. 'క్త' ప్రత్యయాంతము. భూతకాలికము.

1) ధాతువు - **దహ్** - దహ - భస్మీకరణే - భ్వాది(1) ప్రకరణ ధాతువు - పరస్మైపది. ఉపసర్గ : పరి నామవాచక రూపము ననుసరించి మూడు లింగములలోనికి మారును. దగ్ధః - దగ్ధా - దగ్ధమ్.

2) పరిదగ్ధాః - స్త్రీలింగ బహువచనరూపము.

**శ్లో॥ జ్వలతి పవనవృద్ధః పర్వతానాం దరీషు**
**స్ఫుటతి పటునినాదైః శుష్కవంశస్థలీషు।**
**ప్రసరతి తృణమధ్యే లబ్ధవృద్ధిః క్షణేన**
**గ్లపయతి మృగవర్గం ప్రాన్తలగ్నో దవాగ్నిః॥ 25**

**పదవిభాగము:-** జ్వలతి పవనవృద్ధః పర్వతానాం దరీషు స్ఫుటతి పటునినాదైః శుష్క వంశస్థలీషుప్రసరతి తృణమధ్యే లబ్ధవృద్ధిః క్షణేన గ్లపయతి మృగవర్గం ప్రాన్తలగ్నః దవాగ్నిః

**అన్వయక్రమము:-** పవనవృద్ధః దవాగ్నిః పర్వతానామ్ దరీషు జ్వలతి శుష్కవంశస్థలీషు పటునినాదైః స్ఫుటతి క్షణేన లబ్ధవృద్ధిః తృణమధ్యే ప్రసరతి ప్రాన్తలగ్నః మృగవర్గమ్ గ్లపయతి.

**ప్రతిపదార్థము:-** పవనవృద్ధః=వాయువుచేత వృద్ధి బొందిన, దవాగ్నిః=కారుచిచ్చు, పర్వతానామ్=పర్వతములయొక్క, దరీషు=లోయలందు, జ్వలతి=మండుచున్నది. శుష్కవంశస్థలీషు=ఎండిన వెదురు ప్రదేశములయందు, పటునినాదైః=చటచటశబ్దము లతో, స్ఫుటతి=విరియుచున్నది. క్షణేన=క్షణములోపల, లబ్ధవృద్ధిః=వృద్ధిని పొంది, తృణమధ్యే=ఎండిన గడ్డియందు, ప్రసరతి=వ్యాపించుచున్నది. ప్రాన్తలగ్నః=పార్శ్వముల యందంటుచున్నదై, మృగవర్గమ్=జింకలగుంపును, గ్లపయతి=వ్యాకులపఱుచుచున్నది.

**తాత్పర్యము:-** వాయువుచే వృద్ధిచెందిన కారుచిచ్చు పర్వతలోయలందు మండు చున్నది. ఎండిన వెదురు స్థలములందు చటచట శబ్దములతో విరియుచున్నది. ఎండిన గడ్డియందు క్షణాల్లో వ్యాపించుచున్నది. పార్శ్వములందంటుకొన్నదై జింకలగుంపును కష్టపెట్టుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) పవన వృద్ధః-పవనేన వృద్ధః - తృతీయాతత్పురుషః.
2) దవాగ్నిః - దవస్య అగ్నిః - షష్ఠీతత్పురుషః.
3) శుష్కవంశస్థలీషు - శుష్కానాం వంశానాం స్థలీషు - కర్మధారయగర్భితః - షష్ఠీతత్పురుషః.
4) పటునినాదైః - పటవశ్చేమే నినాదాః తైః - కర్మధారయః.





5) లబ్ధవృద్ధిః - లబ్ధావృద్ధిః యేనాసౌ - బహువ్రీహిః
6) తృణమధ్యే-తృణానాం మధ్యే - షష్ఠీతత్పురుషః.
7) ప్రాన్తలగ్నః - ప్రాన్తే లగ్నః - సప్తమీతత్పురుషః.
8) మృగవర్గమ్ - మృగాణాం వర్గమ్ - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) పునాతీతి పవనః. పూఞ్ పవనే - పవిత్రము చేయువాడు. **నభస్వ ద్వాత పవన పవమాన ప్రభంజనాః.**
2) నినదతీతి నినదః, ణ ద అవ్యక్తే శబ్దే. మ్రోయునది నినాదము. **శబ్దే నినాద నినద ధ్వని ధ్వాన రవస్వనాః....**
3) దీర్యతే దరీ. దౄ విదారణే. భేదింపబడినది. దరీ తు కందరో వా.

c) **గుణము:-** ప్రసాదగుణము

d) **రీతి:-** వైదర్భి

e) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీవృత్తము.

f) **అల్పసమాసభరితము.** ప్రసాదగుణమునకు చక్కని ఉదా:-(8 సమాసములు).

g) **క్రియాదర్శము :-** జ్వలతి, స్ఫుటతి, ప్రసరతి, గ్లపయతి.

1. జ్వలతి: జ్వల్- దీప్తౌ, 1వ వికరణ ధాతువు లట్ ప్రథమపురుషైకవచనము. పరస్మైపది. అ వికరణ ప్రత్యయము. జ్వల్ + అ + తి > జ్వలతి
2. స్ఫుటతి: స్ఫుట్ - వికసించుట, 6వ వికరణ ధాతువు - లట్ ప్రథమపురుష ఏకవచనము. పరస్మైపది. స్ఫుట్ + అ + తి > స్ఫుటతి.
3. ప్రసరతి: సృ - వెళ్ళుట, 1వ వికరణ ధాతువు - పరస్మైపది. 'అ' వికరణ ప్రత్యయము సృ+అ+తి (తిజ్ ప్రత్యయము) సృ+అ+తి > సర్+అ+తి > సరతి. లట్ ప్రథమపురుషఏకవచనము. ప్ర=ఉపసర్గ.
4. గ్లపయతి: గ్లై. హర్షక్షయే, 10వ వికరణ ధాతువు. పరస్మైపది. వికరణ ప్రత్యయము 'అయ' లట్ ప్రథమపురుషైకవచన తిజ్ ప్రత్యయము 'తి' వలన గ్లప్+అయ+తి > గ్లపయతి అగును.
5. భ్రేజతే దీవ్యతి హటత్యమీ **జ్వలతి** జోతతే... 2-1-14
**స్ఫుటతి** స్ఫోటతే ఫుల్లత్యున్మీలత్యపి పుష్యతి... 1-1-9
ఆత్మనేఽపి **గ్లపయతి** గ్లాపయత్యపి పీడనే.... 2-3-85 (ఆఖ్యాతచంద్రికా)

**శ్లో॥ బహుతర ఇవ జాతః శాల్మలీనాం వనేషు**
**స్ఫురతి కనకగౌరః కోటరేషు ద్రుమాణామ్।**

పరిణతదళశాఖానుత్పతన్ ప్రాంశువృక్షాన్
భ్రమతి పవనధూతః సర్వతోఽగ్నిర్వనాన్తే॥ 26

**పదవిభాగము:–** బహుతరః ఇవ జాతః శాల్మలీనామ్ వనేషు స్ఫురతి కనకగౌరః కోటరేషు ద్రుమాణామ్ పరిణతదళశాఖాన్+ఉత్పతన్ ప్రాంశువృక్షాన్ భ్రమతి పవనధూతః సర్వతః +అగ్నిః+వనాన్తే.

**అన్వయక్రమము:–** అగ్నిః శాల్మలీనామ్ వనేషు బహుతర ఇవ జాతః ద్రుమాణామ్ కోటరేషు కనక గౌరః స్ఫురతి పవనధూతః పరిణతదళశాఖాన్ ప్రాంశువృక్షాన్ సర్వతః ఉత్పతన్ వనాన్తే భ్రమతి.

**ప్రతిపదార్థము:–** అగ్నిః=నిప్పు, శాల్మలీనామ్=బూరుగ చెట్లయొక్క, వనేషు=అడవులందు, బహుతర ఇవ=అధికముగా, జాతః=పుట్టినది, ద్రుమాణామ్=చెట్లయొక్క, కోటరేషు=తొఱ్ఱల యందు, కనకగౌరః=బంగారువలె పచ్చగా, స్ఫురతి=ప్రకాశించుచున్నది. పవనధూతః=గాలిచేవీచబడిన, పరిణతదళశాఖాన్=పండుటాకుల కొమ్మలు గల,ప్రాంశువృక్షాన్=ఎత్తైన చెట్లను, సర్వతః=అంతటా, ఉత్పతన్=ఎగిరియంటుచున్నదై, వనాన్తే=అటవీప్రాంతమున, భ్రమతి=తిరుగుచున్నది.

**తాత్పర్యము:–** బూరుగ చెట్ల యొక్క అడవులందు పుట్టిన **అగ్ని** చెట్ల తొఱ్ఱలయందు బంగారువలె పచ్చగా ప్రకాశించుచున్నది. పండుటాకులు గల ఎత్తైన చెట్లను గాలిచే వీచబడి ఎగిరి అంటుచున్నదై అటవీ ప్రాంతమున తిరుగుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కనకగౌరః – కనకవత్ గౌరః – ఉపమితసమాసః.
2) పరిణతదళశాఖాన్–పరిణతాని దళాని శాఖాశ్చ యేషాం తాన్– బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) ప్రకర్షేణ అశ్నుత ఇతి ప్రాంశుః. అశూ వ్యాప్తౌ ఊర్ధ్వముగా వ్యాపించునది. **ఉచ్చప్రాంశూన్నతోదగ్రోచ్ఛ్రితాస్తుఙ్గే.**
2) విటపై శ్మాల్యతే శాల్మలిః. శాఖా విస్తారము చేత కొనియాడబడునది. **పిచ్ఛిలా పూరణీమోచా చిరాయు శ్మాల్మలిర్ద్వయోః.**
3) ధూయతే స్మ ధూతం. ధూ విధూననే. **త్యక్తం హీనం విధుతం సముజ్ఝితం ధూతముత్సృష్టమ్.**

c) **గుణము:–** ప్రసాదగుణము

d) **రీతి:–** వైదర్భి





e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీవృత్తము.

f) **అలంకారము:–** ఉత్ప్రేక్ష.

g) **క్రియాదర్శము :–** స్ఫురతి, భ్రమతి.

1. స్ఫురతి: **స్ఫుర్** – స్ఫురించుట, అదురుట. 6వ వికరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము 'తి' – తిజ్ ప్రత్యయము. స్ఫుర్+అ+తి > స్ఫురతి.
2. భ్రమతి: **భ్రమ్**–తిరుగుట. 1వ వికరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. భ్రమ్+అ+తి > భ్రమతి. లట్ ప్రథమపురుష ఏకవచనము.
3. ప్రాదుర్భవతి నిర్భాతి **స్ఫురతి** ప్రతిభాసతే... 1–2–1
మిథ్యాజ్ఞానేఽనవస్థానే **భ్రమతి** భ్రామ్యతీత్యుభే.... 3–3–10
విభ్రమ్యతి విపర్యేతి విపర్యస్యతి విభ్రమే, **భ్రమతి** భ్రామ్యతీత్యేతే...1–2–6
(ఆఖ్యాతచంద్రికా)

**శ్లో॥ గజగవయమృగేన్ద్రా వహ్నిసన్తప్తదేహాః**
**సుహృద ఇవ సమేతా ద్వన్ద్వభావం విహాయ।**
**హుతవహపరిఖేదాదాశు నిర్గత్య కక్షా**
**ద్విపులపులినదేశాన్నిమ్నగాం సంవిశన్తి॥ 27**

**పదవిభాగము:–** గజగవయమృగ+ఇన్ద్రాః వహ్నిసన్తప్తదేహాః సుహృదః+ఇవ సమేతాః ద్వన్ద్వభావమ్ విహాయ హుతవహపరిఖేదాత్+ఆశు నిర్గత్య కక్షాత్+విపులపులినదేశామ్ నిమ్నగామ్ సంవిశన్తి.

**అన్వయక్రమము:–** వహ్నిసన్తప్తదేహాః ద్వంద్వభావమ్ విహాయ సుహృద ఇవ సమేతాః గజగవయమృగేన్ద్రాః హుతవహపరిఖేదాత్ ఆశు కక్షాత్ నిర్గత్య విపులపులినదేశామ్ నిమ్నగామ్ సంవిశన్తి.

**ప్రతిపదార్థము:–** వహ్నిసన్తప్తదేహాః=అగ్నిచే తపింపజేయబడిన శరీరములు గలవై, ద్వంద్వభావమ్=విరోధమును, విహాయ=విడిచి, సుహృద ఇవ=మిత్రులవలె, సమేతాః =కూడినవై, గజగవయమృగేన్ద్రాః=ఏనుగులు, గురుపోతులు, సింహములును, హుతవహపరిఖేదాత్=హుతాగ్నిచేత కలిగిన అధికశ్రమ వలన, ఆశు=వెంటనే, కక్షాత్= కొండగుహ నుండి, నిర్గత్య=వచ్చి, విపులపులినదేశామ్=విస్తారమైన యిసుక తిన్నెలు గల, నిమ్నగామ్=నదిని, సంవిశన్తి=చేరుచున్నవి.

**తాత్పర్యము:–** విరోధమును విడచి మిత్రులవలె కూడినవై అగ్నిచేత తపింపజేయబడిన దేహములు గల ఏనుగులు, గురుపోతులు, సింహములును హుతాగ్నిచే అధికశ్రమ

కలిగినవెంటనే కొండగుహలనుండి విస్తారమైన యిసుక తిన్నెలుగల నదినిచేరుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) వహ్నిసన్తప్తదేహాః–వహ్నినా సన్తప్తో దేహో యేషాం తే – బహువ్రీహిః
2) గజగవయమృగేన్ద్రాః–గజాశ్చ గవయాశ్చ మృగేన్ద్రాశ్చ–ద్వంద్వసమాసః.
3) ద్వంద్వభావమ్ – ద్వంద్వస్య భావమ్ – షష్ఠీతత్పురుషః.
4) విపులపులినదేశాత్ – విపులశ్చాసౌ పులినదేశః తస్మాత్ – కర్మధారయః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) తోయే క్షీణే సతి ఉత్థితం దృశ్యం తత్ పులినమిత్యుచ్యతే. నీళ్ళు తీసిన తరువాత కనబడుదిన్నె పులినమనబడును. **తోయోత్థితం తత్పులినమ్.**

c) **గుణము:–** ప్రసాదమాధుర్యగుణములు.

d) **రీతి:–** వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీవృత్తము.

f) **అలంకారము: ఉత్ప్రేక్ష:** లక్షణమునకై 17వ శ్లోకభాగము చూడదగును. ఈ శ్లోకమున 'జంతువులు అగ్నిచే పరితపింపబడుటచే వైరభావము వీడినవనుట' ఉత్ప్రేక్షగా పేర్కొనదగును. లేదా ఉపమాలంకారము.

g) **క్రియాదర్శము :– సంవిశన్తి** పరస్మైపది. లట్ ప్రథమపురుష బహువచనము. ఉపసర్గ = సం, **విశ్**–ప్రవేశించుట. 6వ వికరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. దీనికి లట్ ప్రథమపురుష బహువచన తిఙ్ ప్రత్యయము అన్తి. కనుక సం+విశ్+అ+అన్తి = సంవిశ + అన్తి > సంవిశ్ + అన్తి > సంవిశన్తి.

2) నిద్రాయతే **సంవిశతి** నిద్రాయాం సంస్తి మన్దతే.... 1-3-26
యభతి చ భజతీత్యేతే నిధువతి సంవిశతి మైథునేఽమీ స్యుః... 2-1-45

**శ్లో॥ కమలవనచితామ్బుః పాటలామోదరమ్యః**
**సుఖసలిలనిషేకః సేవ్యచన్ద్రాంశుహారః।**
**వ్రజతు తవ నిదాఘః కామినీభిః సమేతో**
**నిశి సులలితగీతే హర్మ్యపృష్ఠే సుఖేన॥ 28**

**పదవిభాగము:–** కమలవనచిత+అంబుః పాటల+ఆమోదరమ్యః సుఖసలిలనిషేకః సేవ్యచంద్ర+అంశుహారః వ్రజతు తవ నిదాఘః కామినీభిః సమేతః నిశి సులలిత గీతే హర్మ్యపృష్ఠే సుఖేన.





**అన్వయక్రమము:–** సులలితగీతే కమలవన చిత అంబుః పాటల ఆమోద రమ్యః సుఖ సలిల నిషేకః సేవ్య చంద్రాంశుహారః కామినీభిః సమేతః నిదాఘః నిశి తవ హర్మ్యపృష్ఠే సుఖేన వ్రజతు.

**ప్రతిపదార్థము:–** సులలితగీతే=చక్కనిమనోహరమైన పాటగలదానా!, కమలవన= పద్మ వనముచేత, చిత=వ్యాపింపబడిన, అంబుః=నీరుగలదియు, పాటల= కలిగొట్టు పూవుల యొక్క, ఆమోద=పరిమళముచే, రమ్యః=రమణీయమైనదియు, సుఖ=సుఖకర మైన, సలిల=నీటియందు, నిషేకః=స్నానముగలదియు, సేవ్య=సేవింపదగిన, చంద్రాంశు హారః=చంద్రకిరణములును ముత్యాలహారములున్ను గలదియు, కామినీభిః=స్త్రీలతో, సమేతః=కూడిన, నిదాఘః=గ్రీష్మఋతువు, నిశి=రాత్రియందు, తవ=నీ యొక్క, హర్మ్య పృష్ఠే=మేడమీద, సుఖేన=సుఖముగా, వ్రజతు=గడచిపోవుగాక!

**తాత్పర్యము:–** ఓ ప్రియురాలా! పద్మవనము చేత వ్యాపింపబడిన నీరు గలదియు, కలిగొట్టు పూవుల యొక్క పరిమళముచే రమ్యమైనదియు, సుఖకరమైన నీటియందు స్నానము గలదియు, సేవింపదగిన చంద్రకిరణములు గలదియునైన గ్రీష్మఋతువున రాత్రులందు నీ మేడపైభాగమున స్త్రీలతో కూడి సరససల్లాపములతో హాయిగా గడచిపోవుగాక!

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) సులలితగీతే–సులలితాని గీతాని యస్యాః సా – బహువ్రీహిః.
2) కమలవన చితామ్బుః–కమలానాం వనమ్, కమలవనమ్–షష్ఠీతత్పురుషః–కమలవనేన చితమ్, కమలవనచితమ్–తృతీయాతత్పురుషః–కమలవన చితం అమ్బు యస్మిన్ తథావిధః–బహువ్రీహిః
3) పాటలామోదరమ్యః–పాటలానామ్ ఆమోదః, పాటలామోదః–షష్ఠీతత్పురుషః – తేన రమ్యః యః అసౌ తథావిధః–బహువ్రీహిః
4) సుఖసలిలనిషేకః–సుఖః సలిలే నిషేకో యస్మిన్ – తథావిధః–బహువ్రీహి
5) సేవ్యచంద్రాంశుహారః–సేవ్యాఃచంద్రాంశవో హారాశ్చ యస్మిన్ తథావిధః –బహువ్రీహిః
6) హర్మ్యపృష్ఠే–హర్మ్యాణాం పృష్ఠే–షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) సరతీతి సలిలం సృ గతౌ. ప్రవహించునది. **ఆపః స్త్రీ భూమ్ని వార్వారి సలిలం కమలం జలమ్...**

2) అంబతే అంబు. అబిరబి లబి శబ్దే. ప్రవహించునపుడు ధ్వనియుక్తమై యుండునది. **అమ్భోఽర్ణస్తోయ పానీయ నీర క్షీరామ్బు శంబరమ్.**

c) **గుణము:- మాధుర్యగుణము**

d) **రీతి:- వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు -మాలినీవృత్తము.

f) **క్రియాదర్శము:-** వ్రజతు - పరస్మైపది. లోట్ ప్రథమపురుష ఏకవచనము.

**వ్రజ్**-గతౌ - వెళ్ళుట. 1వ వికరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. లోట్ ప్రథమపురుషైకవచన తిజ్ ప్రత్యయము 'తు'. కనుక వ్రజ్+అ+తు > వ్రజతు. వ్రజతు-వ్రజతామ్-వ్రజన్తు. ఇవి ప్రథమపురుష ఏకవచన, ద్వివచన, బహువచన రూపములు.

శ్రీః





శ్రీః

మహాకవి కాళిదాస విరచితః

# ఋతుసంహారః

## 'ప్రావృడ్వర్ణనం' నామ ద్వితీయః సర్గః

మృణాళినీ వ్యాఖ్యా

**అవతారిక:-** అథ క్రమప్రాప్తం వర్షాకాలం వర్ణయతి.

**శ్లో॥ సశీకరామ్భోధరమత్తకుఞ్జర**
**స్తటిత్పతాకోఽశనిశబ్దమర్దలః ।**
**సమాగతో రాజవదుద్ధతద్యుతి**
**ర్ఘనాగమః కామిజనప్రియః ప్రియే ॥ 1**

**పదవిభాగము:-** సశీకర+అంభోధరమత్తకుంజరః తటిత్+పతాకః+అశనిశబ్దమర్దలః సమాగతః రాజవత్+ఉద్ధతద్యుతిః ఘన+ఆగమః కామిజనప్రియః ప్రియే.

**అన్వయక్రమము:-** హేప్రియే సశీకర అంభోధర మత్తకుంజరః తటిత్ పతాకః అశని శబ్ద మర్దలః ఉద్ధత ద్యుతిః కామిజన ప్రియః ఘనాగమః రాజవత్ సమాగతః.

**ప్రతిపదార్థము:-** హేప్రియే=ఓ ప్రియురాలా!, సశీకర=నీటిబిందువులతో కూడిన, అంభోధర=మేఘములనెడు,మత్తకుంజరః=మదగజములుగల, తటిత్=మెఱపులనెడు, పతాకః=ధ్వజములుగల, అశనిశబ్ద=ఉరుములనెడు, మర్దలః=మద్దెలుగల, ఉద్ధత= వృద్ధిచెందిన, ద్యుతిః=కాంతి గల, కామిజన=కాముకులగు జనులకు, ప్రియః=ఇష్టమైన, ఘనాగమః=వర్షర్తువు, రాజవత్=రాజువలె, సమాగతః=వచ్చినది.

**తాత్పర్యము:-** ఓ ప్రియురాలా! నీటి బిందువులతో కూడిన మేఘములనెడు మద గజములుగల, మెఱపులనెడు ధ్వజములుగల, ఉరుములనెడు మద్దెలుగల, వృద్ధి చెందిన కాంతి గల కాముకులగు జనులకు ఇష్టమైన వర్షర్తువు రాజువలె వచ్చినది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) సశీకరామ్భోధరమత్తకుంజరః-శీకరేణ సహితం సశీకరమ్, సశీకరశ్చా సావమ్భోధరః, సశీకరామ్భోధరః-కర్మధారయః, సశీకరామ్భోధరా ఏవ మత్త కుంజరాః యస్య సః-బహువ్రీహిః

2) తటిత్పతాకః-తటిదేవ పతాకా యస్య సః-బహువ్రీహిః

3) అశనిశబ్దమర్దలః-అశనేఃశబ్దః, అశనిశబ్దః-షష్ఠీతత్పురుషః-అశనిశబ్దః ఏవ మర్దలః యస్య సః -బహువ్రీహిః

4) కామిజనప్రియః–కామీ చాసౌ జనః కామిజనః–కర్మధారయః, తేభ్యః ప్రియః కామిజనప్రియః–చతుర్థీతత్పురుషః.

5) ఘనాగమః–ఘనస్య ఆగమః–షష్ఠీతత్పురుషః.

6) ఉద్ధతద్యుతిః – ఉద్ధతా – ద్యుతిః కాన్తిః యస్య సః – బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కుంజౌ కుంభాధోగర్తావస్యస్త ఇతి కుంజరః–కుంజములనగా కుంభస్థలము లకు దిగువనుండు గుంతలు అవి గలిగినది. **మతఙ్గజో గజో నాగః కుంజరో వారణః కరీ –**

2) మృద్యత ఇతి మర్దలః మృదక్షోభే–మర్దింపబడునది. **వాద్యప్రభేదా డమరు మడ్డు డిణ్డిమ ఝర్ఝరా మర్దలః పణవో౽న్యే చ.**

c) **గుణము** :– ప్రసాదము d) **రీతి :–** వైదర్భి

e) **అలంకారము :–**

a) సంసృష్టి అలంకారము – ఉపమా రూపకములు.

**ఉపమా:** 'సామ్యం వాచ్యమవైధర్మ్యం వాక్యైక్యే ఉపమా ద్వయోః ఇత్యుపమాయాః లక్షణమ్

b) **రూపకము: 'రూపకం రూపితారోపో విషయే నిరుపహ్నవే'** ఇతి రూపకస్య లక్షణమ్. వర్షర్తువు రాజత్వారోపమున చెప్పుటచే ఉపమా, రూపకాలంకార సమష్టిగా చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు–వంశస్థవిలవృత్తం

**లక్షణము:** 1) ఈ ఛందమున ప్రతిపాదమున 12 అక్షరములుండును.

2) వదన్తి వంశస్థవిలం జతౌజరౌ.

3) యతి 5,7 (4) గణములు **జ, త, జ, ర**

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా: | స శీ క | రా మ్భో ధ | ర మ త్త | కుం జ రః |
| | I U I | U U I | I U I | U I U |
| | జ | త | జ | ర |

g) **క్రియాదర్శము:–** సమాగతః– సమ్, ఆ–ఉపసర్గలు. ఆగతః–కృదంతము.

**ధాతువు: గమ్ల** – గమ్–గతౌ–వెళ్ళుట–సకర్మకము. పరస్మైపది.

**ఆగతః–** భూతకాలార్థమునందు ధాతువునకు 'త' అను ప్రత్యయము చేర్చుటచే 'క్త' ప్రత్యయాంత శబ్దములేర్పడును. ఈప్రత్యయము సకర్మక ధాతువులకు– కర్మార్థము నందును, అకర్మక ధాతువులకు భావార్థమునందును చేరును. 'క్త' ప్రత్యయము దుర్బల





ప్రత్యయము కనుక ధాతువునకు గుణవృద్ధులు రావు. ధాత్వంత అనునాసిక లోపము వలన గంత > గత గా మారును. నామవాచక రూపముననుసరించి ఇది మూడు లింగములలోనికి మారును. గతః–గతా–గతమ్

శ్లో॥ నితాన్తనీలోత్పలపత్రకాన్తిభిః
క్వచిత్ప్రభిన్నాఞ్జనరాశిసంనిభైః ।
క్వచిత్సగర్భప్రమదాస్తనప్రభైః
సమాచితం వ్యోమ ఘనైః సమన్తతః ॥ 2

**పదవిభాగము:–** నితాంతనీల+ఉత్పలపత్రకాన్తిభిః క్వచిత్+ప్రభిన్న+అంజనరాశి సన్నిభైః క్వచిత్+సగర్భప్రమదాస్తనప్రభైః సమ్+ఆ+చితమ్ వ్యోమ ఘనైః సమంతతః

**అన్వయక్రమము:–** క్వచిత్ నితాంత నీల ఉత్పల పత్ర కాన్తిభిః క్వచిత్ ప్రభిన్న అంజన రాశి సన్నిభైః క్వచిత్ సగర్భ ప్రమదా స్తన ప్రభైః ఘనైః వ్యోమ సమంతతః సమాచితమ్.

**ప్రతిపదార్థము:–** క్వచిత్=ఒకచోట, నితాంత=అధికమైన, నీల=నల్లనైన, ఉత్పల= కలువలయొక్క, పత్ర=రేకులయొక్క, కాన్తిభిః=కాంతివంటి కాంతి గలిగినవియు, క్వచిత్ =ఒకచోట, ప్రభిన్న=బాగా నూరబడిన, అంజన=కాటుక యొక్క, రాశి=ప్రోగుతో, సన్నిభైః =సమానమైనవియు, క్వచిత్=ఒకచోట, సగర్భ=గర్భముతోకూడిన, ప్రమదా= స్త్రీలయొక్క, స్తన=స్తనముల యొక్క, ప్రభైః=కాంతివంటి కాంతి గలవియునగు, ఘనైః=మేఘములచే, వ్యోమ=ఆకాశము, సమంతతః=అంతటను, సమాచితమ్=బాగుగ కప్పబడినది.

**తాత్పర్యము:–** ఒకచోట బాగా నల్లనైన కలువ రేకుల యొక్క కాంతివంటి కాంతి గల, ఒకచోట బాగా నూరబడిన కాటుక ముద్దతో సమానమైన కాంతిగల ఒకచోట గర్భవతులస్తనములయొక్క కాంతి వంటి కాంతి గల, మేఘములచే ఆకాశము అంతట కప్పబడినది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) నితాన్తనీలోత్పలపత్రకాన్తిభిః–నితాంతం యాని నీలాని ఉత్పలాని తేషాం పత్రాణాం కాన్తిరివ కాన్తిర్యేషాం తథావిధైః–ఉపమాన బహువ్రీహిః

2) ప్రభిన్నాంజనరాశిసన్నిభైః–ప్రభిన్నం యత్ అంజనం తస్య రాశిః తేన సన్నిభాని తైః–కర్మధారయ గర్భతృతీయాతత్పురుషః.

3) సగర్భప్రమదాస్తనప్రభైః–గర్భేణ సహితాః సగర్భాః తథావిధాః యాః ప్రమదాః –సగర్భప్రమదాః–కర్మధారయః–సగర్భప్రమదానాం స్తనాని – సగర్భప్రమదా

స్తనాని – షష్ఠీతత్పురుషః–సగర్భప్రమదాస్తనానాం ప్రభా ఇవ ప్రభా యేషాం తైః – ఉపమాన బహువ్రీహి.

**b) నిఘంటు ప్రమాణములు:–**

1) విశ్వం వ్యయతి సంవృణోతీతి వ్యోమ. వ్యేఞ్–సంవరణే. విశ్వమును వ్యాపించునది. **ద్యౌ దివౌ ద్వే స్త్రియా మభ్రం వ్యోమ పుష్కరమంబరమ్.**

**c) గుణము :– ప్రసాదము, ఓజస్సు**

**d) రీతి :– వైదర్భి**

**e) అలంకారము :–** 'ఉపమా' : లక్షణము పూర్వము చెప్పబడినది.

ఈ శ్లోకమున మేఘములు 1) నీలోత్పల పత్రముల కాంతితోను, 2) కాటుక రాశితోను, 3) గర్భవతులై స్త్రీల స్తనముల కాంతితోను పోల్చబడుటచే ఉపమాలంకారముగా చెప్పదగును.

**f) ఛందస్సు–వృత్తము:–** జగతీ ఛందస్సు–వంశస్థవిలము.

**g) క్రియాదర్శము:–** సమాచితమ్.సమ్, ఆ–ఉపసర్గలు. చితమ్–'క్త' ప్రత్యయాంతము.

**ధాతువు: చిఞ్** (చి) చయనే–ప్రోగుచేయుట. సకర్మకము. ఉభయ(పరస్మైపది) స్వాదిప్రకరణమ్(5) ధాతువు చి+త > చిత. నామవాచక రూపముననుసరించి ఇది మూడు లింగములలోనికి మారును. చితః–చితా–చితమ్.

**శ్లో॥ తృషాకులైశ్చాతకపక్షిణాం కులైః**
**ప్రయాచితాస్తోయభరావలమ్బినః ।**
**ప్రయాన్తి మన్దం బహుధారవర్షిణో**
**వలాహకాః శ్రోత్రమనోహరస్వనాః ॥ 3**

**పదవిభాగము:–** తృషా+ఆకులైః+చాతకపక్షిణామ్ కులైః ప్రయాచితాః+తోయభర + అవలంబినః ప్రయాన్తి మందం బహుధారవర్షిణః వలాహకాః శ్రోత్రమనోహరస్వనాః

**అన్వయక్రమము:–** తృషా ఆకులైః చాతకపక్షిణామ్ కులైః ప్రయాచితాః తోయ భర అవలంబినః బహు ధార వర్షిణః శ్రోత్ర మనోహర స్వనాః వలాహకాః మన్దమ్ ప్రయాన్తి.

**ప్రతిపదార్థము:–** తృషా=దప్పికచే, ఆకులైః=వ్యాకులత చెందిన, చాతకపక్షిణామ్= చాతక పక్షుల యొక్క, కులైః=సమూహములచేత, ప్రయాచితాః=అర్థింపబడినవి, తోయ=జలముయొక్క, భర=భారముచే, అవలంబినః=వ్రేలాడుచుండినవి, బహు= అనేకములగు, ధార=ధారలు కలుగునట్లు, వర్షిణః=వర్షించునవి, శ్రోత్ర=చెవులకు, మనోహర=ఆహ్లాదమగు, స్వనాః=శబ్దములు కలిగినవియగు, వలాహకాః=మేఘములు,





మన్దమ్=నెమ్మదిగ, ప్రయాన్తి=పోవుచున్నవి.

**తాత్పర్యము:–** దప్పికచే వ్యాకులత చెందిన చాతకపక్షుల చేత అర్థింపబడినవి, జలభారముచే వ్రేలాడుచుండినవి, పెక్కు ధారలు కలుగునట్లు వర్షించునవి, చెవులకు ఇంపగు శబ్దములు కలిగించునవి యగు మేఘములు నెమ్మదిగా పోవుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

**a) సమాసములు:–**

1) తోయభరావలమ్బినః – తోయభరేణ అవలంబినః – తృతీయాతత్పురుషః

2) బహుధారవర్షిణః – బహూనాం ధారాణాం వర్షిణః–షష్ఠీ తత్పురుషః

3) శ్రోత్రమనోహరస్వనాః – శ్రోత్రేభ్యః మనోహరః–శ్రోత్రమనోహరః – చతుర్థీ తత్పురుషః–శ్రోత్రమనోహరాణి–స్వనాని యేషాం తే – బహువ్రీహిః

**b) నిఘంటు ప్రమాణములు:–**

1) బలం న జహాతీతి బలాహకః ఓహాక్ త్యాగే, వబయో రభేదాత్ వలాహకః – బలమును విడువనిది. **అభ్రం మేఘో వారివాహః స్తనయిత్ను ర్వలాహకః**

2) స్వనతీతి స్వనః. శబ్దే నినాద నినద ధ్వని ధ్వాన రవ స్వనాః.

**c) గుణము :– ప్రసాదము** **d) రీతి :– వైదర్భి**

**e) ఛందస్సు–వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

**f) క్రియాదర్శము:–** ప్రయాన్తి. ప్ర–ఉపసర్గ. లట్ ప్రథమ పురుష బహువచనము.

**ధాతువు : యా**–ప్రాపణే–పొందుట,వెళ్ళుట. సకర్మకము పరస్మైపది. అదాదిప్రకరణ (2) ధాతువు. దీనికి వికరణ ప్రత్యయముండదు. కనుక యా+అన్తి (లట్ ప్రథమపురుష బహువచన తిఙ్ ప్రత్యయము) యా+అన్తి > యాన్తి. (ఇచట అకారముతో ఆరంభించు ప్రత్యయములకు ముందు అంగమునందలి అకారము పరరూపంలో కలియును).

**శ్లో॥ బలాహకాశ్చాశనిశబ్దమర్దలాః**
**సురేన్ద్రచాపం దధతస్తటిద్గుణమ్ ।**
**సుతీక్ష్ణధారాపతనోగ్రసాయకై–**
**స్తుదన్తి చేతః ప్రసభం ప్రవాసినామ్ ॥**
**4**

**పదవిభాగము:–** (బ) వలాహకాః+చ+అశనిశబ్దమర్దలాః సుర+ఇంద్రచాపమ్ దధతః +తటిత్+గుణమ్ సుతీక్ష్ణధారాపతన+ఉగ్రసాయకైః+తుదన్తి చేతః ప్రసభం ప్రవాసినామ్.

**అన్వయక్రమము:–** అశని శబ్ద మర్దలాః తటిత్ గుణమ్ సురేంద్రచాపమ్ దధతః బలాహకాః సుతీక్ష్ణ ధారా పతన ఉగ్ర సాయకైః ప్రవాసినామ్ చేతః ప్రసభమ్ తుదన్తి.

**ప్రతిపదార్థము:–** అశని=పిడుగు యొక్క, శబ్ద=ధ్వనియను, మర్దలాః=మద్దెలలు గల, తటిత్=మెఱపులనెడు, గుణమ్=నారికలిగిన, సురేంద్రచాపమ్=ఇంద్రధనుస్సును, దధతః =ధరించుచుండినవియగు, బలాహకాః=మేఘములు, సుతీక్ష్ణ=చురుకైన, ధారా= జలధారలయొక్క, పతన=విడుచుటయనెడు, ఉగ్ర=తీక్ష్ణములైన సాయకైః=బాణములచే, ప్రవాసినామ్=దూరప్రాంతములందుండువారి యొక్క, చేతః= మనసును, ప్రసభమ్= బలాత్కారముగ, తుదన్తి=నొప్పించుచున్నవి.

**తాత్పర్యము:–** 1) ఉఱుముచు, పిడుగులు విడుచుచు, ధ్వనించు శబ్దములు మద్దెలలు వేయుచున్నట్లుగా, 2) మెఱుపులను నారికల ఇంద్రధనుస్సును ధరించి 3) చల్లని జలధారలను తీక్ష్ణములగు బాణములనుగావలె విడుచుచున్న మేఘములు భార్యలను వదలి దూరప్రాంతముననున్నవారి మనస్సులను బాగా నొప్పించుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) అశనిశబ్దమర్దలాః–అశనేఃశబ్దః–అశనిశబ్దః–షష్ఠీతత్పురుషః–అశనిశబ్దా ఏవ మర్దలా యేషాం తే–బహువ్రీహిః.

2) తటిద్గుణమ్–తటిదేవ గుణో యస్య తత్–బహువ్రీహిః.

3) సురేంద్రచాపమ్–సురేంద్రస్య చాపమ్–షష్ఠీతత్పురుషః.

4) సు.... సాయకైః–సుతీక్ష్ణాశ్చేమా ధారాః–సుతీక్ష్ణధారాః–కర్మధారయః–తాసాం పతనాని, సుతీక్ష్ణధారాపతనాని–షష్ఠీతత్పురుషః–సుతీక్ష్ణధారాపతనాని ఏవ ఉగ్రాః సాయకాః యేషాం తైః–కర్మధారయః.

b) **నిఘంటు ప్రమాణములు:**

1) శరే ఖడ్గే చ సాయకః.సాయక శబ్దము బాణమందును,ఖడ్గమందును వర్తించును.

2) గుణ్యతే అభ్యస్యత ఇతి గుణః. గుణ అభ్యాసే. అభ్యసింపబడునది–వింటి నారిపేరు. **మౌర్వీ జ్యా శిఞ్జినీ గుణః**

c) **గుణము** : **ప్రసాదము** d) **రీతి** : **వైదర్భి**

e) **అలంకారము:–** సాంగరూపకాలంకారము–లక్షణము పూర్వము చెప్పబడినది. మేఘములందు శత్రుత్వారోపత్వమువలన సాంగరూపకాలంకారముగా చెప్పదగును.





f) **ఛందస్సు–వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలవృత్తము.

g) **క్రియాదర్శము:–** 1) దధతః, 2) తుదన్తి

**1) దధతః:–** ధాతువు:**డుధాఞ్–ధా–ధారణ పోషణయోః**–ధరించుట, పోషించుట. ఉభయపది. జుహోత్యాది(3) ప్రకరణధాతువు ఉభయపది. మూడవ గణము నందలి ధాతువులకు వికరణ ప్రత్యయముచేరదు. కాని ధాతువు మొదటివర్ణము ద్విరుక్తమగును. ఇందు అభ్యాసమునందలి వర్గద్వితీయాక్షరము లకు ప్రథమాక్షర ములు, వర్గ చతుర్థాక్షరములకు తృతీయాక్షరములును ఆదేశ మగును. అభ్యాసము నందలి దీర్ఘములకు హ్రస్వములు ఆదేశమగును. శతృ ప్రత్యయాంతము చేర్చుటచే దధా+అత్=దధత్ అను తకారాంత పుంలింగమగును. దీని ద్వితీయావిభక్తి బహువచన రూపమే దధతః.

**2) తుదన్తి:–** లట్ ప్రథమపురుష బహువచనము. అంతి తిజ్ ప్రత్యయము.

**ధాతువు–తుద**(తుద్) వ్యథనే – బాధించుట. సకర్మకము. (ఉభయ) పరస్మైపది. తుదాది ప్రకరణ(6) ధాతువు.అ వికరణ ప్రత్యయము. ఈ గణమును 'శవికరణి' అందురు. 'తుద్' ధాతువుపై వర్తమానకాలమున లట్, దానిస్థానమున 'తిప్' రాగా, తుద్+అన్తి అని ఉండగా, తుదాదిభ్యః శః అను సూత్రమునే 'శ' ప్రత్యయము రాగా, ఇందలి శకారము ఇత్సంజ్ఞకమవుటచే లోపించగా, తుద్+అ+అన్తి > తుద+అన్తి > తుదన్తి అనురూపమగును.

3) దుఃఖాకరోతి **తుదతి** చ కరోతి వైకల్యముదాద్వ్యోఃమీ (2-3-85 ఆఖ్యాతచన్ద్రికా)

**శ్లో॥ ప్రభిన్నవైదూర్యనిభైస్తృణాఙ్కురై**
**స్సమాచితా ప్రోత్థితకన్దలీదళైః ।**
**విభాతి శుక్లేతరరత్నభూషితా**
**వరాఙ్గనేవ క్షితిరిన్ద్రగోపకైః ॥ 5**

**పదవిభాగము:–** ప్రభిన్నవైదూర్యనిభైః+తృణ+అంకురైః+సమ+ఆచితా ప్ర + ఉత్ +స్థితకందలీదళైః విభాతి శుక్ల+ఇతరరత్నభూపితా వర+అంగన+ఇవ క్షితిః + ఇంద్ర గోపకైః.

**అన్వయక్రమము:–** క్షితిః ప్రభిన్న వైదూర్య నిభైః తృణ అంకురైః ప్రోత్థిత కందలీ దళైః ఇంద్రగోపకైః సమాచితా శుక్లేతర రత్న భూషితా వరాంగనేవ విభాతి.

**ప్రతిపదార్థము:–** క్షితిః=భూమి, ప్రభిన్న=ముక్కలైన, వైదూర్య=వైదూర్యమణులతో, నిభైః =సమమైన, తృణ=గడ్డియొక్క, అంకురైః=మొలకలచేతను, ప్రోత్థిత=వెలువడిన,

కందళీ=నేలతాళ్ళయొక్క, దళైః=ఆకులచేతను, ఇంద్రగోపకైః=ఆరుద్రపురుగులచేతను, సమాచితా=వ్యాపింపబడినదై, శుక్లేతర=తెల్లనికాని, రత్న=రత్నములచే, భూషితా= అలంకరింపబడిన, వరాంగనేవ=ఉత్తమస్త్రీవలె, విభాతి=ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము:–** (వర్షాకాలమున) భూమి, ముక్కలైన వైదూర్యసమమైన గడ్డి మొలకల చేతను, వెలువడిన నేలతాళ్ళ యొక్క ఆకులచేతను, ఆరుద్రపురుగుల చేతను ఆవరింపబడినదై, వివిధ వర్ణరత్నములచే అలంకరింపబడిన ఉత్తమ స్త్రీ వలె ప్రకాశించుచున్నది.

**పదాదర్థవిశేషములు:–**

**a) సమాసములు:–**

1) ప్రభిన్న వైదూర్యనిభైః–ప్రభిన్నా యే వైదూర్యాః ప్రభిన్నవైదూర్యాః–కర్మధారయః –తైః నిభైః–ప్రభిన్నవైదూర్యనిభైః–తృతీయాతత్పురుషః.

2) తృణాంకురైః–తృణానామ్ అంకురైః–షష్ఠీ తత్పురుషః.

3) ప్రోత్థితకందలీదళైః–ప్రోత్థితాః యాః కందళ్యః ప్రోత్థితకందళ్యః–కర్మధారయః – తాసాం దలైః – ప్రోత్థితకందలీదలైః–షష్ఠీతత్పురుషః

4) శుక్లేతరరత్నభూషితాః–శుక్లాత్ ఇతరాణి, శుక్లేతరాణి, షష్ఠీతత్పురుషః –శుక్లేతరాణి చేమాని రత్నాని, శుక్లేతరరత్నాని – కర్మధారయః – తైః భూషితాః శుక్లేతరరత్నభూషితాః–తత్పురుషః

**b) నిఘంటు ప్రమాణములు:**

1) క్షియంతి నివసంతి సర్వేఽస్యామితి క్షితిః. క్షి–నివాసగత్యోః. దీని యందంద ఱుందురు. **ధరా ధరిత్రీ ధరణిః క్షోణీర్జ్యా కాశ్యపీ క్షితిః.**

c) **గుణము :– మాధుర్య ప్రసాదగుణములు** d) **రీతి :–** వైదర్భి

e) **అలంకారము:–** 'ఉపమా' – భూమి ఉత్తమ స్త్రీతో పోల్చబడుటచే ఉపమాలంకారముగా చెప్పదగును.

f) **ఛందస్సు–వృత్తము:–** జగతీ ఛందస్సు–వంశస్థవిలము.

g) **క్రియాదర్థము:–** విభాతి–లట్ ప్రథమపురుష ఏకవచనము. వి=ఉపసర్గ

**ధాతువు:– భా**–దీప్తౌ–ప్రకాశించుట. అకర్మకము, పరస్మైపది. అదాది ప్రకరణ (2) ధాతువు. వికరణ ప్రత్యయము లేదు. భా+తి (లట్ ప్రథమ పురుష ఏకవచన తిజ్ (ప్రత్యయము) > భాతి.

Note:- "రెండవ వికరణము 'అదాది'. వికరణ ప్రత్యయము లేదు. పది వికరణములలో





ఇది కష్టతమమైన వికరణము. దీనిలో కొన్ని ధాతువులు ఏ సూత్రమునకు కట్టుబడని రూపములను పొందును. ఆ రూపములను సాధించుటయే ఆ ధాతువులను గురించి చెప్పిన సూత్రములగును. అవి పద మధ్య సంధి సూత్రములు. వాటిలో అనేకం Phonetic Changes గాని సంధి సూత్రములు గావు." అని కుమార వ్యాకరణము.

2) **విభాతి** వ్యుచ్ఛతే వ్యుష్టే ప్రభాతి వివిశత్యపి. (ఆఖ్యాతచన్ద్రికా 3–1–1)

**శ్లో॥ సదా మనోజ్ఞం స్వనదుత్సవోత్సుకం**
**వికీర్ణవిస్తీర్ణకలాపశోభితమ్ ।**
**ససమ్భ్రమాలిఙ్గనచుమ్బనాకులం**
**ప్రవృత్తనృత్యం కులమద్య బర్హిణామ్ ॥ 6**

**పదవిభాగము:–**సదా మనోజ్ఞమ్ స్వనత్+ఉత్సవ+ఉత్సుకమ్ వికీర్ణవిస్తీర్ణకలాపశోభితమ్ ససంభ్రమ+ఆలింగనచుంబన+ఆకులమ్ ప్రవృత్తనృత్యమ్ కులమ్+అద్య బర్హిణామ్.

**అన్వయక్రమము:–** సదా మనోజ్ఞం స్వనత్ ఉత్సవోత్సుకమ్ వికీర్ణ విస్తీర్ణ కలాప శోభితమ్ ససంభ్రమ ఆలింగన చుంబన ఆకులమ్ బర్హిణామ్ కులమ్ అద్య ప్రవృత్త నృత్యమ్.

**ప్రతిపదార్థము:–** సదా=నిత్యము, మనోజ్ఞమ్=మనోహరమైనది. స్వనత్=ధ్వనించు నది, ఉత్సవ=సంతోషముచే, ఉత్సుకమ్=ఉత్సాహము కలదియు, వికీర్ణ=విప్పబడిన, విస్తీర్ణ=విశాలమైన, కలాప=పురిచే, శోభితమ్=ప్రకాశించునదియు, ససంభ్రమ= వేగిరపాటుతో కూడిన, ఆలింగన=కౌగిలింతయందు, చుంబన=ముద్దు గొనుట యందును, ఆకులమ్=వ్యాకులమైనదియునగు, బర్హిణామ్=నెమళ్ళయొక్క, కులమ్= సమూహము, అద్య=ఈనాడు(వర్షాకాలమున), ప్రవృత్త=ఆరంభింపబడిన, నృత్యమ్= నాట్యము కలదైయున్నది.

**తాత్పర్యము:–** నిత్యము మనోహరముగా ధ్వనించునది, సంతోషముచే ఉత్సాహము గలదియు, విశాలమైన విప్పిన పురిచే ప్రకాశించునదియు, కౌగిలింతయందు ఆతురత గలదియు, ముద్దుగొనుటయందు తొందరబాటు గలదియునగు నెమళ్ళ సమూహము (వర్షాకాలమున) ఇప్పుడు నాట్యమాడుటకుపక్రమించుచున్నది.

**పదాదర్థవిశేషములు:–**

**a) సమాసములు:–**

1) ఉత్సవోత్సుకమ్–ఉత్సవాయ ఉత్సుకమ్–చతుర్థీతత్పురుషః.

2) వికీర్ణ... శోభితమ్–వికీర్ణాః విస్తీర్ణాఃచ యే కలాపాః–వికీర్ణ విస్తీర్ణకలాపాః –కర్మధారయః–తైః శోభితమ్, వికీర్ణ .... శోభితమ్–తృతీయాతత్పురుషః

3) స... కులమ్-ఆలింగనమ్ చుంబనం చ, ఆలింగనచుంబనే-ద్వంద్వః-ససంభ్రమ మే చేమే ఆలింగనచుంబనే-ససంభ్రమాలింగన చుంబనే-కర్మధారయః -తదర్థమ్ ఆకులమ్ యత్ తత్-స.... కులమ్-తత్పురుషః

4) ప్రవృత్తనృత్యమ్-ప్రవృత్తం నృత్యం యేన తత్-బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

**1) బర్హమస్యాస్తీతి బర్హీ ,** పింఛముకలది. **మయూరో బర్హిణో బర్హీ నీలకణ్ఠో భుజంగభుక్.**

c) **గుణము:- మాధుర్య ప్రసాదములు**

d) **రీతి** :- వైదర్భి

e) **అలంకారము :-** స్వభావోక్తి

**లక్షణము:** 'స్వభావోక్తి స్స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్' జాతి మున్నగు వాని యందున్న స్వభావము యొక్క వర్ణనము-స్వభావోక్తి యన్న యలంకారము.' ఇందు వసన్తర్తువున మయూరనాట్యములు సహజసిద్ధముగాన అట్లు వర్ణించుటచే నిది స్వభావోక్త్యలంకారముగా చెప్పదగును.

f) **ఛందస్సు-వృత్తము:-** జగతీ ఛందస్సు-వంశస్థవిలము.

g) **క్రియాదర్శము:-** నృత్యమ్ 'క్యప్' ప్రత్యయాంతము.

**ధాతువు:** నృతీ **'నృత్'** గాత్రవిక్షేపే-నృత్యము చేయుట. అకర్మకము, దివాది ప్రకరణ (4) ధాతువు. పరస్మైపది. ఈ గణమును శ్యన్వికరణి అందురు. నృత్యమ్ (నృత్+య > నృత్య) నపుంసకలింగమున 'నృత్యమ్' గా మారును.

**శ్లో॥ నిపాతయన్త్యః పరితస్తటద్రుమా**
**న్ప్రవృద్ధవేగైస్సలిలైరనిర్మలైః ।**
**స్త్రియః సుదుష్టా ఇవ జాతవిభ్రమాః**
**ప్రయాన్తి నద్యస్త్వరితం పయోనిధిమ్ ॥ 7**

**పదవిభాగము:-** నిపాతయన్త్యః పరితః+తటద్రుమాన్+ప్రవృద్ధవేగైః+సలిలైః+అనిర్మలైః స్త్రియః సుదుష్టాః ఇవ జాతవిభ్రమాః ప్రయాన్తి నద్యః+త్వరితమ్ పయోనిధిమ్.

**అన్వయక్రమము:-** ప్రవృద్ధ+వేగైః అనిర్మలైః సలిలైః పరితః తటద్రుమాన్ నిపాతయన్త్యః జాతవిభ్రమాః నద్యః సుదుష్టాః స్త్రియః ఇవ పయోనిధిమ్ త్వరితమ్ ప్రయాన్తి.

**ప్రతిపదార్థము:-** ప్రవృద్ధ=అధికమైన, వేగైః=వేగముకలిగిన, అనిర్మలైః=కలుషితమైన,





సలిలైః=జలములచే, పరితః=అంతట, తటద్రుమాన్=ఒడ్డుయందలిచెట్లను, నిపాతయన్త్యః=పడగొట్టుచుందునవియు, జాతవిభ్రమాః=సుడులు కలిగిన, నద్యః=నదులు, సుదుష్టాః=చెడిపోయిన, స్త్రియః ఇవ=స్త్రీలవలె, పయోనిధిమ్=సముద్రమును, త్వరితమ్ =వేగముగా, ప్రయాన్తి=చేరుచున్నవి.

**తాత్పర్యము:-** అధికవేగముతో కలుష జలములచే ఒడ్డుయందలి చెట్లను పడగొట్టుచు సుడులు తిరుగుచు నదులు చెడిపోయిన స్త్రీలవలె సముద్రమును వేగముగా చేరుచున్నవి.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ప్రవృద్ధవేగైః-ప్రవృద్ధః వేగో యేషాం తే తథాభూతైఃబహువ్రీహిః

2) అనిర్మలైః-న్ నిర్మలం అనిర్మలం తథాభూతైః-నఞ్తత్పురుషః

3) తటద్రుమాన్-తటస్య ద్రుమాన్ - షష్ఠీతత్పురుషః.

4) జాతవిభ్రమాః-జాతః - విభ్రమః యేషాం తే - జాతవిభ్రమాః-బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:**

1) సమన్తత స్తు పరిత స్సర్వతో విష్వగిత్యపి-ఈ నాలుగును అంతట ననునర్థ మందు వర్తించును.

c) **గుణము: మాధుర్య ప్రసాదము** d) **రీతి : వైదర్భి**

e) **అలంకారము:** 'ఉపమా'. ఇందు నదులు-స్త్రీలతో పోల్చి వర్ణింపబడుటచేనిది ఉపమాలంకారముగా చెప్పదగును. ఉపమానము: నదులు, ఉపమేయము: స్త్రీలు సమానత్వము: కాలుష్యము. వాచకము - ఇవ మొదలైనవి.

f) **ఛందస్సు-వృత్తము:** జగతీ ఛందస్సు-వంశస్థవిలము.

g) **క్రియాదర్శము:-** ప్రయాన్తి. వివరములకు 3వ శ్లోకభాగము చూడదగును.

**శ్లో॥ తృణోత్కరైరుద్గతకోమలాఙ్కురై**
**ర్విచిత్రనీలైర్హరిణీముఖక్షతైః ।**
**వనాని వైన్ధ్యాని హరన్తి మానసం**
**విభూషితాన్యుద్గతపల్లవైర్ద్రుమైః ॥ 8**

**పదవిభాగము:-** తృణ+ఉత్కరైః+ఉద్గతకోమల+అంకురైః+విచిత్రనీలైః+హరిణీ ముఖక్షతైః వనాని వైంధ్యాని హరన్తి మానసమ్ విభూషితాని+ఉద్గతపల్లవైః+ద్రుమైః

**అన్వయక్రమము:-** ఉద్గత కోమల అంకురైః విచిత్ర నీలైః హరిణీ ముఖ క్షతైః తృణ ఉత్కరైః ఉద్గత పల్లవైః ద్రుమైః విభూషితాని వైంధ్యాని వనాని మానసమ్ హరన్తి.

**ప్రతిపదార్థము:-** ఉద్గత=బయటకు వచ్చిన, కోమల=మృదువైన, అంకురైః=మొలకలు కలిగిన, విచిత్ర=నానావర్ణములైనవి, నీలైః=నల్లనైనవియు, హరిణీ=లేళ్ళయొక్క, ముఖ=ముఖములచే, క్షతైః=గాయమునొందినవియుఅగు, తృణ=గడ్డియొక్క, ఉత్కరైః=సమూహములచే, ఉద్గత=బయటకు వచ్చిన, పల్లవైః=చిగుళ్ళు గలిగిన, ద్రుమైః=చెట్ల చేతను, విభూషితాని=అలంకరింపబడినవగు, వైంధ్యాని=వింధ్యపర్వతముల, వనాని=అడవులు, మానసమ్=మనస్సును, హరన్తి=హరించుచున్నవి.

**తాత్పర్యము:-** (వర్షాకాలమున) మృదువైన మొలకలు కలిగి నానావర్ణములతో కూడి లేళ్ళచే కొఱకబడిన నల్లనైన గడ్డిచిగుళ్ళతో చిగిర్చిన చెట్లతో అలంకరింపబడినవగు వింధ్యపర్వతపు అడవులు మనస్సును హరించుచున్నవి.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ఉద్గతకోమలాంకురైః-ఉద్గతాః కోమలాః అంకురాః యేషు తైః-బహువ్రీహిః
2) విచిత్రనీలైః-విచిత్రః చ నీలః చ తే తైః-కర్మధారయః.
3) హరిణీముఖక్షతైః-హరిణ్యాః ముఖమ్ హరిణీముఖమ్-షష్ఠీతత్పురుషః-తేన క్షతా యే తే తైః-తృతీయాతత్పురుషః
4) తృణోత్కరైః-తృణానామ్ ఉత్కరైః-షష్ఠీతత్పురుషః.
5) ఉద్గతపల్లవైః-ఉద్గతాః పల్లవాః యేషు తైః - బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) హరిణీ స్యాన్మృగీ హేమప్రతిమా హరితా చ యా. హరిణీ శబ్దము లేడికిని, బంగారు ప్రతిమకును, పచ్చవన్నె గల దానికిని పేరు. హరతి మన ఇతి హరిణీ. హృఞ్-హరణే. మనస్సును హరించునది. 'హరిణీ వృత్తభేదేఽపి యూధికాసుర యోషితో' రితి శేషః.

c) **గుణము** : ప్రసాదము

d) **రీతి** : వైదర్భి

e) **అలంకారము:** 'స్వభావోక్తి' : లక్షణము పూర్వము చెప్పబడినది. వింధ్యారణ్యములను ప్రకృతి సహజంగా వర్ణించుటచే నీ శ్లోకమున స్వభావోక్త్యలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు-వృత్తము:-** జగతీ ఛందస్సు-వంశస్థవిలము.

g) **క్రియాదర్శము:-** 'హరన్తి'-లట్ ప్రథమపురుషబహువచనము.'అన్తి' తిఙ్ ప్రత్యయము.





**ధాతువు:- హృఞ్-హృ-హరణే**-తీసుకొని పోవుట, దొంగిలించుట, నాశనము చేయుట, ద్వికర్మకము, (ఉభయ) పరస్మైపది. భ్వాదిప్రకరణ(1) ధాతువు. ధాతువులో మార్పును 'శప్' కలిగించినది కాన ఈ గణమును 'శబ్వికరణి' అందురు వికరణ ప్రత్యయము 'అ'. 'హృ+అ+అన్తి > హర్+అ+అన్తి > హర+అన్తి > హరన్తి' గా రూపొందును. (అకారముతో ఆరంభించు తిఙ్ ప్రత్యయములకు ముందు అంగమునందలి అకారము పరరూపములో గలియును.)

శ్లో॥ విలోలనేత్రోత్పలశోభితాననై
ర్మృగైః సమన్తాదుపజాతసాధ్వసైః ।
సమాచితా సైకతినీ వనస్థలీ
సముత్సుకత్వం ప్రకరోతి చేతసః ॥ 9

**పదవిభాగము:-** విలోలనేత్ర+ఉత్పలశోభిత+ఆననైః+మృగైః సమన్తాత్+ఉపజాత సాధ్వసైః సమ+ఆచితా సైకతినీ వనస్థలీ సముత్సుకత్వమ్ ప్రకరోతి చేతసః.

**అన్వయక్రమము:-** విలోల నేత్రోత్పల శోభిత ఆననైః ఉపజాత సాధ్వసైః మృగైః సమంతాత్ సమాచితా సైకతినీ వనస్థలీ చేతసః సముత్సుకత్వమ్ ప్రకరోతి.

**ప్రతిపదార్థము:-** విలోల=చంచలములైన, నేత్రోత్పల=కలువలవంటి కన్నులచే, శోభిత=ప్రకాశించిన, ఆననైః=ముఖములు గల, ఉపజాత=పుట్టిన, సాధ్వసైః=భయము కలిగిన, మృగైః=లేళ్ళచే, సమంతాత్=అంతటా, సమాచితా=వ్యాపింపబడిన, సైకతినీ-ఇసుకకల, వనస్థలీ=వనప్రదేశము, చేతసః=మనస్సునకు, సముత్సుకత్వమ్ =వేడుకను, ప్రకరోతి=చేయుచున్నది.

**తాత్పర్యము:-** భయముచే, చంచలములైన కలువలవంటి కన్నులచే ప్రకాశించు ముఖములు గల లేళ్ళు; అంతటా వ్యాపించిన ఇసుక కల అడవి ప్రాంతము మనస్సుకు వేడుకను (ఈ వర్షాకాలమున) కలిగించుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు**

1) విలోల.. ఆననైః-విలోలాని చేమాని నేత్రాణి, విలోలనేత్రాణి-కర్మధారయః -తాన్యేవ ఉత్పలాని, విలోలనేత్రోత్పలాని-ఉపమితసమాసః-తైః శోభితాని ఆననాని యేషాం తే తైః-బహువ్రీహిః.
2) ఉపజాతసాధ్వసైః-ఉపజాతం సాధ్వసం యేషు తైః-బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:**

1) సికతాః అస్య సంతీతి సైకతం;సికతమనగా ఇసుక. అది కలిగినది సైకతము.

2) సాధూనస్యతీతి సాధ్వసం. అసు క్షేపణే. సాధువులను బాధించునది.

c) **గుణము :- మాధుర్యం** d) **రీతి :- వైదర్భి**

e) **అలంకారము :-** 'స్వభావోక్తి' : లక్షణము పూర్వము చెప్పబడినది. ఈ శ్లోకమున 'వనము' ఉన్నదున్నట్లుగా వర్ణింపబడుటచే 'స్వభావోక్తి' అని చెప్పదగును.

f) **ఛందస్సు-వృత్తము:-** జగతీ ఛందస్సు-వంశస్థవిలము.

g) **క్రియాదర్శమ్:-** ప్రకరోతి లట్ ప్రథమ పురుష ఏకవచనము. 'తి' తిజ్ ప్రత్యయము. ప్ర=ఉపసర్గ.

**ధాతువు: డుకృఞ్** (కృ)-కరణే-చేయుట. సకర్మకము. (ఉభయ) పరస్మైపది. తనాది ప్రకరణ(8) ధాతువు. దీని వికరణ ప్రత్యయము 'ఉ'. కృ+ఉ+తి > కర్+ఉ+తి > కరో+తి > కరోతి.

**శ్లో॥ అభీక్ష్ణముచ్చైర్ధ్వనతా పయోముచా**
**ఘనాన్ధకారీకృతశర్వరీష్వపి ।**
**తటిత్ప్రభాదర్శితమార్గభూమయః**
**ప్రయాన్తి రాగాదభిసారికాః స్త్రియః ॥ 10**

**పదవిభాగము:-** అభీక్ష్ణమ్+ఉచ్చైః+ధ్వనతా పయోముచా ఘన+అంధకారీకృతశర్వరీషు +అపి తటిత్+ప్రభాదర్శితమార్గభూమయః ప్రయాన్తి రాగాత్+అభిసారికాః స్త్రియః.

**అన్వయక్రమము:-** అభిసారికాః స్త్రియః అభీక్ష్ణమ్ ఉచ్చైః ధ్వనతా పయోముచా ఘన అంధకారీకృత శర్వరీష్వపి తటిత్ ప్రభా దర్శిత మార్గ భూమయః రాగాత్ ప్రయాన్తి.

**ప్రతిపదార్థము:-** అభిసారికాః=అభిసారికలగు, స్త్రియః=స్త్రీలు, అభీక్ష్ణమ్=మాటిమాటికి, ఉచ్చైః=బిగ్గరగ, ధ్వనతా=ఉఱుముచుండెడు, పయోముచా=మేఘముచే, ఘన= దట్టమైన, అంధకారీకృత=అంధకారముకలదిగా చేయబడిన, శర్వరీష్వపి=రాత్రుల యందు, తటిత్=మెఱుపుల,ప్రభా=కాంతిచే, దర్శిత=చూపబడిన, మార్గ=దారి యందలి, భూమయః=ప్రదేశములుగలవారై, రాగాత్=అనురాగము వలన, ప్రయాన్తి =వెళ్ళుచున్నారు.

**తాత్పర్యము:-** చిమ్మచీకటి రాత్రులందు అభిసారికలగు స్త్రీలు మాటి మాటికి పెద్దగ ఉఱుముచుండెడు మేఘముచే చేయబడిన మెఱుపు కాంతులచే చూపబడిన దారులందు అనురాగముచే వెళ్ళుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ఘనాంధ.. శర్వరీషు-ఘనశ్చాసౌ అంధకారః, ఘనాంధకారః-ఘనాంధకారః





కృతః ఇతి, ఘనాంధకారీకృతః-ఘనాంధకారీకృతాశ్చేమాః శర్వర్యః తాసు-ఘనాంధ..... శర్వరీషు - కర్మధారయః

2) తటిత్.... భూమయః-తటితః ప్రభా-తటిత్ప్రభా-షష్ఠీతత్పురుషః-తటిత్ప్రభయా దర్శితా మార్గస్య భూమిః యాసాం తాః-బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) 'కాంతార్థినీ తు యా యాతి సంకేతం సాభిసారికా' మనోహరుని సమాగమము కోరి సంకేతస్థలమున కరుగు కామిని 'అభిసారిక' యన బడును.

2) శృణాతి వ్యాపారం దినం వా శర్వరీ. శౄ-హింసాయాం వ్యాపారమునుగాని, దినమును గాని చెఱుచునది. **'అథ శర్వరీ. నిశా నిశీథినీ రాత్రి స్త్రియామా క్షణదా క్షపా'**

c) **గుణము :- మాధుర్యం** d) **రీతి :- వైదర్భి**

e) **'అభిసారిక'** లక్షణము చెప్పబడినదీ శ్లోకమున.

f) **ఛందస్సు-వృత్తము:-** జగతీ ఛందస్సు-వంశస్థవిలము.

g) **క్రియాదర్శము:-** ప్రయాన్తి-లట్ ప్రథమపురుషబహువచనము. వివరములు '3' వ శ్లోక భాగమున చూడదగును.

**శ్లో॥ పయోధరైర్భీమగభీరనిఃస్వనై**
**స్తటిద్భిరుద్వేజితచేతసో భృశమ్।**
**కృతాపరాధానపి యోషితః ప్రియా**
**న్పరిష్వజన్తే శయనే నిరన్తరమ్॥ 11**

**పదవిభాగము:-** పయోధరైః+భీమగభీర నిఃస్వనైః+తటిద్భిః+ఉద్వేజితచేతసః భృశమ్ కృత+అపరాధాన్+అపి యోషితః ప్రియాన్+పరిష్వజంతే శయనే నిరంతరమ్.

**అన్వయక్రమము:-** భీమ గభీర నిఃస్వనైః పయోధరైః తటిద్భిః భృశమ్ ఉద్వేజిత చేతసః యోషితః కృత అపరాధానపి ప్రియాన్ శయనే నిరంతరమ్ పరిష్వజంతే.

**ప్రతిపదార్థము:-** భీమ=భయంకరమైన, గభీర=గంభీరమైన, నిఃస్వనైః=ధ్వనులు కలిగిన, పయోధరైః=మేఘములచేతను, తటిద్భిః=మెఱుపులచేతను, భృశమ్=మిక్కిలి, ఉద్వేజిత= ఉత్కంఠకలిగిన, చేతసః=మనస్సుగల, యోషితః=స్త్రీలు, కృత=చేయబడిన, అపరాధానపి=అపరాధముకలవారైనను, ప్రియాన్=ప్రియులను, శయనే=శయ్య యందు, నిరంతరమ్=గట్టిగా, పరిష్వజన్తే=కౌగిలించుకొనుచున్నారు.

**తాత్పర్యము:-** భయంకరమైన గంభీరమైన ధ్వనులు కలిగిన మేఘములచేతను, మెఱుపుల

చేతను, మిక్కిలి ఉత్కంఠ కలిగిన మనస్సు గల స్త్రీలు, తమకు అపరాధము చేసిన ప్రియులను శయ్యయందు (ఈ వర్షాకాలమున) గట్టిగా కౌగిలించుకొను చున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) భీమగభీరనిస్స్వనైః - భీమః గభీరశ్చ నిః స్వనో యేషాం తే తైః-బహువ్రీహిః
2) ఉద్వేజితచేతసః-ఉద్వేజితాని చేతాంసి యాసాం తాః - బహువ్రీహిః
3) కృతాపరాధాన్-కృతః అపరాధో యైః తే తాన్-బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) యౌతి పుంసా యోషిత్, యోషా చ, యు మిశ్రణే. పురుషునితో గూడు కొనునది. యోషితా, యోషా.'స్త్రీ వధూ ర్యోషితా రామా' ఇతి త్రికాండ శేషః

c) **గుణము :- మాధుర్య ప్రసాదములు** d) **రీతి :- వైదర్భి**

e) సంభోగశృంగారము వర్ణింపబడినది.

f) **ఛందస్సు-వృత్తము :-** జగతీ ఛందస్సు - వంశస్థవిలము.

g) **క్రియాదర్శము-పరిష్వజన్తే :-** లట్ ప్రథమ పురుష బహువచనము. ఆత్మనేపది దీని తిఙ్ ప్రత్యయము 'అన్తే'. పరి ఉపసర్గ.

**ధాతువు:- స్వఞ్జ్** - కౌగిలించుకొనుట. భ్వాదిప్రకరణ (1) ధాతువు.'అ' వికరణ 7ప్రత్యయము. అనిదితాం అల ఉపధాయాః క్ఙితి' - అను సూత్రముచే 'స్వఞ్జ్' అనునది 'స్వజ్' గా మారును. స్వజ్+ అ + అన్తే > స్వజ+అన్తే > స్వజన్తే. 'పరినివిభ్యః సేవ సిత సయ సివు సహ సుట్ స్తు స్వఞ్జామ్' అను సూత్రముచే. పరి+స్వజన్తే > పరిష్వజన్తేగా మారును.

**శ్లో॥ విలోచనేన్దీవరవారిబిన్దుభిః**
**నిషిక్తబిమ్బాధరచారుపల్లవాః।**
**నిరస్తమాల్యాభరణానులేపనాః**
**స్థితా నిరాశాః ప్రమదాః ప్రవాసినామ్॥ 12**

**పదవిభాగము:-** విలోచన+ఇందీవరవారిబిందుభిః నిషిక్తబింబ+అధరచారుపల్లవాః నిరస్తమాల్య+ఆభరణ+అనులేపనాః స్థితాః నిరాశాః ప్రమదాః ప్రవాసినామ్.

**అన్వయక్రమము:-** విలోచనేందీవర వారి బిందుభిః నిషిక్త బింబాధర చారు పల్లవాః నిరస్త మాల్యాభరణ అనులేపనాః ప్రవాసినామ్ ప్రమదాః నిరాశాః స్థితాః.

**ప్రతిపదార్థము:-** విలోచనేందీవర=కన్నులనే కలువలందలి, వారి=కన్నీళ్ళయొక్క, బిందుభిః=బిందువులచే, నిషిక్త=తడుపబడిన, బింబాధరచారుపల్లవాః=సుందరమైన





చిగుళ్ళవంటి బింబాధరములుగల, నిరస్త=విడువబడిన, మాల్య=పుష్పమాలికలును, ఆభరణ=ఆభరణములును, అనులేపనాః=పూతలునుగల, ప్రవాసినామ్=దూర ప్రాంతములనున్న వారియొక్క (బాటసారుల యొక్క), ప్రమదాః=భార్యలు, నిరాశాః =ఆశలులేనివారై, స్థితాః=ఉన్నారు.

**తాత్పర్యము:-** కలువలవంటి కన్నుల యందలి కన్నీళ్ళచే తడుపబడిన సుందరమైన చిగుళ్ళవంటి బింబాధరములుగల, పూతలును విడువబడిన పూలమాలలు, ఆభరణములుగల బాటసారుల భార్యలు (ఈ వర్షాకాలమున) ఆశలుడిగినవారై ఉన్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) విలోచనేందీవరవారిబిందుభిః - ఇందీవరే - ఇవ విలోచనే విలోచనేందీవరే - ఉపమితః సమాసః-తయోః వారిబిందుభిః-షష్ఠీ తత్పురుషః.
2) నిషిక్త..... పల్లవాః- బింబాధరా ఏవ చారు పల్లవాః బింబాధరచారుపల్లవాః -కర్మధారయః నిషిక్తః బింబాధరచారుపల్లవాః యాసాం తాః నిషిక్తబింబాధర చారుపల్లవాః - బహువ్రీహిః
3) నిరస్త.... లేపనాః-నిరస్తాని మాల్యాభరణాని అనులేపనాని చ యాభిః తాః -బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) ఇన్దతీతి ఇన్దిర్లక్ష్మీః, తయా ప్రియత ఇతి ఇన్దీవరం వృఙ్ వరణే. ఐశ్వర్యయుక్తురాలు గనుక ఇంది యనగా లక్ష్మి; ఆమెచేత వరింపబడినది. ఇంద్రియాణి వృణోతీతి వా ఇందీవరం, వృఙ్ వరణే. ఇంద్రియములను సంతోషము చేత గప్పునది. నల్ల కలువకు పేరు.

c) **గుణము :- మాధుర్యప్రసాదములు, ఓజస్సు** d) **రీతి :- వైదర్భి**

e) **అలంకారము :-** 'రూపకము'- లక్షణము ఇంతకు మునుపు చెప్పబడినది. ఈ శ్లోకమున 1) కన్నుల యందు నల్లని కలువ ఆరోపము వలన, పెదవుల యందు సుందరమైన చిగుళ్ళ ఆరోపము వలన, రూపకాలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు - వృత్తము:-** 'జగతీ ఛందస్సు - వంశస్థవిలము.

g) **క్రియాదర్శము :-** స్థితాః-క్త ప్రత్యయాంతము.

**ధాతువు :- ష్ఠా (స్థా)** - గతి నివృత్తౌ (నిలుచుట) అకర్మకము. పరస్మైపది. భ్వాది ప్రకరణ (1) ధాతువు.

భూతకాలార్థమునందు ధాతువునకు 'త' అను దానిని చేర్చుటచే 'క్త' ప్రత్యయాంత

శబ్దములేర్పడును. అకర్మకధాతువు మీద వచ్చినపుడు కర్త్రర్థకముగాని, భావార్థకముగాని యగును. నామవాచకము ననుసరించి మూడు లింగములలోని మారును. ఇదాగమము వలన స్థా + త > స్థిత గా మారును. ఆకారాంత స్త్రీ లింగమున 'స్థితా'; దాని ప్రథమా విభక్తి బహువచనము 'స్థితాః' గా మారును.

శ్లో॥ విపాణ్డురం కీటరజస్తృణాన్వితం
భుజఙ్గవద్వక్రగతిప్రసర్పితమ్।
ససాధ్వసైర్భేకకులైర్నిరీక్షితం
ప్రయాతి నిమ్నాభిముఖం నవోదకమ్॥ 13

**పదవిభాగము:–** విపాండురమ్ కీటరజః+తృణ+అన్వితమ్ భుజంగవత్+వక్రగతి ప్రసర్పితమ్ ససాధ్వసైః+భేకకులైః+నిరీక్షతమ్ ప్రయాతి నిమ్న+అభిముఖమ్ నవోదకమ్.

**అన్వయక్రమము:–** విపాండురమ్ కీట రజః తృణ అన్వితమ్ భుజంగవత్ వక్ర గతి ప్రసర్పితమ్ ససాధ్వసైః భేక కులైః నిరీక్షితమ్ నవోదకమ్ నిమ్న అభిముఖమ్ ప్రయాతి.

**ప్రతిపదార్థము:–** విపాండురమ్=తెలుపువన్నె కలిగినదియు, కీట=పురుగులతో, రజః =ధూళితో, తృణ=గడ్డితో, అన్వితమ్=కూడినదియు, భుజంగవత్=పామువలె, వక్ర= వంకరైన, గతి=గమనముచే, ప్రసర్పితమ్=ప్రసారము కలిగినదియు, ససాధ్వసైః= భయముతో కూడిన, భేక=కప్పల, కులైః=సమూహములచే, నిరీక్షితమ్=చూడబడినది యగు, నవోదకమ్=క్రొత్త నీరు, నిమ్న=పల్లమునకు, అభిముఖమ్=అభిముఖమై, ప్రయాతి =పోవుచున్నది.

**తాత్పర్యము:–** (ఈ వర్షాకాలమున) తెలుపు వన్నె కలిగినదియు, పురుగులు, ధూళి, గడ్డితో కూడినదియు, పామువలె వంకరగ ప్రసారము కలదియు, భయముతో కూడిన కప్పల సమూహముచే చూడబడినదియునగు క్రొత్త నీరు పల్లమునకు అభిముఖమై పోవుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కీటరజస్తృణాన్వితమ్–కీటాశ్చ రజాంసి చ తృణాని చ కీటరజస్తృణాని – సమాహార ద్వంద్వః–తైః అన్వితమ్ – తృతీయాతత్పురుషః

2) వక్రగతిప్రసర్పితమ్–వక్రా చాఽసౌ గతిః, వక్రగతిః. కర్మధారయః–తయా ప్రసర్పితమ్–తృతీయాతత్పురుషః.

3) భేకకులైః–భేకానామ్ కులైః–షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**





1) పాండుగుణయోగాత్పాండురః–తెలుపువన్నె గలిగినది. హరిణః పాణ్డురః పాణ్డుః

2) ఖననాయ నితరాం మ్నాయతే అభ్యస్యత ఇతి నిమ్నం. మ్నా–అభ్యాసే. త్రవ్వుటకు మిక్కిలి యభ్యసింపబడునది.

c) **గుణము** :– **ప్రసాదగుణము** d) **రీతి** :– **వైదర్భి**

e) **అలంకారము:–** ఎ) 'ఉపమా'–లక్షణము పూర్వము చెప్పబడినది. నదులు సముద్రమున కలియుటకు ముందు భాగమున వంపులు తిరుగుతూ ప్రవహిస్తూ పోవుచుండుటను సర్ప గమనముతో పోల్చి వర్ణింపబడుటచే నిట ఉపమాలంకార మున్నదని చెప్పదగును.

ఉపమానము : నదులు, ఉపమేయము : సర్పము

సమానత్వము : వంకరగతి వాచకము : వలె

**బి) భ్రాంత్యలంకారము:లక్షణము:–**స్యాత్ స్మృతిభ్రాన్తి సందేహైః తదఙ్కాలఙ్కృతి త్రయమ్. స్మరణ భ్రమ సంశయములచే ఆ పేర్లుగల మూడలంకారములు అగును. వక్రగతిన జలము ప్రవహించుటనుచూచి కప్పలు సర్పమని భయము నొందినట్లు వర్ణించుటచే నిది భ్రాంత్యలంకారముగా చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** 'జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

g) **క్రియాదర్శము :–** ప్రయాతి–లట్ ప్రథమపురుష ఏకవచనము.

**ధాతువు :– 'యా'** – ప్రాపణే–పొందుట. పరస్మైపది. అదాది ప్రకరణ (2) ధాతువు. దీనికి వికరణ ప్రత్యయముండదు. ప్ర=ఉపసర్గ. ప్ర+యా+తి > ప్రయాతి. తి–పరస్మైపది ప్రథమపురుష ఏకవచన తిఙ్ ప్రత్యయము.

శ్లో॥ విపత్రపుష్పాం నళినీం సముత్సుకా
విహాయ భృఙ్గాః శ్రుతిహారి నిః స్వనాః।
పతన్తి మూఢాః శిఖినాం ప్రనృత్యతాం
కలాపచక్రేషు నవోత్పలాశయా॥ 14

**పదవిభాగము:–** విపత్రపుష్పామ్ నళినీమ్ సముత్సుకాః విహాయ భృంగాః శ్రుతిహారి నిఃస్వనాః పతన్తి మూఢాః శిఖినామ్ ప్రనృత్యతామ్ కలాపచక్రేషు నవ+ఉత్పల+ ఆశయా.

**అన్వయక్రమము:–** శ్రుతిహారి నిఃస్వనాః భృంగాః విపత్ర పుష్పామ్ నళినీమ్ విహాయ సముత్సుకాః నవ ఉత్పల ఆశయా మూఢాః ప్రనృత్యతామ్ శిఖినామ్ కలాప చక్రేషు పతన్తి.

**ప్రతిపదార్థము:–** శ్రుతిహారి=చెవులకింపగు, నిఃస్వనాః=ధ్వనులుగల, భృంగాః=

తుమ్మెదలు, విపత్ర=పత్రములేని, పుష్పామ్=పువ్వులు గల, నళినీమ్=తామరను, విహాయ=విడచి, సముత్సుకాః=ఉత్సాహము కలవై, నవ=నూతనమగు, ఉత్పల=కలువలనెడు, ఆశయా=ఆశచే, మూఢాః=మూఢములై, ప్రనృత్యతామ్=ఆడుచుండు, శిఖినామ్=నెమళ్ళయొక్క, కలాప=పురులయొక్క, చక్రేషు=మండలములందు, పతన్తి=పడుచున్నవి.

**తాత్పర్యము:–** తుమ్మెదలు పత్రము లేని పూవులు గల తామరను విడచి, ఉత్సాహముతో, చెవులకింపగు ధ్వనులుకల, నూతనమగు కలువలనెడు ఆశచే మూర్ఖముగా, నాట్యమాడు నెమళ్ళ యొక్క పింఛ మండలములందు పడుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) శ్రుతిహారినిఃస్వనాః–శ్రుతేః హారీ, శ్రుతిహారీ–షష్ఠీతత్పురుషః – తథావిథో నిః స్వనో యేషాం తే తథాభూతాః–బహుప్రీహిః.
2) విపత్రపుష్పామ్–విగతే పత్రపుష్పే యస్యాః సా తామ్ – బహుప్రీహిః.
3) నవోత్పలాశయా–నవం చేదమ్ ఉత్పలమ్–కర్మధారయః–నవోత్పలమితి ఆశయా – సంభావనా కర్మధారయః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) నల్యతే బధ్యతే చంద్రేణేతి నలినం – చంద్రుని చేత ముకుళ రూపమున బంధింపబడినది. **పద్మం నళినమరవిన్దం మహోత్పలమ్.**
2) **శిఖినౌ వహ్ని బర్హిణౌ. శిఖిన్ శబ్దము అగ్నికిని,** నెమలికిని పేరు.

c) **గుణము** :– **మాధుర్య ప్రసాదగుణము లు** d) **రీతి :– వైదర్భి**

e) **భ్రాంత్యలంకారము:–** లక్షణము పూర్వము చెప్పబడినది. తుమ్మెదలు పురివిప్పిన నెమళ్ళను చూచి అవి అప్పుడే వికసించిన కలువలని భ్రమచెందుటను వర్ణించుటచే నిట భ్రాన్త్యలంకారమున్నదని చెప్పవచ్చును.

f) **ఛందస్సు–వృత్తము:–**జగతీ ఛందస్సు–వంశస్థవిలము.

g) **క్రియాదర్శము:–** పతన్తి– లట్ ప్రథమపురుష బహువచనము.

**ధాతువు :–** పత్ఌ–పత్–గతౌ–క్రిందపడుట. అకర్మకము. పరస్మైపది. భ్వాది ప్రకరణ (1) ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. లట్ ప్రథమపురుష బహువచన తిఙ్ ప్రత్యయము 'అన్తి'. కనుక పత్+అ+అన్తి > పత+అన్తి > పతన్తి గా మారును.

2) పతత్యధోగతౌ భ్రంసతేఽపి భ్రశ్యతి భృశ్యతి। (ఆఖ్యాతచంద్రికా 2-3-51)





శ్లో॥ వనద్విపానాం నవవారిదస్వనైః
మదాన్వితానాం ధ్వనతాం ముహుర్ముహుః।
కపోలదేశా విమలోత్పలప్రభాః
సభృఙ్గయూథైర్మదవారిభిశ్చితాః॥ 15

**పదవిభాగము:–** వనద్విపానామ్ నవవారిదస్వనైః మద+అన్వితానామ్ ధ్వనతామ్ ముహుః+ముహుః కపోలదేశాః విమల+ఉత్పలప్రభాః సభృంగయూథైః+యదవారిభిః +చితాః.

**అన్వయక్రమము:–** నవ వారిద స్వనైః మద అన్వితానామ్ ముహుః ముహుః ధ్వనతామ్ వనద్విపానామ్ విమల ఉత్పల ప్రభాః కపోల దేశాః సభృంగయూథైః మదవారిభిః చితాః.

**ప్రతిపదార్థము:–** నవ=క్రొత్త, వారిద=మేఘముల యొక్క, స్వనైః=ధ్వనులచే, మద=మదముతో, అన్వితానామ్=కూడినవియు, ముహుఃముహుః=తరచుగా, ధ్వనతామ్=అఱచుచుండెడి, వనద్విపానామ్=అడవి గజముల యొక్క, విమల=స్వచ్ఛమైన, ఉత్పల=కలువ యొక్క, ప్రభాః=కాంతివంటి కాంతిగల, కపోలదేశాః=గండ స్థలములు, సభృంగ యూథైః=తుమ్మెదలతో కూడిన, మదవారిభిః=మదజలములచే, చితాః=వ్యాప్తములై యున్నవి.

**తాత్పర్యము:–** క్రొత్త మేఘముల యొక్క ధ్వనులచే మదముతో కూడినవై, తరచుగా అఱచుచుండు అడవి గజముల యొక్క స్వచ్ఛమైన కలువ కాంతివంటి కాంతి గల గండస్థలములు తుమ్మెదలతో కూడిన మదజలములచే నొప్పుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) నవవారిదస్వనైః–నవశ్చాసౌ వారిదః–నవవారిదః–కర్మధారయః–తస్య స్వనైః
2) మదాన్వితానామ్–మదేన అన్వితానామ్–తృతీయాతత్పురుషః.
3) వనద్విపానామ్–వనస్య ద్విపానామ్–షష్ఠీతత్పురుషః.
4) విమలోత్పలప్రభాః–విమలం చ ఇదమ్ ఉత్పలమ్–విమలోత్పలమ్–కర్మధారయః–తస్య ప్రభా ఇవ ప్రభా యేషాం తే తథాభూతాః–బహుప్రీహిః.
5) కపోలదేశాః–కపోలస్య దేశాః–షష్ఠీతత్పురుషః.
6) మదవారిభిః – మదస్య వారీణి తైః–షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) భక్షణ సమయే కంపత ఇతి కపోలమ్. కపి కించిచ్చలనే. భక్షించు సమయ మందు చలించునది. గణ్డౌ కపోలౌ.

2) ద్వాభ్యాం పిబతీతి ద్విపః – పా పానే. తొండము, నోరు అను ఈరెంటిచేతను పానము చేయునది. **దన్తీ దన్తావళో హస్తీ ద్విరదోఽనేకపో ద్విపః.**

c) **గుణము** :– ప్రసాదగుణము d) **రీతి** :– వైదర్భి

e) **అలంకారము:** 'ఉపమా'– లక్షణము ముందు చెప్పబడినది. ఈ శ్లోకమున ఏనుగుల గండస్థలములు నీలోత్పలములతో పోల్చి వర్ణించుటచే నిట ఉపమాలంకారమున్న దని చెప్పదగును.వనగజముల స్వభావమును వర్ణించుటచే నిట స్వభావోక్త్యలంకార మున్నదని కూడ చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:**– 'జగతీ ఛందస్సు – వంశస్థవిలవృత్తము.

f) **క్రియాదర్శము** :– చితాః క్తప్రత్యయాంతము

**ధాతువు** :– చిఞ్ (చి) చయనే–ప్రోగుచేయుట. ఉభయపది. స్వాదిప్రకరణ (5) ధాతువు. ధాతువుకు 'త' ప్రత్యయముచేర్చుటచే చి+త > చితగా మారును. నామవాచకరూపము ననుసరించి మూడు లింగములలోకి మారును. చితః –చితా–చితమ్. స్త్రీలింగ ప్రథమా విభక్తి బహువచనమున చితాః గా మారును.

**శ్లో॥ సితోత్పలాభామ్బుదచుమ్బితోపలాః**
**సమాచితాః ప్రస్రవణైః సమన్తతః।**
**ప్రవృత్తనృత్యైః శిఖిభిః సమాకులాః**
**సముత్సుకత్వం జనయన్తి భూధరాః॥ 16**

**పదవిభాగము:**–సిత+ఉత్పల+ఆభ+అంబుదచుంబిత+ఉపలాః సమాచితాః ప్రస్రవణైః సమంతతః ప్రవృత్తనృత్యైః శిఖిభిః సమాకులాః సముత్సుకత్వమ్ జనయన్తి భూధరాః

**అన్వయక్రమము:**– సితోత్పల ఆభ అంబుద చుంబిత ఉపలాః సమంతతః ప్రస్రవణైః సమాచితాః ప్రవృత్త నృత్యైః శిఖిభిః సమాకులాః భూధరాః సముత్సుకత్వమ్ జనయన్తి

**ప్రతిపదార్థము:**– సిత=తెల్లని, ఉత్పల=కలువల యొక్క, ఆభ=కాంతివంటి కాంతిగల, అంబుద=మేఘములచే, చుంబిత=ముద్దిడుకొనబడిన, ఉపలాః=ఱాళ్ళుగలవియు, సమంతతః=అంతటను, ప్రస్రవణైః=కారుచున్న నీటితో, సమాచితాః=వ్యాపింపబడిన, ప్రవృత్త=ప్రారంభింపబడిన, నృత్యైః=ఆటలు గల, శిఖిభిః=నెమళ్ళచే, సమాకులాః =వ్యాపించబడినవియు అగు, భూధరాః=కొండలు, సముత్సుకత్వమ్=కుతూహలము ను, జనయన్తి=పుట్టించుచున్నవి.

**తాత్పర్యము:**– తెల్లనికలువల వంటి కాంతి గల మేఘములచే ముద్దిడుకొనబడిన రాళ్ళు గల్గినవి,అంతట,నీటి ప్రవాహములతో వ్యాప్తములైనవియు, ఆడుట ప్రారంభించిన నెమళ్ళచేవ్యాపించబడిన కొండలు కుతూహలమును పుట్టించుచున్నవి.





**పదాదర్శవిశేషములు:**–

a) **సమాసములు:**– 1) సిత...ఉపలాః–సితం చేదమ్ ఉత్పలమ్ సితోత్పలమ్– కర్మధారయః– తస్యాభా ఇవాభా యేషాం తే తథాభూతాః– బహువ్రీహిః.

2) ప్రవృత్తనృత్యైః–ప్రవృత్తం నృత్యం యేషాం తే తైః–బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:**–

1) ఉపలాతి భినత్తి వస్తూనీతి ఉపలః. లా ఆదానే. వస్తువులను ఖండించునది. **పాషాణ ప్రస్తర గ్రావోపలాశ్మాన శ్శిలా దృషత్.**

c) **గుణము** :– **మాధుర్యము** d) **రీతి** :– వైదర్భి

e) పర్వతములను అతిరమణీయంగా ఈ శ్లోకమున వర్ణించుట జరిగింది.

f) **ఛందస్సు – వృత్తము:**– 'జగతీ ఛందస్సు – వంశస్థవిలవృత్తము.

g) **క్రియాదర్శము** :– జనయన్తి–ప్రేరణార్థక క్రియ.

**ధాతువు** :– **జనీ** (జన్) – ప్రాదుర్భావే – పుట్టుట, ఆత్మనేపది. దివాది ప్రకరణ (4) ధాతువు. ప్రేరణార్థకమున 10వ వికరణ ధాతువు రూపమున 'అయ' ప్రత్యయము వలన జన్+అయ+అన్తి > జనయ+అన్తి > జనయన్తి గా మారును. ఇందు పరస్మైపదిగా నుండుట వలన 'అన్తి' అను లట్ ప్రథమ పురుష బహువచన తిఙ్ ప్రత్యయము చే పై రూపము ఏర్పడును.

2) ప్రసూయతే ప్రసూతే చ గర్భమోక్షే విజాయతే, ప్రజాయతే జనయతి జజన్తి చ్ఛాన్దసం విదుః (ఆఖ్యాతచంద్రికా 2–1–52)

**శ్లో॥ కదమ్బసర్జార్జునకేతకీవనం**
**వికమ్పయంస్తత్కుసుమాధివాసితః।**
**సశీకరామ్భోధరసఙ్గశీతలః**
**సమీరణః కం న కరోతి సోత్సుకమ్॥ 17**

**పదవిభాగము:**– కదంబసర్జ+అర్జునకేతకీవనమ్ వికంపయన్+తత్+కుసుమ+ అధివాసితః సశీకర+అంభోధరసంగశీతలః సమీరణః కమ్ న కరోతి సోత్సుకమ్.

**అన్వయక్రమము:**– కదంబ సర్జ అర్జున కేతకీ వనమ్ వికంపయన్ తత్ కుసుమ అధివాసితః సశీకర అంభోధర సంగ శీతలః సమీరణః కమ్ సోత్సుకమ్ న కరోతి.

**ప్రతిపదార్థము:**– కదంబ=కడిమచెట్లయొక్క, సర్జ=వేగి చెట్ల యొక్క, అర్జున= ఏఱు మద్దిచెట్ల యొక్క, కేతకీ=మొగలి చెట్ల యొక్క, వనమ్=అడవిని, వికంపయన్= కదల్చుచు, తత్=ఆయా చెట్ల సంబంధ, కుసుమ=పూలచే, అధివాసితః=సువాసన గలదియు,

సశీకర=నీటి తుంపరలతో కూడిన, అంభోధర=మేఘములయొక్క సంగ=సంబంధముచే, శీతలః=చల్లని దైన, సమీరణః=గాలి, కమ్=ఎవనిని, సోత్సుకమ్ =కుతూహలముతో కూడిన వానినిగా, న కరోతి=చేయదు?

**తాత్పర్యము:–** కడిమ, వేగి, ఏఱుమద్ది, మొగలి చెట్లున్న అడవిని కదల్చుచు ఆయా చెట్ల పూలచే సువాసన గలదియు, నీటి తుంపరలచే కూడిన మేఘముల యొక్క సంబంధముచే చల్లనిదైన వాయువు ఎవనిని ఉత్సాహముతో కూడిన వానినిగా చేయదు?

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కదంబ.... వనమ్ – కదంబశ్చ సర్జశ్చ అర్జునశ్చ కేతకీ చ – కదంబసర్జార్జున కేతక్యః–ద్వంద్వః– తాసాం వనమ్– షష్ఠీతత్పురుషః.
2) స..... శీతలః–సశీకరాశ్చేమే అమ్భోధరాః–సశీకరామ్భోధరాః–కర్మధారయః –తేషాం సంగః – సశీకరామ్భోధరసంగః – షష్ఠీతత్పురుషః – తేన శీతలః – తృతీయాతత్పురుషః
3) తత్కుసుమాధివాసితః– తేషాం కుసుమాని, తత్కుసుమాని – షష్ఠీతత్పురుషః –తైః అధివాసితః–తత్కుసుమాధివాసితః–తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) సమ్యక్ ఈరితుం గంతుం శీలమస్య సమీరణః. ఈర–గతౌ. లెస్సగా సంచరించు స్వభావము గలవాడు.
2) సృజతి నిర్యాసం సర్జకః సృజ విసర్గే. బంకను పుట్టించునది. **సర్జకాసనబన్ధూక పుష్ప ప్రియక జీవకాః.**

c) **గుణము** :– ప్రసాదగుణము d) **రీతి** :– వైదర్భి

e) వర్షర్తువు నందలి 'వాయువు' వర్ణన మనోహరంగా చేయబడినది.

f) **ఛందస్సు – వృత్తము:–** 'జగతీ ఛందస్సు – వంశస్థవిలవృత్తము.

g) **క్రియాదర్శము** :– 'కరోతి' పూర్వ శ్లోక భాగములలో వివరింపబడినది.

**శ్లో॥ శిరోరుహైః శ్రోణితటావలమ్బిభిః**
**కృతావతంసైః కుసుమైః సుగన్ధిభిః।**
**స్తనైస్సహారైర్వదనైస్ససీధుభిః**
**స్త్రియో రతిం సఞ్జనయన్తి కామినామ్॥ 18**

**పదవిభాగము:–** శిరోరుహైః శ్రోణితట+అవలంబిభిః కృత+అవతంసైః కుసుమైః సుగంధిభిః స్తనైః+సహారైః+వదనైః+ససీధుభిః స్త్రియః రతిమ్ సంజనయన్తి కామినామ్.





**అన్వయక్రమము:–** శ్రోణితట అవలంబిభిః శిరోరుహైః కృతావతంసైః సుగంధిభిః కుసుమైః సహారైః స్త నైః ససీధుభిః వదనైః స్త్రియః కామినామ్ రతిమ్ సంజనయన్తి.

**ప్రతిపదార్థము:–** శ్రోణితట=పిఱుదులపైన, అవలంబిభిః=వ్రేలాడుచుండునవియు, సుగంధిభిః=సువాసనగల, కుసుమైః=పూలచేత, శిరోరుహైః=కేశములచేత, కృతావతంసైః =చేయబడిన సిగబంతిచేత, సహారైః=మాలికలతో కూడిన,స్తనైః=కుచములచేత, ససీధుభిః =మద్యముతో కూడిన, వదనైః=ముఖములచేత, స్త్రియః=స్త్రీలు, కామినామ్=కాముకులకు, రతిమ్=శృంగారభావమును, సంజనయన్తి=పుట్టించుచున్నారు.

**తాత్పర్యము:–** పిరుదులపై ఊగుచుండు సిగబంతిచేత, సువాసన గల పూల మాలికలతో కూడిన స్తనముల చేత, మద్యముతో కూడిన ముఖములచేత, స్త్రీలు కాముకులకు శృంగార రాగమును జనింపజేయుచున్నారు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) శ్రోణితటావలంబిభిః–శ్రోణ్యాః తటమ్–షష్ఠీతత్పురుషః, తస్మిన్ అవలంబిభిః –సప్తమీతత్పురుషః.
2) కృతావతంసైః–కృతః అవతంసో యేషాం తైః–బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శ్రోణతి సంగచ్ఛతే శ్రోణిః, శ్రోణృ–సంఘాతే. సంహతమై యుండునది. **కటి శ్రోణిః కకుద్మతీ.**
2) స్తనతి బాల ఆభ్యామితి స్తనౌ. స్తన శబ్దే. వీని కొఱకు బాలుడు మొఱపెట్టును. **స్తనౌ కుచౌ.**

c) **గుణము** :– **మాధుర్య ప్రసాదములు**

d) **రీతి – వైదర్భి :–** 'బంధపారుష్యరహితా శబ్ద కాఠిన్యవర్జితా, నాతిదీర్ఘ సమాసా చ వైదర్భీరీతి రిష్యతే అని లక్షణము. క్లిష్టసంధులులేని, శబ్దకాఠిన్యములేని, దీర్ఘసమాసములు లేని పదరచన వైదర్భి అనబడును.

e) సంభోగశృంగారము వర్ణింపబడినది.

f) **ఛందస్సు – వృత్తము:–** 'జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

g) **క్రియాదర్శము** :– 'సంజనయన్తి' ఉపసర్గ : సం ధాతువివరములకై 16వ శ్లోకభాగము చూడదగును.

**శ్లో॥ తటిల్లతాశక్రధనుర్విభూషితాః**
**పయోధరాస్తోయభరావలమ్బినః।**

**స్త్రియశ్చ కాఞ్చీమణికుణ్డలోజ్జ్వలా**
**హరన్తి చేతో యుగపత్ప్రవాసినామ్॥ 19**

**పదవిభాగము:–** తటిత్+లతాశక్రధనుః+విభూషితాః పయోధరాః+తోయభర+అవలంబినః స్త్రియః+చ కాంచీమణికుండల+ఉత్+జ్వలాః హరన్తి చేతః యుగపత్+ప్రవాసినామ్.

**అన్వయక్రమము:–**తటిత్‌లతా శక్రధనుః విభూషితాః తోయభర అవలంబినః పయోధరాః కాంచీ మణి కుండల ఉజ్జ్వలాః స్త్రియఃచ ప్రవాసినామ్ చేతః యుగపత్ హరన్తి.

**ప్రతిపదార్థము:–** తటిత్+లతా=తీగలవంటి మెఱుపులచేత, శక్రధనుః=ఇంద్రుని ధనుస్సు చేత, విభూషితాః=అలంకరింపబడిన, తోయ=జలము యొక్క భర=భారము చేత, అవలంబినః=వ్రేలాడుచుండు, పయోధరాః=మేఘములును, కాంచీ=మొలనూళ్ళ చేతను, మణికుండల=మణికుండలములచేతను, ఉత్+జ్వలాః=బాగా ప్రకాశించు చున్న, స్త్రియః=స్త్రీలు, ప్రవాసినామ్=బాటసారుల యొక్క, చేతః=మనస్సును, యుగపత్=ఏక కాలమున, హరంతి=హరించుచున్నారు.

**తాత్పర్యము:–** తీగలవంటి మెఱుపుల చేతను, ఇంద్రుని ధనుస్సుచేతను, అలంకరించ బడినవై నీరు కలిగి యుండుటచే వ్రేలాడుచుండు మేఘములును, మొలనూళ్ళ చేత మణి కుండలములచేత ప్రకాశించుచున్న స్త్రీలు బాటసారుల మనస్సులను ఏకకాలమున హరించుచున్నారు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) తటిల్లతాశక్రధనుర్విభూషితాః–తటిల్లతా శక్రధనుశ్చ–తటిల్లతా శక్రధనుషీ–ద్వంద్వః–తాభ్యాం విభూషితాః.–తటిల్లతాశక్రధనుర్విభూషితాః– తృతీయా తత్పురుషః.

2) తోయభరావలంబినః–తోయస్య భరః–తోయభరః–షష్ఠీతత్పురుషః–తేన ఆవలంబినః–తోయభరావలంబినః–తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శక్రస్య ధనుః శక్రధనుః–శక్రుని ధనుస్సు. **ఇంద్రాయుధం శక్రధనుః.**

2) కచ్యతే బధ్యతే కాంచీ. కచ దీప్తిబంధనదేవనేషు. కట్టబడునది. ఒంటి సరము గలది. **స్త్రీ కట్యాం మేఖలా కాంచీ సప్తకీ రశనా తథా.**

c) **గుణము** :– **మాధుర్య ప్రసాదములు**

d) **రీతి** :– **వైదర్భి**





e) **ఛందస్సు – వృత్తము:–** 'జగతీ ఛందస్సు – వంశస్థవిలవృత్తము.

f) **క్రియాదర్శము :–** హరన్తి– లట్ ప్రథమ పురుషబహువచనము. ధాతు వివరములకై '8'వ శ్లోక భాగము చూడదగును.

**శ్లో॥ మాలాః కదమ్బనవకేసరకేతకీభి**
**రాయోజితాశ్శిరసి బిభ్రతి యోషితోఽద్య।**
**కర్ణాన్తరేషు కకుభద్రుమమఞ్జరీభి**
**రిచ్ఛానుకూలరచితానవతంసకాంశ్చ॥ 20**

**పదవిభాగము:–** మాలాః కదంబనవకేసరకేతకీభిః+ఆయోజితాః+శిరసి బిభ్రతి యోషితః +అద్య కర్ణ+అన్తరేషు కకుభద్రుమమంజరీభిః ఇచ్ఛా+అనుకూలరచితాన్ + అవతంసకాన్+చ.

**అన్వయక్రమము:–** అద్య యోషితః శిరసి కదంబ నవ కేసర కేతకీభిః ఆయోజితాః మాలాః కర్ణ అన్తరేషు కకుభద్రుమ మంజరీభిః ఇచ్ఛా అనుకూల రచితాన్ అవతంసకాన్ చ బిభ్రతి.

**ప్రతిపదార్థము:–** అద్య=ఇప్పుడు, యోషితః=స్త్రీలు, శిరసి=తల యందు, కదంబ=కదంబపూవులతోడను, నవ=క్రొత్త, కేసర=సురపొన్న పువ్వులతోడను, కేతకీభిః=మొగలిపూవులతోడను, ఆయోజితాఃకూర్చబడిన, మాలాః=మాలికలు, కర్ణ+అన్తరేషు=చెవిసందులయందు, చ=మఱియు, కకుభద్రుమ=మద్ది చెట్ల యొక్క, మంజరీభిః=చిగుళ్ళతో, ఇచ్ఛా=కోరికకు, అనుకూల=అనుకూలమగునట్లు, రచితాన్=కూర్చబడిన, అవతంసకాన్=కర్ణాలంకారములను, బిభ్రతి=ధరించుచున్నారు.

**తాత్పర్యము:–** ఇప్పుడు (ఈ వర్షాకాలమున) స్త్రీలు తలలయందు కదంబ, సురపొన్న, మొగలి పూవులను తురుముకొని, చెవిసందులయందు మాలికలు మఱియు మద్ది చిగుళ్ళతో కోరికకు అనుకూలమగునట్లు కూర్చబడిన కర్ణాలంకారములు ధరించు చున్నారు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కకుభద్రుమమంజరీభిః–కకుభ ద్రుమాణాం మంజరీభిః–షష్ఠీ తత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కిత్యతే జ్ఞాయతే గంధోఽనేనేతి కేతకీ. కిత జ్ఞానే. దీని చేత పరిమళము తెలియబడును. మొగలి చెట్టు పేరు.

2) ప్రశస్తాః కేసరాస్సన్త్యస్య కేసరః-మంచి అకరువులు గలది. **పున్నాగే పురుషస్తుంగః కేసరో దేవవల్లభః.**

3) **పుంస్యుత్తంసావతంసౌ ద్వౌ కర్ణపూరేపి శేఖరే.** ఉత్తంస శబ్దమును, అవతంస శబ్దమును అలంకారార్థమై చెవులకు పెట్టు పువ్వులు సొమ్ములు మొదలైన వానికిని, శిరోభూషణమునకును పేళ్ళు.

c) **గుణము :- ప్రసాదగుణము** d) **రీతి :- వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - వసంతతిలకా వృత్తము.

**లక్షణము:** 1) ఈ ఛందమున ప్రతిపాదమునకు 14 అక్షరములుండును.

2) ఉక్తా వసన్తతిలకా తభజా జగౌ గః।

3) గణములు త, భ, జ, జ, గ, గ (4) యతి (8.6)

| ఉదా:- | మా లాః క | దం బ న | వ కే స | ర కే త | కీ భిః |
|---|---|---|---|---|---|
| | U U I | U I I | I U I | I U I | U U |
| | త | భ | జ | జ | గ గ |

f) **క్రియాదర్శము :-** 'బిభ్రతి'. లట్ ప్రథమపురుషబహువచనము. పరస్మైపది.

**ధాతువు :- దుభృఞ్-భృ**-ధారణ. పోషణయోః-ధరించుట, పోషించుట జు హోత్యాది (3) ప్రకరణ ధాతువులకు వికరణ చిహ్నము చేరదు. కాని వానికి ద్విరుక్తి కలుగును. ఈ ధాతువుల విషయమున పరస్మైపద ప్రథమపురుష బహువచన ప్రత్యయము నందలి అనునాసికము లోపించును. అన్తి-అతి, అన్తు-అతు. ఈ గణమున 'భృ' అను ధాతువు అభ్యాసమునందలి అచ్చునకు ఇకారాదేశమగును. భృ+భృ+అతి > బిభృ+అతి > బిభ్ర్ + అతి > బిభ్రతి.

సూ: ఇకోయణచి-అ సవర్ణాచ్చుపరమగునపుడు ఇ, ఈ లకు యకారము, ఉ, ఊ లకు వ కారము, ఋ, ౠ లకు రేఫము, ఌ కారమునకు ల కారము ఆదేశమగును. య, వ, ర, ల అను హల్లులకు యణ్ అనునది ప్రత్యాహార సంజ్ఞ.

**శ్లో॥ కాలాగురుప్రచురచన్దనచర్చితాఙ్గ్యః**
**పుష్పావతంససురభీకృతకేశపాశాః।**
**శ్రుత్వా ధ్వనిం జలముచాం త్వరితం ప్రదోషే**
**శయ్యాగృహం గురుగృహాత్ప్రవిశన్తి నార్యః॥ 21**

**పదవిభాగము:-** కాలాగురుప్రచురచందనచర్చిత+అంగ్యః పుష్ప+అవతంస సురభీకృత కేశపాశాః శ్రుత్వా ధ్వనిమ్ జలముచామ్ త్వరితమ్ ప్రదోషే శయ్యాగృహమ్ గురుగృహాత్ +ప్రవిశన్తి నార్యః.





**అన్వయక్రమము:-** కాలాగురు ప్రచుర చందన చర్చిత అంగ్యః పుష్ప అవతంస సురభీకృత కేశపాశాః నార్యః ప్రదోషే జలముచామ్ ధ్వనిమ్ శ్రుత్వా గురుగృహాత్ శయ్యాగృహమ్ త్వరితమ్ ప్రవిశన్తి.

**ప్రతిపదార్థము:-** కాలాగురు=నల్లని చందన విశేషము, ప్రచుర=అధికముగ నుండు, చందన=చందనముచే, చర్చిత పూయబడిన, అంగ్యః=అవయవములుగలది, పుష్ప= పూవుల యొక్క, అవతంస అలంకారములచే, సురభీకృత=సువాసన కలిగించబడిన, కేశపాశాః=కొప్పులు కలిగిన, నార్యః=స్త్రీలు, ప్రదోషే=రాత్రి మొదటిజామున, జల ముచామ్=మేఘములయొక్క, ధ్వనిమ్=గర్జనను, శ్రుత్వా=విని, గురుగృహాత్= పెద్దల గృహమునుండి, శయ్యాగృహమ్=పడకటింటిని, త్వరితమ్=వేగముగ, ప్రవిశన్తి= ప్రవేశించుచున్నారు..

**తాత్పర్యము:-** నల్లని చందన విశేషముచే పూయబడిన అవయవములు గల, పూల అలంకారములచే సువాసన పొందిన కురుల ముడులు గల స్త్రీలు రాత్రి మొదటి జామున మేఘగర్జనను విని పెద్దల గృహము నుండి పడకటింటిని త్వరితముగ ప్రవేశించుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-** నార్యః - 'నారీ' అను ఈకారాంత శబ్ద స్త్రీలింగ ప్రథమ పురుష బహువచనరూపము.

a) **సమాసములు:-**

1) కాలాగురుప్రచురచన్దనచర్చితాఙ్గ్యః-కాలాగురుః ప్రచురం యస్మిన్ తథావిధమ్ -కాలాగురుప్రచురమ్-తథావిధేన చందనేన చర్చితాన్యంగాని యాసాం తాః -బహువ్రీహి.

2) పుష్ప..... పాశాః-పుష్పాణామ్ అవతంసః-పుష్పావతంసః - షష్ఠీతత్పురుషః - తైః-సురభీకృతాః కేశపాశాః యాసాం తాః-తథావిధాః - బహువ్రీహిః

3) శయ్యాగృహమ్ - శయ్యాయాః గృహమ్ - షష్ఠీతత్పురుషః.

4) గురుగృహాత్-గురూణాం గృహాత్ - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) జలం ముంచతీతి జలముక్. ముచ్-మ్మోక్షణే. ఉదకమును విడుచునది. **ఘన జీమూత ముదిర జలము గ్ధూమయోనయః.**

2) దోషాయాః ప్రారంభః ప్రదోషః. దోషయనగా రాత్రి. దాని యొక్క ప్రారంభము. **ప్రదోషో రజనీముఖమ్.**

c) **గుణము :- మాధుర్యము** d) **రీతి :- వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు-వసన్తతిలకావృత్తము.

f) **క్రియాదర్శము :-** ప్రవిశన్తి- లట్ ప్రథమపురుష బహువచనము. ప్ర=ఉపసర్గ.

**ధాతువు :- విశ(విశ్)** - ప్రవేశనే-ప్రవేశించుట. సకర్మకము. పరస్మైపది. తుదాది ప్రకరణ (6) ధాతువు. 'అ' అనునది వికరణ ప్రత్యయము. ఈ గణధాతు వివరములకు 4వ శ్లోక భాగమును చూడదగును. విశ్ + అ+అన్తి > విశన్తి గా మారును. అన్తి - లట్ ప్రథమ పురుష బహువచన తిఙ్ ప్రత్యయము.

**శ్లో॥ కువలయదళనీలైరున్నతైస్తోయనమ్రైః**
**మృదుపవనవిధూతైః మన్దమన్దం చలద్భిః।**
**అపహృతమివ చేతస్తోయదైస్సేన్ద్రచాపైః**
**పథికజనవధూనాం తద్వియోగాకులానామ్॥ 22**

**పదవిభాగము:-** కువలయదళనీలైః+ఉన్నతైః+తోయనమ్రైః మృదుపవనవిధూతైః మన్దమన్దమ్ చలద్భిః అపహృతమ్+ఇవ చేతః+తోయదైః+స+ఇన్ద్రచాపైః పథిక జనవధూనామ్ తత్+వియోగ+ఆకులానామ్.

**అన్వయక్రమము:-** కువలయదళ నీలైః ఉన్నతైః తోయ నమ్రైః మృదు పవన విధూతైః మన్దమందమ్ చలద్భిః సేంద్రచాపైః తోయదైః తత్ వియోగ-ఆకులానామ్ పథికజన -వధూనామ్ చేతః అహహృతమ్ ఇవ.

**ప్రతిపదార్థము:-** కువలయదళ=కలువ రేకుల వలె, నీలైః=నీలమైనవియు, ఉన్నతైః =ఎత్తైనవి, తోయ=నీటిచే, నమ్రైః=వంగినవియు, మృదు=మృదువగు, పవన=గాలిచే, విధూతైః=కదల్పబడినవియు, మన్దమందమ్=నెమ్మదిగా, చలద్భిః=కదలుచుండు, సేంద్రచాపైః=ఇంద్రధనుస్సుతో కూడిన, తోయదైః=మేఘములచే, తత్=భర్తల యొక్క వియోగ=వియోగముచే, ఆకులానామ్=వ్యాకులతచెందిన, పథికజన=బాటసారుల, వధూనామ్=భార్యలయొక్క చేతః=మనస్సు, అపహృతమివ=అపహరింపబడినదాని వలెనున్నది.

**తాత్పర్యము:-** కలువరేకులవలె నీలమైనవియు, ఎత్తైనవియు, జలములచే వంగినవియు, పిల్లవాయువుచే కదల్పబడినవియు, కదలుచుండు ఇంద్రధనుస్సుతో కూడిన మేఘములచే వియోగముచే వ్యాకులతచెందిన బాటసారుల భార్యల యొక్క మనస్సు అపహరింపబడినట్లున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-** 1) కువలయదళనీలైః-కువలయస్య దళాని, కువలయదళాని- షష్ఠీతత్పురుషః-తానీవ నీలాని తైః-కువలయదళనీలైః-ఉపమాన పూర్వపద





కర్మధారయః

2) తోయనమ్రైః-తోయేన నమ్రైః తృతీయాతత్పురుషః.

3) మృదుపవనవిధూతైః-మృదుశ్చాసౌ పవనః-మృదుపవనః-కర్మధారయః-తేన విధూతైః-మృదుపవన విధూతైః-తృతీయాతత్పురుషః.

4) వియోగాకులానామ్-వియోగేన ఆకులానామ్-తృతీయాతత్పురుషః.

5) పథికజనవధూనామ్-పథికజనానామ్ వధూనామ్ - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) ధూయతే స్మ ధూతం. ధూ-విధూననే. **త్యక్తం హీనం విధుతం సముజ్ఝితం ధూతముత్సృష్టమ్.**

2) చేతయతీతి చిత్తం. చేతశ్చ. చితీ-సంజ్ఞానే. తెలియజేయునది. చిత్తం తు చేతో హృదయంస్వాన్తం హృన్మానసం మనః.

c) **గుణము :-** ఓజస్సు d) **రీతి :-** వైదర్భి

e) **అలంకారము:** 'ఉత్ప్రేక్ష'

**లక్షణము:** 'సంభావనా స్యాదుత్ప్రేక్షా' సంభావనయే ఉత్ప్రేక్షాలంకారమనబడును.

**అన్వయము:** బాటసారుల (ప్రవాసినుల) స్త్రీల యొక్క మనస్సు అపహరింపబడినది వలె నున్నట్లు వర్ణించుటనే నిది 'ఉత్ప్రేక్షాలంకారము' గా చెప్పదగును.

f) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము.

**లక్షణము:** 1) ఈ ఛందమున ప్రతిపాదమునకు 15 అక్షరములుండును.

2) ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః।

3) గణము న, న, మ, య, య (4) యతి 8.7.

| ఉదా:- | కు వ ల | య ద ళ | నీ లై రు | న్న తై స్తో | య న మ్రైః |
|---|---|---|---|---|---|
| | I I I | I I I | U U U | I U U | I U U |
| | న | న | మ | య | య |

g) **క్రియాదర్శమ్ :-** అపహృతమ్-'క్త' ప్రత్యయాంతము. భూతకాలికము. అప=ఉపసర్గ.

**ధాతువు :- హృఞ్** (హృ) హరణే - తీసికొనిపోవుట, దొంగిలించుట, నాశనము చేయుట, భ్వాది ప్రకరణ (1) ధాతువు. ద్వికర్మకము. ఉభయపది భూతకాలార్థమున ధాతువునకు 'త' అను ప్రత్యయమును చేర్చుటచే 'క్త' ప్రత్యయాంత శబ్దములేర్పడును. హృ+త > హృత. నామవాచకరూపము ననుసరించి మూడు లింగములలోనికి మారును. హృతః (పుంలిం) - హృతా(స్త్రీలిం) - హృతమ్ (నపుం. లిం.).

**శ్లో॥ ముదిత ఇవ కదమ్బైర్జాతపుష్పైస్సమన్తాత్**

**పవనచలితశాఖైః శాఖిభిర్నృత్యతీవ ।**
**హసితమివ విధత్తే సూచిభిః కేతకీనాం**
**నవసలిలనిషేకాచ్ఛాన్తతాపో వనాన్తః॥ 23**

**పదవిభాగము:–** ముదితః+ఇవ కదమ్బైః+జాతపుష్పైః+సమన్తాత్ పవనచలితశాఖైః శాఖిభిః+నృత్యతి+ఇవ హసితమ్+ఇవ విధత్తే సూచిభిః కేతకీనామ్ నవసలిలనిషేకాత్ +శాన్తతాపః+వనాన్తః.

**అన్వయక్రమము:–** నవ సలిల నిషేకాత్ శాన్త తాపః వనాన్తః జాత పుష్పైః కదంబైః ముదిత ఇవ పవన చలిత శాఖైః శాఖిభిః నృత్యతి+ఇవ కేతకీనామ్ సూచిభిః హసితమ్ విధత్తే ఇవ.

**ప్రతిపదార్థము:–** నవ=క్రొత్త, సలిల=నీటి యొక్క, నిషేకాత్=చల్లుట వలన, శాన్త= తగ్గిన, తాపః=తాపము కల, వనాన్తః=వనప్రదేశము, జాత=పుట్టిన, పుష్పైః= పుష్పములుగల, కదంబైః=కడిమి చెట్లచే, ముదిత ఇవ=సంతసించినట్లున్నది, పవన =గాలిచే, చలిత=కదల్పబడిన, శాఖైః=కొమ్మలుగల, శాఖిభిః=చెట్లతో, నృత్యతి+ ఇవ=ఆడుచున్నట్లున్నది, కేతకీనామ్=మొగలిపువ్వుల, సూచిభిః=రేకులచే, హసితమ్= చిరునవ్వును, విధత్తే ఇవ=ధరించుచున్నట్లున్నది.

**తాత్పర్యము:–** (మేఘములు) చల్లని నీటిని వర్షించుటచే తాపము తగ్గిన వన ప్రదేశము (1) పుష్పములు గల కడిమి చెట్లచే సంతసించినట్లున్నది, (2) గాలి తాకిడికి కదిలే కొమ్మలుగల చెట్లచే ఆడుచున్నట్లున్నది, (3) మొగలి పూవుల రేకులచే చిరునవ్వును ధరించినట్లున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) నవ.... తాపః–సలిలస్య నిషేకః సలిలనిషేకః – షష్ఠీతత్పురుషః. నవశ్చాసౌ సలిలనిషేకః – నవసలిలనిషేకః – కర్మధారయః – శాన్తః తాపః యస్యాసౌ తథావిధః – బహువ్రీహిః.
2) జాతపుష్పైః–జాతాని పుష్పాణి యేషు తే తథావిధైః – బహువ్రీహిః.
3) పవనచలితశాఖైః–పవనేన చలితాః శాఖా యేషాం తే తథావిధైః– బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) సరతీతి సలిలమ్. సృ గతౌ. రలయోరభేదః. ప్రవహించునది. సలతీతి సలిలమ్. షల గతౌ. పోవునది. **సలిలం కమలం జలమ్.**

c) **గుణము** :– ప్రసాదగుణము  d) **రీతి :–** వైదర్భి





e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ – మాలినీ వృత్తము.

f) **క్రియాదర్శము :–** విధత్తే– లట్ ప్రథమపురుష ఏకవచనము. వి=ఉపసర్గ.

**ధాతువు :–** డుధాఞ్ (ధా) ధారణ పోషణయోః–ధరించుట, పోషించుట. సకర్మకము (ఉభయ) ఆత్మనేపది. జుహోత్యాది (3) ప్రకరణ ధాతువు. ఇచ్చట ధా+ధా+తే>దా+ధా+తే>దధా+తే>ధత్+తే>ధత్తేగా మారును.

1) ధా ధాతువునకు ద్విరుక్తమైన పిమ్మట బలహీన ప్రత్యయమునకు ముందు తుది దీర్ఘము లోపించును. దధా, దధ్, త్, థ్, స్, ధ్వ అనువానితో ముగియు ప్రత్యయములకు ధత్ అను రూపమును పొందును.
2) దధాతి ధత్తే బిభృతే బిభర్తి భరతీతి చ ..... (ఆఖ్యాతచంద్రికా 2-3-8)

**శ్లో॥ శిరసి వకుళమాలాం మాలతీభిస్సమేతాం**
**వికసితనవపుష్పైర్యూథికాకుట్మలైశ్చ।**
**వికచనవకదమ్బైః కర్ణపూరం వధూనాం**
**రచయతి జలదౌఘః కాన్తవత్కాల ఏషః॥ 24**

**పదవిభాగము:–** శిరసి వకుళమాలామ్ మాలతీభిః+సమేతామ్ వికసితనవపుష్పైః+ యూథికాకుట్మలైః+చ వికచనవకదంబైః కర్ణపూరమ్ వధూనామ్ రచయతి జలద+ఓఘః కాన్తవత్+కాలః+ఏషః.

**అన్వయక్రమము:–** జలద ఓఘః ఏషః కాలః కాన్తవత్ వధూనామ్ శిరసి మాలతీభిః సమేతామ్ వకుళమాలామ్ రచయతి చ వికసిత నవ పుష్పైః యూథికాకుట్మలైః వికచ నవ కదంబైః కర్ణపూరమ్ రచయతి.

**ప్రతిపదార్థము:–** జలద=మేఘముల యొక్క, ఓఘః=సమూహము గల, ఏషః=ఈ, కాలః=కాలము, కాన్తవత్=ప్రియుడువలె, వధూనామ్=స్త్రీల యొక్క, శిరసి= శిరస్సు నందు, మాలతీభిః=జాజిపూవులతో, సమేతామ్=కూడిన, వకుళమాలామ్= పొగడ మాలికను, రచయతి=కూర్చుచున్నది, చ=మరియు, వికసిత=వికసించిన, నవ= క్రొత్త, పుష్పైః=పూవులు గల, యూథికాకుట్మలైః=అడవి మొల్లమొగ్గలతోడను, వికచ= వికసించిన, నవ=క్రొత్త, కదంబైః=కడిమపూలతోను, కర్ణపూరమ్= కర్ణాలంకారమును, రచయతి=కూర్చుచున్నది.

**తాత్పర్యము:–** మేఘసమూహముగల ఈ కాలము (వర్షా) ప్రియుడు వలె స్త్రీల యొక్క శిరస్సు నందు జాజిపూలతో కూడిన పొగడమాలికను కూర్చుచున్నది. వికసించిన క్రొత్త పూవులు గల అడవి మొల్ల మొగ్గలతోడను, కడిమ పూలతోను కర్ణాలంకారమును

కూర్చుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) జలదౌఘః-జలదానామ్ ఓఘః - షష్ఠీతత్పురుషః.
2) వకుళమాలామ్ - వకుళస్య మాలామ్ - షష్ఠీతత్పురుషః.
3) వికసితనవపుష్పైః-వికసితాని నవాని పుష్పాణి యేషు తైః - బహువ్రీహిః
4) యూధికాకుట్మలైః-యూధికాయాః కుట్మలైః - షష్ఠీతత్పురుషః.
5) వికచనవకదంబైః-వికచః చాసౌ నవకదంబః తైః - కర్మధారయః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) ఉచ్యతే రోగమత్తీతి వకుళః. రోగమును బోగొట్టునది. పొగడచెట్టుకు పేరు. **అథ కేసరే వకుళః**
2) కుటతి ఈషత్కుట్మలః. కుట కౌటిల్యే. ఇంచుకంత కుటిలమై యుండునది. **కుట్మలో ముకులో౽స్త్రియామ్.**

c) **గుణము :- మాధుర్య ప్రసాదగుణము** d) **రీతి :- వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము.

f) **అలంకారము :- ఉపమా**

g) **క్రియాదర్శము :-** 'రచయతి' లట్ ప్రథమపురుష ఏకవచనము.

**ధాతువు :- రచ్** ప్రతియత్నే 10వ వికరణ ధాతువు. 'అయ' వికరణ ప్రత్యయము. ఉభయ (పరస్మైపది) చురాదిగణము. తి-లట్ ప్రథమపురుష ఏకవచన తిజ్ ప్రత్యయము. కనుక రచ్+అయ+తి > రచయతి గా మారును.

2) నిర్మిమీతే భావయతి నిర్మాతి **రచయత్యపి.** (ఆఖ్యాతచంద్రికా 2-1-3)

**శ్లో॥ దధతి వరకుచాగ్రైరున్నతైర్హారయష్టిం**
**ప్రతనుసితదుకూలాన్యాయతైః శ్రోణిబిమ్బైః।**
**నవజలకణసేకాదుద్గతాం రోమరాజిం**
**లలితవలివిభఙ్గైర్మధ్యదేశైశ్చ నార్యః॥ 25**

**పదవిభాగము:-** దధతి వరకుచ+అగ్రైః+ఉన్నతైః+హారయష్టిమ్ ప్రతనుసితదుకూలాని + ఆయతైః శ్రోణిబింబైః నవజలకణ సేకాత్+ఉత్+గతామ్ రోమరాజిమ్ లలితవలి విభంగైః+మధ్యదేశైః+చ నార్యః.

**అన్వయక్రమము:-** నార్యః ఉన్నతైః వర కుచాగ్రైః హారయష్టిమ్ ఆయతైః శ్రోణిబింబైః





ప్రతను సిత దుకూలాని లలిత వలి విభంగైః నవ జల కణ సేకాత్ ఉద్గతామ్ రోమరాజిమ్ దధతి.

**ప్రతిపదార్థము:-** నార్యః=స్త్రీలు, ఉన్నతైః=ఎత్తగు, వర=శ్రేష్ఠమైన, కుచ+అగ్రైః=చను మొనల చేత, హారయష్టిమ్=యష్టివంటి హారమును, ఆయతైః=విశాలమగు, శ్రోణిబింబైః =బింబములవంటి పిఱుదులచే, ప్రతను=సన్నని, సిత=తెల్లని, దుకూలాని= పట్టు వస్త్రములను, లలిత=సుందరమైన, వలి=వళుల, విభంగైః=విరుపులచే, నవ=క్రొత్త, జలకణ=నీటి బిందువుల యొక్క, సేకాత్=చల్లుట వలన, ఉద్గతామ్=పులకరించిన, రోమరాజిమ్=నూగారును, దధతి=ధరించుచున్నారు.

**తాత్పర్యము:-** స్త్రీలు ఎత్తగు శ్రేష్ఠమైన చనుమొనలచేత యష్టివంటి హారమును, బింబములవంటి పిఱుదులచేత సన్నని తెల్లని పట్టు వస్త్రములను, సుందరమైన వళుల విరుపులచేత నీటి బిందువులు చల్లుట వలన గగుర్పొడిచిన నూగారును ధరించు చున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-** 1) వరకుచాగ్రైః- వరఃచాసౌ కుచః వరకుచః-కర్మధారయః -వరకుచానామ్ అగ్రైః-వరకుచాగ్రైః-షష్ఠీతత్పురుషః.

2) శ్రోణిబింబైః-శ్రోణీనామ్ బింబైః-షష్ఠీతత్పురుషః.
3) ప్రతనుసితదుకూలాని - సితాని చేమాని దుకూలాని - సితదుకూలాని - కర్మధారయః-ప్రతనూని చేమాని - ప్రతనుసితదుకూలాని - కర్మధారయః
4) మధ్యదేశైః-మధ్యశ్చాసౌ దేశః-మధ్యదేశైః-కర్మధారయః.
5) లలితవలివిభంగైః-లలితాశ్చేమా వలయః-లలిత వలయః-కర్మధారయః -తాసాం విభంగైః-లలితవలివిభంగైః-షష్ఠీతత్పురుషః.
6) నవజలకణసేకాత్ - నవాశ్చేమాః జలకణాః-నవజలకణాః-కర్మధారయః -తేషాం సేకాత్-నవజలకణసేకాత్-షష్ఠీతత్పురుషః.
7) రోమరాజిమ్-రోమాణామ్ రాజిమ్ - రోమరాజిమ్ - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) కుచయో రగ్రం కుచాగ్రం. కుచముల యొక్క అగ్రము. **చూచుకం తు కుచాగ్రం స్యాత్.**

c) **గుణము :- మాధుర్య ప్రసాదములు** d) **రీతి :- పాఞ్చాలి**

e) **ఛందస్సు - వృత్తము:-** 'అతిశక్వరీ ఛందస్సు' - మాలినీ వృత్తము.

f) **క్రియాదర్శము :-** దధతి-లట్ ప్రథమపురుషబహువచనము. పరస్మైపది.

ధాతువివరములు పూర్వము చెప్పబడినవి.

**శ్లో॥ నవజలకణసఙ్గాచ్ఛీతతామాదధానః**
**కుసుమభరనతానాం లాసకః పాదపానామ్।**
**జనితరుచిరగన్ధః కేతకీనాం రజోభిః**
**పరిహరతి నభస్వాన్ ప్రోషితానాం మనాంసి॥26**

**పదవిభాగము:-** నవజలకణసంగాత్+శీతతామ్+ఆదధానః కుసుమభరనతానామ్ లాసకః పాదపానామ్ జనితరుచిరగన్ధః కేతకీనామ్ రజోభిః పరిహరతి నభస్వాన్ ప్రోషితానామ్ మనాంసి.

**అన్వయక్రమము:-** నవ జల కణ సంగాత్ శీతతామ్ ఆదధానః కుసుమ భర నతానామ్ పాదపానామ్ లాసకః కేతకీనామ్ రజోభిః జనిత రుచిర గంధః నభస్వాన్ ప్రోషితానామ్ మనాంసి పరిహరతి.

**ప్రతిపదార్థము:-** నవ=క్రొత్త, జల=నీటి, కణ=బిందువుల, సంగాత్=సంబంధము వలన, శీతతామ్=చల్లదనమును, ఆదధానః=స్వీకరించుచున్న, కుసుమ=పూవుల యొక్క, భర=బరువుచే, నతానామ్=వంగిన, పాదపానామ్=చెట్లకు, లాసకఃకదల్చు చుండు, కేతకీనామ్=మొగలిపూవుల యొక్క, రజోభిః=పరాగములచే, జనిత=జనించిన, రుచిర= మనోహరమగు, గంధః=వాసన కలిగిన, నభస్వాన్=వాయువు, ప్రోషితానామ్= బాటసారుల, మనాంసి=మనస్సులను, పరిహరతి= చెదరగొట్టు చున్నది.

**తాత్పర్యము:-** నీటి బిందువుల సంబంధము వలన చల్లదనమును పొందిన పూవుల బరువుచే వంగిన చెట్లను కదల్చు వాయువు, మొగలిపూవుల పరాగములచే జనించిన పరిమళము, బాటసారుల మనస్సులను చెదరగొట్టుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) నవజలకణసంగాత్ - నవశ్చాసౌ జలకణః - నవజలకణః-కర్మధారయః- తస్య సంగాత్ - షష్ఠీతత్పురుషః.
2) కుసుమభరనతానామ్-కుసుమానాం భరః కుసుమభరః-షష్ఠీతత్పురుషః-తేన నతానామ్- తృతీయాతత్పురుషః.
3) జనితరుచిరగన్ధః - జనితః రుచిరః గంధో యస్మిన్నసౌ-బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) నభః కారణత్వాన్నభోఽస్యాస్తీతి నభస్వాన్. ఆకాశము ఉత్పత్తి స్థానముగా గలవాడు. **నభస్వ ద్వాత పవన పవమాన ప్రభఞ్జనాః.**
2) పాదైర్మూలైః జలం పిబతీతి పాదపః. పా పానే. పాదములనగా వేళ్ళు. వానిచే





జలమును బానము చేయునది. **వృక్షో మహీరుహ శ్శాఖీ విటపీ పాదప స్తరుః**

c) **గుణము** :- మాధుర్యం d) **రీతి** :- వైదర్భి

e) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము.

f) **క్రియాదర్శమ్:-**పరిహరతి. పరి - ఉపసర్గ. హరతి - లట్ ప్రథమపురుషైకవచనం, పరస్మైపది. ధాతు వివరములకై '8'వ శ్లోక భాగము చూడదగును.

**శ్లో॥ జలభరవినతానామాశ్రయోఽస్మాకముచ్చై**
**రయమితి జలసేకైస్తోయదాస్తోయనమ్రాః।**
**అతిశయపరుషాభిర్గ్రీష్మవహ్నేః శిఖాభిః**
**సముపజనితతాపం హ్లాదయన్తీవ విన్ధ్యమ్॥ 27**

**పదవిభాగము:-** జలభరవినతానామ్+ఆశ్రయః+అస్మాకమ్+ఉచ్చైః+అయమ్+ఇతి జలసేకైః+తోయదాః+తోయనమ్రాః అతిశయపరుషాభిః+గ్రీష్మవహ్నేః శిఖాభిః సముప జనితతాపమ్ హ్లాదయన్తి+ఇవ విన్ధ్యమ్.

**అన్వయక్రమము:-** తోయ నమ్రాః తోయదాః అయమ్ జలభర వినతానామ్ అస్మాకమ్ ఉచ్చైః ఆశ్రయః ఇతి అతిశయపరుషాభిః గ్రీష్మవహ్నేః శిఖాభిః సముపజనిత తాపమ్ వింధ్యమ్ జలసేకైః హ్లాదయన్తి+ఇవ.

**ప్రతిపదార్థము:-** తోయ=నీటిచే, నమ్రాః=వంగిన, తోయదాః=మేఘములు, అయమ్ =ఇతడు, జలభర=జలముల బరువుచే, వినతానామ్=వంగిపోయిన, అస్మాకమ్ =మనకు, ఉచ్చైః=ఉన్నతమగు, ఆశ్రయః=ఆశ్రయుడు, ఇతి=అని, అతిశయ=మిగుల, పరుషాభిః =కఠినములగు, గ్రీష్మవహ్నేః=గ్రీష్మపు ఎండ యొక్క, శిఖాభిః=జ్వాలలచే, సముపజనిత=జనించిన, తాపమ్=తాపము గల, వింధ్యమ్=వింధ్య పర్వతమును, జలసేకైః=నీటితో తడుపుటచే, హ్లాదయన్తి+ఇవ = సంతోషపెట్టుచున్నట్లున్నవి.

**తాత్పర్యము:-** జలము బరువుచే వంగిన మేఘములు ఇతడు మనకు ఉన్నతమగు ఆశ్రయుడని, మిగుల కఠినములగు గ్రీష్మపు ఎండయొక్క జ్వాలలచే పుట్టిన తాపము గల వింధ్యపర్వతమును నీటిధారలతో / అభిషేకములతో సంతోష పెట్టుచున్నట్లున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) జలభరవినతానామ్-జలస్య భరః, జలభరః-షష్ఠీతత్పురుషః తేన వినతానామ్ - తృతీయాతత్పురుషః.
2) తోయనమ్రాః-తోయేన నమ్రాః-తృతీయాతత్పురుషః.
3) గ్రీష్మవహ్నేః-గ్రీష్మస్య వహ్నేః-షష్ఠీతత్పురుషః.

4) సముపజనితతాపమ్–సముపజనితః తాపః యస్మిన్నసౌ తథావిధమ్ – బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శాఖతే వ్యాప్నోతీతి శిఖా. శాఖృ–వ్యాప్తౌ–వ్యాపించునది. **వహ్నేర్ద్వయో ర్జ్వాలకీలా వర్చిర్హేతి శ్శిఖాస్త్రియామ్.**

2) జలస్య ధరః జలధరః–జలమును ధరించునది. **ధారాధరో జలధర స్తటిత్వా న్వారిదోఽ మ్బుభృత్.**

c) **గుణము** :– ప్రసాదగుణము d) **రీతి :–** వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు–మాలినీవృత్తము.

f) **క్రియాదర్శము :–** హ్లాదయన్తి – లట్ ప్రథమపురుషబహువచనము.

**ధాతువు:–** హ్లాద్–ఇంపుగ బల్కుట, సంతోషించుట–అకర్మక క్రియ. ఆత్మనేపది. భ్వాదిప్రకరణ (1) ధాతువు. ప్రేరణార్థకమున పరస్మైపదరూపము నొందినది. ప్రత్యయము 'అయ'. అంతి – లట్ ప్రథమపురుష బహువచన తిఙ్ ప్రత్యయము కనుక హ్లాద్+ అయ + అన్తి > హ్లాదయ + అన్తి > హ్లాదయన్తి గా మారును.

**శ్లో॥ బహుగుణరమణీయః కామినీచిత్తహారీ**
**తరువిటపలతానాం బాన్ధవో నిర్వికారః।**
**జలదసమయ ఏష ప్రాణినాం ప్రాణభూతో**
**దిశతు తవ హితాని ప్రాయశో వాఞ్ఛితాని॥ 28**

**పదవిభాగము:–** బహుగుణరమణీయః కామినీచిత్తహారీ తరు విటప లతానామ్ బాంధవః నిర్వికారః జలదసమయః ఏషః ప్రాణినామ్ ప్రాణభూతః దిశతు తవ హితాని ప్రాయశః వాంఛితాని.

**అన్వయక్రమము:–** బహుగుణ రమణీయః కామినీ చిత్తహారీ తరు విటప లతానామ్ బాంధవః నిర్వికారః ప్రాణినామ్ ప్రాణభూతః ఏషః జలదసమయః తవ హితాని వాంఛితాని ప్రాయశః దిశతు.

**ప్రతిపదార్థము:–** బహుగుణ=అనేక గుణములచే, రమణీయః=రమణీయమైనది, కామినీ =కాముకురాండ్ర, చిత్తహారీ=మనస్సును హరించునదియు, తరు=చెట్ల యొక్క, విటప =కొమ్మలకును, లతానామ్=తీగలకును, బాంధవః=బంధువగునదియు, నిర్వికారః =వికారములు లేని, ప్రాణినామ్=జంతువులకు, ప్రాణభూతః=ప్రాణాధార మగు, ఏషః =ఈ, జలదసమయః=వర్షర్తువు, తవ=నీకు, హితాని=హితములగు, వాంఛితాని=కోరిక





లను, ప్రాయశః=తరచుగా, దిశతు=ఇచ్చుగాక.

**తాత్పర్యము:–** ఓ ప్రేయసీ అనేక గుణములచే రమణీయమైనది, కాముకురాండ్ర మనస్సును హరించునదియు, చెట్ల కొమ్మలకు, తీగలకు బంధువైనదియు, జంతువులకు ప్రాణాధారమగు ఈ వర్షర్తువు నీకు హితములగు కోరికలను తరచుగా ఇచ్చుగాక.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) బహుగుణరమణీయః–బహుభిః గుణైః రమణీయః–తృతీయాతత్పురుషః.

2) కామినీచిత్తహారీ – కామినీనాం చిత్తహారీ–షష్ఠీతత్పురుషః.

3) తరువిటపలతానామ్–తరుఃచ విటపశ్చ లతా చ తాసామ్–ద్వంద్వసమాసః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) బధ్నాతి ప్రీతిమితి–బన్ధుః. బన్ధురేవ బాంధవః. ప్రీతిని బొందించువాడు. **సగోత్ర బాంధవ జ్ఞాతి బన్ధు స్వ స్వజనా స్సమాః.**

c) **గుణము** :– **ప్రసాదగుణము, మాధుర్యము**

d) **రీతి** :– వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు–మాలినీవృత్తము

f) **క్రియాదర్శము :–** 'దిశతు' – లోట్ ప్రథమపురుష ఏకవచనము.

**ధాతువు :– దిశ్**–ఇచ్చుట. ఉభయపది. తుదాది (6)వ ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. లోట్ ప్రథమపురుషఏకవచన తిఙ్ ప్రత్యయము తు. కనుక దిశ్+అ+తు > దిశతు గా మారును.

2) సనోతి దాసతి దిశత్యాత్మనే సప్త యచ్ఛతి (ఆఖ్యాతచంద్రికా 2-2-11)

**శ్రీః**

శ్రీః

మహాకవి కాళిదాస విరచితః

# ఋతుసంహారః

## శరద్వర్ణనం నామ తృతీయః సర్గః

**అవతారిక :** అథ క్రమప్రాప్తం శరత్కాలం వర్ణయతి

**శ్లో॥ కాశాంశుకా వికచపద్మమనోజ్ఞవక్త్రా**
**సోన్మాదహంసరవనూపురనాదరమ్యా।**
**ఆపక్వశాలిలలితానతగాత్రయష్టిః**
**ప్రాప్తా శరన్నవవధూరివ రూపరమ్యా॥ 1**

**పదవిభాగము:–** కాశ+అంశుకా వికచపద్మమనోజ్ఞవక్త్రా స+ఉన్మాదహంసరవ నూపుర నాదరమ్యా ఆపక్వశాలిలలిత+ఆనతగాత్రయష్టిః ప్రాప్తా శరత్+నవవధూః +ఇవ రూపరమ్యా.

**అన్వయక్రమము:–** కాశ అంశుకా వికచ పద్మ మనోజ్ఞ వక్త్రా స+ఉన్మాద హంస రవ రమ్యా నూపురనాద ఆపక్వ శాలి లలిత ఆనత గాత్రయష్టిః రూపరమ్యా శరత్ నవ వధూరివ ప్రాప్తా.

**ప్రతిపదార్థము:–** కాశ=తెల్లే, అంశుకా=వస్త్రముగా కలిగినదియు, వికచ=వికసించిన, పద్మ=తామరయే, మనోజ్ఞ=మనోహరమగు, వక్త్రా=ముఖముగాగలదియు, స+ఉన్మాద= మదముతోకూడిన, హంస=హంసయొక్క, రవ=ధ్వనియే, రమ్యా= రమ్యమైన, నూపుర నాద=అందెల చప్పుడుగా కలదియు, ఆపక్వ=ఇంచుకంత పండిన, శాలి=వరియొక్క (వరికాడ), లలిత=సౌందర్యమే, ఆనత=వంగిన, గాత్రయష్టిః= అంగయష్టిగా కలదియు, రూపరమ్యా=రూపముచే రమ్యముగా నుండు, శరత్= శరదృతువు, నవ=క్రొత్త, వధూరివ =పెండ్లికూతురు వలె, ప్రాప్తా=వచ్చినది.

**తాత్పర్యము:–** తెల్లే వస్త్రముగా గలదియు, వికసించిన తామరయే మనోహరమగు ముఖముగా గలదియు, మదముతో కూడ హంసయొక్క ధ్వనియే రమ్యమైన అందెల చప్పుడుగా కలదియు, ఇంచుకంత పండిన వరియే మనోహరంగా వంగిన శరీరముగా కలదియునైన శరదృతువు రూపముచే రమ్యముగా నుండి క్రొత్త పెండ్లి కూతురు వలె వచ్చినది.





**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కాశాంశుకా : కాశ ఏవ అంశుకో యస్యాః సా – బహువ్రీహిః.
2) వికచ.... వక్త్రా–వికచాని పద్మాని ఏవ మనోజ్ఞం వక్త్రం యస్యాః సా – బహువ్రీహిః.
3) సో...... రమ్యా – సోన్మాదాశ్చేమే హంసాః సోన్మాదహంసాః – కర్మధారయః తేషాం రవ ఏవ నూపురనాదః తేన రమ్యా యా సా తథావిధా – తృతీయా తత్పురుషః
4) ఆపక్వశాలిలలితానతగాత్రయష్టిః – ఆపక్వశాలినాం లలితమ్ అపక్వశాలి లలితమ్ – షష్ఠీతత్పురుషః – ఆపక్వశాలిలలితమేవ ఆనత గాత్రయష్టిః యస్యాస్సా – బహువ్రీహిః
5) రూపరమ్యా – రూపేణ రమ్యా – తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కాశత ఇతి కాశం కాశృ దీప్తౌ ప్రకాశించునది.
2) నూయతే నూపురః. ణు స్తుతౌ. స్తోత్రము చేయబడునది. **పాదాంగదం తులా కోటి ర్మంజీరో నూపురోऽ స్త్రియామ్.**
3) ఉన్మాద్యతే అనేనే త్యున్మాదః. మదీహర్షగ్లేపనయోః. దీని చేత మదించును. **ఉన్మాద శ్చిత్తవిభ్రమః.**

c) **గుణము :– మాధుర్య ప్రసాదగుణములు** d) **రీతి :– వైదర్భి**

e) **అలంకారము :–** రూపకము, విశేషణములతో రూపకాలంకారము గలదు. **లక్షణము:** 'రూపకం రూపితారోపో విషయే నిరుపహ్నవే' అని 'సాహిత్య దర్పణము'. 'శరదృతువును నూతన పెండ్లి కూతురుతో పోల్చి వర్ణించి చెప్పుటలో నిట ఉపమా రూపకాలంకారములున్నవని చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – వసంతతిలకావృత్తము

1) శక్వరీ ఛందస్సున ప్రతిపాదమున 14 అక్షరములుండును.
2) 'జ్ఞేయా వసన్తతిలకా తభజా జగౌగః' అని లక్షణము.
3) గణములు త, భ, జ, జ, గ, గ 4) యతి (8,6)

| ఉదా: | కాశాంశు | కా వి క | చ ప ద్మ | మ నోజ్ఞ | వ క్త్రా |
|---|---|---|---|---|---|
| | U U I | U I I | I U I | I U I | U U |
| | త | భ | జ | జ | గ గ |

g) **క్రియాదర్శము :–** 'ప్రాప్తా'–'క్త' ప్రత్యయాంతము. స్త్రీలింగ ప్రథమావిభక్తి ఏకవచన రూపము. ప్ర = ఉపసర్గ.

**ధాతువు :– ఆప్** వ్యాప్తౌ, వ్యాపించుట – ఐదవ వికరణ ధాతువు. పరస్మైపది. ఇచట ప్ర+ఆప్ అను ధాతువునకు 'త' ప్రత్యయాంతము చేర్చుటచే ప్ర+ఆప్+త =ప్రాప్త గా మారును. నామవాచక రూపమున మూడు లింగములలోనికి మారును. ప్రాప్తః (పుంలిం.) – ప్రాప్తా (స్త్రీలిం.) ప్రాప్తమ్ (నపుంలిం.)

**శ్లో॥ కాశైర్మహీ శిశిరదీధితినా రజన్యో**
**హంసైర్జలాని సరితాం కుముదైః సరాంసి।**
**సప్తచ్ఛదైః కుసుమభారనతైర్వనాన్తాః**
**శుక్లీకృతాన్యుపవనాని చ మాలతీభిః ॥ 2**

**పదవిభాగము:–** కాశైః+మహీ శిశిరదీధితినా రజన్యః హంసైః+జలాని సరితాం కుముదైః సరాంసి సప్తచ్ఛదైః కుసుమభారనతైః+వనాన్తాః శుక్లీకృతాని+ఉపవనాని చ మాలతీభిః

**అన్వయక్రమము:–** కాశైః మహీ శిశిరదీధితినా రజన్యః హంసైః సరితామ్ జలాని కుముదైః సరాంసి కుసుమ భార నతైః సప్తచ్ఛదైః వనాన్తాః మాలతీభిః ఉపవనాని శుక్లీకృతాని.

**ప్రతిపదార్థము:–** కాశైః=తెల్లుపుష్పములచే, మహీ=భూమియును, శిశిర దీధితినా= చంద్రునిచే, రజన్యః=రాత్రులును, హంసైః=హంసలచే, సరితామ్=నదుల యొక్క జలాని=జలములును, కుముదైః=కలువలచే, సరాంసి=సరస్సులును, కుసుమ=పూవుల యొక్క, భార=భారముచే, నతైః=వంగిన, సప్తచ్ఛదైః=ఏడాకుల అరటి చెట్లచేత, వనాన్తాః =అరణ్య ప్రాంతములును, మాలతీభిః=జాజులచే, ఉపవనాని=తోటలును, శుక్లీకృతాని =తెల్లగా చేయబడినవి.

**తాత్పర్యము:–** తెల్లు పుష్పములచే భూమియు, చంద్రునిచే రాత్రులును, హంసలచే నదీజలములను, కలువలచే సరస్సులును, పూల భారముచే వంగిన అరటి చెట్లచే అరణ్యప్రాంతములును, జాజులచే తోటలును, తెల్లగా చేయబడినవి. (శరదృతువున).

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) శిశిరదీధితినా – శిశిరా దీధితిర్యస్యాసౌ తేన – బహువ్రీహిః.

2) కుసుమభారనతైః – కుసుమానాం భారః – కుసుమభారః – షష్ఠీతత్పురుషః – తేన నతైః – తృతీయాతత్పురుషః.





b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శినోత్యంగం శీతేన శిశిరః. శీఙ్ నిశానే. శీతముచేత దేహము నల్పముగా జేయునది. మాఘ ఫాల్గున మాసములతో గూడిన ఋతువుపేరు. **'శిశిరో ఉ స్త్రియామ్'.**

2) మహ్యతే మహీ. మహ పూజాయాం. పూజింపబడునది. **గోత్రా కుః పృథివీ పృథ్వీక్ష్మా ఉ వని ర్మేదినీ మహీ.**

c) **గుణము :–** **మాధుర్య ప్రసాదగుణములు**

d) **రీతి :–** **వైదర్భి**

e) **అలంకారము : 'స్వభావోక్తి'.**

**లక్షణము:** 'స్వభావోక్తి స్స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్' అని చంద్రాలోకము. జాత్యాదులని యనగా జాతి గుణక్రియాదులని భావము. స్వభావవర్ణనమని యనగా యథాతథవర్ణనమని భావము. ఇందు శరదృతువు నాటి ప్రకృతిని యథాతథముగ వర్ణించుటచే నిట స్వభావోక్త్యాలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – వసంతతిలకావృత్తము

g) **క్రియాదర్శమ్ :–** 'కృతాని' – 'క్త' ప్రత్యయాంతము. నామవాచక రూపమున నపుంసక లింగ ద్వితీయా విభక్తి బహువచనరూపము.

**ధాతువు :–** కృ. 'క్త' ప్రత్యయాంతమున కృ+త = కృతగా మారును. నామవాచక రూపమున మూడు లింగములలోనికి మారును.

కృతః (పుం.లి.) – కృతా (స్త్రీ. లిం.) – **కృతమ్** (నపుం.లిం.).

**శ్లో॥ చఞ్చన్మనోజ్ఞశఫరీరశనాకలాపాః**
**పర్యన్తసంస్థితసితాణ్డజపఙ్క్తిహారాః।**
**నద్యో విశాలపులినాన్తనితమ్బబిమ్బా**
**మన్దం ప్రయాన్తి సమదాః ప్రమదా ఇవాద్య॥ 3**

**పదవిభాగము:–** చంచత్+మనోజ్ఞశఫరీరశనాకలాపాః పర్యన్తసంస్థితసిత+అండజ పంక్తి హారాః నద్యః విశాలపులినాన్తనితంబబింబాః మందం ప్రయాన్తి సమదాః ప్రమదాః ఇవ+అద్య.

**అన్వయక్రమము:–** అద్య చంచత్ మనోజ్ఞ శఫరీ రశనా కలాపాః పర్యన్త సంస్థిత సిత అండజ పంక్తి హారాః విశాల పులినాంత నితంబబింబాః నద్యః సమదాః ప్రమదాః ఇవ మందం ప్రయాన్తి.

**ప్రతిపదార్థము:–** అద్య=ఇప్పుడు(ఈ శరదృతువున), చంచత్=కదలుచున్న, మనోజ్ఞ=సుందరమగు, శఫరీ=చేపలనెడు, రశనా=మొలనూళ్ళయొక్క కలాపాః=పంక్తులు గలవియు, పర్యన్త=దగ్గరలో, సంస్థిత=కూర్చొని యున్న, సిత=తెల్లని, అండజ=మీ పక్షుల యొక్క, పంక్తి=వరుసలే, హారాః=హారముగా గలవియు, విశాల=విశాలమగు, పులినాంత=ఇసుక తిన్నెలే, నితంబబింబాః=పిఱుదులుగా గలవియు అగు నద్యః=నదులు, సమదాః=మదముతో కూడిన, ప్రమదాఃఇవ= సుందరీ మణులవలె, మందమ్ =నెమ్మదిగా, ప్రయాన్తి=పోవుచున్నవి.

**తాత్పర్యము:–** ఈ శరత్కాలమున కదలుచుండుట వలన మనోహరమగు చేపలనెడు మొలనూళ్ళ పంక్తులు గల, దగ్గరగా కూర్చొనియున్న తెల్లని పక్షుల యొక్క వరుసయే హారముగా గల, విశాలమగు ఇసుకతిన్నెలే పిఱుదులుగాగల నదులు మదముతో కూడిన సుందరీమణులవలె నెమ్మదిగా పోవుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) చంచత్...... కలాపాః – మనోజ్ఞాశ్చైతాః శఫర్యః మనోజ్ఞశఫర్యః – కర్మధారయః– చంచన్త్యశ్చ తాః మనోజ్ఞశఫర్యః చంచన్మనోజ్ఞశఫర్యః – కర్మధారయః – చంచన్మనోజ్ఞశఫర్య ఏవ రశనాకలాపాః యాసాం – తాః – బహువ్రీహిః

2) పర్యన్త...... హారాః – పర్యన్తే సంస్థితాః – పర్యన్తసంస్థితాః – సప్తమీతత్పురుషః పర్యన్తసంస్థితాః సితాండజాః – పర్యన్తసంస్థితసితాణ్డజాః – కర్మధారయః, తేషాం పంక్తిరేవ హారో యాసాం తాః – బహువ్రీహిః.

3) విశాల.... బింబాః – విశాలాశ్చ తే పులినాంతాః – విశాలపులినాన్తాః – కర్మధారయః – విశాలపులినాన్తా ఏవ నితంబబింబాః యాసాం తాః – బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శఫాన్ గతిసాధనావయవాన్ రిణాతి పీడయతీతి శఫరీ. శఫములనగా గొరిసెలు వానిని శీఘ్రగమనము చేత బీడించునది. **ప్రోష్ఠీతు శఫరీ ద్వయోః**

2) మాద్యతే నేనేతి మదః. మదీ హర్ష గ్లేపనయోః. దీని చేత మదించును. **'మదో దానమ్'.**

c) **గుణము :– మాధుర్యము** d) **రీతి :– వైదర్భి**

e) **అలంకారము: రూపక** లక్షణము 1వ శ్లోక భాగమున చెప్పబడినది. విశేషణము లందు రూపకముతో నదులును సుందరీమణులుగా పోల్చి వర్ణించుటచే నిట ఉపమా, రూపకాలంకారములున్నవని చెప్పదగును.





f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – వసంతతిలకావృత్తము

g) **క్రియాదర్శము :–** 'ప్రయాన్తి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. ప్ర = ఉపసర్గ.

**ధాతువు :–** యా. ధాతువు వివరములు మొదటి సర్గలోని శ్లోక భాగమున చెప్పబడినవి.

**శ్లో॥ వ్యోమ క్వచిద్రజతశఙ్ఖమృణాలగౌరై**
**స్త్యక్తామ్బుభిర్లఘుతయా శతశః ప్రయాతైః।**
**సంలక్ష్యతే పవనవేగచలైః పయోదై**
**రాజేవ చామరవరైరుపవీజ్యమానః॥** 4

**పదవిభాగము:–** వ్యోమ క్వచిత్+రజతశంఖమృణాలగౌరైః+త్యక్త+అమ్బుభిః+లఘుతయా శతశః ప్రయాతైః సంలక్ష్యతే పవనవేగచలైః పయోదైః రాజా+ఇవ చామర వరైః+ఉపవీజ్యమానః.

**అన్వయక్రమము:–** వ్యోమ క్వచిత్ రజత శంఖ మృణాల గౌరైః త్యక్త అమ్బుభిః లఘుతయా శతశః ప్రయాతైః పవన వేగ చలైః పయోదైః చామరవరైః ఉపవీజ్యమానః రాజేవ సంలక్ష్యతే.

**ప్రతిపదార్థము:–** వ్యోమ=ఆకాశము, క్వచిత్=ఒకచోట, రజత=వెండివలె, శంఖ = శంఖమువలె, మృణాల=తామరకాడవలె, గౌరైః=తెల్లనైనవియు, త్యక్త=విడవబడిన, అమ్బుభిః=నీరుగలవియు, లఘుతయా=తేలికతనముతో, శతశః=వందలకొలదిగ, ప్రయాతైః=విడిపోయినవియు, పవన=గాలి యొక్క, వేగ=తాకిడిచే, చలైః= కదలుచుండు, పయోదైః=మేఘములచే, చామరవరైః=శ్రేష్ఠమైన చామరములచే, ఉపవీజ్యమానః =వీచబడుచున్న, రాజేవ=రాజువలె, సంలక్ష్యతే=కనబడుచున్నది.

**తాత్పర్యము:–** ఆకాశము ఒకచోట వెండి, శంఖము, తామరకాడవలె తెల్లనైనవియు, విడవబడిన నీటిని కలిగినవియు, తేలికతనముతో వందలకొదిగ విడిపోయినవియు గాలి తాకిడిచే కదలుచుండు మేఘములచే శ్రేష్ఠమైన చామరములచే వీచబడుచున్న రాజువలె (శరదృతువు) కనబడుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) రజత ...... గౌరైః – రజతఇచ్చ, శఙ్ఖఇచ్చ, మృణాలఇచ్చ రజతశంఖమృణాలాని తద్వద్గౌరైః – కర్మధారయః

2) త్యక్తామ్బుభిః – త్యక్తాని అంబూని యైః తైః – బహువ్రీహిః.

3) పవనవేగచలైః – పవనస్య వేగః పవనవేగః – షష్ఠీతత్పురుషః – తేన చలైః – పవనవేగచలైః – తృతీయాతత్పురుషః.
4) చామరవరైః – చామరేషు వరైః – సప్తమీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**
1) మృణ్యతే భక్ష్యత ఇతి మృణాళమ్. మృణ హింసాయామ్. భక్షింపబడునది. **'మృణాళం బిసం'.**
2) చమర మృగసంబంధి చామరం–చమరమృగసంబంధమైనది **'చామరం తు ప్రకీర్ణకమ్'.**

c) **గుణము** :– ప్రసాదము d) **రీతి** :– వైదర్భి

e) **అలంకారము : 'ఉపమా'**
**లక్షణము:** 'సామ్యం వాచ్యమవైషమ్యం వాక్యైక్యే ఉపమా ద్వయోః' అని సాహిత్యదర్పణము. ఇందు ఆకాశము రాజుతో పోల్చి వర్ణింపబడుటచే నిట ఉపమాలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము :–** సంలక్ష్యతే – ఆత్మనేపది. లట్ ప్రథమపురుషైకవచనము. సం=ఉపసర్గ. లక్ష్ – ఆలోచనే, దర్శనాంకనయోః, ఉభయపది, (చురాది) 10వ వికరణ ధాతువు. ఆత్మనేపది. ఈ ధాతువునకు 'య' అనే కర్మార్థప్రత్యయము చేర్చుటచే లక్ష్+య>లక్ష్యగా మారును. దీనికి లట్ ప్రథమపురుష ఏకవచన ఆత్మనేపది తిఙ్ ప్రత్యయమైన తే చేర్చుటచే లక్ష్య+తే > లక్ష్యతేగా మారును. కర్మణి ప్రయోగము.

**శ్లో॥ భిన్నాఞ్జనప్రచయకాన్తి నభో మనోజ్ఞం**
**బన్ధూకపుష్పరచితారుణతా చ భూమిః।**
**వప్రాశ్చ చారుకమలావృతభూమిభాగాః**
**ప్రోత్కణ్ఠయన్తి న మనో భువి కస్య యూనః॥ 5**

**పదవిభాగము:–** భిన్న+అంజనప్రచయకాన్తి నభః మనోజ్ఞం బంధూకపుష్పరచిత+ అరుణతా చ భూమిః వప్రాః+చ చారుకమల+ఆవృతభూమిభాగాః ప్రోత్కణ్ఠయన్తి న మనః భువి కస్య యూనః.

**అన్వయక్రమము:–** భిన్న అంజన ప్రచయ కాన్తి మనోజ్ఞం నభః బంధూకపుష్ప రచిత అరుణతా భూమిః చ చారు కమల ఆవృత భూమిభాగాః వప్రాశ్చ భువి కస్య యూనః మనః న ప్రోత్కణ్ఠయన్తి.





**ప్రతిపదార్థము:–** భిన్న=నూరబడిన, అంజన=కాటుక యొక్క ప్రచయ=ముద్దయొక్క కాన్తి =కాంతివంటి కాంతిగలదియు, మనోజ్ఞమ్=అందమగు, నభః=ఆకాశమును, బంధూక పుష్ప=మంకెన పూలచే, రచిత=నిర్మింపబడిన, అరుణతా=ఎఱుపుకలిగిన, భూమిశ్చ =భూమియును, చారు=సుందరములైన, కమల=కమలములతో, ఆవృత= చుట్టబడిన, భూమిభాగాః=భూప్రాంతములు కలిగిన, వప్రాశ్చ=కొండదిగువ ప్రాంతములును, భువి= భూమియందు, కస్య=ఏ, యూనః=యువకుని యొక్క, మనః =మనస్సును, న ప్రోత్కణ్ఠయన్తి= ఉత్కంఠపఱచు చుండుటలేదు.

**తాత్పర్యము:–** నూరబడిన కాటుక ముద్ద యొక్క కాంతివంటి కాంతి గల అందమగు ఆకాశమును, మంకెన పూలచే నిర్మింపబడిన ఎఱుపు కలిగిన భూమియును, అందమైన కమలములతో చుట్టబడిన కొండ దిగువ భాగములును; భూమి యందు ఏ యువకుని మనస్సును ఉత్కంఠ పఱచుచుండుటలేదు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**
1) భిన్నాంజన........ కాన్తి–భిన్నఞ్చ తదఞ్జనమ్ – భిన్నాంజనమ్ – కర్మధారయః – తస్య ప్రచయః– భిన్నాంజనప్రచయః–షష్ఠీతత్పురుషః–తస్య కాన్తిరివ కాన్తిర్యస్య తత్–బహువ్రీహిః.
2) బంధూక ..... రచితా – బంధూకస్య పుష్పాణి–షష్ఠీతత్పురుషః–తైః రచితా–బంధూకపుష్పరచితా–తృతీయాతత్పురుషః
3) చారు ... భాగాః–చారూణి చ తాని కమలాని–చారుకమలాని– కర్మధారయః –తై ఆవృతాః భూమిభాగాః యేషాం తే–బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**
1) ఉప్యతే ప్రాకారోఽత్ర వప్రః. టువప్ బీజసంతానే. దీనియందు ప్రాకారము పాతబడును. **'స్యాచ్చయో వప్రమస్త్రియామ్'.**
2) సుకుమారత్వాత్ బధ్నాతి చిత్తం బన్ధూకః. బంధ బంధనే. సుకుమారమౌట వలన మనస్సులు బంధించునది. **'రక్తకస్తు బంధూకో బన్ధుజీవకః'.**

c) **గుణము** :– ప్రసాదము d) **రీతి** :– వైదర్భి

e) **అలంకారము :– 'స్వభావోక్తి'** లక్షణము '2' వ శ్లోకభాగమున చూడదగును. ఇందు 'శరదృతుశోభను' యథాతథముగా వర్ణింపబడుటచే నిట స్వభావోక్త్య లంకారమున్నదని చెప్పబడును.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము– ప్రోత్కణ్ఠయన్తి :–** పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. ప్ర మరియు ఉత్ = ఉపసర్గలు.

**ధాతువు: కఠి** – శోకే, ప్రాయేణ ఉత్పూర్వోఽయముత్కణ్ఠాయామ్. 10వ వికరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అయ' చురాది గణము. లట్ ప్రథమపురుష బహువచన ఝిజ్ ప్రత్యయము అన్తి; కఠి+అయ+అన్తి > కంఠ్+అయ+అన్తి > కంఠయ+అన్తి > కంఠయన్తిగా మారును.

2) ప్రతిజానాతి చోత్కణ్ఠత్యుత్కణ్ఠయతి మణ్ఠతే (ఆఖ్యాతచంద్రికా 1-2-20)

**శ్లో॥ మన్దానిలాకులితచారుతరాగ్రశాఖః**
**పుష్పోద్గమప్రచయకోమలపల్లవాగ్రః।**
**మత్తద్విరేఫపరిపీతమధుప్రసేక**
**శ్చిత్తం విదారయతి కస్య న కోవిదారః॥ 6**

**పదవిభాగము:–** మంద+అనిల+ఆకులితచారుతర+అగ్రశాఖః పుష్ప+ఉద్గమప్రచయ కోమలపల్లవ+అగ్రః మత్తద్విరేఫపరిపీతమధుప్రసేకః+చిత్తం విదారయతి కస్య న కోవిదారః.

**అన్వయక్రమము:–** మంద అనిల ఆకులిత చారుతర అగ్రశాఖః పుష్ప ఉద్గమ ప్రచయ కోమల పల్లవ అగ్రః మత్త ద్విరేఫ పరిపీత మధు ప్రసేకః కోవిదారః కస్య చిత్తమ్ న విదారయతి.

**ప్రతిపదార్థము:–** మంద=మెల్లనైన, అనిల=గాలిచే, ఆకులిత=కదల్పబడిన, చారుతర= మిక్కిలి సుందరమగు, అగ్రశాఖః=కొనకొమ్మలు కలదియును, పుష్ప=పూవుల యొక్క ఉద్గమ=ప్రాదుర్భావము యొక్క ప్రచయ=అధిక్యముతో, కోమల=కోమలములైన, పల్లవ=చిగురుల,అగ్రః=చివరలు కలదియును, మత్త=మదించిన, ద్విరేఫ=తుమ్మెదలచే, పరిపీత=బాగుగా త్రాగబడిన, మధు=మకరందము యొక్క, ప్రసేకః=ప్రవాహము కలిగినదియునగు, కోవిదారః=ఎఱ్ఱ కాంచనపుచెట్టు, కస్య=ఎవని, చిత్తమ్=మనస్సును, న విదారయతి=చీల్చివేయదు?

**తాత్పర్యము:–** మెల్లనైన గాలిచే కదల్పబడిన మిగుల సుందరమగు కొన కొమ్మలు కలదియును, పూవుల యొక్క ప్రాదుర్భావాధిక్యముతో కోమలములైన చిగురుల చివరలు కలదియును, మదించిన తుమ్మెదలచే బాగుగా త్రాగబడిన మకరంద (పూ తేనె) ప్రవాహము కలదియునగు ఎఱ్ఱకాంచనపు చెట్టు (కొండ గోగు) ఎవనిమనస్సును చీల్చివేయదు?

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–** 1) మంద.. శాఖః–మందశ్చ సః అనిలః–మందానిలః–కర్మధారయః





తేన ఆకులితాః మందానిలాకులితాః–తృతీయాతత్పురుషః–మందానిలాకులితాః చారుతరాగ్రశాఖాః యస్యాఽసౌ తథావిధః – బహువ్రీహిః.

2) పుష్ప .... పల్లవాగ్రః – పుష్పాణామ్ ఉద్గమః – పుష్పోద్గమః – షష్ఠీతత్పురుషః – తస్య ప్రచయః – పుష్పోద్గమప్రచయః, తేన కోమలః పల్లవాగ్రో యస్య సః – బహువ్రీహిః.

3) మత్త..... ప్రసేకః – మత్తాశ్చ తే ద్విరేఫాః – కర్మధారయః, తైః పరిపీతః మధుప్రసేకో యస్య సః – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) అస్య భ్రమర ఇతినామ్ని ద్వౌరేఫౌస్త ఇతి ద్విరేఫః. భ్రమరమను తనపేరునందు రెండు రేఫములు గలది. **'ద్విరేఫ పుష్పలిడ్భృంగ షట్పద భ్రమరాళయః'**

2) కుం భూమిం విదారయతీతి కోవిదారః. దౄ విదారణే. భూమిని వ్రక్కలించునది. **కోవిదారే చమరికః కుద్దాలో యుగపత్రకః.**

c) **గుణము :– మాధుర్యం, ఓజస్సు** d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము

g) **క్రియాదర్శము :–** 'విదారయతి' – వి=ఉపసర్గ. పరస్మైపది. లట్ ప్రథమపురుష ఏకవచనము.

**ధాతువు :–** దౄ–విదారణే, క్ర్యాది (9) ధాతువు. సకర్మకక్రియ. ప్రేరణార్థకము. 'అయ' వికరణ ప్రత్యయము. 'తి' లట్ ప్రథమపురుషైకవచన పరస్మైపది తిజ్ ప్రత్యయము. కనుక దౄ+అయ+తి > దార్+అయ+తి > దారయతి గా మారును.

2) భిన్తే **విదారయతి** చ భినత్తి ద్యతి ముణ్డతి, బిలతి స్ఫోటయతి చ దృణాత్యాఖణ్డ యత్యపి, ముస్యతి ఛ్ఛిద్రయతి చ దారయత్యపి భేదనే (ఆఖ్యాతచంద్రికా 2-5-7)

**శ్లో॥ తారాగణప్రవరభూషణముద్వహన్తీ**
**మేఘావరోధపరిముక్తశశాఙ్కవక్త్రా।**
**జ్యోత్స్నాదుకూలమమలం రజనీ దధానా**
**వృద్ధిం ప్రయాత్యనుదినం ప్రమదేవ బాలా॥ 7**

**పదవిభాగము:–** తారాగణప్రవరభూషణమ్+ఉద్వహన్తీ మేఘ+అవరోధపరిముక్త శశాంకవక్త్రా జ్యోత్స్నా దుకూలమ్ అమలమ్ రజనీ దధానా వృద్ధిమ్ ప్రయాతి+అను దినమ్ ప్రమదా+ఇవ బాలా.

**అన్వయక్రమము:–** తారాగణ ప్రవర భూషణమ్ ఉద్వహన్తీ మేఘ అవరోధ పరిముక్త

శశాంక వక్త్రా అమలమ్ జ్యోత్స్నాదుకూలమ్ దధానా రజనీ బాలా ప్రమదేవ అనుదినమ్ వృద్ధిమ్ ప్రయాతి.

**ప్రతిపదార్థము:–** తారాగణ=నక్షత్రగణమనే, ప్రవర=ఉత్తమమైన, భూషణమ్=భూషణమును, ఉద్వహన్తీ=ధరించినదియు, మేఘ=మేఘముల యొక్క, అవరోధ=అవరోధము నుండి, పరిముక్త=వెలువడిన, శశాంక=చంద్రుడే, వక్త్రా=ముఖముగా కలిగినదియు, అమలమ్ =నిర్మలమైన, జ్యోత్స్నా=వెన్నెలయే, దుకూలమ్=వస్త్రముగా, దధానా=ధరించియున్న, రజనీ=రాత్రి, బాలా=బాలిక, ప్రమదేవ=స్త్రీవలె, అనుదినమ్=ప్రతిరోజును, వృద్ధిమ్ =వృద్ధిని, ప్రయాతి=పొందుచున్నది.

**తాత్పర్యము:–** నక్షత్రగణమునే ఉత్తమ భూషణముగా ధరించినదియు, మేఘముల అవరోధమునుండి వెలువడిన చంద్రుడేముఖముగా గలదియు, నిర్మలమైన వెన్నెలయే వస్త్రముగా ధరించియున్న రాత్రి, బాలిక యగు స్త్రీవలె ప్రతిరోజును (ఈ శరత్కాలమున) వృద్ధిని పొందుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) తారాగణప్రవరభూషణమ్ – తారాణామ్ గణః – తారాగణః – షష్ఠీతత్పురుషః – తారాగణ ఏవ ప్రవరం భూషణమ్ – కర్మధారయః.

2) మేఘ..... వక్త్రా – మేఘస్య అవరోధః, మేఘావరోధః – షష్ఠీతత్పురుషః – తేన పరిముక్తః – మేఘావరోధ పరిముక్తః చాసౌ శశాంకః, మేఘావరోధ పరిముక్త శశాంకః – కర్మధారయః – మేఘావరోధపరిముక్త శశాంక ఏవ వక్త్రం యస్యాఃసా – బహువ్రీహిః.

3) జ్యోత్స్నాదుకూలమ్ – జ్యోత్స్నా ఏవ దుకూలమ్ – కర్మధారయః.

b) **నిఘంటు ప్రమాణములు:–** 1)శశతి ప్లుతేన గచ్ఛతీతి శశః. శశ ప్లుతగతౌ. దాటుచు బోవునది. కుందేలు పేరు. **గన్ధర్వ శ్శరభో రామః సృమరో గవయ శ్శశః.**

c) **గుణము** :– మాధుర్యము d) **రీతి** :– వైదర్భి

e) **అలంకారము : ఉపమా,** లక్షణము '1' వ శ్లోక భాగము చూడదగును. ఇందు బాలికయగు స్త్రీవలె రాత్రి ప్రతిరోజూ వృద్ధిపొందుచున్నట్లు వర్ణింపబడుటచే నిట ఉపమాలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు–వృత్తము:–** శక్వరీ ఛందస్సు – వసంతతిలకావృత్తము

g) **క్రియాదర్శము :–** 'ప్రయాతి' : పరస్మైపది. లట్‌ప్రథమపురుషైకవచనము. ప్ర= ఉపసర్గ.

**ధాతువు :–** 'యా'. ఈ ధాతువు వివరములు మొదటి సర్గలో చెప్పబడినవి.





**శ్లో॥ కారణ్డవాననవిఘట్టితవీచిమాలాః**
**కాదమ్బసారసకులాకులతీరదేశాః।**
**కుర్వన్తి హంసవిరుతైః పరితో జనస్య**
**ప్రీతిం సరోరుహరజోఽరుణితాస్తటిన్యః॥ 8**

**పదవిభాగము:–** కారణ్డవ+ఆననవిఘట్టితవీచిమాలాః కాదంబసారసకుల+ఆకుల తీరదేశాః కుర్వన్తి హంసవిరుతైః పరితః జనస్య ప్రీతిమ్ సరోరుహరజః+అరుణితాః +తటిన్యః.

**అన్వయక్రమము:–** కారణ్డవ ఆనన విఘట్టిత వీచి మాలాః కాదంబ సారస కులాకుల తీరదేశాః సరోరుహ రజః అరుణితాః తటిన్యః హంసవిరుతైః పరితః జనస్య ప్రీతిమ్ కుర్వన్తి.

**ప్రతిపదార్థము:–** కారణ్డవ=కన్నెలేడుయను పక్షియొక్క, ఆనన=ముక్కుచే, విఘట్టిత=పొడవ బడిన, వీచి=అలల యొక్క, మాలాః=వరుసలు కలిగినవియు, కాదంబ=కలహంసలయొక్క, సారస=బెగ్గురు పక్షుల యొక్క, కుల=సమూహముచే, ఆకుల=వ్యాప్త మైన, తీరదేశాః=తీరప్రాంతములు కలిగినవియు, సరోరుహ=పద్మములయొక్క, రజః=పుప్పొడిచే, అరుణితాః=ఎఱ్ఱగ జేయబడిన, తటిన్యః=నదులు, హంసవిరుతైః =హంసల కూతలచే, పరితః=అంతటను, జనస్య=జనులకు, ప్రీతిమ్=సంతోషమును, కుర్వన్తి=చేయుచున్నవి.

**తాత్పర్యము:–** (శరదృతువున) కన్నెలేడుయను పక్షియొక్క ముక్కుచే పొడవబడిన అలల యొక్క వరుసలు కలిగినవియు, కలహంసల, బెగ్గురు పక్షుల యొక్క సమూహముచే క్రిక్కిరిసిన తీరప్రాంతములు కలిగినవియు, పద్మముల పుప్పొడిచే ఎఱ్ఱగజేయబడిన నదులు హంసల కూతలచే అంతటా జనులకు సంతోషమును చేయుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కారణ్డ... మాలాః – కారణ్డవానామ్ ఆననైః – కారణ్డవాననైః – షష్ఠీతత్పురుషః – కారణ్డవాననైః విఘట్టితాః వీచిమాలాః యాసాం తాః – బహువ్రీహిః.

2) కాదంబ..... దేశాః – కాదంబాః చ సారసాఃచ, కాదంబసారసాః – ద్వంద్వః – తేషాం కులం – కాదంబసారసకులం – షష్ఠీతత్పురుషః – తేన ఆకులః తీరదేశో యాసాం తాః – బహువ్రీహిః.

3) సరోరుహరజోఽరుణితాః – సరోరుహాణామ్ రజాంసి, సరోరుహరజాంసి తైః అరుణితాః సరోరుహరజోఽరుణితాః – తృతీయాతత్పురుషః

4) హంసవిరుతైః – హంసానాం విరుతైః – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కరండే భవః కారండః తం వాతి గచ్ఛతీతి కారండవః. వా గతి గంధనయోః కరండము పంజరము. తత్సంబంధమైనది కారండవము. దానిని బొంది యుండునది. కన్నెలేడు. **తేషాం విశేషా హారీతో మద్గుః కారండవః ప్లవః**

2) కదంబస్య స్వసంఘస్య సహచరిత్వాత్ కాదంబః – కదంబమనగా తన సమూహము. ఆ సంఘముతో గూడియుండునది. **'కాదంబః కలహంసః స్యాత్'.**

c) **గుణము – ప్రసాదము** d) **రీతి – వైదర్భి**

e) **అలంకారము : 'స్వభావోక్తి'. లక్షణము:** '2' వ శ్లోకభాగమున చూడదగును. ఇందు శరదృతువున నదులును యథాతథముగా వర్ణించుటచే నిట స్వభావోక్త్యలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము :–** 'కుర్వన్తి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము.

**ధాతువు:** 'కృ'. తనాది (8) ప్రకరణ ధాతువు. ఈ ధాతువివరములు ఇంతకు పూర్వము చెప్పబడినవి.

**శ్లో॥ నేత్రోత్సవో హృదయహారిమరీచిమాలః**
**ప్రహ్లాదకః శిశిరశీకరవారివర్షీ**
**పత్యుర్వియోగవిషదిగ్ధశరక్షతానాం**
**చన్ద్రో దహత్యనుదినం తనుమఙ్గనానామ్॥ 9**

**పదవిభాగము:–** నేత్ర+ఉత్సవః హృదయహారిమరీచిమాలః ప్రహ్లాదకః శిశిరశీకరవారివర్షీ పత్యుః+వియోగవిషదిగ్ధశరక్షతానామ్ చంద్రః దహతి+అనుదినమ్ తనుమ్ అంగనానామ్.

**అన్వయక్రమము:–** నేత్ర ఉత్సవః హృదయహారి మరీచి మాలః ప్రహ్లాదకః శిశిర శీకరవారి వర్షీ చంద్రః పత్యుః వియోగ విషదిగ్ధ శర క్షతానామ్ అంగనానామ్ తనుమ్ దహతి.

**ప్రతిపదార్థము:–** నేత్ర=కన్నులకు, ఉత్సవః=పండుగయైనట్టి, హృదయహారి=మనస్సును హరించునట్టి, మరీచి=కిరణముల యొక్క, మాలః=మాలకలిగినట్టి, ప్రహ్లాదకః=అధిక సంతోషమును కలిగించునట్టి, శిశిర=చల్లని, శీకరవారి=జలబిందువులను, వర్షీ= వర్షించునట్టి, చంద్రః=చంద్రుడు, పత్యుః=ప్రియుని యొక్క, వియోగ=వియోగమను,





విషదిగ్ధ=విషము పూయబడిన, శర=బాణములచే, క్షతానామ్=కొట్టబడిన, అంగనానామ్ =స్త్రీలయొక్క, తనుమ్=శరీరమును, దహతి=దహించుచున్నాడు.

**తాత్పర్యము:–** కన్నులకు పండుగయైనట్టి, మనస్సును హరించునట్టి కిరణముల మాల కలిగినట్టి, అధికసంతోషమును కలిగించునట్టి, చల్లని బిందువులను వర్షించునట్టి చంద్రుడు ప్రియుని యొక్క వియోగమను విషము పూయబడిన బాణములచే కొట్టబొడిన స్త్రీల శరీరమును దహించుచున్నాడు.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) నేత్రోత్సవః – నేత్రయోరుత్సవః – షష్ఠీతత్పురుషః.

2) హృదయహారి ... మాలః – హృదయం హరతీతి హృదయహారీ – ద్వితీయా తత్పురుషః – హృదయహారిణీ మరీచీనాం మాలా యస్య సః – బహువ్రీహిః

3) శిశి.... వర్షీ – శిశిరాణి చ తాని శీకరాణి శిశిరశీకరాణి. కర్మధారయః– శిశిరశీకరాణామ్ వారివర్షతీతి, శిశిరశీకరవారివర్షీ – షష్ఠీతత్పురుషః.

4) వియోగ .... క్షతానామ్ – వియోగ ఏవ విషమ్ వియోగవిషమ్– అవధారణా పూర్వపద కర్మధారయః–తేన దిగ్ధాః శరాః వియోగవిషదిగ్ధ శరాః–తృతీయా తత్పురుషః వియోగవిషదిగ్ధ శరైః క్షతాః వియోగవిషదిగ్ధశరక్షతాః తాసామ్– తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) మ్రియంతే క్షుద్రజంతవః తమాంసి వా అనేనేతి మరీచిః. మృజ్ ప్రాణత్యాగే. దీనిచేత క్షుద్రజంతువులుగాని, అంధకారముగాని నశించును. **'భానుః కరో మరీచిః స్త్రీ పుంసయో ర్దీధితిః స్త్రియామ్'.**

2) శినోతి పద్మశోభామితి శిశిరః శీఞ్ నిశాతనే పద్మములకాంతి చెఱుచునది. **'తద్వదర్థాస్సుషీమ శ్శిశిరో జడః'.**

c) **గుణము – మాధుర్య ప్రసాదగుణములు** d) **రీతి – వైదర్భి**

e) విప్రలంభ శృంగారోద్దీపన విభావము వర్ణించబడినది.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – వసంత తిలకావృత్తము

g) **క్రియాదర్శము :–** 'దహతి' : పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము.

**ధాతువు :– దహ్**–దహించుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు.'అ' వికరణ ప్రత్యయము.'తి' పరస్మైపది లట్ ప్రథమపురుషైకవచన 'తిప్' ప్రత్యయము. కనుక దహ్+అ+తి > దహ+తి > దహతి గా మారును.

2) **దహతి** శ్రేషతి శ్లేషత్యపి ప్రోషతి చూర్యతే, తాపయత్యోషతి తపత్యపి ప్లుష్యతి కుణ్డతే, దాహే కూటయతి ప్లోషత్యమీ. (ఆఖ్యాతచంద్రికా 2-5-8)

**శ్లో॥ ఆకమ్పయన్ఫలభరానతశాలిజాలా**
**న్యానర్తయం స్తరువరాన్కుసుమావనమ్రాన్।**
**ఉత్ఫుల్లపఙ్కజవనాం నళినీం విధున్వ**
**న్యూనాం మనశ్చలయతి ప్రసభం నభస్వాన్॥ 10**

**పదవిభాగము:–** ఆకమ్పయన్+ఫలభర+ఆనతశాలిజాలాన్+ఆనర్తయన్+తరువరాన్ +కుసుమ+అవనమ్రాన్ ఉత్ఫుల్లపంకజవనామ్ నళినీమ్ విధున్వన్+యూనామ్ మనః +చలయతి ప్రసభమ్ నభస్వాన్.

**అన్వయక్రమము:–** ఫల భర ఆనత శాలి జాలాన్ ఆకమ్పయన్ కుసుమ అవనమ్రాన్ తరువరాన్ ఆనర్తయన్ ఉత్ఫుల్ల పంకజ వనామ్ నళినీమ్ విధున్వన్ నభస్వాన్ యూనామ్ మనః ప్రసభమ్ చలయతి.

**ప్రతిపదార్థము:–** ఫల=పంట యొక్క, భర=బరువుచే, ఆనత=వంగిన, శాలి=వరి మొక్కల, జాలాన్=సమూహములను, ఆకమ్పయన్=కదల్చుచు, కుసుమ=పూవులచే, అవనమ్రాన్=వంగిన, తరువరాన్=వృక్షరాజములను, ఆనర్తయన్=ఆడించుచు, ఉత్ఫుల్ల =వికసించిన, పంకజ=పద్మముల యొక్క, వనామ్=వనము కలిగిన, నళినీమ్= తామరకొలనును, విధున్వన్=కదిలించుచు, నభస్వాన్=వాయువు, యూనామ్= యువకుల యొక్క, మనః=మనస్సును, ప్రసభమ్=బలత్కారముగా, చలయతి=చలింప జేయుచున్నది.

**తాత్పర్యము:–** పంట బరువుచే వంగిన వరి మొక్కల సమూహములను కదల్చుచు, పూవులచే వంగిన వృక్షరాజములను ఆడించుచు, వికసించిన పద్మముల వనముకలిగిన తామరకొలనులను కదిలించుచు, వాయువు యువకుల మనస్సును బలవంతముగా చలింపజేయుచున్నది.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) ఫల... జాలాన్–ఫలానాం భరః – ఫలభరః – షష్ఠీతత్పురుషః, తేన ఆనతాన్ – ఫలభరానతాన్–తృతీయాతత్పురుషః, ఫలభరానతాన్–చ తాన్ శాలిజాలాన్ – ఫలభరానతశాలిజాలాన్ – కర్మధారయః.

2) కుసుమావనమ్రాన్ – కుసుమైః అవనమ్రాన్, కుసుమావనమ్రాన్ – తృతీయా తత్పురుషః.





3) తరువరాన్ – తరుషు వరాన్ షష్ఠీతత్పురుషః.

4) ఉత్ఫుల్ల... వనామ్ – ఉత్ఫుల్లం పంకజవనమ్ యస్యాః సా తామ్ కర్మధారయః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) తరంత్యాతపమనేనేతి తరుః. తౄ ప్లవనతరణయోః. ఎండను దీని చేత తరింతురు. **'వృక్షో మహీరుహ శ్శాఖీ విటపీ పాదపస్తరుః'.**

c) **గుణము – మాధుర్యం** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – వసంతతిలకావృత్తము

f) **క్రియాదర్శము :–** 'చలయతి' : పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము.

**ధాతువు :– 'చల్'**–కదలుట – భ్వాది (1) ప్రకరణ ధాతువు. ప్రేరణార్థకమున 'అయ' వలన మరియు తి పరస్మైపది లట్ ప్రథమపురుషైకవచన తిఙ్ ప్రత్యయము వలన చల్+అయ+తి > చలయతి గా మారును.

2) ధూనయతి ధువతి **చలయతి** ధూనోతి, ధవతి ధునాతి చ ధునోతి... (ఆఖ్యాతచంద్రికా 2-3-72)

**శ్లో॥ సోన్మాదహంసమిథునైరుపశోభితాని**
**స్వచ్ఛాని ఫుల్లకమలోత్పలభూషితాని।**
**మన్దప్రభాతపవనాహతవీచిమాలా**
**న్యుత్కణ్ఠయన్తి సహసా హృదయం సరాంసి॥ 11**

**పదవిభాగము:–** స+ఉన్మాదహంసమిథునైః+ఉపశోభితాని స్వచ్ఛాని ఫుల్లకమల+ ఉత్పల భూషితాని మన్దప్రభాతపవన+ఆహతవీచిమాలాని+ఉత్కణ్ఠయన్తి సహసా హృదయమ్ సరాంసి.

**అన్వయక్రమము:–** సోన్మాద హంస మిథునైః ఉపశోభితాని ఫుల్ల కమల ఉత్పల భూషితాని మంద ప్రభాత పవన ఆహత వీచి మాలాని స్వచ్ఛాని సరాంసి హృదయమ్ సహసా ఉత్కణ్ఠయన్తి.

**ప్రతిపదార్థము:–** సోన్మాద=మదముతో కూడిన, హంస=హంసల యొక్క, మిథునైః =జంటలచే, ఉపశోభితాని=అలంకరింపచేయబడినవియు, ఫుల్ల=వికసించిన, కమల= పద్మములచే, ఉత్పల=కలువలచే, భూషితాని=అలంకరింపజేయబడినవియు, మంద= మెల్లని, ప్రభాత=వేకువజామునాటి, పవన=వాయువులచే, ఆహత=కొట్టబడిన, వీచి= అలలయొక్క, మాలాని=వరుసలు కలిగినవియు, స్వచ్ఛాని=స్వచ్ఛమైన, సరాంసి= సరస్సులు, హృదయమ్=హృదయమును, సహసా=శీఘ్రముగ, ఉత్కణ్ఠయన్తి= వేగిరబాటు కలవిగ జేయబడుచున్నవి.

**తాత్పర్యము:–** మదముతో కూడిన హంసల జంటచే అలంకరింపబడిన, వికసించిన పద్మములు, కలువలచే అలంకరింపజేయబడిన, వేకువజాము నాటి మెల్లని వాయువులచే కొట్టబడిన అలల వరుసలు కలిగినవియైన స్వచ్ఛమైన సరస్సులు మనస్సును శీఘ్రముగ వేగిరబాటుకలవిగ జేయబడుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) సోన్మాద.... మిథునైః – సోన్మాదాని చ తాని హంసమిథునాని, సోన్మాదహంస మిథునాని తైః – కర్మధారయః.

2) ఫుల్ల .... భూషితాని – కమలాని చ ఉత్పలాని చ కమలోత్పలాని – ద్వంద్వః – ఫుల్లానిచ తాని కమలోత్పలాని – కర్మధారయః – ఫుల్లకమలోత్పలైః భూషితాని యాని తాని – బహువ్రీహిః.

3) మంద.... మాలాని – ప్రభాతస్య పవనః, ప్రభాతపవనః – షష్ఠీతత్పురుషః – మందః చాసౌ ప్రభాతపవనః, మందప్రభాతపవనః – కర్మధారయః, తేన ఉద్గతా వీచీనాం మాలాః యేషు తాని – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) మేథతే సంగచ్ఛత ఇతి మిథునం. మేథృ సంగమే. కూడి యుండునది. **'స్త్రీ పుంసౌ మిథునం ద్వంద్వమ్'.**

2) **'సహసావిదధీత న క్రియామ్'** ఇది విచారించక యనునర్థమందు వర్తించును. **'అతర్కితే తు సహసా'.**

3) ఫుల్లతీతి ఫుల్లః. ఫుల్ల వికసనే. వికసించునది. **ఫుల్లశ్చైతే వికసితే.**

c) **గుణము** :– మాధుర్యము d) **రీతి** :– వైదర్భి

e) **అలంకారము:** స్వభావోక్తి. లక్షణము '2' వ శ్లోక భాగము చూడదగును. ఇందు శరదృతువునాటి 'సరస్సులు' ను యథాతథముగా వర్ణింపబడుటచే నిట స్వభావోక్త్యలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు – లక్షణము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము :–** 'ఉత్కణ్ఠయన్తి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము.

**ధాతువు :–** కఠి. ఈ ధాతువివరములు 5వ శ్లోక భాగమున చెప్పబడినవి.

**శ్లో॥ నష్టం ధనుర్వలభిదో జలదోదరేషు**
**సౌదామినీ స్ఫురతి నాద్య వియత్పతాకా।**





**ధున్వన్తి పక్షపవనైర్న నభో బలాకాః**
**పశ్యన్తి నోన్నతముఖా గగనం మయూరాః॥ 12**

**పదవిభాగము:–** నష్టమ్ ధనుః+వలభిదః జలద+ఉదరేషు సౌదామినీ స్ఫురతి న+ అద్య వియత్+పతాకా ధున్వన్తి పక్షపవనైః+న నభః బలాకాః పశ్యన్తి న+ఉన్నత ముఖా గగనమ్ మయూరాః.

**అన్వయక్రమము:–** అద్య జలద ఉదరేషు వలభిదః ధనుః నష్టమ్ వియత్ పతాకా సౌదామినీ న స్ఫురతి బలాకాః పక్షపవనైః నభః న ధున్వన్తి మయూరాః ఉన్నత ముఖాః గగనమ్ న పశ్యన్తి.

**ప్రతిపదార్థము:–** అద్య=ఇప్పుడు (శరదృతువున), జలద=మేఘముల యొక్క, ఉదరేషు =గర్భములయందు, వలభిదః=ఇంద్రుని, ధనుః=ధనుస్సు, నష్టమ్= నశించినది, వియత్ =ఆకాశమునకు, పతాకా=ధ్వజమైన, సౌదామినీ=మెఱపు, న స్ఫురతి=స్ఫురించుటలేదు, బలాకాః=బెగ్గురు పక్షులు, పక్షపవనైః=ఱెక్కలగాలిచే, నభః=ఆకాశమును, న ధున్వన్తి= కదల్చుచుండుటలేదు, మయూరాః=నెమళ్ళు, ఉన్నత=ఎత్తబడిన, ముఖాః=ముఖములు గలవై, గగనమ్=ఆకాశమును, న పశ్యన్తి=చూచుటలేదు.

**తాత్పర్యము:–** (శరదృతువున) ఇప్పుడు మేఘములందు ఇంద్రధనుస్సు నశించినది. ఆకాశ ధ్వజమైన మెఱపు స్ఫురించుటలేదు బెగ్గురు పక్షుల ఱెక్కల గాలిచే ఆకాశము కదిలింపబడుట లేదు. నెమళ్ళు ఎత్తబడిన ముఖములు గలవై ఆకాశమును చూచుటలేదు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) జలదోదరేషు – జలదానాం ఉదరాణి–జలదోదరాణి తేషు జలదోదరేషు –షష్ఠీతత్పురుషః

2) వియత్పతాకా–వియతః పతాకా–షష్ఠీతత్పురుషః.

3) పక్షపవనైః–పక్షాణాం పవనైః–పక్షపవనైః–షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) వలతి సంవృణోతీతి వలభీ. వల సంవరణే. కప్పుకొని యుండునది. **'గోపానసీ తు వలభీ ఛ్ఛాదనే వక్ర దారుణి'.**

2) సుదామ్నా ఐరావతేన సహవర్తత ఇతి సౌదామినీ. సుదామ మనగా ఐరావతము, దానితో కూడియుండునది. **తడిత్సౌదామినీ విద్యుచ్చంచలా చపలా అపి.**

c) **గుణము – ప్రసాదము** d) **రీతి – వైదర్భి**

e) **అలంకారము: స్వభావోక్తి' లక్షణము '2' వ శ్లోక భాగము చూడగలరు.** ఇందు 'శరదృతువు' ప్రకృతి సహజంగా యథావిధముగ వర్ణింపబడుటచే నిట 'స్వభావోక్త్యలంకార' మున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – వసంతతిలకావృత్తము

g) **క్రియాదర్శము :–** 1) **'పశ్యన్తి'** – పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము.

**ధాతువు :– దృశ్** (పశ్య్) – ప్రేక్షణే చూచుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు. దీని వికరణ ప్రత్యయము 'అ'. పరస్మైపది లట్ ప్రథమపురుషబహువచన తిఙ్ ప్రత్యయము 'అన్తి'. భ్వాదిప్రకరణములోని కొన్ని ధాతువులకు వికరణ ప్రత్యయము పరమగునపుడు మరియొక రూపము ఆదేశముగా వచ్చును. వానిలో దృశ్ ధాతువునకు పశ్య్ అనునది ఆదేశముగా వచ్చును. కనుక దృశ్ > పశ్య్ + అ + అన్తి > పశ్య + అన్తి > పశ్యన్తిగా మారును.

2) **స్ఫురతి:** పరస్మైపది. లట్ ప్రథమపురుష ఏకవచనము. 'తి' దీని తిఙ్ ప్రత్యయము.

**ధాతువు:– స్ఫుర్**–స్ఫురించుట–తోచుట. తుదాది (6) ప్రకరణ ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. ఈ గణ ధాతువులకు ప్రథమగణ వికరణ చిహ్నమైన అకారమునకు ముందువలె ధాతువు లందెట్టిమార్పును జరుగదు. కనుక స్ఫుర్ + అ + తి > స్ఫుర + తి > స్ఫురతి.

3) **ధున్వన్తి** – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. 'అన్తి' దీని – తిఙ్ ప్రత్యయము.

**ధాతువు:– ధు** (ధూ) – కమ్పనే–కంపించుట. (ఉభయ) పరస్మైపది. అకర్మకము. స్వాదిప్రకరణ ధాతువు. 'ను' వికరణ ప్రత్యయము. ధు+ను+అన్తి > ధున్వన్తి గా మారును.

**శ్లో॥ నృత్యప్రయోగరహితాఞ్ఛిఖినో విహాయ**
**హంసానుపైతి మదనో మధురప్రగీతాన్।**
**త్యక్త్వా కదమ్బకుటజార్జునసర్జనీపా**
**న్సప్తచ్ఛదానుపగతా కుసుమోద్గమశ్రీః॥ 13**

**పదవిభాగము:–** నృత్యప్రయోగరహితాన్+శిఖినః విహాయ హంసాన్+ఉపైతి మదనః మధురప్రగీతాన్ త్యక్త్వా కదమ్బకుటజ+అర్జునసర్జనీపాన్+సప్తచ్ఛదాన్+ఉపగతా కుసుమ+ఉద్గమశ్రీః.

**అన్వయక్రమము:–** మదనః నృత్య ప్రయోగ రహితాన్ శిఖినః విహాయ మధుర ప్రగీతాన్





హంసాన్ ఉపైతి కుసుమ ఉద్గమ శ్రీః కదంబ కుటజ అర్జున సర్జ నీపాన్ త్యక్త్వా సప్తచ్ఛదాన్ ఉపగతా.

**ప్రతిపదార్థము:–**మదనః=మన్మథుడు, నృత్య=నాట్యముయొక్క ప్రయోగ=ప్రయోగముచే, రహితాన్=శూన్యములైన, శిఖినః=నెమళ్ళను, విహాయ=విడిచిపెట్టి, మధుర=మధుర మైన, ప్రగీతాన్=గానములు గల, హంసాన్=హంసలను, ఉపైతి=చేరుచున్నాడు, కుసుమ =పుష్పముల యొక్క ఉద్గమ=పుట్టుక యొక్క శ్రీః=లక్ష్మి, కదంబ=కడిమచెట్లను, కుటజ=కొండమల్లె చెట్లను, అర్జున=మద్దిచెట్లను, సర్జ=వేగిచెట్లను, నీపాన్=కడపచెట్లను, త్యక్త్వా=విడిచిపెట్టి, సప్తచ్ఛదాన్=ఏడాకుల అరటి చెట్లను, ఉపగతా=పొందినది.

**తాత్పర్యము:–** మన్మథుడు నాట్యమును మానిన నెమళ్ళను విడిచి మధురముగా గానము చేయు హంసలను చేరుచున్నాడు. పుష్పలక్ష్మి కడిమ, మద్ది, వేగి, కడప చెట్లను విడిచి ఏడాకుల అరటి చెట్లను పొందినది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) నృత్యప్రయోగరహితాన్–నృత్యస్య ప్రయోగః–నృత్యప్రయోగః–షష్ఠీతత్పురుషః –తేన రహితా యే తే తాన్–తృతీయాతత్పురుషః

2) కుసుమోద్గమశ్రీః–కుసుమానామ్ ఉద్గమః–కుసుమోద్గమః–షష్ఠీతత్పురుషః –తస్య శ్రీః–కుసుమోద్గమశ్రీః–షష్ఠీతత్పురుషః.

3) కదంబ ...... నీపాన్–కదంబః చ కుట జః చ అర్జునఃచ సర్జఃచ నీపఃచ– ద్వంద్వ సమాసః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కుస్యతి భ్రమరాదినా శ్లిష్యతీతి కుసుమమ్. కుస శ్లేషణే. భ్రమరములతో గూడియుండునది. **'స్త్రియస్సుమనసః పుష్పం ప్రసూనం కుసుమమ్, సుమమ్'.**

2) నయతి ప్రాణినః సుఖం నీపః. ణీఞ్ ప్రాపణే. ప్రాణులను సుఖము నొందించునది. **'నీప ప్రియక కదమ్బాస్తు హలిప్రియే'.**

c) **గుణము – ప్రసాదము** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము

g) **క్రియాదర్శము :–** ఉపగతా, కృదంతము. క్త ప్రత్యయాంతము. ఉప=ఉపసర్గ.

**ధాతువు :–** గమ్లృ–గతౌ–పోవుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు. 'క్త' ప్రత్యయాంతము. భూతకాల కర్త్రర్థక క్రియాజన్య విశేషణము. ధాతువునకు 'త' అను ప్రత్యయము చేర్చుట వలన ఈ రూపమేర్పడును. 'త' ప్రత్యయము బలహీనము. దీనికి ముందు

గుణము గాని వృద్ధికాని రాదని అర్థము. 'త' ప్రత్యయము చేరునపుడు ధాతువు లందలి అనునాసికములు సాధారణముగా లోపించును. కనుక గమ్+త > గత. నామవాచక రూపమునననుసరించి మూడు లింగములలోనికి మారును. గతః (పుంలిం.)–గతా (స్త్రీలిం.)–గతమ్ (నపుం.లి.).

**శ్లో॥ శేఫాలికాకుసుమగన్ధమనోహరాణి**
**స్వస్థస్థితాణ్డజకులప్రతినాదితాని।**
**పర్యన్తసంస్థితమృగీనయనోత్పలాని**
**ప్రోత్కణ్ఠయన్త్యుపవనాని మనాంసి పుంసామ్॥ 14**

**పదవిభాగము:–** శేఫాలికాకుసుమగంధమనోహరాణి స్వస్థస్థిత+అణ్డజకుల ప్రతినాదితాని పర్యన్తసంస్థితమృగీనయన+ఉత్పలాని ప్రోత్కణ్ఠయన్తి+ఉపవనాని మనాంసి పుంసామ్.

**అన్వయక్రమము:–** శేఫాలికాకుసుమ గంధ మనోహరాణి స్వస్థ స్థిత అణ్డజ కుల ప్రతినాదితాని పర్యన్త సంస్థిత మృగీ నయన ఉత్పలాని ఉపవనాని పుంసామ్ మనాంసి ఉత్కణ్ఠయన్తి.

**ప్రతిపదార్థము:–** శేఫాలికాకుసుమ=నల్లవావిలి పూల యొక్క, గంధ=వాసనచే, మనోహరాణి=సుందరములును, స్వస్థ=ప్రశాంతములై, స్థిత=కూర్చొనియున్న, అణ్డజ=కోకిల మొదలగు పక్షుల, కుల=సమూహములచే, ప్రతినాదితాని=ప్రతిధ్వనింపబడినవియు, పర్యన్త=దగ్గర, సంస్థిత=ఉన్న, మృగీ=లేళ్ళ యొక్క, నయన=కన్నులనెడు, ఉత్పలాని=కలువలు గలిగిన, ఉపవనాని=పూదోటలు, పుంసామ్=పురుషుల, మనాంసి =మనస్సులను, ఉత్కణ్ఠయన్తి=ఉత్కంఠితముగ చేయుచున్నవి.

**తాత్పర్యము:–** నల్ల వావిలి పూల వాసనచే సుందరములును అగు ప్రశాంతముగ కూర్చొనియున్న పక్షుల సమూహముల ప్రతిధ్వనులు కలిగించు, దగ్గరలో నున్న లేళ్ళ కన్నులనెడు కలువలు గలిగిన పూదోటలు జనుల మనస్సులను ఉత్కంఠముగ చేయుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) శేఫాలికా.... హరాణి–శేఫాలికాయాః కుసుమాని, శేఫాలికా కుసుమాని–షష్ఠీతత్పురుషః–తేషాం గంధః–శేఫాలికాకుసుమగంధః – షష్ఠీ తత్పురుషః –తేన మనోహరాణి–శేఫాలికాకుసుమగంధమనోహరాణి– తృతీయా తత్పురుషః.

2) స్వస్థ...... నాదితాని–స్వస్థస్థితాః చ తే అండజాః–స్వస్థస్థితాండజాః–





కర్మధారయః–తేషాం కులమ్ స్వస్థస్థితాండజకులమ్–షష్ఠీతత్పురుషః–తేన ప్రతినాదితాని–తృతీయాతత్పురుషః.

3) పర్యన్త..... ఉత్పలాని– పర్యన్తే సంస్థితాః– పర్యన్తసంస్థితాః– సప్తమీతత్పురుషః – పర్యన్త సంస్థితాః చ తాః మృగ్యః, పర్యన్త సంస్థిత మృగ్యః–కర్మధారయః – తాసాం నయనాన్యేవోత్పలాని యేషు తాని – పర్యన్త.... ఉత్పలాని– బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శేరత ఇతి శేఫాః నిద్రాణాః అళయోఽత్రేతి శేఫాలికా – నిద్రించుచున్న తుమ్మెదలు గలది. **'శేఫాలికా తు సువహా నిర్గుణ్డీ నీలికా చ సా'.**

c) **గుణము** :– ప్రసాదము, ఓజస్సు  d) **రీతి** :– వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – వసంతతిలకావృత్తము

f) **క్రియాదర్శము:–** ప్రోత్కణ్ఠయన్తి – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. ప్ర= ఉపసర్గ.

**ధాతువు :–** కఠి. ధాతువు వివరములు 5వ శ్లోక భాగమున చెప్పబడినవి.

**శ్లో॥ కల్హారపద్మకుముదాని ముహుర్విధున్వం**
**స్తత్సఙ్గమాదధికశీతలతాముపేతః।**
**ఉత్కణ్ఠయత్యతితరాం పవనః ప్రభాతే**
**పత్రాన్తలగ్నతుహినామ్బువిధూయమానః॥ 15**

**పదవిభాగము:–** కల్హారపద్మకుముదాని ముహుః+విధున్వన్+తత్+సంగమాత్+అధిక శీతలతామ్+ఉపేతః ఉత్కణ్ఠయతి+అతితరామ్ పవనః ప్రభాతే పత్ర+అన్తలగ్న తుహిన+అంబువిధూయమానః.

**అన్వయక్రమము:–** ప్రభాతే పవనః కల్హార పద్మ కుముదాని ముహుః విధున్వన్ తత్సంగమాత్ అధిక శీతలతామ్ ఉపేతః పత్ర అంత లగ్న తుహిన అంబు విధూయమానః అతితరామ్ ఉత్కణ్ఠయతి.

**ప్రతిపదార్థము:–** ప్రభాతే=ప్రాతఃకాలమునందలి, పవనః=వాయువు, కల్హార= ఎఱ్ఱకలువలను, పద్మ=కమలములను, కుముదాని=తెల్లకలువలను, ముహుః=తరచుగా, విధున్వన్=కదలించుచు, తత్సంగమాత్=వాని సంబంధము వలన, అధిక=మిక్కిలి, శీతలతామ్=చల్లదనమును, ఉపేతః=పొందినదై, పత్ర=ఆకుల యొక్క, అంత=కొనల యందు, లగ్న=తగులు కొన్న, తుహిన=మంచు యొక్క, అంబు=నీటిని, విధూయమానః =రాల్చుచు, అతితరామ్=మిక్కిలి, ఉత్కణ్ఠయతి=వేడుక జేయుచున్నది.

**తాత్పర్యము:–** ప్రాతఃకాలమునందలి వాయువు ఎఱ్ఱకలువలను, కమలములను, తెల్లకలువలను తరచుగా కదిలించుచు, వాని సంబంధము వలన మిక్కిలి చల్లదనమును పొంది ఆకుల కొనలయందు తగులుకొన్న మంచు నీటిని రాల్చుచు మిక్కిలి వేడుక చేయుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కల్హారపద్మకుముదాని–కల్హారాణి చ పద్మాని చ కుసుమాని చ సమాహార ద్వంద్వః

2) తత్సంగమాత్–తేషాం సంగమాత్–షష్ఠీతత్పురుషః.

3) అధికశీతలతామ్–అధికా చాసౌ శీతలతా తామ్–కర్మధారయః.

4) పత్రాన్త ... మానః–పత్రస్య అన్తః, పత్రాన్తః – షష్ఠీతత్పురుషః, తత్ర లగ్నం తుహినాంబు, పత్రాన్తలగ్నతుహినాంబు – సప్తమీతత్పురుషః – తద్ విధూయమానం యేన సః – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కే జలే హ్లాదతే కహ్లారం – జలమందు సంతోషించునది. **'సౌగన్ధికం తు కహ్లారమ్'** (కల్హారమ్)

2) తోహతి అర్దయతి పద్మమితి తుహినమ్. తుహిర్ అర్దనే పద్మమును పీడించునది. **'అవశ్యాయస్తు నీహార స్తుషార స్తుహినం హిమమ్'.**

c) **గుణము – మాధుర్య ప్రసాదము లు** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :–** 'ఉత్కణ్ఠయతి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము.
ధాతువు: 'కఠి'. ధాతువివరములు 5వ శ్లోకభాగమున చెప్పబడినవి.

**శ్లో॥ సమ్పన్నశాలినిచయావృతభూతలాని**
**స్వస్థస్థితప్రచురగోకులశోభితాని।**
**హంసైః ససారసకులైః ప్రతినాదితాని**
**సీమాన్తరాణి జనయన్తి నృణాం ప్రమోదమ్॥ 16**

**పదవిభాగము:–**సంపన్నశాలినిచయ+ఆవృతభూతలాని స్వస్థస్థితప్రచురగోకుల శోభితాని హంసైః ససారకులైః ప్రతినాదితాని సీమ+అన్తరాణి జనయన్తి నృణామ్ ప్రమోదమ్.

**అన్వయక్రమము:–** సంపన్న శాలి నిచయ ఆవృత భూతలాని స్వస్థ స్థిత ప్రచుర గోకుల శోభితాని ససారకులైః హంసైః ప్రతి నాదితాని సీమాన్తరాణి నృణామ్ ప్రమోదమ్ జనయన్తి.





**ప్రతిపదార్థము:–**సంపన్న=ఏపుగాపెరిగిన, శాలి=వరియొక్క నిచయ=సమూహము లచే, ఆవృత=కప్పబడిన, భూతలాని=భూభాగములును, స్వస్థ=జంకు బొంకు లేక, స్థిత =స్థిరముగా కూర్చొని యున్న, ప్రచుర=పెక్కు, గోకుల=ఆలమందలచే, శోభితాని= శోభించునదియు, ససారకులైః=బెగ్గురు పక్షులతో కూడిన, హంసైః=హంసలచే, ప్రతినాదితాని=ప్రతిధ్వనింపజేయబడినవియగు, సీమాన్తరాణి=గ్రామ సీమలు, నృణామ్=జనులకు, ప్రమోదమ్=ఆనందమును, జనయన్తి= పుట్టించుచున్నవి.

**తాత్పర్యము:–** ఏపుగా పెరిగిన వరి సమూహములచే కప్పబడిన భూభాగములును, జంకుబొంకులేక స్థిరముగా నున్న పెక్కు ఆలమందలచే శోభించునదియు, బెగ్గురుపక్షులతో కూడిన హంసలచే ప్రతిధ్వనింపజేయబడిన గ్రామసీమలు జనులకు ఆనందమును పుట్టించుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) సంపన్నా .... భూతలాని–సంపన్నః చాసౌ శాలినిచయః, సంపన్నశాలి నిచయః – కర్మధారయః–తేన ఆవృతాని భూతలాని యేషాం తాని– బహువ్రీహిః

2) స్వస్థ.... శోభితాని–స్వస్థస్థితం ప్రచురం చ, స్వస్థస్థితప్రచురమ్–ద్వంద్వః– తత్ గోకులమ్, స్వస్థస్థితప్రచురగోకులమ్–కర్మధారయః–తేన శోభితాని– తృతీయా తత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) గవాం కులం సంఘాతః గోకులమ్. ఆవుల యొక్క మంద గోకులము. **'గోకులం తు గోధనం స్యాద్గవాం వ్రజే'.**

c) **గుణము – ప్రసాదము**

d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :–** 'జనయన్తి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము.

**ధాతువు :–** జనీ (జన్) ప్రాదుర్భావే పుట్టుట. దివాది ప్రకరణ (4) ధాతువు. అకర్మకము. ఆత్మనేపది. ప్రేరణార్థకమున పరస్మైపదిగా మారును. ప్రత్యయము 'అయ'. పరస్మైపది లట్ ప్రథమపురుష బహువచన తిజ్ ప్రత్యయము 'అన్తి'. కనుక జన్+అయ+అన్తి > జనయ + అన్తి > జనయన్తి గా మారును.

శ్లో॥ హంసైర్జితా సులలితా గతిరఙ్గనానా
మమ్భోరుహైర్వికసితైర్ముఖచన్ద్రకాన్తిః।
నీలోత్పలైర్మదకలాని విలోకితాని
భ్రూవిభ్రమాశ్చ రుచిరాస్తనుభిస్తరఙ్గైః॥ 17

**పదవిభాగము:–** హంసైః+జితాః సులలితా గతిః+అంగనానామ్ అంభోరుహైః+వికసితైః + ముఖచంద్రకాన్తిః నీల+ఉత్పలైః+మదకలాని విలోకితాని భ్రూవిభ్రమాః+చ రుచిరాః +తనుభిః+తరంగైః.

**అన్వయక్రమము:–** అంగనానామ్ సులలితా గతిః హంసైః జితాః ముఖచంద్రకాంతిః వికసితైః అమ్భోరుహైః జితాః మదకలాని విలోకితాని భ్రూవిభ్రమాః చ రుచిరాః+తనుభిః +తరంగైః.

**ప్రతిపదార్థము:–** అంగనానామ్=స్త్రీల యొక్క, సులలితా=మనోహరమగు, గతిః =గమనము, హంసైః=హంసలచే, జితా=జయింపబడెను. ముఖచంద్రకాంతిః=చంద్రుని వంటి ముఖముల యొక్క కాంతి, వికసితైః=వికసించిన, అమ్భోరుహైః=పద్మములచే, జితా=జయింపబడెను, మదకలాని=మత్తుచే మధురములగు, విలోకితాని=చూపులు, నీల+ఉత్పలైః=నల్ల కలువలచే, జితాని=జయింపబడెను. రుచిరాః=మనోహరమగు, భ్రూవిభ్రమాః=కనుబొమ్మల విలాసములు, తనుభిః=చిన్నవగు, తరంగైః=అలలచే, జితాః =జయింపబడెను.

**తాత్పర్యము:–** స్త్రీల మనోహరగమనము హంసలచే జయింపబడెను. చంద్రుని వంటి ముఖముల యొక్క కాంతి వికసించిన పద్మములచే జయింపబడెను. మత్తుచే మధురములగు చూపులు నల్లని కలువలచే జయింపబడెను. మనోహరమైన కనుబొమ్మల విలాసములు చిన్న అలలచే జయింపబడెను.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) ముఖచంద్రకాన్తిః–ముఖచంద్రస్య కాన్తిః–షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) తరతీతి తరంగః. తౄ ప్లవన తరణయోః. దరి చేరునది. **భంగః తరఙ్గ ఊర్మి ర్వా స్త్రియాం వీచిః**

2) అంభసి రోహతీతి అంభోరుహమ్. జలమందు బుట్టునది. **'బిస ప్రసూన రాజీవ పుష్కరామ్భోరుహాణి చ'.**

c) **గుణము – మాధుర్య ప్రసాదములు** d) **రీతి – వైదర్భి**





e) **అలంకారము:** a) **వ్యతిరేకాలంకారము**

**లక్షణము:–** 'వ్యతిరేకో విశేషశ్చేదుపమేయోపమానయోః' అని చంద్రాలోకము. ఉపమేయోపమానములకుభేదమునుగూడ చెప్పిన యెడల వ్యతిరేకాలంకార మగును. స్త్రీల గమనము హంసలచే, ముఖకాంతి వికసించిన పద్మములచే, చూపులు నల్లని కలువలచే జయింపబడినట్లువర్ణించుటచే నిట వ్యతిరేకాలంకార మున్నదని చెప్పదగును.

b) **రూపకాలంకారము:** లక్షణము '1' వ శ్లోక భాగమున చూడదగును. ఇందు ముఖమునందు చంద్రుని ఆరోపించి అభేదంగా వర్ణించుటచే నిట 'రూపకాలంకార' మున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము :–** 'జితా' – కృదంతము. 'క్త' ప్రత్యయాంతము.

**ధాతువు :– జి** – జయే, అకర్మకము, పరస్మైపది. 'క్త' ప్రత్యయాంతముచే ధాతువు 'జి' కు 'త' ప్రత్యయము చేర్చుటచే 'జిత' గా మారును. నామవాచకరూపము ననుసరించి మూడు లింగములలోనికి మారును. జితాః – ప్రథమావిభక్తి స్త్రీలింగ బహువచనరూపము. జితః (పుంలిం.) – **జితా** (స్త్రీలిం.) – జితమ్ (నపుం.లిం.).

శ్లో॥ శ్యామా లతాః కుసుమభారనతప్రవాళాః
స్త్రీణాం హరన్తి ధృతభూషణబాహుకాన్తిమ్।
దన్తావభాసవిశదస్మితవక్త్రకాన్తిం
కఙ్కేళిపుష్పరుచిరా నవమాలతీ చ॥ 18

**పదవిభాగము:–** శ్యామాః లతాః కుసుమభారనతప్రవాళాః స్త్రీణామ్ హరన్తి ధృత భూషణబాహుకాంతిమ్ దన్త+అవభాసవిశదస్మితవక్త్రకాన్తిమ్ కంకేళిపుష్పరుచిరా నవమాలతీ చ.

**అన్వయక్రమము:–** కుసుమ భార నత ప్రవాళాః శ్యామాః లతాః స్త్రీణామ్ ధృత భూషణ బాహు కాన్తిమ్ హరన్తి కంకేళిపుష్ప రుచిరా నవమాలతీ చ దన్త అవభాస విశద స్మిత వక్త్రకాన్తిమ్ హరతి.

**ప్రతిపదార్థము:–** కుసుమ=పూల యొక్క, భార=భారముచే, నత=వంగిన, ప్రవాళాః =చిగురులుగల, శ్యామాః=ప్రేంకణ చెట్ల, లతాః=తీగలు, స్త్రీణామ్=స్త్రీల యొక్క, ధృత= ధరించబడిన, భూషణ=ఆభరణములు గల, బాహు=బాహువుల యొక్క, కాన్తిమ్= శోభను, హరన్తి=అపహరించుచున్నవి. కంకేళిపుష్ప=అశోకపూవులచే, రుచిరా= మనోహరమైన, నవమాలతీ చ=క్రొత్త జాజి తీగయు, దన్త=దన్తముల యొక్క, అవభాస=

కాంతిచే, విశద=స్వచ్ఛమైన, స్మిత=చిరునగవు గల, వక్త్రకాన్తిమ్= ముఖకాంతిని, హరతి= అపహరించుచున్నది.

**తాత్పర్యము:–** పూల బరువుచే వంగిన ప్రేంకణపు చెట్ల తీగ చిగుళ్ళు, ఆభరణములు ధరించిన స్త్రీల బాహువుల శోభను హరించుచున్నవి. అశోకపూవులతో కూడిన మనోహరమైన క్రొత్త జాజులు దన్తకాంతిచే స్వచ్ఛమైన చిరునగవు గల స్త్రీల ముఖ కాంతిని అపహరించుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కుసుమభారనతప్రవాళాః–కుసుమానాం భారః–కుసుమభారః–షష్ఠీ తత్పురుషః – తేన నతాః ప్రవాళాః యాసాం తాః–బహువ్రీహిః.

2) ధృతభూషణబాహుకాన్తిమ్–ధృతాని చ తాని భూషణాని, ధృతభూషణాని–కర్మధారయః–ధృతభూషణాః చ తే బాహవః – కర్మధారయః – తేషామ్ కాన్తిమ్ – షష్ఠీతత్పురుషః

3) దన్తావ ..... కాన్తిమ్–దన్తానామ్ అవభాసః–దన్తావభాసః–షష్ఠీతత్పురుషః –తేన విశదమ్–దన్తావభాసవిశదమ్–తృతీయాతత్పురుషః–దన్తావభాస విశదం చ తత్ స్మితమ్– కర్మధారయః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శ్యామవర్ణత్వాత్ శ్యామా–నల్లనిది. **'శ్యామా తు మహిలాహ్వయా'**, ప్రేంకణపు చెట్టు పేళ్ళు.

2) ప్రవాళ మఙ్కురేఽ ప్యస్త్రీ– ప్రవాళ శబ్దము చిగురునకును, అపిశబ్దము వలన పగడమునకు, వీణాదండమునకును పేరు. ప్రవళత ఇతి ప్రవాళమ్. వల సంచలనే. కదులునది.

c) **గుణము – మాధుర్య ప్రసాదములు**

d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :–** హరతి – పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము. దీని తిజ్ ప్రత్యయము తి.

**ధాతువు :– హృఞ్**–హృ–హరణే – తీసికొని పోవుట. దొంగిలించుట, నాశనము చేయుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ' కనుక హృ + అ + తి > హర్ + అ + తి > హర + తి > హరతి గా మారును.





శ్లో॥ కేశాన్నితాన్తఘననీలవికుంచితాగ్రా
నాపూరయన్తి వనితా నవమాలతీభిః।
కర్ణేషు చ ప్రవరకాఞ్చనకుట్మలేషు
నీలోత్పలాని వివిధాని నివేశయన్తి॥ 19

**పదవిభాగము:–** కేశాన్ + నితాన్తఘననీలవికుంచిత+అగ్రాన్+ఆపూరయన్తి వనితాః నవమాలతీభిః కర్ణేషు చ ప్రవరకాంచనకుట్మలేషు నీల+ఉత్పలాని వివిధాని నివేశయన్తి.

**అన్వయక్రమము:–** వనితాః నితాన్త ఘన నీల వికుంచిత అగ్రాన్ కేశాన్ నవమాలతీభిః ఆపూరయన్తి ప్రవర కాంచన కుట్మలేషు కర్ణేషు వివిధాని నీలోత్పలాని నివేశయన్తి.

**ప్రతిపదార్థము:–** వనితాః=స్త్రీలు, నితాన్త=మిక్కిలి, ఘన=దట్టమై, నీల=నల్లనై, వికుంచిత =ముడువబడిన, అగ్రాన్=చివరలు కలిగిన, కేశాన్=వెంట్రుకలను, నవమాలతీభిః =క్రొత్తజాజులచే, ఆపూరయన్తి=నింపుచున్నారు. ప్రవర=శ్రేష్ఠమైన, కాంచన=బంగారు, కుట్మలేషు=కమ్ములుగల, కర్ణేషు=చెవులయందు, వివిధాని=నానావిధములైన, నీలోత్పలాని=నల్లకలువలను, నివేశయన్తి=తురుముచున్నారు.

**తాత్పర్యము:–** స్త్రీలు మిక్కిలి దట్టమై నల్లని ముడువబడిన చివరలు గల వెంట్రుకలను జాజిపూలచే నింపుచున్నారు. శ్రేష్ఠమైన బంగారుకమ్ములు గల చెవులయందు నానావిధములైన నల్ల కలువలను తురుముచున్నారు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) నితాన్త.... వికుంచితాగ్రాన్–నితాన్తమ్ ఘన ఇవ నీలాః–నితాన్తఘననీలాః–ఉపమాన పూర్వపద కర్మధారయః సమాసః–విశేషేణ కుంచితః అగ్రః యేషాం తే వికుంచితాగ్రాః బహువ్రీహిః

2) ప్రవర ..... కుట్మలేషు–ప్రవరాణి కాఞ్చన కుట్మలాని యేషు తేషు–కర్మధారయః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కుంచతి వక్రతయా అల్పీభవతీతి కుంచితమ్. కుచ గతి కౌటిల్యాల్పీ భావయోః వంకరదొటచేత కొంచమై యుండునది. **అరాళం వృజినం జిహ్మం మూర్తి మత్కుంచితం నతమ్.**

2) కరోతి శబ్ద గ్రహణం కర్ణః, డుకృఞ్ కరణే. శబ్దగ్రహణమును చేయునది. **'కర్ణ శబ్దగ్రహౌ శ్రోత్రం శ్రుతిః స్త్రీ శ్రవణం శ్రవః'.**

c) **గుణము :– మాధుర్య ప్రసాదములు** d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :–** 'నివేశయన్తి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచన తిజ్ ప్రత్యయము 'అన్తి'. ని = ఉపసర్గ.

**ధాతువు :– విశ్** – ప్రవేశపెట్టుట – తురుముట. 6వ వికరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. ప్రేరణార్థకమున 'అయ' అను వికరణ ప్రత్యయమున, తిజ్ ప్రత్యయమైన అన్తి వలన 'నివేశయన్తి' గా మారును. నివిశ్ + అయ + అన్తి > నివేశయ + అన్తి > నివేశయ్ + అన్తి > నివేశయన్తి. (గుణము)

**శ్లో॥ హారైః సచన్దనరసైః స్తనమణ్డలాని**
**శ్రోణీతటం సువిపులం రశనాకలాపైః।**
**పాదామ్బుజాని కలనూపురశేఖరైశ్చ**
**నార్యః ప్రహృష్టమనసోఽద్య విభూషయన్తి॥ 20**

**పదవిభాగము:–** హారైః సచందనరసైః స్తనమణ్డలాని శ్రోణీతటమ్ సువిపులమ్ రశనా కలాపైః పాదాంబుజాని కలనూపురశేఖరైః+చ నార్యః ప్రహృష్టమనసః+అద్య విభూషయన్తి.

**అన్వయక్రమము:–** అద్య ప్రహృష్టమనసః నార్యః సచందనరసైః హారైః స్తనమణ్డలాని రశనా కలాపైః సువిపులమ్ శ్రోణీతటమ్ కల నూపురశేఖరైః పాదాంబుజాని విభూషయన్తి.

**ప్రతిపదార్థము:–** అద్య=ఈశరదృతువున, ప్రహృష్టమనసః=సంతోషమునొందిన మనస్సు గల, నార్యః=స్త్రీలు, సచందనరసైః=చన్దనరసముతో కూడిన, హారైః=హారములతో, స్తనమణ్డలాని=స్తనప్రదేశములను, రశనా=మొలనూళ్ళ యొక్క, కలాపైః=వడ్డాణములచే, సువిపులమ్=మిక్కిలి విశాలమగు, శ్రోణీతటమ్=పిఱుదుల ప్రదేశమును, కల=అవ్యక్త మధురమగు, నూపురశేఖరైః=శ్రేష్ఠమైన అందెలచే, పాదాంబుజాని=పాదపద్మములను, విభూషయన్తి=అలంకరించుచున్నారు.

**తాత్పర్యము:–** ఈ శరదృతువున సంతోషము నొందిన మనస్సు గల స్త్రీలు 1) చందనరసముతో కూడిన హారములతో స్తన ప్రదేశములను, 2) మొలనూళ్ళ వడ్డాణములచే మిక్కిలి పెద్దవగుపిఱుదులును, 3) మధురములగు శ్రేష్ఠములైన అందెలచే పాదపద్మములను అలంకరించుచున్నారు.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) ప్రహృష్టమనసః–ప్రహృష్టాని మనాంసి యాసాం తాః–బహుువ్రీహిః.
2) చందనరసైః – చందనస్య రసః – షష్ఠీతత్పురుషః.





3) స్తనమణ్డలాని–స్తనానాం మండలాని – షష్ఠీతత్పురుషః.
4) రశనాకలాపైః–రశనాయాః కలాపైః – షష్ఠీతత్పురుషః.
5) కలనూపురశేఖరైః–కలాని చ తాని నూపురాణి–కలనూపురాణి–కర్మధారయః –తేషాం–శేఖరైః–కలనూపురశేఖరైః–షష్ఠీతత్పురుషః.
6) పాదామ్బుజాని–పాదాః అమ్బుజాని ఇవ, పాదామ్బుజాని–ఉపమితసమాసః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శిఖరం శిరోఽగ్రం తస్యాయమితి శేఖరః. శిరస్సు మీద నుండునది. **'శిఖా స్వాపీడ శేఖరౌ'**
2) అశ్నోతి కటీమితి రశనా. అశూ వ్యాప్తౌ. స్త్రీల యొక్క మొలయందు వ్యాపించునది. పాఠాంతరము రసనా. **'స్త్రీ కట్యాం మేఖలా కాంచీ సప్తకీ రశనా తథా'.**

c) **గుణము – మాధుర్య ప్రసాదములు** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.

f) **అలంకారము:** రూపకము. లక్షణము 1వ శ్లోక భాగము చూడదగును. ఇందు 'పాదామ్బుజాని' అనుచోట పాదములను – పద్మములను సామ్యమున వర్ణించుటచే నిట రూపకాలంకారమున్నదని చెప్పదగును.

g) **క్రియాదర్శము :–** విభూషయన్తి – పరస్మైపది. లట్ ప్రథమపురుషఏకవచన తిజ్ ప్రత్యయము అన్తి.

**ధాతువు :– భూష్** – అలంకారే – అలంకరించుకొనుట. చురాది (10) ప్రకరణ ధాతువు. అయ వికరణ ప్రత్యయము. కనుక భూష్ + అయ + అన్తి > భూషయ + అన్తి > భూషయన్తి గా మారును.

2) మణ్డతి మణ్డయతి చ **భూషయత్యపి** భూషతి (ఆఖ్యాతచంద్రికా 2–1–11)

**శ్లో॥ స్ఫుటకుముదచితానాం రాజహంసాశ్రితానాం**
**మరకతమణిభాసా వారిణా భూషితానామ్।**
**శ్రియమతిశయరూపాం వ్యోమ తోయాశయానాం**
**వహతి విగతమేఘం చన్ద్రతారావకీర్ణమ్॥ 21**

**పదవిభాగము:–** స్ఫుటకుముదచితానామ్ రాజహంస+ఆశ్రితానామ్ మరకతమణి భాసా వారిణా భూషితానామ్ శ్రియమ్+అతిశయరూపామ్ వ్యోమ తోయ+ఆశయానామ్ వహతి విగతమేఘమ్ చంద్రతార+అవకీర్ణమ్.

**అన్వయక్రమము:–** స్ఫుట కుముద చితానామ్ రాజహంస ఆశ్రితానామ్ మరకతమణి

భాసా వారిణా భూషితానామ్ తోయాశయానామ్ అతిశయరూపామ్ శ్రియమ్ విగత మేఘమ్ చంద్ర తార అవకీర్ణమ్ వ్యోమ వహతి.

**ప్రతిపదార్థము:–** స్ఫుట=వికసించిన, కుముద=తెల్లకలువలచే, చితానామ్ = వ్యాపించ బడినవియు, రాజహంస=రాజహంసలచే, ఆశ్రితానామ్=ఆశ్రయించబడినవియు, మరకతమణి=మరకతమణి యొక్క భాసా=కాంతి వంటి కాంతి కలిగిన, వారిణా= నీటిచే, భూషితానామ్=అలంకరింపబడిన, తోయాశయానామ్=జలాశయముల యొక్క అతిశయరూపామ్=గొప్పసౌందర్యమైన, శ్రియమ్=శోభను, విగతమేఘమ్= మేఘములు లేని, చంద్ర=చంద్రునిచే, తార=నక్షత్రములచే, అవకీర్ణమ్=వ్యాప్తమైన, వ్యోమ= ఆకాశము, వహతి=వహించుచున్నది..

**తాత్పర్యము:–** వికసించిన తెల్లగలువలచే వ్యాపించబడినవియు, రాజహంసలచే ఆశ్రయించబడినవియు, మరకతమణి యొక్క కాంతివంటి కాంతి కలిగిన నీటిచే అలంకరింపబడినదియునగు జలాశయము యొక్క గొప్ప సౌందర్య శోభను మేఘములు లేని, తారాచంద్రులతో వ్యాప్తమై ఆకాశము వహించుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) విగతమేఘమ్–విగతాః మేఘా యస్మిన్ తత్–బహువ్రీహిః.
2) చంద్రతారావకీర్ణమ్–చంద్రశ్చ తారాశ్చ చంద్రతారాః ద్వంద్వః–తైః అవకీర్ణమ్ యత్ తత్ – తృతీయాతత్పురుషః
3) స్ఫుటకుముదచితానామ్–స్ఫుటాని చ తాని కుముదాని స్ఫుటకుముదాని– కర్మధారయః– తైః చితాః యే తే తేషామ్ – తృతీయాతత్పురుషః
4) రాజహంసాశ్రితానామ్–రాజహంసైః ఆశ్రితాః తథావిధానామ్– తృతీయా తత్పురుషః
5) మరకతమణిభాసా–మరకతమణేః భాః యస్మిన్ తేన–బహువ్రీహిః.
6) తోయాశయానామ్–తోయాని ఆశయే యేషామ్ తేషామ్– బహువ్రీహిః.
7) అతిశయరూపామ్–అతిశయమ్ రూపమ్–యస్యాః సా తామ్– బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) రాజహంసాస్తు తే చంచుచరణై రోహితైః స్సితాః. హంసేషు శ్రేష్ఠత్వాద్రాజహంసః హంసలలో శ్రేష్ఠమైనది రాజహంస.
2) మరం మరణం తకత్యనేనేతి మరకతమ్. తక హసనహసనయోః. విషహర మైనది గనుక దీని చేత మరణమును గెలుతురు. **గారుత్మతం మరకత**





మశ్మగర్భో హరిన్మణిః.

c) **గుణము – మాధుర్య ప్రసాదములు మరియు ఓజస్సు.** d) **రీతి – వైదర్భి**

e) **అలంకారము:** పదార్థ నిదర్శనాలంకారము. ఇందు జలాశయమును ఆకాశముతో పోల్చి వర్ణింపబడుటచే నిట 'పదార్థనిదర్శనాలంకార' మున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీ వృత్తము.

లక్షణము:

1) అతిశక్వరీ ఛందస్సునందు ప్రతిపాదములో 15 అక్షరము లుండును.
2) 'ననమయయయుతేయం మాలినీ భోగలోకైః' అని వృత్తలక్షణము.
3) న, న, మ, య, య గణములు 4) యతి (8, 7)

| ఉదా:–స్ఫు ట కు | ము ద చి | తా నాం రా | జ హం సా | శ్రి తా నామ్ |
|---|---|---|---|---|
| I I I | I I I | U U U | I U U | I U U |
| న | న | మ | య | య |

g) **క్రియాదర్శము :–** వహతి. – పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము. దీని తిజ్ ప్రత్యయము 'తి'.

**ధాతువు :– వహ** (వహ్) ప్రాపణే – మోయుట, ప్రవహించుట. ద్వికర్మకము. (ఉభయ) పరస్మైపది. భ్వాది (1) ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయము అ. కనుక వహ్ + అ + తి > వహతి గా మారును.

2) నృణాతి లమ్భయతి చ **వహత్యపి** నయత్యమూ। (ఆఖ్యాతచంద్రికా 2–3–16)

**శ్లో॥ శరది కుముదసఙ్గాద్వాయవో వాన్తి శీతా**
**విగతజలదబృన్దా దిగ్విభాగా మనోజ్ఞాః।**
**విగతకలుషమమ్భః శ్యానపఙ్కా ధరిత్రీ**
**విమలకిరణచన్ద్రం వ్యోమ తారావిచిత్రమ్॥ 22**

**పదవిభాగము:–** శరది కుముదసంగాత్+వాయవః వాన్తి శీతాః విగతజలదబృందాః దిగ్విభాగాః మనోజ్ఞాః విగతకలుషమ్+అమ్భః శ్యానపంకా ధరిత్రీ విమలకిరణచంద్రమ్ వ్యోమ తారావిచిత్రమ్.

**అన్వయక్రమము:–** శరది కుముద సంగాత్ వాయవః శీతాః వాన్తి విగత జలద బృందాః దిక్ విభాగాః మనోజ్ఞాః అంభః విగత కలుషమ్ ధరిత్రీ శ్యానపంకా విమల కిరణ చంద్రమ్ తారా విచిత్రమ్.

**ప్రతిపదార్థము:-** శరది=శరదృతువునందు, కుముద=కలువల యొక్క, సంగాత్ = సంబంధమువలన, వాయవః=వాయువులు, శీతాః=చల్లనివై, వాన్తి=వీచుచున్నవి, విగత=పోయిన, జలద=మేఘముల యొక్క, బృందాః=సమూహములు కలిగిన, దిక్=దిక్కులయొక్క, విభాగాః=ప్రదేశములు, మనోజ్ఞాః=మనోహరమైనవి. అంభః= నీరు, విగతకలుషమ్=నిర్మలమైయున్నది, ధరిత్రీ=భూమి, శ్యానపంకా=ఎండిన బురద గలదైయున్నది. విమల=స్వచ్ఛమైన, కిరణ=కిరణములు గల, చంద్రమ్=చంద్రుడు గల, వ్యోమ=ఆకాశము, తారా=నక్షత్రములచేత, విచిత్రమ్=విచిత్రమైయున్నది.

**తాత్పర్యము:-** శరత్కాలమునందు కలువల సంబంధము వలన వాయువులు చల్లనివై వీచుచున్నవి. మేఘముల అవరోధము లేనందున దిక్కుల ప్రాంతములన్నియు మనోహరముగానున్నవి. నీరు తేటపడినిర్మలమై యున్నది. భూమి ఎండిన బురదగలదై యున్నది. ఆకాశము స్వచ్ఛమైన కిరణములుగల చంద్రుడు చేతను, నక్షత్రగణముల చేతను విచిత్రముగనున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) కుముదసంగాత్ - కుముదానాం సంగాత్ - షష్ఠీతత్పురుషః.
2) దిగ్విభాగాః - దిశాం విభాగాః - షష్ఠీతత్పురుషః.
3) విగతజలదబృందాః - విగతాని జలదానాం బృందాని యేషాం తే - బహువ్రీహిః.
4) విగతకలుషమ్ - విగతం కలుషమ్ యస్మాత్ తత్ - బహువ్రీహిః.
5) శ్యానపంకా - శ్యానః పంకః యస్యాః సా - బహువ్రీహిః.
6) విమలకిరణచంద్రమ్ - విమలకిరణః చంద్రః యస్మిన్ తత్ - బహువ్రీహిః
7) తారావిచిత్రమ్ - తారాభిః విచిత్రమ్ - తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) శృణాతి పంకమితి శరత్. శృ-హింసాయామ్. అడుసును బోగొట్టునది. **'కాల ప్రభూతం శరదా'** అని త్రికాండశేషము. ఇది ఆశ్వయుజ కార్తికమాసము లతో గూడిన ఋతువు పేరు. **'అథ శరత్ స్త్రియామ్'.**
2) తరం త్యనయా నావికా ఇతి తారా. తారకాచ. తృ-ప్లవనతరణయోః - దీని చేత నావికులు తరింతురు. **నక్షత్రమృక్షం భం తారా.....**

c) **గుణము - ప్రసాదము మరియు ఓజో గుణము** d) **రీతి - వైదర్భి**

e) **అలంకారము:** 'స్వభావోక్తి'. లక్షణమునకై 2వ శ్లోక భాగము చూడదగును. ఇందు శరదృతువు ప్రకృతి సహజముగా వర్ణింపబడుటచే నిట 'స్వభావోక్త్యలంకార' మున్నదని చెప్పదగును.





f) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము.

g) **క్రియాదర్శము :-** 'వాన్తి' - పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. దీని తిజ్ ప్రత్యయము 'అన్తి'.

**ధాతువు :- వా** - గతి గన్ధనయోః - గమనము, పరిమళించుట. అదాది (2) ప్రకరణ ధాతువు. సకర్మకము, ఈ ప్రకరణ ధాతువుకు వికరణ ప్రత్యయము ఉండదు. కనుక వా + అన్తి > వాన్తి గా మారును.

2) పవతే వాతి వాతస్య....... (ఆఖ్యాతచంద్రికా 2-3-45)

**శ్లో॥ దివసకరమయూఖైర్బోధ్యమానం ప్రభాతే**
**వరయువతిముఖాభం పఙ్కజం జృమ్భతేఽద్య।**
**కుముదమపి గతేఽస్తం లీయతే చన్ద్రబిమ్బే**
**హసితమివ వధూనాం ప్రోషితేషు ప్రియేషు॥ 23**

**పదవిభాగము:-** దివసకరమయూఖైః+బోధ్యమానమ్ ప్రభాతే వరయువతిముఖ+ ఆభమ్ పంకజమ్ జృంభతే+అద్య కుముదమ్+అపి గతే+అస్తమ్ లీయతే చంద్రబింబే హసితమ్+ఇవ వధూనామ్ ప్రోషితేషు ప్రియేషు.

**అన్వయక్రమము:-** అద్య దివసకర మయూఖైః బోధ్యమానమ్ పంకజమ్ ప్రభాతే వర యువతి ముఖ ఆభమ్ జృంభతే చంద్రబింబే అస్తం గతే కుముదమపి ప్రియేషు ప్రోషితేషు వధూనామ్ హసితమివ లీయతే.

**ప్రతిపదార్థము:-** అద్య=ఈ శరదృతువులో, దివసకర=సూర్యుని యొక్క, మయూఖైః =కిరణములచే, బోధ్యమానమ్=వికసింపజేయబడు, పంకజమ్=పద్మము, ప్రభాతే= ప్రాతఃకాలమునందు, వర=ఉత్తమమైన, యువతి=స్త్రీ యొక్క, ముఖ=ముఖముయొక్క, ఆభమ్=కాంతివంటి కాంతిగలదై, జృంభతే=వికసించుచున్నది. చంద్రబింబే= చంద్ర బింబము, అస్తంగతే=అస్తమింపగా, కుముదమపి=కలువపూవు కూడ, ప్రియేషు= ప్రియులు, ప్రోషితేషు=దేశాంతరగతులై యుండగా, వధూనామ్=స్త్రీలయొక్క, హసితమివ=నవ్వువలె, లీయతే=ద్రవించిపోవుచున్నది (ముకుళించు).

**తాత్పర్యము:-** శరదృతువులో సూర్యుని యొక్క కిరణములచే వికసింపజేయబడు పద్మము, ప్రాతఃకాలము నందు ఉత్తమస్త్రీ యొక్క ముఖకాంతి వంటి కాంతిగలదై వికసించు చున్నది. చంద్రబింబము అస్తమింపగా కలువ పూవుకూడ ప్రియులు దేశాంతరగతులై యుండగా స్త్రీల యొక్క నవ్వువలె ముకుళించుకొని పోవుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-** 1) దివసకరమయూఖైః - దివసకరస్య మయూఖైః - షష్ఠీతత్పురుషః

2) వరయువతిముఖాభమ్ – వరాణాం యువతీనామ్ – ముఖమ్ – వరయువతి ముఖమ్ – షష్ఠీతత్పురుషః – వరయువతిముఖస్య ఆభా ఇవ ఆభా యస్య తత్ – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) అస్తమ్ – ఇదికానరాకుండుట యందు వర్తించును. అదర్శనం దర్శనాభావః నాశప్రయుక్తః తిరోభావప్రయుక్తో వా. తత్ర ఉభయత్ర మాంతమస్తమిత్యవ్యయం వర్తతే. యథా – 'అస్తంగతో భాస్కర' ఇతి **'అస్తమదర్శనే'.**

c) **గుణము – మాధుర్య ప్రసాదములు** d) **రీతి – వైదర్భి**

e) **అలంకారము:** 'ఉపమా'. లక్షణము 4వ శ్లోక భాగమున చెప్పబడినది. ఇందు కలువపూవును స్త్రీ యొక్క నవ్వుతో పోల్చి వర్ణింపబడుటచే నిట 'ఉపమాలంకార' మున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీ వృత్తము.

g) **క్రియాదర్శము :–** లీయతే – ఆత్మనేపది. లట్ వ్యోమ=ఆకాశము, ప్రథమపురుషైక వచనము. దీని తిజ్ ప్రత్యయము 'తే'.

**ధాతువు :–** లీ – శ్లేషణే – ముకుళించుకొనుట, అంటిపెట్టుకొనుట. దివాది (4) ప్రకరణ ధాతువు. 'య' వికరణ ప్రత్యయము. కనుక లీ + య + తే > లీయతే గా మారును.

**శ్లో॥ అసితనయనలక్ష్మీం లక్షయిత్వోత్పలేషు**
**క్వణితకనకకాఞ్చీం మత్తహంసస్వనేషు।**
**అధరరుచిరశోభాం బన్ధుజీవే ప్రియాణాం**
**పథికజన ఇదానీం రోదితి భ్రాన్తచిత్తః॥ 24**

**పదవిభాగము:–** అసితనయనలక్ష్మీమ్ లక్షయిత్వా+ఉత్పలేషు క్వణితకనకకాంచీమ్ మత్తహంసస్వనేషు అధరరుచిరశోభామ్ బన్ధుజీవే ప్రియాణామ్ పథికజనః ఇదానీమ్ రోదితి భ్రాన్తచిత్తః.

**అన్వయక్రమము:–** ఇదానీమ్ పథికజనః ప్రియాణామ్ అసిత నయన లక్ష్మీమ్ ఉత్పలేషు క్వణిత కనకకాంచీమ్ మత్త హంస స్వనేషు అధర రుచిర శోభామ్ బన్ధుజీవే లక్షయిత్వా భ్రాన్త చిత్తః రోదితి.

**ప్రతిపదార్థము:–** ఇదానీమ్=ఇప్పుడు, పథికజనః=పథికజనము, ప్రియాణామ్= ప్రియురాండ్రయొక్క, అసిత=నల్లని, నయన=కన్నుల యొక్క, లక్ష్మీమ్=శోభను, ఉత్పలేషు =కలువలయందును, క్వణిత=ధ్వనించు, కనకకాంచీమ్=బంగారు మొలనూలును,





మత్త=మదించిన, హంస=హంసలయొక్క, స్వనేషు=ధ్వనులయందును, అధర=పెదవి యొక్క, రుచిర=మనోహరమైన, శోభామ్=శోభను, బన్ధుజీవే=మంకెనపూవు నందును, లక్షయిత్వా=కనుగొని, భ్రాన్త=భ్రమించిన, చిత్తః=చిత్తముగలదై, రోదితి=ఏడ్చుచున్నది.

**తాత్పర్యము:–** శరత్కాలమున పథికజనులు ప్రియురాండ్ర నల్లని కన్నుల శోభను కలువలయందును, 2) ధ్వనించు బంగరు మొలనూలును మదించిన హంసల ధ్వనులయందును, 3) మనోహరమగు పెదవి శోభను మంకెన పూవునందును కనుగొని భ్రమించిన చిత్తము గలదై ఏడ్చుచున్నారు.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) అసితనయనలక్ష్మీమ్ – అసితే చ తే నయనే అసితనయనే – కర్మధారయః – అసితనయనయోః లక్ష్మీమ్ – షష్ఠీతత్పురుషః.

2) మత్తహంసస్వనేషు – మత్తాఃచ తే హంసాః – కర్మధారయః – తేషాం స్వనేషు – షష్ఠీతత్పురుషః.

3) క్వణితకనకకాంచీమ్ – కనకస్య కాంచీ షష్ఠీతత్పురుషః–క్వణితా, చ సా కనకకాంచీ తాం క్వణితకనకకాంచీమ్ – కర్మధారయః.

4) అధరరుచిరశోభామ్ – రుచిరా చ సా శోభా – రుచిరశోభా – కర్మధారయః – అధరస్య రుచిర శోభా తామ్ – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) పంథానం గచ్ఛతీతి పాంథః పథికశ్చ, త్రోవనడచువాడు. **'అధ్వనీనోఽధ్వగో ఽధ్వన్యః పాన్థః పథిక ఇత్యపి',**

2) బంధూన్ జీవయతి బంధుజీవకః. జీవ – ప్రాణధారణే. తనకు బంధువులై యుండు తుమ్మెదలను బ్రతికించునది. **'రక్తకస్తు బన్ధూకో బన్ధుజీవకః'.**

c) **గుణము – మాధుర్య ప్రసాదములు** d) **రీతి – వైదర్భి**

e) విప్రలంభశృంగారరసము ఇందు వర్ణింపబడినది.

f) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీ వృత్తము.

g) **క్రియాదర్శము :–** రోదితి. పరస్మైపది. లట్ ప్రథమపురుషఏకవచనము.

**ధాతువు :–** రుద్ – అశ్రు విమోచనే – కన్నీరొలుకుట. అకర్మకము. అదాది (2) ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయముండదు.

1. దృధ ప్రత్యయములు పరమగునపుడు దానికి ముందున్న భాగములో ఉపధయగు హ్రస్వ ఇక్కునకు గుణము వచ్చును.

2. రుదాదిభ్యః సార్వ ధాతుకే. అనురెండు సూత్రముల వలన (ఇడాగమము)
కనుక రుద్ + తి > రుద్ + ఇతి > రోద్ + ఇతి > రోదితి గా మారును.

2) కన్దతి క్రన్దతి క్లన్దత్యస్రయత్యపి **రోదితి,**
బాష్పాయతే విలపతి తేవతే పరిదేవతే ......... (ఆఖ్యాతచంద్రికా 1-3-17)

**శ్లో॥ స్త్రీణాం విహాయ వదనేషు శశాఙ్కలక్ష్మీం**
**వామం చ హంసవచనం మణినూపురేషు।**
**బన్ధూకకాన్తిమధరేషు మనోహరేషు**
**క్వాపి ప్రయాతి సుభగా శరదాగమశ్రీః॥ 25**

**పదవిభాగము:-** స్త్రీణామ్ విహాయ వదనేషు శశాంకలక్ష్మీమ్ వామమ్ చ హంస వచనమ్ మణినూపురేషు బంధూకకాన్తిమ్+అధరేషు మనోహరేషు క్వాపి ప్రయాతి సుభగా శరత్+ఆగమశ్రీః.

**అన్వయక్రమము:-** సుభగా శరత్ ఆగమశ్రీః శశాంక లక్ష్మీమ్ స్త్రీణామ్ వదనేషు వామమ్ హంస వచనమ్ మణినూపురేషు బంధూక కాంతిమ్ మనోహరేషు అధరేషు విహాయ క్వాపి ప్రయాతి.

**ప్రతిపదార్థము:-** సుభగా=మనోహరమైన, శరత్=శరదృతువు యొక్క, ఆగమశ్రీః =రాకయందలి శోభ; శశాంక=చంద్రుని యొక్క, లక్ష్మీమ్=శోభను, స్త్రీణామ్=స్త్రీల యొక్క, వదనేషు=ముఖములయందును, వామమ్=సుందరమైన, హంస=హంసల యొక్క, వచనమ్=ధ్వనిని, మణినూపురేషు=మణులున్న అందెలయందును, బంధూక= మంకెన పూల, కాంతిమ్=కాంతిని, మనోహరేషు=మనోహరమైన, అధరేషు= పెదవులయందు, విహాయ=విడచి, క్వాపి=ఎచటికో, ప్రయాతి=వెడలుచున్నది.

**తాత్పర్యము:-** మనోహరమగు శరదృతువు తనరాక యందలి శోభను 1) చంద్రుని శోభను స్త్రీల ముఖములయందు, 2) సుందరమైన హంసల ధ్వనిని స్త్రీల యొక్క మణులున్న అందెలయందు, 3) మంకెన పూవుల కాంతిని స్త్రీల యొక్క మనోహరమగు పెదవులయందు విడచి ఎచటికో వెడలుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) శశాంకలక్ష్మీమ్ - శశాంకస్య లక్ష్మీమ్ - షష్ఠీతత్పురుషః.
2) హంసవచనమ్ - హంసానామ్ వచనమ్ - షష్ఠీతత్పురుషః.
3) మణినూపురేషు - మణీనామ్ నూపురేషు - షష్ఠీతత్పురుషః.





4) బంధూకకాన్తిమ్ - బంధూకానామ్ - కాన్తిమ్ - షష్ఠీతత్పురుషః.
5) శరదాగమశ్రీః - శరదః ఆగమః - శరదాగమః - షష్ఠీతత్పురుషః - తస్య శ్రీః - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) **భగః శ్రీ కామమాహాత్మ్య వీర్యయత్నార్క కీర్తిషు.** భగశబ్దము ఐశ్వర్యమునకును, ఇచ్చకును, దొడ్డతనమునకును, శక్తికిని, ప్రయత్నమునకును, సూర్యునికిని, కీర్తికిని పేరు. భజ్యత ఇతి భగః భజ సేవాయామ్. ఆశ్రయింపబడునది.

c) **గుణము - మాధుర్య ప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) సంభోగశృంగారోద్దీవన విభావన వర్ణనము చేయబడినది.

f) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - వసన్తతిలకా వృత్తము.

g) **క్రియాదర్శము :-** ప్రయాతి. పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము. ప్ర=ఉపసర్గ.

**ధాతువు :-** యా. ధాతువివరములు ఇంతకుముందు చెప్పబడినవి.

**శ్లో॥ వికచకమలవక్త్రా ఫుల్లనీలోత్పలాక్షీ**
**వికసితనవకాశశ్వేతవాసో వసానా।**
**కుముదరుచిరకాన్తిః కామినీవోన్మదేయం**
**ప్రతిదిశతు శరద్వశ్చేతసః ప్రీతిమగ్ర్యామ్॥ 26**

**పదవిభాగము:-** వికచకమలవక్త్రా ఫుల్లనీల+ఉత్పల+అక్షీ వికసితనవకాశశ్వేత వాసః వసానా కుముదరుచిరకాన్తిః కామినీ+ఇవ+ఉన్మదా+ఇయమ్ ప్రతిదిశతు శరత్+వః +చేతసః ప్రీతిమ్+అగ్ర్యామ్.

**అన్వయక్రమము:-** వికచ కమల వక్త్రా ఫుల్ల నీల ఉత్పల అక్షీ వికసిత నవ కాశ శ్వేత వాసః వసానా కుముద రుచిర కాన్తిః ఇయమ్ శరత్ ఉన్మదా కామినీవ వః చేతసః అగ్ర్యామ్ ప్రీతిమ్ ప్రతిదిశతు.

**ప్రతిపదార్థము:-** వికచ=వికసించిన, కమల=కమలమే, వక్త్రా=ముఖముగా కలదై, ఫుల్ల=విరిసిన, నీల=నల్లని, ఉత్పల=కలువలే, అక్షీ=కన్నులుగా కలదై, వికసిత= వికసించిన, నవ=క్రొత్త, కాశ=తెల్లుపూవుచే, శ్వేత=తెల్లని, వాసః=వస్త్రముగా, వసానా =ధరించినదై, కుముద=కలువవలె, రుచిర=మనోహరమగు, కాన్తిః=కాంతి కలిగిన, ఇయమ్=ఈ, శరత్=శరదృతువు, ఉన్మదా=మదించిన, కామినీవ=ప్రేయసి వలె, వః =మీ అందరియొక్క, చేతసః=మనస్సులకు, అగ్ర్యామ్=ఉత్తమమైన, ప్రీతిమ్= ప్రీతిని,

ప్రతిదిశతు=కలిగించుగాక.

**తాత్పర్యము:-** వికసించిన కమలమే ముఖముగా కలదై, విరిసిన నల్లని కలువలే కన్నులుగా కలదై, వికసించిన క్రొత్త తెల్లుపూలే తెల్లని వస్త్రముగా ధరించి మనోహరమగు కాంతి కలిగిన ఈ శరదృతువు మదించిన ప్రేయసివలె మీ అందఱి మనస్సులకు ఉత్తమమైన ప్రీతిని కలిగించుగాక.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) వికచకమలవక్త్రా-వికచమ్ కమలమేవ వక్త్రం యస్యాః సా - బహువ్రీహిః
2) ఫుల్లనీలోత్పలాక్షీ - ఫుల్లాని -నీలోత్పలాని ఏవ అక్షిణీ యస్యాః - సా - బహువ్రీహిః.
3) వికసిత .... వాసః - వికసితః నవః కాశ ఏవ శ్వేతమ్ వాసః - తత్ కర్మధారయః
4) కుముదరుచిరకాన్తిః - కుముదైః రుచిరా కాన్తిః యస్యాః సా - బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) చేతయతీతి చిత్తం. చేతశ్చ. చితీ - సంజ్ఞానే. తెలియజేయునది.
**'చిత్తం తు చేతో హృదయం స్వాన్తం హృన్మానసం మనః'.**

c) **గుణము - మాధుర్య ప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము.

g) **క్రియాదర్శము :-** ప్రతిదిశతు. పరస్మైపది. లట్ ప్రథమపురుషఏకవచనము. ప్రతి=ఉపసర్గ.

**ధాతువు :- దిశ్**-అతిసర్జనే-కలిగించుట. తుదాది (6) ప్రకరణ ధాతువు. వికరణప్రత్యయము 'అ'. మొదటి వర్గ (1, 4, 6, 10 గణములు) ధాతువులకు లోట్ ప్రథమపురుషతిజ్ ప్రత్యయములు. తు(ఏకవచనం), తామ్ (ద్వివచనం), అంతు (బహువచనం). కనుక దిశ్+అ+తు > దిశతు, దిశతామ్, దిశన్తు.

2) దదాతి నిర్వపతి చ దధాత్యపి చ దాశతి, సనోతి దాసతి దిశత్యాత్మనే సప్త యచ్ఛతి (ఆఖ్యాతచంద్రికా 2-2-11)

**శ్రీః**





**శ్రీః**

**మహాకవి కాళిదాస విరచితః**

# ఋతుసంహారః

# హేమన్తవర్ణనం నామ చతుర్థః సర్గః

**అథ క్రమప్రాప్తం హేమన్తకాలం వర్ణయతి.**

**శ్లో॥ నవప్రవాళోద్గమసస్యరమ్యః**
**ప్రఫుల్లలోధ్రః పరిపక్వశాలిః।**
**విలీనపద్మః ప్రపతత్తుషారో**
**హేమన్తకాలః సముపాగతోఽయమ్॥ 1**

**పదవిభాగము:-** నవప్రవాళ+ఉత్+గమసస్యరమ్యః ప్రఫుల్లలోధ్రః పరిపక్వశాలిః విలీన పద్మః ప్రపతత్+తుషారః హేమన్తకాలః సముపాగతః+అయమ్.

**అన్వయక్రమము:-** నవ ప్రవాళ ఉద్గమ సస్య రమ్యః ప్రఫుల్ల లోధ్రః పరిపక్వ శాలిః విలీనపద్మః ప్రపతత్ తుషారః అయమ్ హేమంతకాలః సముపాగతః.

**ప్రతిపదార్థము:-** నవ=క్రొత్త, ప్రవాళ=చిగుళ్ళయొక్క, ఉద్గమ=పుట్టుకచేతను, సస్య=సస్యములచేతను, రమ్యః=రమ్యమైనదియు, ప్రఫుల్ల=వికసించిన, లోధ్రః=తెల్లలొద్దుగు చెట్టుగలదియు, పరిపక్వ=పండిన, శాలిః=వరికలిగినదియు, విలీనపద్మః=వాడిన కమలములు గలదియు, ప్రపతత్=పడుచున్న, తుషారః=మంచుగలదియు అగు, అయమ్=ఈ, హేమంతకాలః=హేమంతఋతువు, సముపాగతః=వచ్చినది.

**తాత్పర్యము:-** క్రొత్తచిగుళ్ళ పుట్టుకచేత సస్యములచేత రమ్యమైనదియు, వికసించిన తెల్లని లొద్దుగుచెట్టు గలదియు, పండిన వరిగలదియు, వాడిన కమలములు గలదియు, కురియుచున్న మంచుగలదియునైన హేమంత ఋతువు వచ్చినది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) నవ.. రమ్యః-నవశ్చాసౌ ప్రవాళః, నవప్రవాళః-కర్మధారయః-తేషాం ఉద్గమైః నవప్రవాళోద్గమైః-షష్ఠీతత్పురుషః నవప్రవాళోద్గమైః సస్యైః రమ్యః తృతీయా తత్పురుషః
2) ప్రఫుల్లలోధ్రః - ప్రఫుల్లో లోధ్రో యస్మిన్ సః-బహువ్రీహిః.
3) ప్రపతత్తుషారః - ప్రపతన్ తుషారో యస్మిన్ సః-బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) హిమేన హంతీతి హేమంతః. హన హింసాగత్యోః. చలిచేత జనులను హింసించునది. మార్గశిర పుష్యమాసములతో గూడిన ఋతువు పేరు.

2) రుణద్ధి అతిసారాదికమ్ లోధ్రః. రుధిర్ ఆవరణే. రలయోరభేదః అతిసారాదుల నడ్డపెట్టునది. తెల్లలొద్దుగు చెట్టు పేరు.

c) **గుణము** :– ప్రసాదము మరియు ఓజస్సు

d) **రీతి** :– వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – ఉపజాతివృత్తము

లక్షణము: 1) త్రిష్టుభ్ ఛందమున ప్రతిపాదమునకు 11 అక్షరములుండును.
2) ఉపేన్ద్రవజ్రా ప్రథమే లఘౌసా, 3) స్యాదిన్ద్రవజ్రా యది తాజగౌగః
4) గణములు: జ, త, జ, గ, గ 5) యతి (5,6)
6) పై '2' వృత్తపాదముల సమ్మిళితము ఉపజాతిగా పేర్కొనబడును.

ఉదా:– న వ ప్ర | వా లో ధ్ర | మ స స్య | ర మ్యః.
I U I | U U I | I U I | U U
జ | త | జ | గ గ

ఉదా:– హే మ న్త | కా లః స | ము పా గ | తో యమ్
U U I | U U I | I U I | U U
త | త | జ | గ గ

g) **క్రియాదర్శము :– సముపాగతః –** 'క్త' ప్రత్యయాంతము. నామవాచక రూపము ననుసరించి మూడు లింగములలోనికి మారును. మిగిలిన వివరములు మొదటి సర్గ మొదటి శ్లోకమున చూడగలరు.

**శ్లో॥ మనోహరైః కుఙ్కుమరాగరక్తై**
**స్తుషారకున్దేన్దునిభైశ్చ హారైః।**
**విలాసినీనాం స్తనశాలినీనా**
**మలంక్రియన్తే స్తనమణ్డలాని ॥ 2**

**పదవిభాగము:–** మనోహరైః కుంకుమరాగరక్తైః తుషారకున్ద+ఇన్దునిభైః+చ హారైః విలాసినీనామ్ స్తనశాలినీనామ్+అలంక్రియన్తే స్తనమణ్డలాని.

**అన్వయక్రమము:–** స్తన శాలినీనామ్ విలాసినీనామ్ స్తనమండలాని మనోహరైః కుంకుమ రాగ రక్తైః తుషార కుంద ఇందు నిభైః+చ హారైః అలంక్రియన్తే.





**ప్రతిపదార్థము:–** స్తన=స్తనములచే, శాలినీనామ్=ప్రకాశించుచుండెడు, విలాసినీనామ్ =విలాసవతులయొక్క, స్తనమండలాని=స్తనమండలములు, మనోహరైః=మనోహరము లైన, కుంకుమ=కుంకుమయొక్క, రాగ=ఎఱుపుచే, రక్తైః=ఎఱ్ఱనైనవియు, తుషార= మంచు తోను, కుంద=మల్లెతోను, ఇందు=చంద్రునితోడను, నిభైః=సమానములగు, హారైః =హారములచే, అలంక్రియన్తే=అలంకరింపబడుచున్నవి.

**తాత్పర్యము:–** స్తనములచే ప్రకాశించెడు విలాసవతుల యొక్క స్తనమండలములు మనోహరములైన కుంకుమ యొక్క ఎఱుపుచే ఎఱ్ఱనైనవియు; మంచు, మల్లె, చంద్రునితో సమానమగు హారములచే అలంకరింపబడుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కుంకుమరాగ రక్తైః – కుంకుమస్యరాగః, కుంకుమరాగః–షష్ఠీతత్పురుషః –తేన రక్తైః, కుంకుమరాగరక్తైః–తృతీయాతత్పురుషః.

2) తుషార ...... నిభైః–తుషారశ్చ కుందశ్చ ఇందుశ్చ, తుషారకున్దేన్దవః–ద్వంద్వః –తేషాం నిభైః – షష్ఠీతత్పురుషః.

3) స్తనశాలినీనామ్ – స్తనాభ్యాం శాలన్తే యాః తాసామ్ – కృత్సమాసః

4) స్తనమణ్డలాని – స్తనానాం మణ్డలాని – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) శుష్కదశాయాం కుమితి కూయతే కుంకుమం. కు శబ్దే, ఎండినప్పుడు కుమని పలుకునది.

c) **గుణము** :– మాధుర్య ప్రసాదములు

d) **రీతి** :– వైదర్భి

e) **అలంకారము : 'ఉపమా'.**

'తుషారకున్దేందునిభైః' – అనుచోట ఉపమాలంకారము. లక్షణము ముందుసర్గలలో చెప్పబడినది.

f) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – ఉపేన్ద్రవజ్రా వృత్తము.

g) **క్రియాదర్శము – అలంక్రియన్తే :–** ఆత్మనేపది. లట్ ప్రథమపురుషబహువచనము. 'అన్తే'–తిఙ్ ప్రత్యయము. అలమ్ = గతి సంజ్ఞ, కర్మణి ప్రయోగము.

**ధాతువు :–** కృ. సకర్మకధాతువు – కర్మార్థకము. క్రియతే – ఏకవచనము, క్రియన్తే –బహువచనము.

భావకర్మార్థక లకారములు ఆత్మనేపదమునందే ఉండును. అందుభావార్థమున ప్రథమైకవచనము మాత్రమే ఉండును. కర్మార్థమున అన్నివచనములు ఉండును.

**శ్లో॥ న బాహుయుగ్మేషు విలాసినీనాం**
**ప్రయాన్తి సఙ్గం వలయాఙ్గదాని।**
**నితమ్బబిమ్బేషు నవం దుకూలం**
**తన్వంశుకం పీనపయోధరేషు॥ 3**

**పదవిభాగము:–** న బాహుయుగ్మేషు విలాసినీనామ్ ప్రయాన్తి సంగం వలయ+ అంగదాని నితంబబింబేషు నవమ్ దుకూలమ్ తన్వంశుకమ్ పీన పయోధరేషు.

**అన్వయక్రమము:–** విలాసినీనామ్ బాహుయుగ్మేషు వలయ అంగదాని సంగమ్ న ప్రయాన్తి నితంబబింబేషు నవమ్ దుకూలమ్ పీన పయోధరేషు తన్వంశుకమ్ సంగమ్ న ప్రయాన్తి.

**ప్రతిపదార్థము:–** విలాసినీనామ్=విలాసవతులయొక్క, బాహుయుగ్మేషు=బాహువుల జంటలయందు, వలయ=కంకణములును, అంగదాని=దండకడియములును, సంగమ్ =సంబంధమును, న ప్రయాన్తి=పొందు చుండలేదు, నితంబబింబేషు=పిఱుదులయందు, నవమ్=క్రొత్తదగు, దుకూలమ్=పట్టువస్త్రమును, పీన=బలిసిన, పయోధరేషు=స్తనముల యందు, తన్వంశుకమ్=సన్నని (పలుచని) వలువను, సంగమ్= సంబంధమును, న ప్రయాన్తి=పొందుచుండలేదు.

**తాత్పర్యము:–** (హేమన్తఋతువున) విలాసవతులు తమ చేతులకు కంకణకడియములు ధరింపకున్నారు. పిఱుదులయందు క్రొత్తదగు పట్టువస్త్రమును, బలిసిన స్తనముల యందు పలుచని వలువను ధరింపకున్నారు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) బాహుయుగ్మేషు–బాహూనాం యుగ్మేషు–షష్ఠీతత్పురుషః.
2) వలయాంగదాని – వలయం చ అంగదం చ,వలయాంగదే తాని, వలయాంగ దాని – ద్వంద్వః.
3) నితమ్బబింబేషు–నితమ్బానాం బింబేషు – షష్ఠీతత్పురుషః.
4) పీనపయోధరేషు–పీనాశ్చ తే పయోధరాః తేషు – కర్మధారయః.
5) తన్వంశుకమ్ – తను చ తత్ అంశుకమ్ – కర్మధారయః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) ప్యాయతే ఇతి పీనం. వృద్ధిబొందునది గనుక పీనం. **'పీన పీన్నీ తు స్థూలపీవరే'**





c) **గుణము** :– మాధుర్యప్రసాదములు d) **రీతి** :– వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – ఉపజాతివృత్తము.

f) **క్రియాదర్శము :–** 'ప్రయాన్తి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము.
ప్ర = ఉపసర్గ.

**ధాతువు :–** యా. వివరములు ముందుసర్గ శ్లోకభాగములలో చూడగలరు.

**శ్లో॥ కాఞ్చీగుణైః కాఞ్చనరత్నచిత్రై**
**ర్నో భూషయన్తి ప్రమదా నితమ్బమ్।**
**న నూపురైర్హంసరుతం భజద్భిః**
**పాదామ్బుజాన్యమ్బుజకాన్తిభాఞ్జి॥ 4**

**పదవిభాగము:–** కాంచీగుణైః కాంచనరత్నచిత్రైః+నో భూషయన్తి ప్రమదాః నితంబమ్ న నూపురైః+హంసరుతమ్ భజద్భిః పాదామ్బుజాని+అమ్బుజకాంతిభాంజి.

**అన్వయక్రమము:–** ప్రమదాః కాంచన రత్న చిత్రైః కాంచీగుణైః నితంబమ్ హంస రుతమ్ భజద్భిః నూపురైః అంబుజ కాంతి భాంజి పాదామ్బుజాని నో భూషయన్తి.

**ప్రతిపదార్థము:–** ప్రమదాః=స్త్రీలు, కాంచన=బంగారుచేతను, రత్న=రత్నములచేతను, చిత్రైః=చిత్రములైన, కాంచీగుణైః=మొలనూళ్ళతో, నితంబమ్=పిఱుదును, హంసరుతమ్ =హంసధ్వనిని, భజద్భిః=పొందుచుండెడు, నూపురైః=అందెలచే, అంబుజ=పద్మము యొక్క, కాంతి=కాంతిని, భాంజి=పొందెడి, పాదామ్బుజాని=పాదపద్మములను, నో భూషయన్తి=అలంకరించుచుండలేదు.

**తాత్పర్యము:–** స్త్రీలు బంగారము రత్నములతో నిర్మితమైన మొలనూళ్ళతో పిఱుదును, హంసధ్వనిని పొందుచుండెడు అందెలచే పద్మముయొక్క కాంతిని పొందెడు పాద పద్మములను అలంకరించుచుండలేదు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కాంచనరత్నచిత్రైః– కాంచనైః రత్నైః చిత్రాః, కాంచనరత్నచిత్రాః – తృతీయా తత్పురుషః
2) కాంచీగుణైః–కాంచ్యాః గుణైః–కాంచీగుణైః – షష్ఠీతత్పురుషః.
3) అంబుజకాంతిభాంజి – అంబుజానాం కాన్తిః, అంబుజకాన్తిః – షష్ఠీతత్పురుషః – తస్యాః భాక్ తాని – కృత్సమాసః
4) పాదామ్బుజాని – పాదా ఏవ అమ్బుజాని – పాదామ్బుజాని–కర్మధారయః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) సురత సమ్మర్దేన నితరాం తామ్యతి నితంబః. తము గ్లానౌ. సురత సమ్మర్దము చేత మిక్కిలి గాసి బొందునది. **'పశ్చాత్ నితంబః స్త్రీకట్యాః'.**

2) రూయత ఇతి రుతమ్.రు శబ్దే, పలుకబడునది.**'తిరశ్చాం వాశితం రుతమ్'.**

c) **గుణము :- మాధుర్యప్రసాదములు** d) **రీతి :- వైదర్భి**

e) **అలంకారము : రూపకము.** 'పాదామ్బుజాని' -అనుచోట పాదము అంబుజము అభేదముగా వర్ణింపబడుటచే నిది రూపకమగును. లక్షణము పూర్వము చెప్పబడినది.

f) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతివృతము.

g) **క్రియాదర్శము :-** భూషయన్తి-పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనం. అన్తి తిజ్ ప్రత్యయము.

**ధాతువు: భూష్** అలంకారే - అలంకరించుట. చురాది (10) ప్రకరణ ధాతువు. 'అయ' వికరణ ప్రత్యయము. భూష్+అయ+అన్తి > భూషయ+అన్తి > భూషయన్తి గా మారును.

**శ్లో|| గాత్రాణి కాలీయకచర్చితాని**
**సపత్రలేఖాని ముఖామ్బుజాని|**
**శిరాంసి కాలాగురుధూపితాని**
**కుర్వన్తి నార్యః సురతోత్సవాయ|| 5**

**పదవిభాగము:-** గాత్రాణి కాలీయకచర్చితాని సపత్రలేఖాని ముఖాంబుజాని శిరాంసి కాలాగురుధూపితాని కుర్వన్తి నార్యః సురత+ఉత్సవాయ.

**అన్వయక్రమము:-** నార్యః సురతోత్సవాయ గాత్రాణి కాలీయక చర్చితాని ముఖాంబుజాని సపత్రలేఖాని శిరాంసి కాలాగురు ధూపితాని కుర్వన్తి.

**ప్రతిపదార్థము:-** నార్యః=స్త్రీలు, సురతోత్సవాయ=రతికేళికొఱకు, గాత్రాణి= శరీరములను, కాలీయక=నల్లచందనముచే, చర్చితాని=పూయబడినవిగను, ముఖాంబుజాని =ముఖపద్మములను, సపత్రలేఖాని=మకరికాపత్రములతో కూడినవిగను, శిరాంసి= శిరస్సులను, కాలాగురు=నల్లని అగరుచే, ధూపితాని= ధూపమువేయబడినవిగను, కుర్వన్తి=చేయుచున్నారు.

**తాత్పర్యము:-** స్త్రీలు సంభోగము కొఱకు శరీరములను నల్లని చందనముచే పూయబడినవిగాను, ముఖపద్మములను మకరికాపత్రములతో కూడివిగాను, శిరస్సులను నల్లని అగరుచే ధూపము వేయబడినవిగాను చేయుచున్నారు.





**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) సురతోత్సవాయ-సురతస్య ఉత్సవాయ-షష్ఠీతత్పురుషః.

2) కాలీయకచర్చితాని-కాలీయకేన చర్చితాని-తృతీయాతత్పురుషః.

3) కాలాగురుధూపితాని-కాలాగురుణా ధూపితాని-తృతీయాతత్పురుషః.

4) ముఖామ్బుజాని-ముఖాని చ తాని అమ్బుజాని - కర్మధారయః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) గాతే గచ్ఛతీతి గాత్రం. గాజ్ గతౌ పోవునది. **'గాత్రం వపుః సంహననం శరీరం వర్ష్మ విగ్రహః'.**

2) కాలవర్ణసారత్వాత్కాలేయకమ్. నల్లవన్నె చేవగలది. (పాఠాంతరము-కాలీయకమ్) **'కాలేయకం చ కాలానుసార్యం చ'.**

c) **గుణము :- మాధుర్యప్రసాదములు** d) **రీతి :- వైదర్భి**

e) **అలంకారము : 'రూపకము'.** లక్షణము పూర్వముచెప్పబడినది.

'ముఖామ్బుజాని' - ఇందు ముఖమును పద్మమును అభేదముగా వర్ణించుటచే నిది రూపకమగును.

f) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - 'ఉపజాతివృత్తము'

g) **క్రియాదర్శము-కుర్వన్తి :-** పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. అన్తి- తిజ్ ప్రత్యయము. ఉత్, ప్ర = ఉపసర్గలు

**ధాతువు: డుకృఞ్** (కృ) కరణే-చేయుట. తనాది (8) ప్రకరణధాతువు. 'ఉ' అనునది వికరణ ప్రత్యయము.

గమనిక: దృఢ ప్రత్యయములు పరమగునపుడు 'కృ' ధాతువునందలి ఋకారమునకు (గుణము) 'అర్' అనియు; దుర్బల ప్రత్యయములు పరమగునపుడు 'ఉర్' అనియు ఆదేశమగును. కృ+ఉ+అన్తి > కురు + అన్తి > కుర్వన్తి గా మారును.

**శ్లో|| రతిశ్రమక్షామవిపాణ్డువక్త్రా**
**స్సమ్ప్రాప్తహర్షాభ్యుదయాస్తరుణ్యః|**
**హసన్తి నోచ్చైర్దశనాగ్రభిన్నా**
**న్ప్రపీడ్యమానానధరానవేక్ష్య|| 6**

**పదవిభాగము:-** రతిశ్రమక్షామవిపాండువక్త్రాః+సమ్ప్రాప్తహర్ష+అభ్యుదయాః+తరుణ్యః హసన్తి న+ఉచ్చైః+దశనా+అగ్రభిన్నాన్ ప్రపీడ్యమానామ్+అధరాన్+అవేక్ష్య.

**అన్వయక్రమము:–** రతి శ్రమ క్షామ విపాండు వక్త్రాః సంప్రాప్త హర్ష అభ్యుదయాః తరుణ్యః దశన అగ్ర భిన్నాన్ ప్రపీడ్యమానాన్ అధరాన్ అవేక్ష్య ఉచ్చైః న హసన్తి.

**ప్రతిపదార్థము:–** రతి=సంభోగమందలి, శ్రమ=శ్రమచే, క్షామ=తగ్గిన, విపాండు=తెల్లనైన, వక్త్రాః=ముఖములుగల; సంప్రాప్త=పొందబడిన, హర్ష=సంతోషము యొక్క అభ్యుదయాః=పెంపుగల, తరుణ్యః=స్త్రీలు, దశన=దంతములయొక్క అగ్ర=చివరలచే, భిన్నాన్=భేదించబడిన, ప్రపీడ్యమానాన్=బాధించుచుండెడి, అధరాన్=పెదవులను, అవేక్ష్య=చూచి, ఉచ్చైః=అధికముగా, న హసన్తి=నవ్వుటలేదు.

**తాత్పర్యము:–** సంభోగముచే వాడి తెల్లనైన ముఖములతో ఆనందాతిరేకముచే స్త్రీలు దంతాగ్రములచే భేదింపబడిన, బాధించుచుండెడి పెదవులను చూచి అధికముగా నవ్వుటలేదు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) రతి... వక్త్రాః–రతేః శ్రమః–రతిశ్రమః–షష్ఠీతత్పురుషః, తేన క్షామం విపాణ్డు చ వక్త్రం యాసాం తథావిధాః–బహుబ్రీహిః.
2) సమ్ప్రాప్తహర్షాభ్యుదయాః–సమ్ప్రాప్తః హర్షస్య అభ్యుదయో యాభిః తాః – బహుబ్రీహిః.
3) దశనాగ్రభిన్నాన్ – దశనాగ్రేణ భిన్నాన్– తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) దంశంతి స్త్ర్యధరమేభిరితి దశనాః, దంశ దశనే. వీనిచేత వనితల యధరమును గొఱుకుదురు. **'రదనా దశనా దన్తా రదాః'** –

c) **గుణము :– మాధుర్యప్రసాదములు**

d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – ఉపజాతివృత్తము

g) **క్రియాదర్శము :–** హసన్తి – పరస్మైపది. లట్ ప్రథమపురుష బహువచనము. అన్తి తిఙ్ ప్రత్యయము.

**ధాతువు :– హసే** (హస్) – హసనే–నవ్వుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. హస్ + అ + అన్తి > హస+అన్తి > హసన్తి గా మారును. (అకారముతో ఆరంభించు ప్రత్యయములకు ముందు అంగమునందలి అకారము లోపించును)





శ్లో॥ పీనస్తనోరస్స్థలభాగశోభా
మాసాద్య తత్పీడనజాతఖేదః।
తృణాగ్రలగ్నైస్తుహినైః పతద్భి
రాక్రన్దతీవోషసి శీతకాలః॥ 7

**పదవిభాగము:–** పీనస్తన+ఉరః+స్థలభాగశోభామ్+ఆసాద్య తత్+పీడనజాతఖేదః తృణ+అగ్రలగ్నైః+తుహినైః పతద్భిః+ఆక్రన్దతి+ఇవ+ఉషసి శీతకాలః.

**అన్వయక్రమము:–** పీన స్తన ఉరఃస్థల భాగ శోభామ్ ఆసాద్య తత్ పీడన జాత ఖేదః శీతకాలః ఉషసి పతద్భిః తృణ అగ్ర లగ్నైః తుహినైః ఆక్రందతి ఇవ.

**ప్రతిపదార్థము:–** పీన=బలిసిన, స్తన=చనుగుబ్బలుగల, ఉరఃస్థల=వక్షఃస్థలముయొక్క భాగ=భాగమందలి, శోభామ్=శోభను, ఆసాద్య=పొంది, తత్=దానియొక్క, పీడన=పీడించుటచే, జాత=కలిగిన, ఖేదః=శోకముకలద్దై, శీతకాలః=శీతాకాలము, ఉషసి=వేకువ జామున, పతద్భిః=పడుచుండెడి, తృణ=గడ్డియొక్క, అగ్ర=చివరలయందు, లగ్నైః=తగులుకొన్న, తుహినైః=మంచుబిందువులచే, ఆక్రందతీవ=ఏడ్చుచున్నదివలె నున్నది.

**తాత్పర్యము:–** బలిసిన చనుగుబ్బలు గల వక్షఃస్థలభాగమందలి శోభను పొంది, పీడించుటచే కలిగిన శోకముకలదైన హేమన్తఋతువు వేకువజామున గడ్డిపోచల చివరి నుండి జాలువారు మంచు బిందువులు అనుమిషతో ఏడ్చుచున్నట్లు వలె నున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) పీన.... శోభామ్–పీనాని చ తాని స్తనాని పీనస్తనాని – కర్మధారయః–పీన స్తనానామ్ ఉరఃస్థలభాగః, పీనస్తనోరస్థలభాగః–షష్ఠీతత్పురుషః–తస్య శోభామ్–షష్ఠీతత్పురుషః.
2) తృణాగ్రలగ్నైః–తృణానాం అగ్రమ్ తృణాగ్రమ్–షష్ఠీతత్పురుషః–తత్ర లగ్నైః – సప్తమీ తత్పురుషః.
3) తత్పీడనజాతఖేదః–తస్య పీడనమ్–తత్పీడనమ్–షష్ఠీతత్పురుషః–తేన జాతః ఖేదో యస్మిన్ సః–బహుబ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) ఓషతి అర్కకరై రిత్యుషః ప్రత్యుషశ్చ. ఉష దాహే–సూర్యకిరణములచే దహింప జేయునది. **'ప్రత్యూషోఽహర్ముఖం కల్య ముషఃప్రత్యుషసీ అపి'.** –

c) **గుణము** :– మాధుర్యప్రసాదములు d) **రీతి** :– వైదర్భి

e) **అలంకారము : ఉత్ప్రేక్ష.** లక్షణము పూర్వం చెప్పబడినది.

f) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతివృత్తము.

g) **క్రియాదర్శము :-** ఆక్రందతి - పరస్మైపది. ఆ ఉపసర్గ.

**ధాతువు** - క్రన్ద - ఏడ్చుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. పరస్మైపది. లట్ ప్రథమ పురుష ఏకవచనము. ఆఙ్=ఉపసర్గ. కనుక క్రన్ద్+అ+తి > క్రన్ద+తి > క్రన్దతిగా మారును.

**శ్లో॥ ప్రభూతశాలిప్రసవైశ్చితాని**
**మృగాఙ్గనాయూథ విభూషితాని।**
**మనోహరక్రౌఞ్చనినాదితాని**
**సీమాన్తరాణ్యుత్సుకయన్తి చేతః॥ 8**

**పదవిభాగము:-** ప్రభూతశాలిప్రసవైః+చితాని మృగ+అంగనాయూథవిభూషితాని మనోహరక్రౌంచనినాదితాని సీమాన్తరాణి+ఉత్సుకయన్తి చేతః.

**అన్వయక్రమము:-** ప్రభూత శాలి ప్రసవైః చితాని మృగ+అంగనా యూథ విభూషితాని మనోహర క్రౌంచ నినాదితాని సీమాన్తరాణి చేతః ఉత్సుకయన్తి.

**ప్రతిపదార్థము:-** ప్రభూత=అధికమైన, శాలి=వరియొక్క ప్రసవైః=పంటలచే, చితాని= వ్యాప్తమైనవియు, మృగాంగనా=ఆడలేళ్ళయొక్క, యూథ=గుంపులచే, విభూషితాని= అలంకరింపబడినవియు, మనోహర=మనోహరమగు, క్రౌంచ=క్రౌంచపక్షులచే, నినాదితాని=ధ్వనింపజేయబడిన, సీమాన్తరాణి=సరిహద్దు ప్రాంతములు, చేతః= మనస్సును, ఉత్సుకయన్తి=కలవరపరచుచున్నవి.

**తాత్పర్యము:-** బాగా పండిన వరిపంటలచే వ్యాప్తమైనవియు, ఆడలేళ్ళ గుంపులచే అలంకరింపబడినవియు, మనోహరమగు క్రౌంచ పక్షుల ధ్వనులు గల సరిహద్దు ప్రాంతములు మనస్సును కలవరపరచుచున్నవి.

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ప్రభూతశాలిప్రసవైః-ప్రభూతాశ్చ తే శాలయః, ప్రభూతశాలయః-కర్మధారయః -తేషాం ప్రసవైః-షష్ఠీతత్పురుషః.
2) మృగాంగనాయూథవిభూషితాని-మృగాంగనానాం యూథః-మృగాంగనా యూథః-షష్ఠీతత్పురుషః-తేన విభూషితాని యాని తాని - తత్పురుషః
3) మనో.... నినాదితాని-మనోహరాశ్చ తే క్రౌంచాః - మనోహరక్రౌంచాః- కర్మధారయః-తైః నినాదితాని యాని తాని - తత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**





1) క్రుంచతి పంక్తిరూపేణ గచ్ఛతీతి క్రుఙ్. క్రౌంచశ్చ. క్రుంచ గతికౌటిల్యాల్పీ భావయోః. పంక్తిరూపముగాబోవునది. లేక కుటిలమైయుండునది.

c) **గుణము - ప్రసాదము** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతివృత్తము.

g) **క్రియాదర్శము :-** ఉత్సుకయన్తి - నామవాచక ధాతువు (Denominative)

ఉత్సుకయన్తి - 'ఉత్సుకం కుర్వన్తి' అను అర్థమున 'తత్కరోతి తదాచష్టే' అను చురాది గణసూత్రముచే 'ణిచ్' ప్రత్యయము 'ఉత్సుక' శబ్దముపై చేయవలెను. 'ఉత్సుక + ఇ' అని ఉండగా 'అతోలోపః' అను సూత్రముచే అకారములోపించి 'ఉత్సుక్ + ఇ = ఉత్సుకి' అని కాగా, దీనిపై వర్తమానకాలము, బహువచనమున 'ఝి' ప్రత్యయము రాగా, ఝకారమునకు 'ఝోన్తః' అని అంతాదేశమురాగా, 'ఉత్సుకి > అన్తి' అనికాగా, కర్తరి 'శప్' అను సూత్రముచే 'శప్' రాగా, 'ఉత్సుకి+అ+అన్తి' అనికాగా, సార్వధాతుకార్ధ ధాతుకయోః అని ఇకారమునకు గుణమురాగా 'ఏచోఽయవాయావః' అని అయాదేశము రాగా ఉత్సుకయ్+అ+అన్తి > 'ఉత్సుకయ+అన్తి' అని కాగా 'అతోగుణే' అను సూత్రముచే పరరూపమురాగా 'ఉత్సుకయన్తి' అని రూపమగును.

**శ్లో॥ ప్రఫుల్లనీలోత్పలశోభితాని**
**సోన్మాదకాదమ్బవిభూషితాని।**
**ప్రసన్నతోయాని సుశీతలాని**
**సరాంసి చేతాంసి హరన్తి పుంసామ్॥ 9**

**పదవిభాగము:-** ప్రఫుల్లనీలోత్పలశోభితాని సోన్మాదకాదంబవిభూషితాని ప్రసన్న తోయాని సుశీతలాని సరాంసి చేతాంసి హరన్తి పుంసామ్.

**అన్వయక్రమము:-** ప్రఫుల్ల నీలోత్పల శోభితాని సోన్మాద కాదంబ విభూషితాని ప్రసన్న తోయాని సుశీతలాని సరాంసి పుంసామ్ చేతాంసి హరన్తి.

**ప్రతిపదార్థము:-** ప్రఫుల్ల=వికసించిన, నీలోత్పల=నల్లకలువలచే, శోభితాని=శోభిల్లు నవియు, సోన్మాద=మదించిన, కాదంబ=కలహంసలచే, విభూషితాని=అలంకరింప బడినవియు, ప్రసన్న=తేటబడిన, తోయాని=నీరు కలివియు, సుశీతలాని=చల్లనివియు నగు,సరాంసి=జలాశయములు,పుంసామ్=జనులయొక్క, చేతాంసి=మనస్సులను, హరన్తి =హరించుచున్నవి.

**తాత్పర్యము:-**1) వికసించిన నల్ల కలువలచే శోభిల్లునవియగు, 2)మదించిన కలహంసలచే అలంకరింపబడినవియగు, 3)చల్లని తేటబడిన నీరు కలవియునగు

జలాశయములు జనులమనస్సులను హరించుచున్నవి.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ప్ర... శోభితాని - ప్రఫుల్లాని చైతాని నీలోత్పలాని, ప్రఫుల్లనీలోత్పలాని - కర్మధారయః-తైః శోభితాని యాని తాని - తత్పురుషః
2) సోన్మాద..... విభూషితాని - సోన్మాదశ్చాసౌ కాదంబః, సోన్మాదకాదంబః -కర్మధారయః- తైః విభూషితాని యాని తాని - తత్పురుషః.
3) ప్రసన్నతోయాని - ప్రసన్నం తోయం యేషాం తాని - బహుర్వ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) తాయతే పాలయతీతి తోయమ్. తాయృ-సంతాన పాలనయోః - రక్షించునది. **'అమ్భోఽర్ణ స్తోయ పానీయ నీర క్షీరామ్బు శంబరమ్'.** -

c) **గుణము - ప్రసాదము** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతివృత్తము

g) **క్రియాదర్శము:-** హసన్తి. ఈ క్రియావిశేషములు '6' వ శ్లోకభాగమున చెప్పబడినవి.

**శ్లో॥ పాకం వ్రజన్తీ హిమజాతశీతై**
**రాధూయమానా సతతం మరుద్భిః।**
**ప్రియే! ప్రియఙ్గుః ప్రియవిప్రయుక్తా**
**విపాణ్డుతాం యాతి విలాసినీవ॥ 10**

**పదవిభాగము:-** పాకమ్ వ్రజన్తీ హిమజాతశీతైః+ఆధూయమానా సతతమ్ మరుద్భిః ప్రియే ప్రియంగుః ప్రియవిప్రయుక్తా విపాణ్డుతామ్ యాతి విలాసినీ+ఇవ.

**అన్వయక్రమము:-** (హే) ప్రియే, హిమ జాత శీతైః పాకమ్ వ్రజంతీ మరుద్భిః సతతమ్ ఆధూయమానా ప్రియంగుః ప్రియ విప్రయుక్తా విలాసినీవ విపాణ్డుతామ్ యాతి.

**ప్రతిపదార్థము:-** (హే) ప్రియే=ఓ ప్రియురాలా! హిమ=మంచుచే, జాత=పుట్టిన, శీతైః =చలిచేత పాకమ్=పరిపక్వదశను, వ్రజంతీ=పొందుచున్నదియు, మరుద్భిః=వాయువులచే, సతతమ్=ఎల్లప్పుడు, ఆధూయమానా=కదల్పబడుచున్నదియు, ప్రియంగుః=పిప్పలిలత, ప్రియ=ప్రియుని, విప్రయుక్తా=ఎడబాసిన, విలాసినీవ=కామినివలె, విపాణ్డుతామ్ =పాలిపోవుటను, యాతి=పొందుచున్నది.

**తాత్పర్యము:-** ఓ ప్రియురాలా! 1)మంచుచే పుట్టిన చలిచే పరిపక్వదశను పొందు చున్నదియు, 2)వాయువులచే ఎల్లప్పుడు కదల్పబడుచున్నదియగు, పిప్పలిలత ప్రియుని





ఎడబాసిన కామినివలె పాలిపోవుటను పొందుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) హిమజాతశీతైః - హిమాత్ జాతాని హిమజాతాని - పంచమీతత్పురుషః -హిమజాతాని చ తాని శీతానితైః - కర్మధారయః.
2) ప్రియవిప్రయుక్తా - ప్రియేణ విప్రయుక్తా - తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) కుపితేన అనేన మ్రియతే లోక ఇతి మరుత్. మృఙ్-ప్రాణత్యాగే. కుపితుడైన యితనిచేత లోకము మృతిబొందింపబడును. **'సమీర మారుత మరుజ్జగత్ప్రాణ సమీరణాః'.**

c) **గుణము - మాధుర్యప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **అలంకారము:** ఉపమా లక్షణము పూర్వము చెప్పబడినది.

f) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతివృత్తము

g) **క్రియాదర్శము :-** 'యాతి'. పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము. ధాతువు **యా** వివరములు ఇంతకుముందు చెప్పబడినవి.

**శ్లో॥ పుష్పాసవామోదసుగన్ధివక్త్రో**
**నిశ్వాసవాతైస్సురభీకృతాఙ్గః।**
**పరస్పరాఙ్గవ్యతిరిక్తశాయీ**
**శేతే జనః కామరసానువిద్ధః॥ 11**

**పదవిభాగము:-**పుష్ప+ఆసవ+ఆమోదసుగంధివక్త్రః+నిః+శ్వాసవాతైః+సురభీకృత+ అంగః పరస్పర+అంగవ్యతిరిక్తశాయీ శేతే జనః కామరస+అనువిద్ధః.

**అన్వయక్రమము:-** పుష్ప ఆసవ ఆమోద సుగంధి వక్త్రః నిశ్వాసవాతైః సురభీకృత అంగః జనః కామ రస అనువిద్ధః పరస్పర అంగ వ్యతిరిక్త శాయీ శేతే.

**ప్రతిపదార్థము:-** పుష్ప=పూలయొక్క, ఆసవ=మద్యము యొక్క, ఆమోద=పరిమళముచే, సుగంధి=గుబాళించుచుండు, వక్త్రః=నోరుగల, నిశ్వాసవాతైః=నిట్టూర్పుగాలులచేత, సురభీకృత=పరిమళభరితమైన, అంగః=శరీరముగల, జనః=జనము, కామ=కామము యొక్క, రస=రసముచే, అనువిద్ధః=కూర్పబడినదై, పరస్పర=ఒకరినొకరు, అంగ= అవయవములతో, వ్యతిరిక్త=కలియునట్లు, శాయీ=శయనశీలమై, శేతే=పరుండుచున్నది.

**తాత్పర్యము:-** పూల మద్య పరిమళముచే గుబాళించు నోరు గల, నిట్టూర్పుల గాలులచే

పరిమళభరితమైన శరీరము గల, జనము కామరసముచే కూర్చబడినదై ఒకరి నొకరు తగులునట్లు శయనశీలమై పరుండుచున్నది.

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) పుష్ప.. వక్త్రః-పుష్పాణాం ఆసవః, పుష్పాసవః-షష్ఠీతత్పురుషః-తస్యామోదః పుష్పాసవామోదః-షష్ఠీతత్పురుషః, తేన సుగన్ధి వక్త్రం యస్యాసౌ తథావిధః - బహుబ్రీహిః.
2) నిఃశ్వాసవాతైః-నిఃశ్వాసస్య వాతైః-షష్ఠీతత్పురుషః.
3) సురభీకృతాంగః-సురభీణి కృతాని అంగాని యస్యాసౌ తథావిధః-బహుబ్రీహిః
4) కామరసానువిద్ధః- కామస్య రసః కామరసః-షష్ఠీతత్పురుషః-తేన అనువిద్ధః యః అసౌ తథావిధః-తత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) వాతీతి వాయుః. వా-గతిగంధనయోః. వీచుచుండెడివాడు. **'నభస్వద్వాత పవన పవమాన ప్రభంజనాః' -**
2) మధునామధుపుష్పేణ కృతః. ఆసవో మధ్వాసవః, మాధవశ్చ. ఇప్పపువ్వుచేత చేయబడినకల్లు. **'మధ్వాసవో మాధవకో మధు' -**
3) స ఏవ అతి నిర్హారీ అతిదూరగామీ చేత్ ఆమోద ఇత్యుచ్యతే. మిక్కిలి దూరముగా వ్యాపించునట్టిది. **'ఆమోద స్సోఽ తినిర్హారీ' -**

c) **గుణము** :- **మాధుర్యప్రసాదములు**

d) **రీతి** :- **వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము :-** త్రిష్టుభ్ ఛందస్సు - 'ఉపేన్ద్రవజ్రావృత్తము

f) **క్రియాదర్థము:-** 'శేతే' - ఆత్మనేపది. లట్ ప్రథమపురుషఏకవచనము.

తే-తిజ్ ప్రత్యయము

**ధాతువు :- శీజ్** (శీ) - స్వప్నే - నిద్రించుట - అకర్మకము - అదాదిప్రకరణ (2) ధాతువు. వికరణ ప్రత్యయముండదు.

'శీ' ధాతువుకు లట్, లోట్, లఙ్, విధిలిఙ్ - అను నాలుగు 'ల' కారముల యందు దుర్బల ప్రత్యయము పరమగునపుడు కూడ గుణమువచ్చును. ఇ, ఈ లకు ఏకారము, ఉ, ఊ, లకు ఓ కారము, ఋ,ౠలకు అర్ అనునది, ౡ కారమునకు అల్ అనునది గుణము. కనుక శీ + తే > శే + తే > శేతే గా





మారును. శేతే - శయాతే - శేరతే గా వచనమును బట్టి మారును.

1) ('శీ' ధాతువుకు అతే, అత, అతామ్ అను ప్రత్యయములు పరమగునపుడు, వాటికి ముందు రేఫాగమము వచ్చును). - శేరతే

2) శీ + ఆతే > శే+ఆతే > శయ్+ఆతే > శయాతే.

(ఏ ఓ ఐ ఔ లకు అచ్చు పరమగునపుడు వరుసగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అను ఆదేశములు వచ్చును.) - శయాతే.

**శ్లో॥ దన్తచ్ఛదైస్సవ్రణదన్తచిహ్నై**
**స్స్తనైశ్చ పాణ్యగ్రకృతాభిలేఖైః।**
**సంసూచ్యతే నిర్దయమఙ్గనానాం**
**రతోపభోగో నవయౌవనానామ్॥ 12**

**పదవిభాగము:-** దన్తచ్ఛదైః+సవ్రణదన్తచిహ్నైః+స్తనైః+చ పాణి+అగ్రకృత+అభిలేఖైః సంసూచ్యతే నిర్దయమ్+అంగనానామ్ రత+ఉపభోగః+నవయౌవనానామ్.

**అన్వయక్రమము:-** సవ్రణ దన్త చిహ్నైః దన్తచ్ఛదైః పాణ్యగ్ర కృత అభిలేఖైః స్తనైశ్చ నవయౌవనానామ్ అంగనానామ్ నిర్దయమ్ రతి ఉపభోగః సంసూచ్యతే.

**ప్రతిపదార్థము:-** సవ్రణ=గాయములతో గూడిన, దన్త=దంతముల యొక్క, చిహ్నైః =చిహ్నములు గల, దన్తచ్ఛదైః=పెదవులచేతను, పాణ్యగ్ర=గోళ్ళచే, కృత=చేయబడిన, అభిలేఖైః=గీరుగల, స్తనైశ్చ=స్తనములచేతను, నవయౌవనానామ్=క్రొత్త యౌవనముగల, అంగనానామ్=స్త్రీలయొక్క, నిర్దయమ్=దయలేని, రతి=రతముయొక్క, ఉపభోగః= అనుభవము, సంసూచ్యతే=సూచింపబడుచున్నది.

**తాత్పర్యము:-** దంతవ్రణ చిహ్నములు గల పెదవుల చేతను, గోటిగాట్లతో కూడిన స్తనములచేతను, నవయౌవనముగల స్త్రీల యొక్క గాఢమైన సంభోగానుభవము సూచింపబడుచున్నది.

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) సవ్రణదన్తచిహ్నైః-వ్రణాశ్చ దంతచిహ్నాని చ వ్రణదన్తచిహ్నాని-ద్వంద్వః-తైః సహితాని యాని తాని - బహుబ్రీహిః.
2) పాణ్యగ్ర.... లేఖైః - పాణేః అగ్రమ్ - పాణ్యగ్రమ్-షష్ఠీతత్పురుషః తేన కృతః అభిలేఖో యేషు తథాభూతైః-బహుబ్రీహిః.
3) నవయౌవనానామ్ - నవం యౌవనం యాసాం తాసామ్- బహుబ్రీహిః

4) రతోపభోగః - రతే ఉపభోగః - సప్తమీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) విస్తృతాఙ్గుళౌ పాణౌ. చాచిన వేళ్ళు గలది **'పాణౌ చపేట ప్రతల ప్రహస్తౌ విస్తృతాఙ్గుళౌ'.**

2) రమణం రతమ్. రము క్రీడాయామ్. రమించుట. **'వ్యవాయో గ్రామ్యధర్మో మైథునం నిధువనం రతమ్' -**

c) **గుణము - మాధుర్యప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతివృత్తము

g) **క్రియాదర్థము :-** సంసూచ్యతే. సం=ఉపసర్గ ఆత్మనేపది. లట్ ప్రథమపురుష ఏకవచనము. తే తిఙ్ ప్రత్యయము.

**ధాతువు:- సూచ్** - సూచించు - చురాది (10) ప్రకరణ ధాతువు. 'అయ' వికరణ ప్రత్యయము. కర్మార్థమునందును ప్రేరణకర్మార్థమునందును ఈ ధాతు రూపములు ఒకేవిధముగా నుండును. సూచ్+అయ+తే > సూచ్యతే గా మారును.

**శ్లో॥ కాచిద్విభూషయతి దర్పణసక్తహస్తా**
**బాలాతపేషు వనితా వదనారవిన్దమ్।**
**దన్తచ్ఛదం ప్రియతమేన నిపీతసారం**
**దన్తాగ్రభిన్నమవకృష్య నిరీక్షతే చ॥ 13**

**పదవిభాగము:-** కాచిత్+విభూషయతి దర్పణసక్తహస్తా బాలాతపేషు వనితా వదనారవిందమ్ దన్తచ్ఛదం ప్రియతమేన నిపీతసారమ్ దన్త+అగ్రభిన్నమ్+అవకృష్య నిరీక్షతే చ.

**అన్వయక్రమము:-** కాచిత్ వనితా దర్పణసక్తహస్తా బాలాతపేషు వదనారవిందమ్ విభూషయతి ప్రియతమేన నిపీత సారమ్ దన్త అగ్ర భిన్నమ్ దంతచ్ఛదమ్ అవకృష్య నిరీక్షతే చ.

**ప్రతిపదార్థము:-** కాచిత్=ఒకానొక, వనితా=ఆడుది, దర్పణ=అద్దమందు, సక్త=తగుల్కొనిన, హస్తా=హస్తముకలదై, బాలాతపేషు=లేతఎండయందు, వదనారవిందమ్=ముఖపద్మమును, విభూషయతి=అలంకరించుచున్నది. ప్రియతమేన=ప్రియునిచే, నిపీత=త్రాగబడిన, సారమ్=సారముగల, దన్త=దంతముల యొక్క, అగ్ర=చివరలచే, భిన్నమ్=గాట్లుపెట్టబడిన, దంతచ్ఛదమ్=పెదవిని, అవకృష్య=లాగి, నిరీక్షతే చ=చూచుచున్నది.





**తాత్పర్యము:-** ఒకానొక ఆడుది హస్తమున అద్దముకలదై లేత ఎండయందు ముఖపద్మమును అలంకరించుచున్నది. ప్రియునిచే త్రాగబడిన సారముగల దన్తపు చివరలచే గాట్లుబడిన పెదవిని లాగి చూచుచున్నది.

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) దర్పణసక్తహస్తా-దర్పణే సక్తః హస్తో యస్యాః సా-బహువ్రీహిః.

2) బాలాతపేషు - బాలాశ్చతే ఆతపాః తేషు - కర్మధారయః.

3) వదనారవిందమ్ - వదనం అరవిందమ్ ఇవ - కర్మధారయః

4) నిపీతసారమ్ - నిపీతః సారో యస్యాఽసౌ తథావిధమ్ - బహువ్రీహి.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) దృష్యతే అనేన సువేషాభిమానాదితి దర్పణః. దృప దృప్తౌ. దీని చేత మంచి వేషాభిమానము వలన గర్వింతురు. **'దర్పణే ముకురాదర్శౌ' -**

c) **గుణము - మాధుర్యప్రసాదములు**

d) **రీతి - వైదర్భి**

e) **అలంకారము - రూపకము.** లక్షణము మొదటి సర్గ శ్లోకభాగమున చెప్పబడినది. ఇందు 'వదనారవిందమ్' అనుచోట వదనమును అరవిందమును అభేదముగా చెప్పుటచే నిది రూపకాలంకారమగును.

f) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - 'వసన్తతిలకా' వృత్తము

**లక్షణము** : 1) ప్రతిపాదమున 14 అక్షరములుండును.

2) ఉక్తా వసన్తతిలకా తభజా జగౌగః।

3) గణములు త, భ, జ, జ, గ, గ, 4) యతి 8, 6

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా:- | కా చి ద్వి | భూ ష య | తి ద ర్ప | ణ స క్త | హ స్తా |
| | I I U | U I I | I I U | I I U | I U |
| | త | భ | జ | జ | గ గ |

ఈ వృత్తమునకు 'వసన్తతిలక, సింహోన్నతా, ఉద్ధర్షిణీ' అనియు పేర్లు.

g) **క్రియాదర్థము :-** నిరీక్షతే - ఆత్మనేపది. లట్ ప్రథమపురుష ఏకవచనము, నిర్

**ధాతువు :- ఈక్ష** (ఈక్ష్) దర్శనే - దర్శించుట - సకర్మకము. భ్వాది (1) ప్రకరణ ధాతువు. అ వికరణప్రత్యయము. తే తిఙ్ ప్రత్యయము. ఈక్ష్ + అ + తే > ఈక్ష + తే > ఈక్షతే గా మారును.

2) దైవం పర్యాలోచయతీత్యర్థే రాధ్యతి చేక్షతే। (ఆఖ్యాతచంద్రికా 1-2-21)

**శ్లో॥ అన్యా ప్రకామసురతశ్రమఖిన్నదేహా**
**రాత్రిప్రజాగరవిపాటలనేత్రపద్మా।**
**స్రస్తాంసదేశలులితాకులకేశపాశా**
**నిద్రాం ప్రయాతి మృదుసూర్యకరాభితప్తా॥ 14**

**పదవిభాగము:-** అన్యా ప్రకామసురతశ్రమఖిన్నదేహా రాత్రిప్రజాగరవిపాటల నేత్రపద్మా స్రస్త+అంసదేశలులిత+ఆకులకేశపాశా నిద్రామ్ ప్రయాతి మృదు సూర్యకర+అభితప్తా.

**అన్వయక్రమము:-** అన్యా ప్రకామ సురత శ్రమ ఖిన్న దేహా రాత్రి ప్రజాగర విపాటల నేత్రపద్మా స్రస్త అంస దేశ లులితాకుల కేశపాశా మృదు సూర్యకర అభితప్తా నిద్రామ్ ప్రయాతి.

**ప్రతిపదార్థము:-** అన్యా=మఱియొక ఆడుది, ప్రకామ=అధికమగు, సురత=సంభోగ మందలి, శ్రమ=శ్రమచే, ఖిన్న=అలసిన, దేహా=దేహము కలదై, రాత్రి=రాత్రియందు, ప్రజాగర=జాగరముచే, విపాటల=తెల్లనైన (పాలిపోయిన), నేత్రపద్మా=పద్మములవంటి కన్నులుకలదై, స్రస్త=జారిన, అంసదేశ=భుజభాగమున, లులిత=పొరలుచుండు, ఆకుల=వ్యాకులమైన, కేశపాశా=కేశపాశముకలదై, మృదు=లేత, సూర్యకర=సూర్య కిరణములచే, అభితప్తా=తపింపబడినదై, నిద్రామ్=నిద్రను, ప్రయాతి=పొందుచున్నది.

**తాత్పర్యము:-** మఱియొక ఆడుది అధికమగు సంభోగశ్రమచే అలసిన దేహముకలదై, రాత్రి జాగరణచే పాలిపోయిన పద్మములవంటి కన్నులుకలదై, భుజభాగమున జారి, పొరలుచుండు జడకలదై లేత సూర్యకిరణములచే తపింపబడినదై నిద్రను పొందు చున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ప్రకామ.... దేహా - ప్రకామశ్చాసౌ సురతః ప్రకామసురతః-కర్మధారయః - తస్య శ్రమః, ప్రకామసురతశ్రమః-షష్ఠీతత్పురుషః - తేన ఖిన్నో దేహో యస్యాః సా - బహువ్రీహిః.
2) రాత్రి.... పద్మా-రాత్రౌ ప్రజాగరః, రాత్రిప్రజాగరః-సప్తమీతత్పురుషః-తేన విపాటలే రాత్రిప్రజాగరవిపాటలే, పద్మవత్ నేత్రే యస్యాః సా - బహువ్రీహిః
3) స్రస్త.... పాశా-స్రస్తశ్చ అంసదేశే లులితాకులశ్చ కేశపాశో యస్యాః సా - బహువ్రీహిః.
4) మృదు .... తప్తాః - మృదుభిః సూర్యకరైః అభితప్తా యా సా - బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:-** 1) అమ్యతే భారేణ అంసః. అమ రోగే. భారముచే బీడింపబడునది. **'స్కన్ధో భుజశిరోంసో ఽ స్త్రీ'** -





2) కామ్యతే సర్వైరితి కామమ్. కము కాంతౌ. అందఱిచేత కోరబడునది. **'కామం ప్రకామం పర్యాప్తం నికామేష్టం యథేప్సితమ్'.**

c) **గుణము :-** **మాధుర్య ప్రసాదములు** d) **రీతి :-** **వైదర్భి**

e) **అలంకారము:** **'ఉపమా'.** లక్షణము మొదటి సర్గ శ్లోక భాగమున చెప్పబడినది. 'నేత్ర పద్మా'.

f) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - 'వసన్తతిలకా' వృత్తము

g) **క్రియాదర్శము :-** ప్రయాతి. మొదటిసర్గ శ్లోకభాగములలో ధాతువివరములు చెప్పబడినవి.

**శ్లో॥ నిర్మాల్యదామ పరిముక్తమనోజ్ఞగన్ధం**
**మూర్ధ్నోఽపనీయ ఘననీలశిరోరుహాన్తాః।**
**పీనోన్నతస్తనభరానతగాత్రయష్ట్యః**
**కుర్వన్తి కేశరచనామపరాస్తరుణ్యః॥ 15**

**పదవిభాగము:-** నిర్మాల్యదామ పరిముక్తమనోజ్ఞగంధమ్ మూర్ధ్నః+అపనీయ ఘన నీలశిరోరుహ+అన్తాః పీన+ఉన్నతస్తనభర+ఆనతగాత్రయష్ట్యః కుర్వన్తి కేశరచనామ్ +అపరాః+తరుణ్యః.

**అన్వయక్రమము:-** ఘన నీల శిరోరుహ అంతాః పీన ఉన్నత స్తన భర ఆనత గాత్రయష్ట్యః అపరాః తరుణ్యః పరిభుక్త మనోజ్ఞ గంధమ్ నిర్మాల్యదామ మూర్ధ్నః అపనీయ కేశరచనామ్ కుర్వన్తి.

**ప్రతిపదార్థము:-** ఘన=మేఘమువలె, నీల=నల్లని, శిరోరుహ=కేశములయొక్క, అంతాః =చివరలు గల, పీన=బలిసిన, ఉన్నత=ఎత్తైన, స్తన=స్తనములయొక్క, భర=బరువుచే, ఆనత=వంగిన, గాత్రయష్ట్యః=యష్టివంటి శరీరము గల, అపరాః=మఱికొందరు, తరుణ్యః=స్త్రీలు, పరిభుక్త=విడువబడిన, మనోజ్ఞ=మనోహరమగు, గంధమ్=పరిమళము గల, నిర్మాల్యదామ=నిర్మాల్యమాలను, మూర్ధ్నః=తలనుండి, అపనీయ=తీసివేసి, కేశరచనామ్=జడ అల్లుకొనుటను, కుర్వన్తి=చేయుచున్నారు.

**తాత్పర్యము:-** మేఘమువలె నల్లని కేశముల యొక్క చివరలు గల, బలిసిన ఎత్తైన స్తనముల బరువుచే వంగిన శరీరములు గల మఱికొందరు స్త్రీలు మనోహరమగు పరిమళముగల నిర్మాల్యమాలను తలనుండి తీసివేసి జడలల్లుకొనుటను చేయుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-** 1) నిర్మాల్యదామ - నిర్మాల్యం చ తత్ దామ - కర్మధారయః.

2) పరి.... గంధమ్ – పరిముక్తః మనోజ్ఞో గంధో యస్య తత్– బహువ్రీహిః
3) పీన.. యష్ట్యః – పీనాని ఉన్నతాని చ స్తనాని పీనోన్నతస్తనాని – కర్మధారయః – తేషాం భరేణ ఆనతా గాత్రయష్టిః యస్యాః సా తాః – బహువ్రీహిః
4) ఘననీలశిరోరుహాన్తాః–ఘనాశ్చ నీలాశ్చ శిరోరుహాణామ్ అంతాః యాసాం తాః – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) మూర్ఛత్యున్నతో భవతి మూర్ధా. ముర్ఛా – మోహసముచ్ఛ్రాయయోః ఉన్నతమైనది. **'ఉత్తమాఙ్గం శిరశ్శీర్షం మూర్ధా నా మస్తకోఽస్త్రియామ్.**

c) **గుణము – మాధుర్య ప్రసాదములు** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :–** 'కుర్వన్తి'. – ఈ క్రియావిశేషములు '5' వ శ్లోక భాగమున చెప్పబడినవి.

**శ్లో॥ అన్యా ప్రియేణ పరిభుక్తమవేక్ష్య గాత్రం**
**హర్షాన్వితా విరచితాధరచారుశోభా।**
**కూర్పాసకం పరిదధాతి నఖక్షతాఙ్గీ**
**వ్యాలమ్బినీలలలితాలకకుఞ్చితాక్షీ॥ 16**

**పదవిభాగము:–** అన్యా ప్రియేణ పరిభుక్తమ్+అవేక్ష్య గాత్రమ్ హర్ష+అన్వితా విరచిత+అధరచారుశోభా కూర్పాసకమ్ పరిదధాతి నఖక్షత+అంగీ వ్యాలంబి (వి+ఆలంబి) నీలలలిత+అలకకుంచిత+అక్షి.

**అన్వయక్రమము:–** ప్రియేణ పరిభుక్తమ్ గాత్రమ్ అవేక్ష్య హర్ష అన్వితా విరచిత అధర చారు శోభా నఖ క్షత అంగీ వ్యాలంబి నీల లలిత అలక కుంచిత అక్షి అన్యా కూర్పాసకమ్ పరిదధాతి.

**ప్రతిపదార్థము:–** ప్రియేణ=ప్రియునిచే, పరిభుక్తమ్=అనుభవించబడిన, గాత్రమ్=దేహమును, అవేక్ష్య=చూచి, హర్ష=ఆనందముతో, అన్వితా=కూడినదియు, విరచిత =మిక్కిలి నిర్మింపబడిన, అధర=పెదవియొక్క, చారు=మనోహరమగు, శోభా=శోభగలిగినదియు, నఖ=గోళ్ళచే, క్షత=గాయమైన, అంగీ=అవయవములు గలదియు, వ్యాలంబి=వ్రేలాడు, నీల=నల్లని, లలిత=మనోహరమైన, అలక=ముంగురు లచే, కుంచిత=మూయబడిన, అక్షి=కన్నులు గల, అన్యా=మఱియొకతె, కూర్పాసకమ్=రవికను, పరిదధాతి=తొడుగుచున్నది.





**తాత్పర్యము:–** ప్రియునిచే అనుభవింపబడిన దేహమును చూచి ఆనందపారవశ్యముతో కూడినదియు, చక్కని అధరశోభకలదియు, గోళ్ళచే గాయమైన అవయవములు గలదియు, వ్రేలాడు నల్లని మనోహరమైన ముంగురులచే మూయబడిన కన్నులు గల మఱియొక స్త్రీ రవికను తొడుగుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) విరచితాధరచారుశోభా – విరచితా అధరస్య చారుశోభా యస్యాః సా – బహువ్రీహిః.
2) నఖక్షతాంగీ – నఖేన క్షతాని అంగాని యస్యాః సా – బహువ్రీహిః.
3) వ్యాలమ్బి... అక్షీ – వ్యాలంబినశ్చ నీలాశ్చ లలితాశ్చ – కర్మధారయః – వ్యాలమ్బినీలలలితాః–తథాభూతాశ్చ తే అలకాః వ్యాలమ్బినీలలలితాలకాః– కర్మధారయః – వ్యాలమ్బినీలలలితాలకైః కుంచితే అక్షిణీ యస్యాః సా – బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కూర్పరే కపోణౌ అస్యతే కూర్పాసకః. అసు–క్షేపణే. మోచేతి యందు పెట్టబడునది. **'చోళః కూర్పాసకోఽస్త్రియామ్'.**
2) అల్యంతే భూష్యంత ఇత్యలకాః. అల భూషణే. అలంకరింపబడునవి. **'అలకా శ్చూర్ణకున్తలాః'**

c) **గుణము – ప్రసాదమాధుర్యములు**

d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :–** 'పరిదధాతి' – (ఉభయ) పరస్మైపది. లట్ ప్రథమపురుష ఏకవచనము. పరి–ఉపసర్గ.

**ధాతువు :– డుధాఞ్** (ధా) ధారణ పోషణయోః, ధరించుట, పోషించుట క్రియావివరములు మొదటి సర్గ శ్లోకములందు చెప్పబడినవి.

**శ్లో॥ అన్యాశ్చిరం సురతకేళిపరిశ్రమేణ**
**ఖేదం గతాః ప్రశిథిలీకృతగాత్రయష్ట్యః।**
**సంహృష్యమాణపులకోరుపయోధరాన్తా**
**అభ్యఞ్జనం విదధతి ప్రమదాః సుశోభాః॥ 17**

**పదవిభాగము:-** అన్యాః+చిరమ్ సురతకేళిపరిశ్రమేణ ఖేదం గతాః ప్రశిథిలీకృత గాత్రయష్ట్యః సంహృష్యమాణపులక+ఉరుపయోధర+అన్తాః అభ్యంజనమ్ విదధతి ప్రమదాః సుశోభాః.

**అన్వయక్రమము:-** చిరమ్ సురతకేళి పరిశ్రమేణ ఖేదమ్ గతాః ప్రశిథిలీకృత గాత్రయష్ట్యః సంహృష్యమాణ పులక ఉరు పయోధర అన్తాః సుశోభాః అన్యాః ప్రమదాః అభ్యంజనమ్ విదధతి.

**ప్రతిపదార్థము:-** చిరమ్=ఎక్కువసేపు, సురతకేళి=సంభోగముచేయుటచే కలిగిన, పరిశ్రమేణ=అలసటచే, ఖేదమ్=దుఃఖమును, గతాః=పొందినవారున్ను, ప్రశిథిలీకృత =బాగా శిథిలముగాచేయబడిన, గాత్రయష్ట్యః=యష్టివంటి శరీరముగలవారున్ను, సంహృష్యమాణ=సంతోషముచే, పులక=గగుర్పాటుగలవారున్ను, ఉరు=ఉన్నతమైన, పయోధర= స్తనములయొక్క, అన్తాః=చూచుకములు గల, సుశోభాః=మంచిశోభగల, అన్యాః=మఱికొందఱు,ప్రమదాః=స్త్రీలు, అభ్యంజనమ్=అభ్యంగమును,విదధతి=చేయు చున్నారు.

**తాత్పర్యము:-** ఎక్కువసేపు సంభోగముచేయుటచే కలిగిన అలసటచే దుఃఖమును పొందినవారు, నలిగిన శరీరావయవములు గలవారు, సంతోషముచే గగుర్పాటుతో ఉన్నతమైన స్తనచూచుకములుగల మఱికొందఱు స్త్రీలు అభ్యంగనము చేయుచున్నారు.

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) సురతకేళిపరిశ్రమేణ-సురతస్య కేళిః-సురతకేళిః-షష్ఠీతత్పురుషః-తస్య పరిశ్రమేణ -షష్ఠీతత్పురుషః.

2) ప్ర... యష్ట్యః-ప్రశిథిలీకృతా గాత్రయష్టీ, యాసాం తాః - బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) సుష్ఠు రమత ఇతి సురతః. రము - క్రీడాయామ్. లెస్సగాఁ గ్రీడించువాడు.

**'స్యాద్దయాళుః కారుణికః కృపాళుః సురతస్సమాః' -**

c) **గుణము - మాధుర్యప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - 'వసంతతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :-** 'విదధతి' - పరస్మైపది. లట్ప్రథమపురుషబహువచనము.

**ధాతువు :- డుధాఞ్** (ధా). ధారణ పోషణయోః. జుహోత్యాది ప్రకరణ (3) ధాతువు వివరములు మొదటిసర్గశ్లోకభాగములందు చెప్పబడినవి.





శ్లో॥ బహుగుణరమణీయో యోషితాం చిత్తహారీ
పరిణతబహుశాలివ్యాకులగ్రామసీమా।
సతతమతిమనోజ్ఞః క్రౌఞ్చమాలాపరీతః
ప్రదిశతు హిమయుక్తశ్చైష కాలస్సుఖం వః॥ 18

**పదవిభాగము:-** బహుగుణరమణీయః యోషితామ్ చిత్తహారీ పరిణతబహుశాలి వ్యాకుల గ్రామసీమాః సతతమ్ అతిమనోజ్ఞః క్రౌంచమాలాపరీతః ప్రదిశతు హిమయుక్తః+చ +ఏషః+కాలః సుఖమ్ వః.

**అన్వయక్రమము:-** బహు గుణ రమణీయః యోషితామ్ చిత్తహారీ పరిణత బహు శాలి వ్యాకులగ్రామసీమా సతతమ్+అతిమనోజ్ఞః క్రౌంచమాలా పరీతః హిమయుక్తః ఏషః కాలః వః సుఖమ్ ప్రదిశతు.

**ప్రతిపదార్థము:-** బహు=అనేకములైన, గుణ=గుణములచే, రమణీయః=రమణీయ మైనదియు, యోషితామ్=స్త్రీలయొక్క, చిత్తహారీ=మనస్సునుహరించునదియు, పరిణత=పండిన, బహు=అధికమైన, శాలి=వరిచే, వ్యాకుల=వ్యాకులమైన, గ్రామసీమాః =గ్రామపొలిమేరలుగలదియు, సతతమ్=ఎల్లప్పుడు, అతిమనోజ్ఞః=అధికమనోహర మైనదియు, క్రౌంచ=క్రౌంచపక్షుల, మాలా=పంక్తులచే, పరీతః=ఆవృతమైనదియు, హిమయుక్తః చ=మంచుతో కూడియుండునదియు అయిన, ఏషః=ఈ, కాలః=(హేమంత) కాలము, వః =మీకు, సుఖమ్=సుఖమును, ప్రదిశతు=కలుగజేయుగాక.

**తాత్పర్యము:-** అనేక గుణములచే రమణీయమైనదియు, స్త్రీలమనస్సును హరించు నదియు, అధికంగా పండిన వరిచే వ్యాకులమైన గ్రామపొలిమేరలు గలదియు, క్రౌంచపక్షుల పంక్తులచే చుట్టబడినదియు, మంచుతో కూడియుండు ఈ (హేమంత) కాలము మీకు సుఖమును కలుగజేయుగాక!

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) బహుగుణరమణీయః - బహుభిః గుణైః రమణీయః యః అసౌ - తత్పురుషః

2) చిత్తహారీ - చిత్తం హరతి యః అసౌ - కృత్సమాసః.

3) పరిణత ... సీమః-పరిణతైః బహుభిః, శాలిభిః, వ్యాకులః గ్రామసీమా యస్మిన్ సః - బహువ్రీహిః.

4) క్రౌంచమాలాపరీతః-క్రౌంచానామ్ మాలయా పరీతః యః సః-తత్పురుషః

5) హిమయుక్తః-హిమేన యుక్తః-తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) పరిణమతే అవస్థాంతర మాపద్యతే పరిణతమ్. వేఱొక యవస్థను బొందునది. **'పక్వం పరిణతే', -**

2) వ్యాకుల్యతే మనో యస్యేతి వ్యాకులః. కుల సంస్త్యానే. శోకాదులచేత మందముగా జేయబడిన మనస్సుగలవాడు. **'విహస్త వ్యాకులౌ సమౌ' -**

c) **గుణము - ప్రసాదము**

d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము.

**లక్షణము:** 1) ప్రతి పాదమునందు 15 అక్షరములుండును.

2) ననమయయ యుతేయం మాలినీ భోగిలోకైః

3) న, న, మ, య, య గణములు.

4) యతి (8, 7)

| ఉదా:- | బ హు గు | ణ ర మ | ణీ యో-యో | షి తాం చి | త్త హా రీ |
|---|---|---|---|---|---|
| | I I I | I I I | U U U | I U U | I U U |
| | న | న | మ | య | య |

f) **క్రియాదర్శము :-** ప్రదిశతు. లోట్ ప్రథమపురుషైకవచనము. పరస్మైపది.

ప్ర = ఉపసర్గ

**ధాతువు :- దిశ** (దిశ్) అతిసర్జనే - ఇచ్చుట చూపుట. (ఉభయ) పరస్మైపది. తుదాది (6) ప్రకరణ ధాతువు మిగిలిన వివరములు మొదటి సర్గ చివరిశ్లోకమున చెప్పబడినవి.

**శ్రీః**





**శ్రీః**

మహాకవి కాళిదాస విరచితః

# ఋతుసంహారః

## శిశిర ఋతు వర్ణనం నామ పంచమః సర్గః

**అథ క్రమప్రాప్తం శిశిరం వర్ణయతి.**

**శ్లో॥ ప్రరూఢశాల్యంశుచయైర్మనోహరం**
**క్వచిత్ స్థిత క్రౌఞ్చనినాదరాజితమ్।**
**ప్రకామకామం ప్రమదాజనప్రియం**
**వరోరు! కాలం శిశిరాహ్వయం శృణు॥ 1**

**పదవిభాగము:-** ప్రరూఢశాల్యంశుచయైః+మనోహరమ్ క్వచిత్ స్థిత క్రౌఞ్చనినాద రాజితమ్ ప్రకామకామమ్ ప్రమదాజనప్రియమ్ వర+ఊరు కాలమ్ శిశిర+ఆహ్వయమ్ శృణు.

**అన్వయక్రమము:-** వర ఊరు ప్రరూఢ శాల్యంశు చయైః మనోహరమ్ క్వచిత్ స్థిత క్రౌంచ నినాద రాజితమ్ ప్రకామ కామమ్ ప్రమదాజన ప్రియమ్ శిశిర ఆహ్వయమ్ కాలమ్ శృణు.

**ప్రతిపదార్థము:-** వర=శ్రేష్ఠమైన, ఊరు=తొడలుకలిగినదానా! ప్రరూఢ=పెరిగిన, శాల్యంశు=వరివెన్నుల యొక్క, చయైః=సమూహముచే, మనోహరమ్=మనోహర మైనదియు, క్వచిత్=ఒకచోట, స్థిత=ఉన్న, క్రౌంచ=క్రౌంచపక్షుల యొక్క, నినాద= ధ్వనిచే, రాజితమ్=అలంకరింపబడినదియు, ప్రకామ=ఎక్కువైన, కామమ్= కామము కలిగిన, ప్రమదాజన=స్త్రీజనులకు, ప్రియమ్=ఇష్టమైన, శిశిర='శిశిర' అనెడి, ఆహ్వయమ్ =పేరు కలిగిన, కాలమ్=కాలము (ఋతువు)ను, శృణు=వినుము.

**తాత్పర్యము:-** శ్రేష్ఠమైన తొడలుగలదానా! పెరిగిన వరివెన్నుల సమూహముచే మనోహరమైనదియు, క్రౌంచపక్షుల ధ్వనిచే అలంకరింపబడినదియు, ఎక్కువ కామము గల స్త్రీలకు ఇష్టమైన 'శిశిర' ఋతువును (చెప్పెద) వినుము.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ప్రరూఢశాల్యంశుచయైః- ప్రరూఢాశ్చేమే శాల్యంశవః ప్రరూఢశాల్యంశవః -కర్మధారయః - తేషాం చయః, ప్రరూఢశాల్యంశుచయః-షష్ఠీతత్పురుషః

2) స్థితక్రౌంచనినాదరాజితమ్ – స్థితాశ్చ తే క్రౌంచాః – స్థితక్రౌంచాః – కర్మధారయః– తేషాం నినాదః–స్థితక్రౌంచనినాదః తేన రాజితః యః అసౌ తథావిధమ్ – తృతీయాతత్పురుషః.
3) ప్రమదాజనప్రియమ్ – ప్రమదాజనేభ్యః ప్రియః యః అసౌ తథావిధమ్ – చతుర్థీతత్పురుషః
4) ప్రకామకామమ్ – ప్రకామః కామో యస్మిన్ తమ్ – బహువ్రీహిః.
5) శిశిరాహ్వయమ్ – శిశిరః ఇతి ఆహ్వయో యస్య తమ్ – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**
1) శినోత్యంగం శీతేన శిశిరః. శీతముచేత దేహము నల్పముగా జేయునది. మాఘఫాల్గునమాసములతో గూడిన ఋతువుపేరు. **శిశిరోऽ స్త్రియామ్.**
2) ఆహూయతే అనేన ఇతి ఆహ్వయః. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దేచ. దీనిచేత పిలువబడును.

c) **గుణము** :– ప్రసాదము d) **రీతి** :– వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – వంశస్థవిలవృత్తము.
లక్షణము: 1) ఇందు ప్రతిపాదమున 12 అక్షరములుండును.
2) వదన్తి వంశస్థవిలం జతౌజరౌ ।
3) జ, త, జ, ర అను గణములుండును. 4) యతి (5,7)

ఉదా:– ప్ర రూ ఢ | శా ల్యం శు | చ యై ర్మ | నో హ రం
I U I | U U I | I U I | U I U
జ | త | జ | ర

g) **క్రియాదర్శము :– శృణు –** లోట్ మధ్యమపురుషైకవచనము. పరస్మైపది. హి తిజ్ ప్రత్యయము.

ధాతువు : **శ్రు–శృ–శ్రవణే** – వినుట. భ్వాది (1) ప్రకరణధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. 'శ్రువః శృచ' అను సూత్రముచే శ్రు ధాతువునకు శృ ఆదేశము, శ్ను ప్రత్యయము చెప్పబడినది. ను కారమునకు పరసవర్ణము.

కనుక శృ+ను+హి > శృణు+హి > శృణు గా మారును.

**శ్లో॥ నిరుద్ధవాతాయనమన్దిరోదరం**
**హుతాశనో భానుమతో గభస్తయః।**
**గురూణి వాసాంస్యబలాః సయౌవనాః**
**ప్రయాన్తి కాలేऽత్ర జనస్య సేవ్యతామ్ ॥ 2**





**పదవిభాగము:–** నిరుద్ధవాతాయనమన్దిర+ఉదరమ్ హుతాశనః భానుమతః గభస్తయః గురూణి వాసాంసి+అబలాః సయౌవనాః ప్రయాన్తి కాలే+అత్ర జనస్య సేవ్యతామ్.

**అన్వయక్రమము:–** నిరుద్ధ వాతాయన మందిర ఉదరమ్ హుతాశనః భానుమతః గభస్తయః గురూణి వాసాంసి సయౌవనాః అబలాః అత్ర కాలే జనస్య సేవ్యతామ్ ప్రయాన్తి.

**ప్రతిపదార్థము:–** నిరుద్ధ=మూయబడిన, వాతాయన=కిటికీలుగల, మందిర=ఇళ్ల యొక్క, ఉదరమ్=మధ్యభాగమును, హుతాశనః=అగ్నియు, భానుమతః=సూర్యుని యొక్క, గభస్తయః=కిరణములను, గురూణి=దట్టములగు, వాసాంసి=వస్త్రములును, సయౌవనాః =యౌవనములోనున్న, అబలాః=స్త్రీలును, అత్ర=ఈ, కాలే=కాలమునందు (శిశిరర్తువు), జనస్య=జనమునకు, సేవ్యతామ్=అనుభవింపదగినవగుటను, ప్రయాన్తి =పొందుచున్నవి.

**తాత్పర్యము:–** ఈ (శిశిర) కాలమునందు మూయబడిన కిటికీలు గల ఇళ్ళమధ్య భాగమును, అగ్నియు, సూర్యకిరణములును, దట్టమగు వస్త్రములును, యౌవన వతులును, జనమునకు సేవింపబడదగినవియగుచున్నవి.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**
1) నిరుద్ధ.... ఉదరమ్ – నిరుద్ధం వాతాయనం, యస్యాసౌ తథావిధమ్ – బహువ్రీహిః – నిరుద్ధవాతాయనం చ తత్ మందిరమ్ – నిరుద్ధవాతాయన మందిరమ్ – కర్మధారయః – తస్యోదరమ్ – నిరుద్ధవాతాయనమందిరోదరమ్ – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**
1) ఉదయర్తి గర్భోऽస్మాదితి ఉదరమ్. ఋ–గతౌ, దీనివలన గర్భము ప్రకాశమౌను. **'పిచణ్డకుక్షీజఠరోదరం తున్దమ్'.**
2) వాతస్య అయనం మార్గో వాతాయనం. వాయువునకు మార్గము. **'వాతాయనం గవాక్షః'.**

c) **గుణము :–** ప్రసాదము d) **రీతి** :– వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – 'వంశస్థవిల' వృత్తము.

g) **క్రియాదర్శము:–** ప్రయాన్తి – లట్ ప్రథమపురుషబహువచనము. పరస్మైపది. ప్ర=ఉపసర్గ.

**ధాతువు :–** యా. మిగిలిన వివరములు మొదటిసర్గ శ్లోకభాగమున చెప్పబడినవి.

**శ్లో॥ న చన్దనం చన్ద్రమరీచిశీతలం**

న హర్మ్యపృష్ఠం శరదిన్దునిర్మలమ్।
న వాయవః సాన్ద్రతుషారశీతలా
జనస్య చిత్తం రమయన్తి సామ్ప్రతమ్॥ 3

**పదవిభాగము:-** న చన్దనమ్ చంద్రమరీచిశీతలమ్ న హర్మ్యపృష్ఠమ్ శరత్+ఇందు నిర్మలమ్ న వాయవః సాంద్రతుషారశీతలాః+జనస్య చిత్తమ్ రమయన్తి సామ్ప్రతమ్.

**అన్వయక్రమము:-** సాంప్రతమ్ చంద్ర మరీచి శీతలమ్ చందనమ్ శరత్ ఇందు నిర్మలమ్ హర్మ్య పృష్ఠమ్ సాంద్ర తుషార శీతలాః వాయవః జనస్య చిత్తమ్ న రమయన్తి.

**ప్రతిపదార్థము:-**సాంప్రతమ్=ఇప్పుడు, చంద్ర=చంద్రునియొక్క, మరీచి=కిరణముల వలె, శీతలమ్=చల్లనైన, చందనమ్=చందనమును, శరత్=శరత్కాలమందలి, ఇందు= చంద్రునివలె, నిర్మలమ్=స్వచ్ఛమైన, హర్మ్య=మేడలయొక్క, పృష్ఠమ్= పైభాగమును, సాంద్ర=దట్టమైన, తుషార=మంచుచే, శీతలాః=చల్లనైన, వాయవః=వాయువులు, జనస్య=జనముయొక్క, చిత్తమ్=మనస్సును, న రమయన్తి=రంజింప జేయుటలేదు.

**తాత్పర్యము:-** శిశిరర్తువున 1) చంద్రుని కిరణములవలె చల్లనైన చందనమును, 2) శరత్కాలమందలి చంద్రునివలె స్వచ్ఛమైన మేడలపైభాగమును, 3)దట్టమైన మంచుచే చల్లనైన వాయువులు జనము యొక్క మనస్సును రంజింపజేయుట లేదు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) చంద్రమరీచిశీతలమ్–చంద్రస్య మరీచయః చంద్రమరీచయః– షష్ఠీ తత్పురుషః –తద్వత్ శీతలమ్–చంద్రమరీచిశీతలమ్– ఉపమానపూర్వపద కర్మధారయః
2) శరదిన్దునిర్మలమ్ – శరదః ఇన్దుః శరదిన్దుః – షష్ఠీతత్పురుషః–తద్వత్ నిర్మలమ్ – శరదిన్దునిర్మలమ్ – ఉపమానపూర్వపదకర్మధారయః
3) హర్మ్యపృష్ఠమ్ – హర్మ్యస్య పృష్ఠమ్ – షష్ఠీతత్పురుషః.
4) సాంద్రతుషారశీతలాః–సాంద్రం చేదం తుషారమ్, సాంద్రతుషారమ్ – కర్మధారయః–తేన శీతలాః–తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) తనోశ్చ రమం పృష్ఠమిత్యుచ్యతే. శరీరముయొక్క వెనుకటి భాగము పృష్ఠమన బడును. **'పృష్ఠం తు చరమం తనోః'**
2) మనో హరతీతి హర్మ్యం. హృఞ్ హరణే. మనసును హరించునది. ధనినాం వాసః – ధనికులయిల్లు. **'హర్మ్యాదిర్ధనినాం వాసః'.**

c) **గుణము :-** ప్రసాదము

d) **రీతి :-** వైదర్భి





e) **అలంకారము:-** 'ఉపమా'. లక్షణము మొదటిసర్గయందు చెప్పబడినది. చంద్ర కిరణములు చల్లనిచందనముతో పోల్చి వర్ణింపబడుటచే నిట ఉపమాలంకారము చెప్పదగును.

f) **ఛందస్సు-వృత్తము:-** జగతీ ఛందస్సు – వంశస్థవిలము.

g) **క్రియాదర్శము :-** 'రమయన్తి' – లట్ ప్రథమపురుషబహువచనము. పరస్మైపది.

**ధాతువు :- రమ్** – రంజిల్లుట – భ్వాది (1) ప్రకరణ ధాతువు. ఆత్మనేపది. ప్రేరణార్థమున 'అయ' అను వికరణ ప్రత్యయమును, అన్తి అను తిజ్ ప్రత్యయమును చేర్చుటచే క్రియారూపము పరస్మైపది రూపమున ఈ క్రింది విధముగ నుండును. రమ్+అయ+అన్తి > రమయ+అన్తి > రమయన్తి.

2) రమతేఉ_మీ విహరతే కుమారయతి ఖూర్దతే। (ఆఖ్యాతచంద్రికా 2-1-17)

శ్లో॥ తుషారసజ్ఘాతనిపాతశీతలాః
శశాఙ్కభాభిః శిశిరీకృతాః పునః।
విపాణ్డుతారాగణజిహ్మభూషితా
జనస్య సేవ్యా న భవన్తి రాత్రయః॥ 4

**పదవిభాగము:-** తుషారసంఘాతనిపాతశీతలాః శశాంకభాభిః శిశిరీకృతాః పునః విపాండుతారాగణజిహ్మభూషితాః+జనస్య సేవ్యాః+న భవన్తి రాత్రయః.

**అన్వయక్రమము:-** తుషార సంఘాత నిపాత శీతలాః శశాంక భాభిః పునః శిశిరీకృతాః విపాండు తారా గణ జిహ్మ భూషితాః రాత్రయః జనస్య సేవ్యాః న భవంతి.

**ప్రతిపదార్థము:-** తుషార=మంచు యొక్క, సంఘాత=సమూహము యొక్క, నిపాత= పడుటచేత, శీతలాః=చల్లనైనవియును, శశాంక=చంద్రుని యొక్క, భాభిః=కిరణముల చేత, పునః=మరింత (మరల), శిశిరీకృతాః=చల్లబరుపబడినవియును, విపాణ్డు= మిగుల తెల్లనైన, తారా=నక్షత్రముల యొక్క, గణ=సమూహముచే, జిహ్మ=వంకర టింకరగా, భూషితాః=అలంకరింపబడిన, రాత్రయః=రాత్రులు, జనస్య=జనమునకు, సేవ్యాః =సేవింపదగినవిగ, న భవంతి=అగుచుండుటలేదు.

**తాత్పర్యము:-** మంచుపడుటచే చల్లనైనవియును, చంద్రకిరణములచే మరింత చల్లబరుపబడినవియును, మిగుల తెల్లనైన నక్షత్రముల సమూహములు వంకర టింకరగా అలంకరింపబడినవగు రాత్రులు జనమునకు సేవింపదగినవిగ లేవు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) తుషార..... శీతలాః – తుషారస్య సంఘాతః – షష్ఠీతత్పురుషః – తస్య

నిపాతః–తుషారసంఘాతనిపాతః–షష్ఠీతత్పురుషః – తేన శీతలాః యాస్తాః – తృతీయాతత్పురుషః

2) శశాంకభాభిః–శశాంకస్య భాభిః–షష్ఠీతత్పురుషః.

3) విపాండు... భూషితాః – విపాండవః తారాః విపాండుతారాః – కర్మధారయః – తాసాం గణః – విపాండుతారాగణః – షష్ఠీతత్పురుషః – తేన జిహ్మ భూషితాః యాః తాః – తత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) రాతి సుఖమితి రాత్రిః. రా దానే. సుఖమునిచ్చునది.

**'నిశా నిశీథినీ రాత్రి స్త్రియామా క్షణదా క్షపా'....**

c) **గుణము :–** ప్రసాదము

d) **రీతి :–** వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – 'వంశస్థవిల' వృతము.

f) **క్రియాదర్శము :–** భవన్తి – లట్ప్రథమపురుషబహువచనము పరస్మైపది. అన్తి తిజ్ ప్రత్యయము..

**ధాతువు: భూ–సత్తాయాం** – ఉండుట – భ్వాది (1) ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయము 'అ'. భవ అంగము. గుణవృద్ధులు వచ్చును. సార్వధాతుక లకారములందు అంగమునందలి అకారము లోపించును.

కనుక భూ+అ+అన్తి > భో+అ+అన్తి > భవ+అన్తి > భవన్తి గా మారును.

**శ్లో॥ గృహీతతామ్బూలవిలేపనస్రజః**
**సుఖాసవామోదితవక్త్రపఙ్కజాః।**
**ప్రకామకాలాగురుధూపవాసితం**
**విశన్తి శయ్యాగృహముత్సుకాః స్త్రియః॥ 5**

**పదవిభాగము:–** గృహీతతామ్బూలవిలేపనస్రజః సుఖ+ఆసవ+ఆమోదితవక్త్ర పఙ్కజాః ప్రకామకాలాగురుధూపవాసితమ్ విశన్తి శయ్యాగృహమ్+ఉత్సుకాః స్త్రియః.

**అన్వయక్రమము:–** గృహీత తామ్బూల విలేపన స్రజః సుఖ ఆసవ ఆమోదిత వక్త్ర పంకజాః స్త్రియః ప్రకామ కాలాగురు ధూప వాసితమ్ శయ్యాగృహమ్ ఉత్సుకాః విశన్తి.

**ప్రతిపదార్థము:–** గృహీత=స్వీకరింపబడిన, తామ్బూల=తాంబూలము, విలేపన=పూత వస్తువులును, స్రజః=పూల మాలలును కలిగినట్టివారున్ను, సుఖ=సుఖ కరమైన, ఆసవ= మద్యములచే, ఆమోదిత=పరిమళముగనున్న, వక్త్ర=ముఖమనే, పంకజాః=కమలములు





గల, స్త్రియః=స్త్రీలు, ప్రకామ=మిక్కిలి, కాలాగురు=నల్లనిఅగురుయొక్క, ధూప=పొగచే, వాసితమ్=వాసనపొందిన, శయ్యాగృహమ్=పడకటింటిని, ఉత్సుకాః=ఆతురతగలవారై, విశన్తి=ప్రవేశించుచున్నారు.

**తాత్పర్యము:–** తాంబూలము నములుచు, సుగంధద్రవ్యములు, పూలమాలలు కలిగిన వారై, సుఖకరమైన మద్యములచే పరిమళముగనున్న ముఖ కమలములు గల స్త్రీలు, మిక్కిలి నల్లని అగురు పొగచే వాసన నొందిన శయ్యాగృహమును ఆతృతగలవారై ప్రవేశించుచున్నారు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) గృహీత.. స్రజః – తామ్బూలం చ విలేపనం చ స్రక్ చ, తామ్బూలవిలేపన స్రజః–ద్వంద్వః, గృహీతాః తామ్బూలవిలేపనస్రజో యాభిః తాః–గృహీత తామ్బూలవిలేపనస్రజః–బహువ్రీహిః.

2) సుఖ.... పంకజాః–సుఖశ్చాసౌ ఆసవః సుఖాసవః–కర్మధారయః–సుఖాసవేన ఆమోదితం వక్త్రపంకజం యాసాం తాః – సుఖాసవామోదితవక్త్రపంకజాః – బహువ్రీహిః.

3) ప్రకామ...... వాసితమ్ – ప్రకామం కాలాగురుధూపేన వాసితం యత్ తత్, ప్రకామకాలాగురుధూపవాసితమ్– తృతీయాతత్పురుషః.

4) శయ్యాగృహమ్ – శయ్యాయాః గృహమ్ – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) ఉత్సు ఉద్యోగాతిశయః అస్యాసీత్యుత్సుకః. ఇష్టమైన ప్రయోజనమందు ఉద్యోగాతిశయముగలవాడు. 'ఇష్టార్థోద్యుక్త ఉత్సుకః'. అని అమర కోశము కాని ఆప్టే నిఘంటువు దీనికి 'ఆతురత, తొౖందరపాటు'గలవాడని చెబుతుంది.

c) **గుణము :– ఓజస్సు మరియు మాధుర్యప్రసాదములు** d) **రీతి:– వైదర్భి**

e) **అలంకారము : 'ఉపమా'.** లక్షణము మొదటిసర్గనందు చెప్పబడినది. 'వక్త్రపంకజాః' – అనుచోట ఉపమాలంకారము

f) **ఛందస్సు – వృత్తము:–** జగతీ ఛందస్సు – 'వంశస్థవిల' వృత్తము.

g) **క్రియాదర్శము–ప్రోత్కణ్ఠయన్తి :–** విశన్తి. లట్ ప్రథమపురుషబహువచనము. పరస్మైపది. అన్తి– తిజ్ ప్రత్యయము.

**ధాతువు: విశ్** – ప్రవేశనే – ప్రవేశించుట. తుదాది (ఆరవ) గణమునందలి ధాతువు. 'అ' అనునది వికరణ ప్రత్యయము. కనుక 'విశ్+అ+తి > విశ+తి > విశతి', 'విశ్+అ+అన్తి > విశ+అన్తి > విశన్తి' గా మారును.

శ్లో॥ కృతాపరాధాన్బహుశోఽభితర్జితాన్
సవేపథూన్సాధ్వసలుప్తచేతసః।
నిరీక్ష్య భర్తౄన్సురతాభిలాషిణః
స్త్రియోఽపరాధాన్సమదా విసస్మరుః॥ 6

**పదవిభాగము:-** కృత+అపరాధాన్+బహుశః+అపి తర్జితాన్ సవేపథూన్+సాధ్వస లుప్తచేతసః నిరీక్ష్య భర్తౄన్ సురత+అభిలాషిణః స్త్రియః+అపరాధాన్+సమదాః విసస్మరుః.

**అన్వయక్రమము:-** కృత అపరాధాన్ బహుశః తర్జితాన్ సవేపథూన్ సాధ్వస లుప్త చేతసః భర్తౄన్ సురత అభిలాషిణః నిరీక్ష్య సమదాః స్త్రియః అపరాధాన్ విసస్మరుః

**పతిపదార్థము:-** కృత=చేయబడిన, అపరాధాన్=అపరాధములుగల, బహుశః=అనేక సార్లు, తర్జితాన్=తర్జనలు చేయబడిన, సవేపథూన్=వణుకులతో కూడిన, సాధ్వస= భయముచే, లుప్త=నశించిన, చేతసః=మనస్సుగల, భర్తౄన్=భర్తలను, సురత= సంభోగమును, అభిలాషిణః=అభిలషించువారలనుగా, నిరీక్ష్య=తెలిసికొని, సమదాః =మదముతోకూడినవారగు, స్త్రియః=స్త్రీలు, అపరాధాన్=తప్పులను, విసస్మరుః=మఱచి నారు.

**తాత్పర్యము:-** అపరాధములను చేయుట వలన, అనేకసార్లు బెదిరింపబడుటవలన, వణుకులతో కూడిన, భయముచే నశించిన మనస్సు గల భర్తలను సంభోగమును అభిలషించువారలనుగా తెలిసికొని మదవతులైన స్త్రీలు భర్తల తప్పులను మఱచినారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) కృతాపరాధాన్-కృతః అపరాధో యైః తే తథావిధాన్-బహువ్రీహిః.
2) సాధ్వసలుప్తచేతసః-సాధ్వసేన లుప్తాని చేతాంసి యేషాం తే తథావిధాన్ - బహువ్రీహిః.
3) సురతాభిలాషిణః - సురతస్య అభిలాషిణః - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) వేపనం వేపథుః. టు వేపృ కంపనే. కంపించుట వేపథువు. **'అథ వేపథుః, కమ్పః',**

c) **గుణము :- మాధుర్యప్రసాదములు** d) **రీతి :- వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - 'వంశస్థవిల' వృత్తము.





g) **క్రియాదర్శము :-** విసస్మరుః - లిట్ ప్రథమపురుష బహువచనము. పరస్మైపది. వి=ఉపసర్గ.

**ధాతువు :-** స్మృ - స్మరించుట - భ్వాది (1) ప్రకరణ ధాతువు. 'సస్మర్' అనుఅంగమేర్పడిన పిదప లిట్ ప్రథమపురుష తిజ్ ప్రత్యయముచేరుటచే మూడు వచనములందు దిగువ విధంగా నుండును.

| | | | |
|---|---|---|---|
| లిట్ ప్రథమపురుషమునందు | సస్మర్+అ - | సస్మర్+అతుః - | సస్మర్+ఉః |
| | సస్మార | సస్మరతుః | సస్మరుః |

శ్లో॥ ప్రకామకామైర్యువభిః సనిర్దయం
నిశాసు దీర్ఘాస్వభిరామితాశ్చిరమ్।
భ్రమన్తి మన్దం శ్రమఖేదితోరసః
క్షపావసానే నవయౌవనాః స్త్రియః॥ 7

**పదవిభాగము:-** ప్రకామకామైః+యువభిః సనిర్దయమ్ నిశాసు దీర్ఘాసు+అభి రామితాః +చిరమ్ భ్రమన్తి మందమ్ శ్రమఖేదిత+ఉరసః క్షపా+ అవసానే నవయౌవనాః స్త్రియః

**అన్వయక్రమము:-** ప్రకామ కామైః యువభిః సనిర్దయమ్ దీర్ఘాసు నిశాసు చిరమ్ అభిరామితాః శ్రమ ఖేదిత ఉరసః నవ యౌవనాః స్త్రియః క్షపా అవసానే మందమ్ భ్రమన్తి.

**ప్రతిపదార్థము:-** ప్రకామ=అధికమైన, కామైః=కామముగల, యువభిః=యువకులచేత, సనిర్దయమ్=నిర్దయతో, దీర్ఘాసు=దీర్ఘములైన, నిశాసు=రాత్రులయందు, చిరమ్= చాలాకాలము, అభిరామితాః=రమింపబడివారై, శ్రమ=శ్రమచే, ఖేదిత=నొప్పి చెందిన, ఉరసః=వక్షస్థలముగలవారై, నవ=నూతనమగు, యౌవనాః=యౌవనము కలిగిన, స్త్రియః =స్త్రీలు, క్షపా=రాత్రియొక్క, అవసానే=చివరిభాగమునందు, మందమ్=నెమ్మదిగా, భ్రమన్తి=తిరుగుచున్నారు.

**తాత్పర్యము:-** కామాతురులైన యువకులచేత జాలిలేకుండగ రాత్రులందు చాలాకాలము రమించుటచే కలిగిన శ్రమచే నొప్పిబొందిన వక్షస్థలము కలవారై యౌవనములో కడుగిడిన స్త్రీలు వేకువజామున నెమ్మదిగా తిరుగుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-** 1) ప్రకామకామైః-ప్రకామః కామో యేషాం తైః - బహువ్రీహిః
2) నవయౌవనాః - నవం యౌవనం యాసాం తాః - బహువ్రీహిః.
3) క్షపావసానే - క్షపాయాః అవసానే - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) క్షపయతి సర్వచేష్టా ఇతి క్షపా. క్షై క్షయే. సర్వవ్యాపారములను క్షయింప జేయునది. **'నిశా నిశిథినీ రాత్రి స్త్రియామా క్షణదా క్షపా.'**

c) **గుణము** :- మాధుర్యప్రసాదములు

d) **రీతి :-** వైదర్భి

e) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - 'వంశస్థవిల' వృత్తము.

f) **క్రియాదర్శము :-** భ్రమన్తి - .లట్ ప్రథమపురుషబహువచనము. పరస్మైపది. అన్తి తిఙ్ ప్రత్యయము.

**ధాతువు:- భ్రము** (భ్రమ్) - చలనే - చలించుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. కనుక 'భ్రమ్+అ+అన్తి > భ్రమ+అన్తి > భ్రమన్తి' గా మారును. దీని మరో రూపము 'భ్రమ్యన్తి'. ఇతర రూపములు భ్రమ్యన్తి, భ్రామ్యన్తి.

**శ్లో॥ మనోజ్ఞకూర్పాసకపీడితస్తనాః**
**సరాగకౌశేయకభూషితోరసః।**
**నివేశితాన్తః కుసుమైః శిరోరుహైః**
**విభూషయన్తీవ హిమాగమం స్త్రియః॥ 8**

**పదవిభాగము:-** మనోజ్ఞకూర్పాసకపీడితస్తనాః సరాగకౌశేయకభూషిత+ఉరసః నిశేశిత+అన్తః కుసుమైః శిరోరుహైః విభూషయన్తి+ఇవ హిమాగమమ్ స్త్రియః.

**అన్వయక్రమము:-** మనోజ్ఞ కూర్పాసక పీడిత స్తనాః సరాగ కౌశేయక భూషిత ఉరసః నివేశిత + అన్తః కుసుమైః శిరోరుహైః స్త్రియః హిమాగమమ్ విభూషయన్తీవ.

**ప్రతిపదార్థము:-**మనోజ్ఞ=మనోహరమైన, కూర్పాసక=రవికచే, పీడిత=బిగియ కట్టబడిన, స్తనాః=స్తనములుగల, సరాగ=ఎర్రని, కౌశేయక=పట్టుచీరచే, భూషిత= అలంకరింపబడి, ఉరసః=హృదయభాగము గల, నివేశిత+అన్తః=తురుముకొనిన, కుసుమైః=పూవులుగల, శిరోరుహైః=కేశములతో,స్త్రియః=స్త్రీలు, హిమాగమమ్=శీతా కాలమును, విభూషయన్తీవ =అలంకరించుచున్నట్లున్నారు.

**తాత్పర్యము:-** 1) అందమైన రవికచే బిగియగట్టిన స్తనములు గల, 2) రంగుగల పట్టుచీరచే అలంకరించుకొనిన హృదయభాగముగల, 3) తురుము కొనబడిన పూవులు గల కేశములతో స్త్రీలు శీతాకాలమును అలంకరించుచున్నట్లున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**





1) మనోజ్ఞ..... స్తనాః - మనోజ్ఞః చ అసౌ కూర్పాసకః, మనోజ్ఞ కూర్పాసకః -కర్మధారయః, తేన పీడితాని స్తనాని యాసాం తాః - బహువ్రీహిః

2) సరాగ..... ఉరః - సరాగః చ అసౌ కౌశేయకః-సరాగకౌశేయకః-కర్మధారయః -తేన భూషితమ్-ఉరసః యాసాం తాః - బహువ్రీహిః.

3) నివేశితాన్తః కుసుమైః - నివేశితాని అంతఃకుసుమాని యేషు తైః-బహువ్రీహిః

4) హిమాగమమ్ - హిమస్య ఆగమమ్ - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) క్రిమికోశభవ తంతునిర్మితం వస్త్రం కౌశేయం ఇత్యుచ్యతే. పురుగులచేత గలిగిన బుఱ్ఱలవలన బుట్టిన నూలుచేతనైన పట్టుచీర మొదలైనవి కౌశేయ మనబడును. **'కౌశేయం క్రిమికోశోత్థమ్'.**

c) **గుణము - మాధుర్య ప్రసాదములు**

d) **రీతి - వైదర్భి**

e) **అలంకారము: ఉత్ప్రేక్ష.** లక్షణము మొదటి సర్గ భాగమున చెప్పబడినది. స్త్రీల అలంకరణము శీతాకాలమును అలంకరించుచున్నట్లు ఉత్ప్రేక్షించి వర్ణించుటచే నిట ఉత్ప్రేక్షాలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - 'వంశస్థవిల' వృత్తము.

g) **క్రియాదర్శము :-** విభూషయన్తి - లట్ ప్రథమపురుషబహువచనము.

వి = ఉపసర్గ. పరస్మైపది. అన్తి తిఙ్ ప్రత్యయము.

**ధాతువు:- భూష్** - అలంకరణే - అలంకరించుట. చురాది (10) ప్రకరణ ధాతువు. అయ వికరణ ప్రత్యయము. కనుక భూష్+అయ+అన్తి > భూషయ+అన్తి > భూషయన్తి గా మారును.

**శ్లో॥ పయోధరైః కుఙ్కుమరాగపిఞ్జరైః**
**సుఖోపసేవ్యైర్నవయౌవనోష్మభిః।**
**విలాసినీభిః పరిపీడితోరసః**
**స్వపన్తి శీతం పరిభూయ కామినః॥ 9**

**పదవిభాగము:-** పయోధరైః కుంకుమరాగపింజరైః సుఖ+ఉపసేవ్యైః నవ యౌవన+ ఊష్మభిః విలాసినీభిః పరిపీడిత+ఉరసః స్వపన్తి శీతమ్ పరిభూయ కామినః

**అన్వయక్రమము:-** కామినః విలాసినీభిః కుంకుమ రాగ పింజరైః సుఖ ఉపసేవ్యైః నవ యౌవన ఊష్మభిః పయోధరైః పరిపీడిత ఉరసః శీతమ్ పరిభూయ స్వపన్తి.

**ప్రతిపదార్థము:-** కామినః=కాముకులు, విలాసినీభిః=విలాసవతులచే, కుంకుమ= కుంకుమయొక్క, రాగ=రంగుచే, పింజరైః=పచ్చనివన్నెకలిగిన, సుఖ=సుఖముగ, ఉపసేవ్యైః=అనుభవింపదగిన, నవ=నూతనమగు, యౌవన=యౌవనముచే, ఊష్మభిః =వేడికలిగిన, పయోధరైః=స్తనములచే, పరిపీడిత=పీడింపబడిన, ఉరసః=వక్షస్థలము గలవారై, శీతమ్=చలిని, పరిభూయ=లెక్కపెట్టక, స్వపన్తి=నిద్రించుచున్నారు.

**తాత్పర్యము:-**కాముకులు 1)విలాసవతులచే కుంకుమ రంగుచే పచ్చని వన్నె కలిగిన 2)హాయిగ అనుభవింపదగిన నూతన యౌవనముచే వేడి కలిగిన స్తనములచే పీడింపబడిన వక్షస్థలము కలవారై చలిని లెక్కపెట్టక నిద్రించుచున్నారు.

**పదాదర్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) కుంకుమరాగపింజరైః-కుంకుమస్య రాగః, కుంకుమరాగః-షష్ఠీతత్పురుషః -తేన పింజరా యే తే తైః-తృతీయాతత్పురుషః
2) సుఖోపసేవ్యైః-సుఖేన ఉపసేవ్యా యే తే తైః - తృతీయాతత్పురుషః
3) నవయౌవనోష్మభిః - నవం యౌవనోనేష్మవర్తతే యేషు తే తైః - బహుమ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) పీతవర్ణత్వాత్ పింజరమ్, పీతనం చ - పచ్చని వన్నెగలది గనుక పింజరము. **'పింజరం పీతనం తాల మాలం చ హరితాలకే'.** 'తామ్రో విపీతరక్తస్తు పింజరః పరికీర్తితః

c) **గుణము - ప్రసాదమాధుర్యములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** జగతీ ఛందస్సు - 'వంశస్థవిల' వృత్తము.

g) **క్రియాదర్థము :-**స్వపన్తి - లట్ ప్రథమపురుషబహువచనము, పరస్మైపది. అన్తి తిజ్ ప్రత్యయము.

**ధాతువు: ష్వప్ - స్వప్ - శయే** - శయనించుట, నిద్రించుట-భ్వాది (1) ప్రకరణ ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. ఉభయపది. కనుక స్వప్+అ+అన్తి > స్వప+అన్తి > 'స్వపన్తి' గా మారును. అరుదైన ప్రయోగము. స్వపితి-అనునది రెండవ వికరణ ధాతువు. ఇది సాధారణ ప్రయోగము. ప్రేరణార్థకమున ఈ ధాతురూపము స్వాపయతి, తే గా నుండును. సుషుప్సతి-అనునది సన్నంతము. సుప్యతే అనునది కర్మణి రూపముగా గమనించగలరు.

శ్లో॥ సుగన్ధినిఃశ్వాసవికమ్పితోత్పలం
మనోహరం కామరతిప్రబోధకమ్।





నిశాసు హృష్టాః సహ కామిభిః స్త్రియః
పిబన్తి మద్యం మదనీయముత్తమమ్॥ 10

**పదవిభాగము:-** సుగన్ధినిశ్వాసవికమ్పిత+ఉత్పలమ్ మనోహరమ్ కామరతి ప్రబోధకమ్ నిశాః హృష్టాః సహ కామిభిః స్త్రియః పిబన్తి మద్యం మదనీయమ్+ ఉత్తమమ్.

**అన్వయక్రమము:-** స్త్రియః హృష్టాః సుగన్ధి నిఃశ్వాస వికమ్పిత ఉత్పలమ్ మనోహరమ్ కామ రతి ప్రబోధకమ్ మదనీయమ్ మద్యమ్ కామిభిస్సహ నిశాసు పిబన్తి.

**ప్రతిపదార్థము:-** స్త్రియః=స్త్రీలు, హృష్టాః=ఆనందభరితులై, సుగన్ధి=పరిమళించు, నిఃశ్వాస=నిట్టూర్పులచే, వికమ్పిత=కంపితమైన, ఉత్పలమ్=కలువలుగలిగిన, మనోహరమ్ =మనోహరమైన, కామ=కామము యొక్క, రతి=సంభోగమునకు, ప్రబోధకమ్= ప్రేరేపించునట్టి, మదనీయమ్=మత్తెక్కించునట్టి, మద్యమ్=మద్యమును, కామిభిస్సహ= ప్రియులతోడ, నిశాసు=రాత్రులయందు, పిబన్తి=త్రాగుచున్నారు.

**తాత్పర్యము:-**1) పరిమళించు నిట్టూర్పులచే కలువలను కంపింపజేయుచున్న, 2) మనోహరమైన, సంభోగమునకు ప్రేరేపించునట్టి, మత్తెక్కించునట్టి **మద్యమును** స్త్రీలు ఆనందభరితులై ప్రియులతోకూడి రాత్రులయందు త్రాగుచున్నారు.

**పదాదర్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) సుగన్ధి... ఉత్పలమ్ - సుగన్ధిః చ అసౌ నిఃశ్వాసః, సుగన్ధి నిఃశ్వాసః- కర్మధారయఃతేన వికంపితమ్ ఉత్పలమ్ యస్య తత్ - బహుమ్రీహిః.
2) కామరతిప్రబోధకమ్ - కామస్య రతిః కామరతిః - షష్ఠీతత్పురుషః - తస్య ప్రబోధకమ్ - షష్ఠీతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) శోభనః గన్ధః అస్యేతి సుగన్ధిః - మంచిగంధముగలిగినది. **'ఇష్టగన్ధ స్సుగన్ధి స్స్యాత్'.**
2) మాద్యంత్యనయేతి మదిరా,మద్యం చ. మదీ హర్షే, దీని చేత మదింతురుగాన మదిరము, మద్యమును. **'మదిరా కశ్యమద్యే చాపి'.**

c) **గుణము - మాధుర్యప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు వృత్తము:-** జగతీ ఛందస్సు - 'వంశస్థవిల' వృత్తము

g) **క్రియాదర్థము :-** 'పిబన్తి - లట్ ప్రథమపురుష బహువచనము. పరస్మైపది. అన్తి తిజ్ ప్రత్యయము.

**ధాతువు:-** పా (పిబ్) - పానే - త్రాగుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. కనుక పిబ్+అ+అన్తి > పిబ+అన్తి > పిబన్తి గా మారును.

**శ్లో॥ అపగతమదరాగా యోషిదేకా ప్రభాతే**
**కృతవినతకుచాగ్రా పత్యురాలిఙ్గనేన।**
**ప్రియతమపరిభుక్తం వీక్షమాణా స్వదేహం**
**వ్రజతి శయనవాసాద్వాసమన్యద్ధసన్తీ॥ 11**

**పదవిభాగము:-** అపగతమదరాగా యోషిత్+ఏకా ప్రభాతే కృతవినత కుచ+అగ్రా పత్యుః+ఆలింగనేన ప్రియతమపరిభుక్తమ్ వీక్షమాణా స్వదేహమ్ వ్రజతి శయనవాసాత్ +వాస అన్యత్+హసన్తీ.

**అన్వయక్రమము:-** అపగత మద రాగా పత్యుః ఆలింగనేన కృత వినత కుచ అగ్రా ఏకా యోషిత్ ప్రభాతే ప్రియతమ పరిభుక్తమ్ స్వదేహమ్ వీక్షమాణా హసన్తీ శయన వాసాత్ అన్యత్ వాసమ్ వ్రజతి.

**ప్రతిపదార్థము:-** అపగత=పోయిన (తగ్గిన), మద=మదము, రాగా=రాగమును కలదియు, పత్యుః=భర్త యొక్క, ఆలింగనేన=ఆలింగనముచేత, కృత=చేయబడిన, వినత=అణగిన, కుచ+అగ్రా=చూచుకములు కలిగిన, ఏకా=ఒక, యోషిత్= స్త్రీ, ప్రభాతే=వేకువఝామున, ప్రియతమ=ప్రియునిచే, పరిభుక్తమ్=అనుభవింపబడిన, స్వదేహమ్=తనదేహమును, వీక్షమాణా=చూచుచున్నదై, హసన్తీ=నవ్వుచున్నదై, శయన వాసాత్=పడకటింటినుండి, అన్యత్=వేఱొక, వాసమ్=ఇంటికి (గదికి), వ్రజతి=పోవు చున్నది.

**తాత్పర్యము:-** కామోద్రేకము తగ్గిన తరువాత, భర్త యొక్క ఆలింగనముచే అణగిన స్తనాగ్రములు కలిగిన ఒక స్త్రీ వేకువఝామున ప్రియునిచే అనుభవింపబడిన తన దేహమును చూచుచున్నదై, నవ్వుచున్నదై పడకటింటి నుండి వేఱొక గదికి పోవుచున్నది.

**పదార్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) అపగతమదరాగా-మదస్య రాగః, మదరాగః - షష్ఠీతత్పురుషః - అపగతో మదరాగో యస్యాః సా - బహువ్రీహిః.
2) కృతవినతకుచాగ్రా - కృతే వినతే కుచయోః అగ్రే యస్యాః సా - బహువ్రీహిః
3) ప్రియతమపరిభుక్తమ్- ప్రియతమేన పరిభుక్తః యః తమ్- తృతీయాతత్పురుషః
4) శయనవాసాత్ - శయనస్య వాసాత్ - షష్ఠీతత్పురుషః.





b) **నిఘంటు ప్రమాణములు:-**

c) **గుణము :-** మాధుర్యప్రసాదములు d) **రీతి :-** వైదర్భి

e) **ఛందస్సు - వృత్తము :-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము

లక్షణము: 1) ప్రతిపాదమున 15 అక్షరములుండును,
2) ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః॥
3) న, న, మ, య, య గణములుండును. 4) యతి (8, 7)

| ఉదా: అ ప గ | త మ ద | రా గా యో | షి దే కా | ప్ర భా తే |
|---|---|---|---|---|
| I I I | I I I | U U U | I U U | I U U |
| న | న | మ | య | య |

f) **క్రియాదర్శము :-** వ్రజతి - లట్ ప్రథమపురుషఏకవచనము. పరస్మైపది. తి తిఙ్ ప్రత్యయము.

**ధాతువు:- వ్రజ** (వ్రజ్) - గతౌ-వెళ్ళుట-పరస్మైపది. భ్వాది (1) ప్రకరణ ధాతువు. అ వికరణ ప్రత్యయము. కనుక వ్రజ్+అ+తి > వ్రజ+తి > వ్రజతి గా మారును.

2) ప్రతిష్ఠతేఽ ఇచ్ఛత్యయతే వ్రజత్యయతి గచ్ఛతి........ (ఆఖ్యాతచంద్రికా 2-3-32)

**శ్లో॥ అగురుసురభిధూపామోదితం కేశపాశం**
**గలితకుసుమమాలం తన్వతీ కుఞ్చితాగ్రమ్।**
**త్యజతి గురునితమ్బా నిమ్నమధ్యావసానా**
**ఉషసి శయనమన్యా కామినీ చారుశోభా॥ 12**

**పదవిభాగము:-** అగురుసురభిధూప+ఆమోదితమ్ కేశపాశమ్ గలితకుసుమ మాలమ్ తన్వతీ కుఞ్చిత+అగ్రమ్ త్యజతి గురునితమ్బా నిమ్నమధ్య+అవసానా ఉషసి శయనమ్ అన్యా కామినీ చారుశోభా.

**అన్వయక్రమము:-** అగురు సురభి ధూప ఆమోదితమ్ కేశపాశమ్ గలిత కుసుమ మాలమ్ కుంచిత అగ్రమ్ తన్వతీ గురు నితంబా నిమ్న మధ్య అవసానా చారు శోభా అన్యా కామినీ ఉషసి శయనమ్ త్యజతి.

**ప్రతిపదార్థము:-** అగురు=అగురు యొక్క, సురభి=సువాసన గల, ధూప=ధూపము వలన, ఆమోదితమ్=పరిమళము కలిగించబడిన, కేశపాశమ్=కేశసమూహమును, గలిత=జారిన, కుసుమ=పూవులయొక్క, మాలమ్=మాలను కలిగినదియు, కుంచిత= ముడువబడిన, అగ్రమ్=చివరలు గలదిగ, తన్వతీ=చేయుచున్నదియు, గురు=పెద్ద,

నితంబా=పిఱుదులు కలిగినదియు, నిమ్న=తగ్గిన, మధ్య=నడుము యొక్క, అవసానా= చివరకలిగినదియు, చారు=అందమైన, శోభా=ప్రకాశముగల, అన్యా=మఱియొక, కామినీ=కామిని, ఉషసి=వేకువఝామున, శయనమ్=ప్రక్కను, త్యజతి=విడుచుచున్నది.

**తాత్పర్యము:-** సువాసన గల అగురుధూపము వలన పరిమళము నొందిన కేశ సమూహమును, జారిన పూలమాలను కలిగినదియు, ముడువబడిన కేశసమూహము చివరలు గలదియు, పెద్ద పిఱుదులు కలిగినదియు, సన్నని నడుము గలిగి అందముగ ప్రకాశించు మఱియొక కామిని వేకువఝామున ప్రక్కను వీడుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) అగురుసురభిధూపామోదితమ్-సురభిః చ అసౌ ధూపః, సురభిధూపః- కర్మధారయః, అగురోః సురభిధూపః- షష్ఠీతత్పురుషః- తేన ఆమోదితోయః తథావిధమ్ - తృతీయాతత్పురుషః.
2) గలితకుసుమమాలమ్ - కుసుమానామ్ మాలా - కుసుమమాలా - షష్ఠీ తత్పురుషః-గలితా కుసుమమాలా యస్య తమ్ - బహువ్రీహిః.
3) కుంచితాగ్రమ్-కుంచితమ్ అగ్రమ్ యస్య తమ్ - బహువ్రీహిః.
4) గురునితమ్బా-గురూనితమ్బౌ యస్యాః సా-బహువ్రీహిః.
5) నిమ్నమధ్యావసానా - నిమ్నః మధ్యస్య అవసానో యస్యాః సా - బహువ్రీహిః
6) చారుశోభా - చార్వీ శోభా యస్యాః సా తథావిధా-బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) చరతి మనోఽస్మిన్నితి చారు. చర గతి భక్షణయోః. దీని యందు మనస్సు సంచరించును. **'సుందరం రుచిరం చారు సుషమం సాధు శోభనమ్'.**

c) **గుణము - మాధుర్యప్రసాదములు**

d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము

g) **క్రియాదర్శము :-** త్యజతి - లట్ ప్రథమపురుష ఏకవచనము. పరస్మైపది. తి తిజ్ ప్రత్యయము.

**ధాతువు: త్యజ** (త్యజ్) హానౌ - విడుచుట. భ్వాది (1) ప్రకరణ ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. పరస్మైపది. సకర్మకము. కనుక 'త్యజ్+అ+తి > త్యజ+తి > త్యజతి' గా మారును.





**శ్లో॥ కనకకమలకాన్తైః సద్య ఏవామ్బుధౌతైః**
**శ్రవణతటనిషక్తైః పాటలోపాన్తనేత్రైః।**
**ఉషసి వదనబిమ్బైరంససంసక్తకేశైః**
**శ్రియ ఇవ గృహమధ్యే సంస్థితా యోషితోఽద్య॥13**

**పదవిభాగము:-** కనకకమలకాన్తైః సద్యః+ ఏవ+అమ్బుధౌతైః శ్రవణ తటనిషక్తైః పాటల+ఉపాన్త నేత్రైః ఉషసి వదనబింబైః+అంససంసక్తకేశైః శ్రియః+ఇవ గృహమధ్యే సంస్థితాః యోషితః+అద్య.

**అన్వయక్రమము:-** సద్యః ఏవ అంబు ధౌతైః కనక కమల కాంతైః వదనబింబైః శ్రవణ తట నిషక్తైః పాటల ఉపాన్త నేత్రైః అంస సంసక్త కేశైః యోషితః అద్య ఉషసి గృహమధ్యే శ్రియః ఇవ సంస్థితాః.

**ప్రతిపదార్థము:-** సద్యః ఏవ=అప్పుడే, అంబు=నీటితో, ధౌతైః=కడుగబడిన, కనక= బంగారుయొక్క, కమల=కమలములవలె, కాంతైః=చక్కని, వదనబింబైః=ముఖ బింబములతోడను, శ్రవణ=చెవులయొక్క, తట=ఒడ్డునందు, నిషక్తైః=తగిలి యుండెడు, పాటల=పాటలవర్ణమైన, ఉపాన్త=మధ్యభాగముగల, నేత్రైః=కన్నులతోడను, అంస= మూపులయందు, సంసక్త=తగుల్కొనిన, కేశైః=కేశములతోడను, యోషితః=స్త్రీలు, అద్య=ఈ (శిశిర) ఋతువున, ఉషసి=వేకువజామున, గృహమధ్యే=నట్టింట, శ్రియ ఇవ=లక్ష్మీదేవులవలె, సంస్థితాః=ఉన్నారు.

**తాత్పర్యము:-** 1)అప్పుడే నీటితో కడుగుకొనుటవలన బంగరు కమలములవలె చక్కని ముఖబింబముల తోడను, 2)చెవుల వరకు వ్యాపించిన ఎర్రజీర మధ్యభాగమందుగల కన్నులతోడను, 3)మూపులందు తగుల్కొనిన కేశముల తోడను స్త్రీలు ఈ శిశిరర్తువున వేకువజామున నట్టింట లక్ష్మీదేవులవలె ఉన్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) కనకకమలకాన్తైః-కనకస్య కమలాని, కనకకమలాని - షష్ఠీతత్పురుషః, - తద్వత్ కాన్తః తైః - ఉపమాన పూర్వపద కర్మధారయః
2) శ్రవణతటనిషక్తైః - శ్రవణయోః తటమ్ - శ్రవణతటమ్ - షష్ఠీతత్పురుషః - తత్ర నిషక్తాని యాని తాని తైః - బహువ్రీహిః.
3) పాటలోపాన్తనేత్రైః - పాటలాని ఉపాన్తాని యేషాం తాని - బహువ్రీహిః తథాభూతైః నేత్రైః - కర్మధారయః
4) అంససంసక్తకేశైః - అంసే సంసక్తాః అంససంసక్తాః - సప్తమీ తత్పురుషః - అంససంసక్తాః చ తే కేశాః తైః - కర్మధారయః.

5) గృహమధ్యే – గృహాణాం మధ్యే–షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) పాటలీ పుష్పవర్ణత్వాత్ పాటలః. పాదిరిపువ్వు వర్ణము గలిగినది.

c) **గుణము –** ప్రసాదము  d) **రీతి –** వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీ వృత్తము

f) **క్రియాదర్శము :–** సంస్థితాః. కృదంతము. 'క్త' ప్రత్యయాంతము. ఈ పదము వివరములు పూర్వము సర్గలో చెప్పబడినవి. సం=ఉపసర్గ. స్థితః – స్థితా – స్థితమ్. స్థితాః అనునది బహువచన రూపము (స్త్రీలింగము)

**శ్లో॥ పృథుజఘనభరార్తాః కిఞ్చిదానమ్రమధ్యాః**
**స్తనభరపరిఖేదాన్మన్దమన్దం వ్రజన్త్యః।**
**సురతసమయవేషం నైశమాశు ప్రహాయ**
**దధతి దివసయోగ్యం వేషమన్యాస్తరుణ్యః॥ 14**

**పదవిభాగము:–** పృథుజఘనభర+ఆర్తాః కిఞ్చిత+ఆనమ్రమధ్యాః స్తనభరపరిఖేదాత్ +మందమందం వ్రజన్త్యః సురతసమయవేషమ్ నైశమ్+ఆశు ప్రహాయ దధతి దివస యోగ్యమ్ వేషమ్+అన్యాః+తరుణ్యః.

**అన్వయక్రమము:–** పృథు జఘన భర ఆర్తాః కించిత్ ఆనమ్ర మధ్యాః స్తనభర పరిఖేదాత్ మందమందమ్ వ్రజన్త్యః అన్యాః తరుణ్యః నైశమ్ సురత సమయ వేషమ్ ఆశు ప్రహాయ దివసయోగ్యమ్ వేషమ్ దధతి.

**ప్రతిపదార్థము:–** పృథు=స్థూలమైన, జఘన=జఘనము యొక్క, భర=బరువుచే, ఆర్తాః =పీడితులైనట్టియు, కించిత్=కొంచెము, ఆనమ్ర=వంగిన, మధ్యాః=నడుమభాగము గలిగినట్టియు, స్తనభర=స్తనముల బరువుచే, పరిఖేదాత్=ఆయాసమువలన, మంద మందమ్=నెమ్మదినెమ్మదిగా, వ్రజన్త్యః=నడుచుచున్నవారగు, అన్యాః=ఇతర, తరుణ్యః =స్త్రీలు, నైశమ్=రాత్రి సంబంధమగు, సురత=సంభోగము యొక్క, సమయ= సమయ మందలి, వేషమ్=ఆహార్యమును, ఆశు=వెంటనే, ప్రహాయ=వదిలి, దివసయోగ్యమ్= పగటికి అనువైన, వేషమ్=ఆహార్యమును, దధతి=ధరించుచున్నారు.

**తాత్పర్యము:–** స్థూలమైన జఘనము యొక్క బరువుచే పీడితులైనట్టియు, కొంచెము వంగిన నడుము భాగము గలిగినట్టియు, స్తనముల బరువుచే కలిగిన శ్రమ వలన నెమ్మది నెమ్మదిగా నడుచుచున్నవారగు ఇతర స్త్రీలు రాత్రి సంబంధమగు సంభోగసమయ మందలి ఆహార్యమును వెంటనే వదిలి పగటికనువైన ఆహార్యమును ధరించుచున్నారు.





**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) పృథుజఘనభరార్తాః – పృథూ చ తౌ జఘనౌ పృథుజఘనౌ – కర్మధారయః – తయోః భరః, పృథుజఘనభరః – షష్ఠీతత్పురుషః – తేన ఆర్తాః యాః తాః – తృతీయాతత్పురుషః.

2) కించిదానమ్రమధ్యాః – కించిత్ ఆనమ్రో మధ్యో యాసాం తాః – బహువ్రీహిః

3) స్తన..... ఖేదాత్ – స్తనయోః భరః, స్తనభరః – షష్ఠీతత్పురుషః – తస్య పరిఖేదాత్ – షష్ఠీతత్పురుషః.

4) సురతసమయవేషమ్ – సురతస్య సమయః, సురతసమయః – షష్ఠీతత్పురుషః – తస్య వేషమ్ – షష్ఠీతత్పురుషః.

5) దివసయోగ్యమ్ – దివసస్య యోగ్యమ్ – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) హన్యతే పురుషేణ తాడ్యత ఇతి జఘనమ్. హన హింసాగత్యోః. పురుషునిచేత పీడింపబడునది. **'క్లీబే తు జఘనం పురః'**

2) దివస వాసర శబ్దౌ వికల్పేన నపుంసకలింగే వర్తేతే. దివసము వాసరము ఇవి యొక పక్షమున నపుంసకములగును – పగటి పేళ్ళు. **'ఘస్రో దినాహనీ వా తు క్లీబే దివసవాసరౌ'.**

c) **గుణము :– మాధుర్య ప్రసాదములు**  d) **రీతి :– వైదర్భి**

e) **అలంకారము:** 'స్తనభరపరిఖేదాన్మన్దమన్దం' అనుచోట అతిశయోక్తి.

f) **ఛందస్సు–వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీ వృత్తము.

g) **క్రియాదర్శము:–** దధతి – లట్ ప్రథమపురుషబహువచనము, పరస్మైపది. జుహోత్యాది (3) ప్రకరణధాతువు. ఈ ధాతువివరములు ఇంతకుముందు చెప్పబడినవి.

**శ్లో॥ నఖపదచితభాగాన్వీక్షమాణాః స్తనాగ్రాన్**
**అధరకిసలయాగ్రం దన్తభిన్నం స్పృశన్త్యః।**
**అభిమతరసమేతం నన్దయన్త్యస్తరుణ్యః**
**సవితురుదయకాలే భూషయన్త్యాననాని॥ 15**

**పదవిభాగము:–** నఖపదచితభాగాన్ + వీక్షమాణాః స్తనాగ్రాన్ అధరకిసలయ + అగ్రమ్ దన్తభిన్నమ్ స్పృశన్త్యః అభిమతరసం + ఏతమ్ నన్దయన్త్యః+తరుణ్యః సవితుః+ ఉదయకాలే భూషయన్తి+ఆననాని.

**అన్వయక్రమము:-** నఖ పద చిత భాగాన్ స్తన+అగ్రాన్ వీక్షమాణాః దన్త భిన్నమ్ అధరకిసలయ అగ్రమ్ స్పృశన్త్యః ఏతమ్ అభిమత రసమ్ నందయన్త్యః తరుణ్యః సవితుః ఉదయకాలే ఆననాని భూషయన్తి.

**ప్రతిపదార్థము:-** నఖ=గోళ్ళ యొక్క, పద=చిహ్నములచే, చిత=వ్యాప్తమైన, భాగాన్=భాగములు కలిగిన, స్తనాగ్రాన్=చూచుకములను, వీక్షమాణాః=చూచుచున్నట్టియు, దన్త=దన్తములచే, భిన్నమ్=భేదింపబడిన, అధరకిసలయ=చిగురువంటి అధరము యొక్క, అగ్రమ్=కొనను, స్పృశన్త్యః=తాకుచున్నట్టియు, ఏతమ్=ఈ, అభిమత= ఇష్టమగు, రసమ్=రసమును, నందయన్త్యః=సంతోషించుచుండు, తరుణ్యః=స్త్రీలు, సవితుః =సూర్యుని యొక్క, ఉదయకాలే= ఉదయసమయమందు, ఆననాని= ముఖము లను, భూషయన్తి=అలంకరించుకొను చున్నారు..

**తాత్పర్యము:-** గోళ్ళ చిహ్నములచే వ్యాప్తమైన భాగములు కలిగిన చూచుకములను చూచుచున్నట్టి, దన్తపుగాటులు గలిగి యుండు చిగురువంటి అధరపు కొనను తాకుచున్నట్టి, ఈ ఇష్టరసము (నఖక్షత, దన్తక్షతములు)నకు సంతోషించుచుండు స్త్రీలు సూర్యోదయ సమయమందు ముఖములను అలంకరించుకొనుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) నఖ...... భాగాన్ - నఖపదైః చితో భాగో యేషాం తాన్ - బహువ్రీహిః.
2) స్తనాగ్రాన్ - స్తనయోః అగ్రః - స్తనాగ్రః - తాన్ - షష్ఠీతత్పురుషః.
3) దన్తభిన్నమ్ - దంతైః భిన్నమ్ - తృతీయాతత్పురుషః.
4) అధరకిసలయాగ్రమ్ - అధర ఏవ కిసలయః - కర్మధారయః తస్య అగ్రమ్ - షష్ఠీతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) అనితి శ్వసిత్యనేన ఆననం. అన ప్రాణనే. దీని చేత బ్రతుకుదురు. **'వక్త్రాస్యే వదనం తుణ్డ మాననం లపనం ముఖమ్'.**

c) **గుణము - మాధుర్య ప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు - మాలినీ వృత్తము.

f) **అలంకారము: ఉపమా.** లక్షణము మొదటి సర్గనందు చెప్పబడినది. 'అధరకిసలయ'. అనుచోట ఉపమ.

g) **క్రియాదర్శము :-** 'భూషయన్తి'. - లట్ ప్రథమపురుషబహువచనము. పరస్మైపది. ఈ క్రియాధాతు వివరములు ఈ సర్గనందలి '8' వ శ్లోకభాగమున చెప్పబడినవి.





**శ్లో॥ ప్రచురగుడవికారః స్వాదుశాలీక్షురమ్యః**
**ప్రబలసురతకేళి ర్జాతకన్దర్పదర్పః।**
**ప్రియజనరహితానాం చిత్తసన్తాపహేతుః**
**శిశిరసమయ ఏష శ్రేయసే వోఽస్తు నిత్యమ్ ॥ 16**

**పదవిభాగము:-** ప్రచురగుడవికారః స్వాదుశాలి+ఇక్షురమ్యః ప్రబలసురతకేళిః+జాత కందర్పదర్పః ప్రియజనరహితానామ్ చిత్తసంతాపహేతుః శిశిరసమయః ఏషః శ్రేయసే వః+అస్తు నిత్యమ్.

**అన్వయక్రమము:-** ప్రచుర గుడవికారః స్వాదు శాలి ఇక్షు రమ్యః ప్రబల సురతకేళిః జాత కందర్పదర్పః ప్రియజన రహితానామ్ చిత్త సంతాప హేతుః ఏషః శిశిరసమయః నిత్యమ్ వః శ్రేయసే అస్తు.

**ప్రతిపదార్థము:-** ప్రచుర=అధికము అయిన, గుడవికారః=గుడ భేదములు కలిగిన దియు, స్వాదు=ఇంపుగనున్న, శాలి=వరిచేతను, ఇక్షు=చెఱకుచేతను, రమ్యః =రమ్యమైనదియు, ప్రబల=అధికమైన, సురతకేళిః=కామ క్రీడగలిగినదియు, జాత=పుట్టిన, కందర్ప= మన్మథుని యొక్క, దర్పః=దర్పముగలదియు, ప్రియజన= ప్రియజనులచే, రహితానామ్=లేనివారల యొక్క, చిత్త=మనసుయొక్క, సంతాప= సంతాపమునకు, హేతుః=కారణమైన, ఏషః=ఈ, శిశిరసమయః=శిశిరర్తువు, నిత్యమ్= ఎల్లప్పుడు, వః=మీకు, శ్రేయసే=శ్రేయస్సు కొఱకు, అస్తు=ఉండుగాక.

**తాత్పర్యము:-** అధికముగ గుడభేదములు కలిగినదియు, ఇంపుగనున్న వరి, చెఱకులతో రమ్యమైనదియు, అధికమైన కామక్రీడ గలిగినదియు, మన్మథోద్రేకదర్పము కలదియు, ప్రియజనులు లేనివారల మనస్సు యొక్క సంతాపమునకు కారణమైన ఈ శిశిరర్తువు ఎల్లప్పుడు మీకు శ్రేయస్సు కొఱకు ఉండుగాక.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ప్రచుర...... వికారః - గుడస్య వికారః - గుడవికారః - షష్ఠీతత్పురుషః - ప్రచురః గుడవికారో యస్మిన్ సః-బహువ్రీహిః.
2) స్వాదు..... రమ్యః - శాలిచ ఇక్షుః, శాలీక్షూ - ద్వంద్వః, స్వాదూ చ తౌ శాలీక్షూ, స్వాదుశాలీక్షూ - కర్మధారయః, తాభ్యాం రమ్యో యః అసౌ - స్వాదుశాలీక్షురమ్యః - తృతీయాతత్పురుషః.
3) ప్రియజనరహితానామ్ - ప్రియః చ అసౌ జనః ప్రియజనః - కర్మధారయః - తైః రహితానామ్ - తృతీయాతత్పురుషః.

4) చిత్తసంతాపహేతుః – చిత్తస్య సంతాపః, చిత్తసంతాపః–షష్ఠీతత్పురుషః – తస్య హేతుః – షష్ఠీతత్పురుషః.

5) శిశిర సమయః – శిశిరస్య సమయః – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) గుడతీతి గుడః. గుడ రక్షాయాం. రక్షించునది. **'గుడో గోళేక్షుపాకయోః'** అని అమరము.**'గుడస్స్యాద్గోళకే హస్తే సన్నా హేక్షువికారయో'**రితి విశ్వప్రకాశః

2) కుత్సితో దర్పో యస్య సః కందర్పః – కుత్సితమైన దర్పము గలవాడు. **'కందర్పో దర్పకో ఽ నంగః కామః పంచశరః స్మరః'.**

c) **గుణము – ఓజస్సు మరియు ప్రసాదము** d) **రీతి – వైదర్భి.**

e) **ఛందస్సు – వృత్తము:–** అతిశక్వరీ ఛందస్సు – మాలినీవృత్తము.

f) **క్రియాదర్శము :–** 'అస్తు' – లోట్ ప్రథమపురుషఏకవచనము. పరస్మైపది. తు. తిజ్ ప్రత్యయము.

**ధాతువు :– అస** (అస్) భువి–ఉండుట. అకర్మకము. అదాది (2) ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయము ఉండదు. ఈ ధాతువులో 'ఏధి' ప్రత్యేకరూపము. మధ్యమపురుష ఏకవచనమిది. ఈ ధాతువునకు ఆర్ధధాతుక రూపాలు లేవు గనుక ఇది అసంపూర్ణ ధాతువని గ్రహించగలరు. ఇట్టిదే ఈ ప్రకరణములో 'బ్రూ' = (చెప్పుట) ధాతువు ఒకటి ఉంది. ఇది ఉభయపది. అస్ + తు > అస్తు.

**శ్రీః**





**శ్రీః**

మహాకవి కాళిదాస విరచితః

# ఋతుసంహారః

## వసన్తవర్ణనం నామ షష్ఠః సర్గః

**అవతారిక : అథ క్రమప్రాప్తం వసంతకాలం వర్ణయతి**

**శ్లో॥ ప్రఫుల్లచూతాఙ్కురతీక్ష్ణసాయకో**
**ద్విరేఫమాలావిలసద్ధనుర్గుణః।**
**మనాంసి వేద్ధుం సురతప్రసఙ్గినాం**
**వసన్తయోద్ధా సముపాగతః ప్రియే॥ 1**

**పదవిభాగము:–** ప్రఫుల్లచూత+అఙ్కురతీక్ష్ణసాయకః+ద్విరేఫమాలావిలసత్+ధనుః+గుణః మనాంసి వేద్ధుమ్ సురతప్రసఙ్గినామ్ వసన్తయోద్ధా సముపాగతః ప్రియే.

**అన్వయక్రమము:–** (హే) ప్రియే ప్రఫుల్ల చూతాఙ్కుర తీక్ష్ణ సాయకః ద్విరేఫ మాలా విలసత్ ధనుః గుణః వసన్త యోద్ధా సురత ప్రసఙ్గనామ్ మనాంసి వేద్ధుమ్ సముపాగతః

**ప్రతిపదార్థము:–** హే ప్రియే=ఓ ప్రియురాలా, ప్రఫుల్ల=వికసించిన, చూతాంకుర= మామిడి చిగుళ్ళే, తీక్ష్ణ=వాడియైన, సాయకః=బాణములుగా గల, ద్విరేఫ=తుమ్మెదల యొక్క మాలా=వరుసయే, విలసత్=ఒప్పుచున్న, ధనుః=వింటియొక్క, గుణః=నారిగా గల, వసన్త=వసన్తర్తువుఅను, యోద్ధా=యోధుడు,సురత=రతియొక్క, ప్రసఙ్గినామ్= సంబంధముగల వారియొక్క, మనాంసి=మనస్సులను, వేద్ధుమ్=బాధించుటకు, సముపాగతః=వచ్చెను.

**తాత్పర్యము:–** ఓ ప్రియురాలా! వికసించిన మామిడి చిగుళ్ళే వాడియైన బాణములుగా గల, తుమ్మెదల యొక్క వరుసయే ఒప్పుచున్న వింటినారిగా గల, వసన్తర్తువు అను యోధుడు కాముకుల మనస్సులను బాధించుటకు వచ్చెను.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) ప్రఫుల్ల .... సాయకః – ప్రఫుల్లః చ అసౌ చూతాంకురః, చ ప్రఫుల్లచూతాంకురః – కర్మధారయః – ప్రఫుల్లచూతాంకురః ఏవ తీక్ష్ణః సాయకో యస్యాసౌ తథావిధః – బహుప్రీహిః.

2) ద్విరేఫ...... గుణః – ద్విరేఫాణాం మాలా, ద్విరేఫమాలా – షష్ఠీతత్పురుషః

–ధనుషోగుణః, ధనుర్గుణః – షష్ఠీతత్పురుషః–ద్విరేఫమాలైవ విలసన్ ధనుర్గుణో యస్యాసౌ తథావిధః–బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) స్యతి ప్రతిపక్షం నాశయతీతి సాయకః. షోఉ_న్త కర్మణి. శత్రువును నశింపజేయునది. **'శరే ఖడ్గే చ సాయకః'.**

c) **గుణము :–** ప్రసాదగుణము మరియు ఓజస్సు d) **రీతి :–** పాఞ్చాలి

e) **అలంకారము : రూపకము**

'ప్రఫుల్లచూతాంకురతీక్ష్ణసాయకః'.ఇందు మామిడి చిగుళ్ళు,వాడియైన బాణములుగా అబేధముగా వర్ణించుటచే నిది రూపకాలంకారమనదగును.

f) **ఛందస్సు – వృత్తము:–** జగతీఛందస్సు – 'వంశస్థవిల' వృత్తము

లక్షణము: 1) ప్రతిపాదమునకు 12 అక్షరములుండును.

2) 'వదన్తి వంశస్థవిలం జతౌజరౌ' – అనునది వృత్త లక్షణము.

3) గణములు – జ, త, జ, ర 4) యతి (5, 7)

ఉదా: ప్ర ఫు ల్ల | చూ తాం కు | ర తీ క్ష్ణ | సా య కః

I U I U U I I U I U I U

జ త జ ర

ఈ వృత్తమును 'వంశస్థ' అని, వంశస్తనిత అని కూడా అనెదరు.

g) **క్రియాదర్శము :–** సముపాగతః. కృదంతము. 'క్త' ప్రత్యయాన్తము ధాతువివరములు మొదటి సర్గ శ్లోకభాగమునందు చెప్పబడినవి.

**శ్లో॥ ద్రుమాః సపుష్పాః సలిలం సపద్మం**
**స్త్రియః సకామాః పవనస్సుగన్ధిః।**
**సుఖాః ప్రదోషా దివసాశ్చ రమ్యాః**
**సర్వం ప్రియే చారుతరం వసన్తే ॥ 2**

**పదవిభాగము:–** ద్రుమాః సపుష్పాః సలిలం సపద్మం స్త్రియః సకామాః పవనః+సుగన్ధిః సుఖాః ప్రదోషాః దివసాః+చ రమ్యాః సర్వం ప్రియే చారుతరమ్ వసన్తే.

**అన్వయక్రమము:–** హేప్రియే వసన్తే ద్రుమాః సపుష్పాః సలిలమ్ సపద్మం స్త్రియః సకామాః పవనః సుగన్ధిః ప్రదోషాః సుఖాః దివసాః రమ్యాః సర్వమ్ చారుతరమ్.

**ప్రతిపదార్థము:–** హేప్రియే=ఓ ప్రియురాలా! వసన్తే=వసన్తర్తువునందు, ద్రుమాః=చెట్లు, సపుష్పాః=పుష్పములతో గూడినది, సలిలమ్=జలము, సపద్మం=పద్మములతో గూడినది,





స్త్రియః=స్త్రీలు, సకామాః=కామముతో గూడినవారు, పవనః=వాయువు, సుగన్ధిః= పరిమళముతో గూడినది, ప్రదోషాః=సాయంసంధ్యలు, సుఖాః=సుఖకరముగనున్నవి, దివసాః=పగళ్ళు, రమ్యాః=రమ్యముగను, సర్వమ్=సమస్తము, చారుతరమ్= సుందర తరమైయున్నది.

**తాత్పర్యము:–** ఓ ప్రియురాలా! వసన్తర్తువునందు 1) చెట్లు పుష్పములతోను, 2) జలము (చెరువులందు) పద్మములతోను, 3) స్త్రీలు కామముతోను, 4) వాయువు సువాసనతోను, 5) సాయంసంధ్యలు సుఖకరముగను, 6) పగళ్ళు రమ్యముగను, – సమస్తము సుందరతరముగా నుండును.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1. సపుష్పాః – పుష్పైః సహితః – బహువ్రీహిః
2. సుగంధిః – శోభనః గంధః అస్య అస్తి ఇతి – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) ద్రుః వృక్షావయవో ఉ_ స్య ద్రుమః. ద్రు అనగా శాఖ. అది గలిగినది. **'అనోకహః కుటస్సాలః పలాశీ ద్రుద్రుమాగమాః'**

c) **గుణము :–** ప్రసాదమాధుర్యములు

d) **రీతి :–** వైదర్భి

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – ఉపజాతివృత్తము

g) **క్రియాదర్శము :–** 'చారుతరమ్, అత్యంతమ్ చారు. తద్ధితవృత్తి.

**ధాతువు :– చర్** – చరతి చిత్తే – ఉణ్ ప్రత్యయాంతమున చారు గా మారును. చారుః పుంలింగం, చార్వీ స్త్రీలింగం, చారు నపుంసక లింగం. చారు విశేషణము నకు సుందరమైనదని, పుంలింగమున బృహస్పతియని, నపుంసకమున కుంకుమ పువ్వని అర్థము.

**శ్లో॥ వాపీజలానాం మణిమేఖలానాం**
**శశాఙ్కభాసాం ప్రమదాజనానామ్।**
**చూతద్రుమాణాం కుసుమాన్వితానాం**
**దదాతి సౌభాగ్యమయం వసన్తః॥ 3**

**పదవిభాగము:–** వాపీజలానామ్మణిమేఖలానామ్ శశాంకభాసామ్ ప్రమదాజనానామ్ చూతద్రుమాణామ్ కుసుమ+అన్వితానామ్ దదాతి సౌభాగ్యమ్ అయమ్ వసన్తః.

**అన్వయక్రమము:–** అయమ్ వసన్తః వాపీ జలానామ్ మణి మేఖలానామ్ శశాంక

భాసామ్ ప్రమదాజనానామ్ కుసుమ+అన్వితానామ్ చూతద్రుమాణామ్ సౌభాగ్యమ్ దదాతి.

**ప్రతిపదార్థము:–** అయమ్=ఈ, వసన్తః=వసన్తర్తువు, వాపీ=దిగుడుబావులయొక్క, జలానామ్=నీళ్ళకును, మణి=మణులుపొదగబడిన, మేఖలానామ్=మొలతాళ్ళకును, శశాంకభాసామ్=చంద్రకిరణములకును, ప్రమదాజనానామ్=స్త్రీజనులకును, కుసుమ =పూవులతో, అన్వితానామ్=కూడియుండు, చూతద్రుమాణామ్=మామిడి చెట్లకును, సౌభాగ్యమ్=సౌభాగ్యమును, దదాతి=చేకూర్చుచున్నది.

**తాత్పర్యము:–** ఈ వసన్తర్తువు 1) దిగుడుబావుల నీళ్ళకును, 2)మణులు పొదగబడిన మొలనూళ్ళకును, 3)చంద్రకిరణములకును, 4)స్త్రీజనులకును, 5)పూవులతో కూడియుండు మామిడి చెట్లకును సౌభాగ్యమును చేకూర్చుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) వాపీజలానామ్ – వాప్యాః జలాని – వాపీజలాని తేషామ్ – షష్ఠీతత్పురుషః
2) మణిమేఖలానామ్ – మణేః మేఖలానామ్ – షష్ఠీతత్పురుషః.
3) శశాంకభాసామ్ – శశాంకస్య భాసామ్ – షష్ఠీతత్పురుషః.
4) కుసుమాన్వితానామ్ – కుసుమైః అన్వితానామ్ – తృతీయాతత్పురుషః.
5) చూతద్రుమాణామ్ – చూతస్య ద్రుమాణామ్ – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) ఉప్యన్తే పద్మాదయః అత్ర వాపీ. పద్మాదులు దీనియందు నాటబడును. వారి పీయతే ఉ త్ర వాపీ. **'వాపీ తు దీర్ఘికా'**

c) **గుణము :– మాధుర్యప్రసాదములు** d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – 'ఉపజాతి' వృత్తము

f) **క్రియాదర్శము :–** దదాతి – పరస్మైపది. లట్ ప్రథమపురుషఏకవచనము. తి–తిజ్ ప్రత్యయము.

**ధాతువు:– దుదాజ్** – దా – దానే –ఇచ్చుట – (ఉభయ) పరస్మైపది. – జుహోత్యాది (3) ప్రకరణ ధాతువు. ధాతువునకు ద్విత్వము. మిగిలిన వివరములు ఇంతకుముందు చెప్పబడినవి. చూడగలరు.

**శ్లో॥ కుసుమ్భరాగారుణితైర్దుకూలై**
**ర్నితమ్బబిమ్బాని విలాసినీనామ్।**
**రక్తాంశుకైః కుఙ్కుమరాగగౌరై**
**రలంక్రియన్తే స్తనమణ్డలాని ॥ 4**





**పదవిభాగము:–** కుసుమ్భరాగ+అరుణితైః+దుకూలైః+నితమ్బబిమ్బాని విలాసినీనామ్ రక్త+అంశుకైః కుంకుమరాగగౌరైః+అలంక్రియన్తే స్తనమణ్డలాని.

**అన్వయక్రమము:–** విలాసినీనామ్ నితమ్బబింబాని కుసుమ్భ రాగ అరుణితైః దుకూలైః స్తనమణ్డలాని కుంకుమ రాగ గౌరైః రక్త అంశుకైః అలంక్రియన్తే.

**ప్రతిపదార్థము:–** విలాసినీనామ్=విలాసవతులయొక్క, నితమ్బబింబాని=గుండ్రని పిఱుదులును, కుసుమ్భ=కుసుమ పూవుయొక్క, రాగ=రంగుచే, అరుణితైః=ఎఱ్ఱగా జేయబడిన, దుకూలైః=వస్త్రములచేతను, స్తనమణ్డలాని=కుచమండలములు, కుంకుమ=కుంకుమముయొక్క, రాగ=రంగుచే, గౌరైః=గౌరవర్ణములైన, రక్త=ఎఱ్ఱని, అంశుకైః=వస్త్రములచేతను, అలంక్రియన్తే=అలంకరింపబడుచున్నవి.

**తాత్పర్యము:–** విలాసవతులు (తమయొక్క) గుండ్రని పిఱుదులును కుసుమ పూవురంగుచే ఎఱ్ఱగా చేయబడిన పలుచని వస్త్రములచేతను, కుచమండలములను కుంకుమరంగుచే గౌరవర్ణములైన ఎఱ్ఱని వస్త్రములచేతను అలంకరించుకొను చున్నారు.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కుసుమ్భరాగారుణితైః – కుసుమ్భస్య రాగః కుసుమ్భరాగః – షష్ఠీతత్పురుషః – తేన అరుణితైః – తృతీయాతత్పురుషః.
2) నితమ్బబింబాని – నితమ్బానాం బింబాని – షష్ఠీతత్పురుషః.
3) రక్తాంశుకైః–రక్తం చ తత్ అంశుకమ్ తైః – కర్మధారయః.
4) కుంకుమరాగగౌరైః–కుంకుమస్య రాగః, కుంకుమరాగః, షష్ఠీతత్పురుషః–తేన గౌరైః – తృతీయాతత్పురుషః.
5) స్తనమణ్డలాని – స్తనానాం మండలాని – షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కుశ్యతి సంశ్లిష్యతి వస్త్రాదావితి కుసుంభమ్. కుస సంశ్లేషణే. వస్త్రాదుల యందు కూడినది. **'స్యా త్కుసుమ్భం వహ్నిశిఖం మహారజన మిత్యపి'.**

c) **గుణము :– మాధుర్య ప్రసాదములు** d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – 'ఉపజాతి' వృత్తము.

g) **క్రియాదర్శము :–** అలంక్రియన్తే – ఆత్మనేపది. లట్ప్రథమపురుషబహువచనము. ఇందు 'అలం' అనునది 'గతిసంజ్ఞ' గా మాత్రమే పేర్కొనబడును.

**ధాతువు:–** 'కృ' – దీని వివరములు – పూర్వశ్లోకభాగము / 4వ సర్గ / 2వ శ్లోకం చూడగలరు.

శ్లో॥ కర్ణేషు యోగ్యం నవకర్ణికారం
చలేషు నీలేష్వలకేష్వశోకమ్।
పుష్పం చ పుల్లం నవమల్లికాయాః
ప్రయాన్తి కాన్తిం ప్రమదాజనానామ్॥ 5

**పదవిభాగము:–** కర్ణేషు యోగ్యమ్ నవకర్ణికారమ్ చలేషు నీలేషు+అలకేషు+అశోకమ్ పుష్పమ్ చ పుల్లమ్ నవమల్లికాయాః ప్రయాంతి కాన్తిమ్ ప్రమదాజనానామ్.

**అన్వయక్రమము:–** ప్రమదాజనానామ్ కర్ణేషు యోగ్యమ్ నవకర్ణికారమ్ చలేషు నీలేషు అలకేషు అశోకమ్ నవమల్లికాయాః పుల్లమ్ పుష్పఇ్చ కాన్తిమ్ ప్రయాన్తి.

**ప్రతిపదార్థము:–** ప్రమదాజనానామ్=స్త్రీలయొక్క, కర్ణేషు=చెవులయందు, యోగ్యమ్ =తగిన, నవ=క్రొత్త, కర్ణికారమ్=కొండగోగుపూవును, చలేషు=రెపరెపలాడు, నీలేషు=నల్లని, అలకేషు=ముంగురులయందు, అశోకమ్=అశోకపుష్పమును, నవమల్లికాయాః=క్రొత్తదగు మల్లెయొక్క, పుల్లమ్=వికసించిన, పుష్పఇ్చ=పువ్వును, కాన్తిమ్=శోభను, ప్రయాన్తి=పొందుచున్నవి.

**తాత్పర్యము:–** స్త్రీలయొక్క చెవులయందు క్రొత్త కొండగోగుపూవును, రెపరెపలాడు నల్లని ముంగురులయందు అశోక పుష్పమును, వికసించిన క్రొత్త మల్లెపువ్వును శోభను పొందుచున్నవి.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) నవకర్ణికారమ్ – నవః చ అసౌ కర్ణికారః తమ్ – కర్మధారయః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) కర్ణికా మియర్తీతి కర్ణికారః– కర్ణిక యనగా దుద్దు. దానిని బొంది యుండునది. కర్ణికాం కర్ణభూషణత్వమియర్తీతి వా కర్ణికారః. ఋ గతౌ. కర్ణభూషణత్వమును బొందునది. **'కర్ణికారః పరివ్యాధే'.**

c) **గుణము :– మాధుర్యప్రసాదము లు**

d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – 'ఉపజాతివృత్తము'

f) **క్రియాదర్శము–'ప్రయాన్తి' :–** పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. అన్తి తిజ్ ప్రత్యయము. ప్ర = ఉపసర్గ.
**ధాతువు:** 'యా'. ఈ ధాతువివరములు 2వ సర్గ, 3వ శ్లోకభాగమున చూడదగును.





శ్లో॥ స్తనేషు హారాః సితచన్దనార్ద్రా
భుజేషు సఙ్గం వలయాఙ్గదాని।
ప్రయాన్త్యనఙ్గాతురమానసానాం
నితమ్బినీనాం జఘనేషు కాఞ్చ్యః॥ 6

**పదవిభాగము:–** స్తనేషు హారాః సితచందనఆర్ద్రాః భుజేషు సంగమ్ వలయ+ అంగదాని ప్రయాన్తి+అనంగ+ఆతురమానసానామ్ నితమ్బినీనామ్ జఘనేషు కాఞ్చ్యః.

**అన్వయక్రమము:–** అనంగ ఆతుర మానసానామ్ నితమ్బినీనామ్ స్తనేషు సిత చందన ఆర్ద్రాః హారాః భుజేషు వలయ అంగదాని జఘనేషు కాంచ్యః సంగమ్ ప్రయాన్తి.

**ప్రతిపదార్థము:–** అనంగ=మన్మథ, ఆతుర=పీడితులైన, మానసానామ్=మనస్సుగల, నితమ్బినీనామ్=స్త్రీల యొక్క, స్తనేషు=స్తనములయందు, సిత=తెల్లని, చందన= చందనముచే, ఆర్ద్రాః=తడిసిన, హారాః=ముత్యాలహారములును, భుజేషు=భుజముల యందు, వలయఅంగదాని=కేయూరములును, జఘనేషు=జఘనములయందు, కాంచ్యః =మొలనూళ్ళను, సంగమ్=సంబంధమును, ప్రయాన్తి=పొందుచున్నవి.

**తాత్పర్యము:–** మన్మథపీడితలైన మదవతులయొక్క స్తనములయందు తెల్లని చందనముచే తడిసిన ముత్యాలహారములును, భుజములయందు కేయూరములును, జఘనములయందు మొలనూళ్ళను స్థానమును పొందుచున్నవి.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) సితచందనార్ద్రాః – సితం చ తత్ చన్దనమ్, సితచన్దనమ్ – కర్మధారయః– తేన ఆర్ద్రాః – తృతీయాతత్పురుషః

2) అనంగాతురమానసానామ్ – అనంగేన ఆతురం మానసం యాసాం తాసాం – బహువ్రీహిః

3) వలయాంగదాని – వలయానిచ అంగదాని – ద్వంద్వః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) ఆతుర స్సంభ్రమో ఉ స్యాస్తీత్యాతురః. ఊ త్వరా సంభ్రమే. అంతట వేగిరము గలవాడు. **'ఆతురో ఉ భ్యమితో ఉ భ్యాన్తః'** –

c) **గుణము :– మాధుర్యప్రసాదములు** d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – ఉపేన్ద్రవజ్రా వృత్తము

g) **క్రియాదర్శము :-** 'ప్రయాన్తి' - వివరములు ఇంతకు మునుపు చెప్పబడినవి.

**శ్లో॥ సపత్రలేఖేషు విలాసినీనాం**
**వక్త్రేషు హేమామ్బురుహోపమేషు।**
**రత్నాన్తరే మౌక్తికసఙ్గరమ్యః**
**స్వేదాగమో విస్తరతాముపైతి॥ 7**

**పదవిభాగము:-** సపత్రలేఖేషు విలాసినీనామ్ వక్త్రేషు హేమ+అంబురుహ+ ఉపమేషు రత్న+అన్తరే మౌక్తికసంగరమ్యః స్వేద+ఆగమః విస్తరతామ్+ఉపైతి.

**అన్వయక్రమము:-** విలాసినీనామ్ సపత్రలేఖేషు హేమ అంబురుహ ఉపమేషు వక్త్రేషు స్వేద+ఆగమః రత్నాన్తరే మౌక్తిక సంగ రమ్యః విస్తరతామ్ ఉపైతి.

**ప్రతిపదార్థము:-** విలాసినీనామ్=విలాసవతులయొక్క, స పత్రలేఖేషు=మకరికాపత్ర రేఖలతోకూడిన, హేమ=బంగరు, అంబురుహ=పద్మములతో, ఉపమేషు=పోలికగల, వక్త్రేషు=ముఖములయందు, స్వేద+ఆగమః=పట్టినచెమటబొట్లు, రత్నాన్తరే=రత్నముల మధ్య, మౌక్తిక=ముత్యములయొక్క, సంగ=సంబంధమువలె, రమ్యః=రమ్యమై, విస్తరతామ్=విస్తరిల్లుటను, ఉపైతి=పొందుచున్నవి.

**తాత్పర్యము:-** విలాసవతులయొక్క మకరికాపత్ర రేఖలతోకూడిన బంగరు పద్మముతో పోల్చదగిన ముఖములయందు, పట్టినచెమటబొట్లు, రత్నముల మధ్య పొదిగిన ముత్యములవలె రమ్యమై విస్తరిల్లుచున్నవి.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) హేమామ్బురుహోపమేషు - హేమ్నః అమ్బురుహమ్, హేమామ్బురుహమ్ - షష్ఠీతత్పురుషః - తేన సహోపమా యేషాం తేషు - బహువ్రీహిః.
2) స్వేదాగమః -స్వేదస్య ఆగమః - షష్ఠీతత్పురుషః.
3) రత్నాన్తరే - రత్నానామ్ అన్తరే - షష్ఠీతత్పురుషః.
4) మౌక్తిక..... రమ్యః - మౌక్తికస్య సంగః, మౌక్తికసంగః - షష్ఠీతత్పురుషః - తేన రమ్యః - మౌక్తికసంగరమ్యః - తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) ముచ్యతే శుక్తిసంపుటాదితి ముక్తా, ముక్తైవ మౌక్తికమ్. ముచ్ల్ మోక్షణే. ముత్యపుచిప్పలవలన విడువబడునది గనుక ముక్త. ముక్తయే మౌక్తికము. **'అథ మౌక్తికమ్. ముక్తా -'**





c) **గుణము :-** మాధుర్యప్రసాదములు

d) **రీతి :-** వైదర్భి

e) **అలంకారము:'ఉపమా'**-లక్షణము మొదటి సర్గ శ్లోక భాగములందు చెప్పబడినది. 'వక్త్రేషు హేమామ్బురుహోపమేషు'. విలాసవతుల ముఖములను బంగరు పద్మములతో పోల్చి వర్ణింపబడుటచే నిట ఉపమాలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతి వృత్తము

g) **క్రియాదర్శము :-** 'ఉపైతి' : పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము. తి-తిజ్ ప్రత్యయము, ఉప=ఉపసర్గ.

**ధాతువు :- ఇణ్** (ఇ) గతౌ - వెళ్ళుట - సకర్మకము. పరస్మైపది. అదాది (2) ప్రకరణధాతువు. దీనికి వికరణ ప్రత్యయము లేదు. ద్వితీయ వర్గ (అదాది, జుహోత్యాది, స్వాది, రుధాది, తనాది, క్ర్యాదులు) మున బలవత్ప్రత్యయములకు ముందు ధాతువుల అంత్యాచ్చులకును, ఉపధ యందలి హ్రస్వాచ్చులకును గుణము వచ్చును. కనుక ఇ+తి-ఏతి గా మారును.

2) ఋణోత్యటతి యాత్యేతి సరతీయర్తి సర్పతి..... (ఆఖ్యాతచంద్రికా 2-3-32)

**శ్లో॥ ఉచ్ఛ్వాసయన్త్యః శ్లథబన్ధనాని**
**గాత్రాణి కన్దర్పసమాకులాని।**
**సమీపవర్తిష్వధునా ప్రియేషు**
**సముత్సుకా ఏవ భవన్తి నార్యః ॥ 8**

**పదవిభాగము:-** ఉచ్ఛ్వాసయన్త్యః శ్లథబంధనాని గాత్రాణి కందర్పసమాకులాని సమీపవర్తిషు+అధునా ప్రియేషు సముత్సుకాః+ఏవ భవన్తి నార్యః

**అన్వయక్రమము:-** అధునా ప్రియేషు సమీపవర్తిషు నార్యః కందర్ప సమాకులాని శ్లథ బంధనాని గాత్రాణి ఉచ్ఛ్వాసయన్త్యః సముత్సుకాః ఏవ భవన్తి.

**ప్రతిపదార్థము:-** అధునా=ఇప్పుడు, ప్రియేషు=ప్రియులు, సమీపవర్తిషు=దగ్గర నుండగా, నార్యః=స్త్రీలు, కందర్ప=మదనునిచే, సమాకులాని=వ్యాకులమైన, శ్లథ= వదులుజేయ బడిన, బంధనాని=ముడులుగల, గాత్రాణి=అవయవములను, ఉచ్ఛ్వాసయన్త్యః =ఉబ్బించుచు, సముత్సుకాః ఏవ=ఆతురత కలవారుగనే, భవన్తి= అగుచున్నారు.

**తాత్పర్యము:-** ఇప్పుడు (వసన్తర్తువు) ప్రియుల దగ్గరనున్న స్త్రీలు మదనునిచే వ్యాకులమైన సడలించిన ముడులు గల అవయవములను ఉబ్బించుచు ఆతురత కలవారలుగనే అగుచున్నారు.

**పదాదర్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) శ్లథబంధనాని - శ్లథం బంధనం యేషాం తాని - బహువ్రీహిః.
2) కందర్పసమాకులాని - కందర్పేణ సమాకులాని యాని తాని - తృతీయా తత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) గాతే గచ్ఛతీతి గాత్రమ్. గాజ్ గతౌ. పోవునది. **'గాత్రం వపుః సంహననం శరీరం వర్ష్మ విగ్రహః'.**
2) నృణాతి నయతి స్వవశం పురుషమితి నారీ. నృ నయే. పురుషుని వశము చేసికొనునది. **'స్త్రీ యోషిదబలా యోషా నారీ సీమన్తినీ వధూః'.**

c) **గుణము - మాధుర్యప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - 'ఉపజాతి' వృత్తము.

f) **క్రియాదర్థము :-** 'భవన్తి' - పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. అన్తి తిజ్ ప్రత్యయము.

**ధాతువు: 'భూ'**-సత్తాయామ్-ఉండుట-పరస్మైపది. భ్వాది(1)ప్రకరణ ధాతువు. 'అ' వికరణప్రత్యయము, భూ+అ+అన్తి > భో+అ+అన్తి>భవ్+అ+అన్తి > భవ+అన్తి> భవన్తి గా మారును.

గమనిక:-1) 'సార్వధాతుకార్ధధాతుకయోః' - అను సూత్రముచే ధాతువులోని ఊకారమునకు గుణము ఓకారము వచ్చును.

2) 'ఏచోఽయవాయావః' అను సూత్రముచే ఓకారమునకు 'అవ్' ఆదేశమగును.

3) సత్తాయామస్తి **భవతి** విద్యతే। (ఆఖ్యాతచంద్రికా 1-1-1)

**శ్లో॥ తనూని పాణ్డూని సమన్థరాణి (మదాలసాని)**
**ముహుర్ముహుర్జృమ్భణతత్పరాణి।**
**అఙ్గాన్యనఙ్గః ప్రమదాజనస్య**
**కరోతి లావణ్యససమ్భ్రమాణి॥ 9**

**పదవిభాగము:-** తనూని పాణ్డూని సమన్థరాణి ముహుః+ముహుః+జృంభణతత్పరాణి అంగాని+అనంగః ప్రమదాజనస్య కరోతి లావణ్యససమ్భ్రమాణి.

**అన్వయక్రమము:-** అనంగః ప్రమదాజనస్య అంగాని తనూని పాణ్డూని సమన్థరాణి ముహుః ముహుః జృంభణతత్పరాణి లావణ్య ససంభ్రమాణి కరోతి.





**ప్రతిపదార్థము:-** అనంగః=మదనుడు, ప్రమదాజనస్య=స్త్రీజనముయొక్క, అంగాని=దేహములను, తనూని=చిన్నవిగను, పాణ్డూని=తెల్లనివిగను, సమన్థరాణి=జాడ్యముతో గూడినవిగను, ముహుః ముహుః=మాటిమాటికి, జృంభణ తత్పరాణి=ఆవులించుట యందు ఆసక్తి గలవిగను, లావణ్య=లావణ్యముచేత, ససంభ్రమాణి=వేగిరపాటు గలవిగను, కరోతి=చేయుచున్నాడు.

**తాత్పర్యము:-** మదనుడు స్త్రీ జన దేహములను చిన్నవిగను, తెల్లనివిగను, జాడ్యముతో కూడినవిగను, తఱచుగా ఆవులించుటయందు ఆసక్తి గలవిగను, లావణ్యముచే వేగిరపాటు గలవిగను చేయుచున్నాడు.

**పదాదర్థవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) జృమ్భణతత్పరాణి - జృంభణే తత్పరాణి యాని తాని - సప్తమీతత్పురుషః
2) లావణ్యససమ్భ్రమాణి-లావణ్యేన ససమ్భ్రమాణి యాని తాని - తృతీయా తత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) జృంభంతే అనేనేతి జృంభః, జృంభణం చ, జభ జృభిగాత్రవినామే. దీని చేత దేహము సంకోచవికాసాదుల బొందును. **'జృంభస్తు త్రిషు జృంభణమ్'.**

c) **గుణము - మాధుర్య ప్రసాదములు:-** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతి వృత్తము

f) **క్రియాదర్థము :-** 'కరోతి' : పరస్మైపది. లట్ ప్రథమపురుషైకవచనము. తి-తిజ్ ప్రత్యయము.

**ధాతువు :- డుకృఞ్**(కృ) - కరణే - చేయుట. - (ఉభయ) పరస్మైపది. తనాది (8) ప్రకరణ ధాతువు. 'ఉ' వికరణ ప్రత్యయము. దృఢ ప్రత్యయములు పరమగు నపుడు 'కృ' ధాతువు నందలి ఋకారమునకు (గుణము) అర్ అనియు, దుర్బల ప్రత్యయము పరమగునపుడు 'ఉర్' అనియు ఆదేశమగును. కనుక కృ+ఉ+తి > కర్+ఉ+తి > కరోతి గా మారును. (సార్వధాతుకార్ధధాతుకయోః అను సూత్రముచే 'ఉ' ప్రత్యయమునకు గుణము ఓకారము వచ్చును.)

2) కృతౌ కరోత్యావహతి విదధాత్యాదధాతి చ (ఆఖ్యాతచంద్రికా 2-1-2)

**శ్లో॥ నేత్రేషు లోలో మదిరాలసేషు**
**గణ్డేషు పాణ్డుః కఠినస్తనేషు।**

**మధ్యేషు నిమ్నో జఘనేషు పీనః**
**స్త్రీణామనఙ్గో బహుధా స్థితోఽద్య॥ 10**

**పదవిభాగము:-** నేత్రేషు లోలః+మదిరాలసేషు గణ్డేషు పాణ్డు కఠినస్తనేషు మధ్యేషు నిమ్నః+జఘనేషు పీనః స్త్రీణామ్ అనంగః బహుధా స్థితః+అద్య.

**అన్వయక్రమము:-** అద్య అనంగః స్త్రీణాం మదిరాలసేషు నేత్రేషు లోలః గణ్డేషు పాణ్డుః స్తనేషు కఠినః మధ్యేషు నిమ్నః జఘనేషు పీనః బహుధా స్థితః.

**ప్రతిపదార్థము:-** అద్య=ఇప్పుడు (వసన్తర్తువున), అనంగః=మదనుడు, స్త్రీణామ్=స్త్రీల యొక్క, మదిరాలసేషు=మద్యముచే అలసటనొందిన, నేత్రేషు=కన్నులయందు, లోలః =చలించువాడుగను, గణ్డేషు=చెక్కిళ్ళయందు, పాణ్డుః=తెల్లనైనవాడుగను, స్తనేషు= కుచములయందు, కఠినః=కఠినమైనవాడుగను, మధ్యేషు=నడుములయందు, నిమ్నః =సన్నమైనవాడుగను, జఘనేషు=జఘనములయందు, పీనః=బలిసినవాడుగను, బహుధా=అనేక రీతుల, స్థితః=ఉండియున్నాడు.

**తాత్పర్యము:-** వసన్తర్తువున మదనుడు 1)మద్యముచే అలసటనొందిన స్త్రీల కన్నుల యందు చంచలుడుగను, 2)చెక్కిళ్ళయందు తెల్లనివాడుగను, 3) స్తనములయందు కఠినుడుగను, 4)నడుములయందు సన్ననివాడుగను, 5) జఘనములయందు బలిసినవాడుగను అనేకరీతుల ఉండియున్నాడు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) మదిరాలసేషు – మదిరయా అలసాని తేషు తృతీయాతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) గణ్డతీతి గండః. గడి వదనైకదేశే. కూడుకొనియుండునది. **'గణ్డౌ కపోతౌ'.**

c) **గుణము – మాధుర్యప్రసాదములు**

d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు – ఇంద్రవజ్రావృత్తము

f) **క్రియాదర్శము :-** 'స్థితః' – 'క్త' ప్రత్యయాంతము.

**ధాతువు :- ష్ఠా(స్థా)** గతి నివృత్తౌ – నిలుచుట. అకర్మకము. పరస్మైపది. భ్వాదిప్రకరణ ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. ఈ ప్రత్యయాంతములు – భూతకాలికములు. ప్రధానముగా కర్మణ్యర్థములు. అకర్మకధాతువు మీద వచ్చినపుడు కర్త్రర్థకమున గాని భావార్థమున గాని యగును. ఈ ధాతువుపైన (స్థా), కర్త్రర్థములో





కూడ 'క్త' ప్రత్యయము చేయవచ్చును స్థా+ఇ+త > స్థిత. కనుక నామవాచక రూపమునననుసరించి ఇది మూడు లింగములలోనికి మారును. స్థితః (పుం.లి.) – స్థితా (స్త్రీ. లిం.) – స్థితమ్ గా మారును.

**శ్లో॥ అఙ్గాని నిద్రాలసవిభ్రమాణి**
**వాక్యాని కిఞ్చిన్మదలాలసాని।**
**భ్రూక్షేపజిహ్మాని చ వీక్షితాని**
**చకార కామః ప్రమదాజనానామ్॥ 11**

**పదవిభాగము:-** అంగాని నిద్రా+అలసవిభ్రమాణి వాక్యాని కించిత్+మదలాలసాని భ్రూక్షేపజిహ్మాని చ వీక్షితాని చకార కామః ప్రమదాజనానామ్.

**అన్వయక్రమము:-** కామః ప్రమదాజనానామ్ అంగాని నిద్రాలసవిభ్రమాణి వాక్యాని కించిత్ మదలాలసాని వీక్షితాని చ భ్రూక్షేపజిహ్మాని చకార.

**ప్రతిపదార్థము:-** కామః=మదనుడు, ప్రమదాజనానామ్=స్త్రీజనముయొక్క, అంగాని= అవయవములను, నిద్రాలసవిభ్రమాణి=నిదురచే అలసటకలిగిన విలాసములుగల వానినిగా, వాక్యాని=మాటలను, కించిత్=కొంచెము, మద=మదముచే, లాలసాని= మనోహరములుగాను, వీక్షితాని=చూపులను, చ=కూడ, భ్రూక్షేపజిహ్మాని=కనుబొమ్మల విఱుపులచే కుటిలములుగ, చకార=చేసెను.

**తాత్పర్యము:-** మదనుడు, స్త్రీజనము యొక్క అవయవములను, నిదురచే అలసటకలిగిన విలాసములుగలవానినిగా మాటలను, కొంచెము మదముచే మనోహరములగువానినిగా చూపులను కూడ కనుబొమ్మల విఱుపులచే కుటిలముగ చేసెను.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) నిద్రాలసవిభ్రమాణి – నిద్రయా అలసాః నిద్రాలసాః – తృతీయాతత్పురుషః – తే విభ్రమాః యేషు తాని – బహువ్రీహిః.

2) ప్రమదాజనానామ్ – ప్రమదాః చ తే జనాః తేషామ్ – కర్మధారయః.

3) మదలాలసాని – మదేన లాలసాని – మదలాలసాని – తృతీయాతత్పురుషః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) స ఏవ అధికశ్చేత్ లాలసా. అధికమైన యా కోరికయే లాలస అనబడును. లస్యతే లాలసా – లసశ్లేషణ క్రీడనయోః. తర్షః **స మహాన్ లాలసా ద్వయోః**

c) **గుణము :-** మాధుర్యప్రసాదములు d) **రీతి :-వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:** త్రిష్టుభ్ ఛందస్సు – 'ఉపజాతి' వృత్తము

f) **అలంకారము:** క్రియాదీపకాలంకారము (కారక దీపక)

**లక్షణము:–** 'క్రమికైకగతానాం తు గుమ్ఫః కారకదీపకమ్'. క్రియాన్వయమును కలుగజేయునది కారకము. ఒకే కారకము క్రమముగా అనేక క్రియలను దీపింపజేయుట యన్న ధర్మమునుబట్టి దీనికి కారక దీపకము అన్న పేరు సార్థకమగుచున్నది. 'మన్మథుడు – 1) స్త్రీ జన అవయవములను, 2)మాటలను, 3) చూపులను కనుబొమల విఱుపుచే కుటిలముగా చేసెను' అని వర్ణింపబడుట చే నిట క్రియాదీపకాలంకారమున్నదని చెప్పదగును.

g) **క్రియాదర్శము :–** 'చకార' – పరస్మైపది. లిట్ ప్రథమపురుషఏకవచనము. 'అ' – తిజ్ ప్రత్యయము. ఆర్ధధాతుకము కాన వికరణ ప్రత్యయములు ఉండవు.

**ధాతువు :–** డు కృఞ్–కృ–కరణే–చేయుట–సకర్మకము – ఉభయ పరస్మైపది. తనాది (8) ప్రకరణ ధాతువు. 'ఉ' వికరణ ప్రత్యయము.

1. పరోక్షే లిట్. పై సూత్రముచే 'కృ' ధాతువునకు 'లిట్' చేర్చగా కృ+లిట్ అనియుండ, లిట్ స్థానము ఆయా పురుషవచనాదులననుసరించి 'తిప్' మొదలగు ప్రత్యయములు వచ్చును.
2. 'లిట్చ' అను సూత్రముచే తిజ్‌లకు ఆర్ధధాతుక సంజ్ఞయుండుటచే 'శప్' రాదు. (వికరణ ప్రత్యయమురాదు). కనుక కృ+తిప్. ఇప్పుడు
3. పరస్మైపదానాం ణలతుసుస్ థలథుసణల్వమాః' అను సూత్రముచే ప్రథమ పురుషైకవచన తిప్ ప్రత్యయమునకు 'ణల్' ఆదేశము వచ్చును. అందు ణకార లకారములు ఇత్సంజ్ఞకములు. కనుక కృ+అ అనియుండగా,
4. 'లిటి ధాతో రనభ్యాసస్య' అను సూత్రమునే > కృ కృ+అ అగును. పిదప
5. 'ఉరత్' సూత్రముచే > కర్ + కృ + అ అగును.
6. పూర్వోభ్యాసః. మరియు 'హలాదిః శేషః' అను సూత్రములచే>క కృ+అ అగును.
7. కుహోశ్చుః అనుసూత్రముచే(క వర్గాక్షరము లైదింటికిని వరుసగా చవర్గాక్షరములు వచ్చును. హకారమునకు ఝకారమాదేశముగా వచ్చును) > చకృ + అ అగును.
8. పిమ్మట 'ఆద్గుణః' సూత్రముచే > చకర్ + అ చకర అగును. రూపద్వయమున ఇది మొదటి క్రియ. రెండవది
9. 'ణలుత్తమో వా' అను సూత్రముచే ణల్ వికల్పముగా ణిత్ అగును. కనుక ణిత్త్వ పక్షమున ఉపధా వృద్ధిచే (అత ఉపధాయా) చకర్ + అ చకార అగును. ఇది రూపద్వయమున రెండవ క్రియ. 'లిట్' న ప్రథమపురుష, ఉత్తమ పురుష ఏకవచనములు ఒకేవిధమునుండుట తిజ్ ప్రత్యయమువలననని గమనింపగలరు.





**శ్లో॥ ప్రియఙ్గుకాలీయకకుఙ్కుమాక్తం**
**స్తనేషు గౌరేషు విలాసినీభిః।**
**ఆలిప్యతే చన్దనమఙ్గనాభి**
**ర్మదాలసాభిర్మృగనాభియుక్తమ్॥ 12**

**పదవిభాగము:–** ప్రియంగు కాలీయకకుంకుమాక్తమ్ స్తనేషు గౌరేషు విలాసినీభిః ఆలిప్యతే చందనమ్+అంగనాభిః+మదాలసాభిః+మృగనాభియుక్తమ్.

**అన్వయక్రమము:–** విలాసినీభిః మదాలసాభిః అంగనాభిః గౌరేషు స్తనేషు ప్రియంగు కాలీయక కుంకుమాక్తమ్ మృగనాభియుక్తమ్ చందనమ్ ఆలిప్యతే.

**ప్రతిపదార్థము:–**విలాసినీభిః=విలాసవతులైన, మదాలసాభిః=మదవతులైన, అంగనాభిః =స్త్రీలచే, గౌరేషు=గౌరవర్ణములగు, స్తనేషు=స్తనములందు, ప్రియంగు=ప్రేంకణము, కాలీయక=పచ్చిపసుపు, కుంకుమాక్తమ్=కుంకుమపువ్వుతో మెదపబడిన, మృగనాభియుక్తమ్=కస్తూరితో కూడిన, చందనమ్=చందనము, ఆలిప్యతే=పూయ బడుచున్నది.

**తాత్పర్యము:–** విలాసవతులైన మదవతులైన స్త్రీలచే గౌరవర్ణముగనున్న స్తనములందు ప్రేంకణము, పచ్చిపసుపు, మెదుపబడిన కుంకుమపువ్వు, కస్తూరితో కూడిన చందనము పూయబడుచున్నది.

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**
1) మదాలసాభిః – మదేన అలసాః యాః తాభిః – తృతీయాతత్పురుషః.
2) ప్రియంగుకాలీయకకుంకుమాక్తమ్ – ప్రియంగుకాలీయకకుంకుమాని, తైః ఆక్తమ్ యత్ తత్ – తృతీయాతత్పురుషః.
3) మృగనాభియుక్తమ్ – మృగనాభినా యుక్తమ్ – తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**
1) ప్రశస్తాన్యంగాన్యస్యా ఇతి అంగనా. మంచిఅవయవములు గలది. **'విశేషాస్త్వఙ్గనా భీరూః కామినీ వామలోచనా'.**
2) మృగనాభి భవత్వాత్ మృగనాభిః. మృగముయొక్క నాభి వలన బుట్టునది. ఇకారాంతపుంలింగము.'ముఖ్యరాట్ క్షత్రయోః పుంసి నాభిః ప్రాణ్యంగకే ద్వయోః' అను త్రికాండశేషవచనము వలన స్త్రీలింగంబును గలదు.

c) **గుణము:– మాధుర్యప్రసాదములు** d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** త్రిష్టుభ్ ఛందస్సు – ఉపజాతి వృత్తము

g) **క్రియాదర్శము :-** 1) ఆలిప్యతే – ఆత్మనేపది. లట్ ప్రథమపురుష ఏకవచనము. తే – తిఙ్ ప్రత్యయము. ఆ=విశేషణము.

**ధాతువు :- లిప్** (లింప్ ) – ఉపదేహే – పూయుట – సకర్మకము, (ఉభయపది– లింపతి–లింపతే. లట్ ప్రథమపురుషఏకవచనరూపములు. ఆరవవికరణ ధాతువు. భావకర్మార్థకలకారములు ఆత్మనేపదమునందే ఉండును. అందును భావార్థమున ప్రథమైకవచనము మాత్రమే ఉండును. ఈ ధాతువు సకర్మకము కావున కర్మార్థమున లడాదులు వచ్చును. కర్మార్థమున అన్ని వచనములుండును. కనుక చురాది ప్రకరణ ప్రక్రియవలన లిప్+య+తే > లిప్యతే గా మారును.

**శ్లో॥ గురూణి వాసాంసి విహాయ తూర్ణం**
**తనూని లాక్షారసరఞ్జితాని।**
**సుగన్ధికాలాగురుధూపితాని**
**ధత్తే జనః కామమదాలసాఙ్గః॥ 13**

**పదవిభాగము:-** గురూణి వాసాంసి విహాయ తూర్ణమ్ తనూని లాక్షారసరంజితాని సుగన్ధికాలాగురుధూపితాని ధత్తే జనః కామమదాలసాంగః.

**అన్వయక్రమము:-** కామమదాలసాంగః జనః తూర్ణమ్ గురూణి వాసాంసి విహాయ లాక్షారసరంజితాని సుగన్ధి కాలాగురు ధూపితాని తనూని ధత్తే.

**ప్రతిపదార్థము:-** కామమదాలసాంగః=ప్రేమోన్మత్తులైన, జనః=జనము, గురూణి= మొద్దువగు, వాసాంసి=వస్త్రములను, తూర్ణమ్=వెంటనే, విహాయ=విడిచి, లాక్షారస రంజితాని=లత్తుకరసముతో రంగువేయబడిన, సుగన్ధి=మంచివాసన గల, కాలాగురు= నల్లయగురు చేత, ధూపితాని=ధూపమువేయబడిన, తనూని=పలుచని, వాసాంసి= వస్త్రములను, ధత్తే=ధరించుచున్నది.

**తాత్పర్యము:-** ప్రేమోన్మత్తులైన జనము మొద్దువగు వస్త్రములను వెంటనే విడిచి లత్తుకరసముతో రంగువేసిన, మంచి సువాసన గల, నల్లయగురు ధూపమువేయబడిన పలుచని వస్త్రములను ధరించుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) లాక్షారసరంజితాని–లాక్షాయాః రసః–షష్ఠీతత్పురుషః– తేన రంజితాని యాని తాని – తృతీయాతత్పురుషః

2) సుగన్ధి....... ధూపితాని – సుగన్ధిః చ అసౌ కాలాగురుః, సుగన్ధికాలాగురుః –కర్మధారయః–తేన ధూపితాని, యాని తాని – తృతీయాతత్పురుషః





3) కామమదాలసాంగః–కామస్య మదః–షష్ఠీతత్పురుషః–తేన అలసాని అంగాని యస్యాఽసౌ తథావిధః – బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) లక్ష్యతే లాక్షా. లక్ష దర్శనాంకనయోః. కానబడియుండునది. **'లాక్షా రాక్షా జతు క్లీబే యావో ఽలక్తో ద్రుమామయః.'.**

c) **గుణము :- మాధుర్యప్రసాదములు** d) **రీతి :- వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు – ఉపజాతివృత్తము.

g) **క్రియాదర్శము :-** ధత్తే – ఆత్మనేపది. లట్ప్రథమపురుష ఏకవచనము. తే – తిఙ్ ప్రత్యయము.

**ధాతువు :- డుధాఞ్** (ధా) ధారణ పోషణ యోః – ధరించుట / పోషించుట. సకర్మకము, ఉభయపది. జుహోత్యాది(3)ప్రకరణ ధాతువు. ధాతువునకు ద్విత్వము. వివరములు ఇంతకుమునుపు చెప్పబడినవి. ధా–ధాతువునకు ద్విరుక్తమైన పిమ్మట బలహీనప్రత్యయమునకు ముందు తుదిదీర్ఘములోపించును. దధా–దధ్, త్, థ్, స్, ధ్వ అనువానితో ముగియు ప్రత్యయములకు ముందది ధత్ అనురూపమును పొందును. కనుక ధత్+తే > ధత్తేగా మారును.

**శ్లో॥ పుంస్కోకిలశ్చూతరసాసవేన**
**మత్తః ప్రియాం చుమ్బతి రాగహృష్టః।**
**కూజద్ద్విరేఫోఽప్యయమమ్బుజస్థః**
**ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటు॥ 14**

**పదవిభాగము:-**పుంస్కోకిలః+చూతరస+ఆసవేన మత్తః ప్రియామ్ చుమ్బతి రాగ హృష్టః కూజత్+ద్విరేఫః+అపి+అయమ్ అమ్బుజస్థః ప్రియమ్ ప్రియాయాః ప్రకరోతి చాటు.

**అన్వయక్రమము:-** చూత రస ఆసవేన మత్తః రాగహృష్టః పుంస్కోకిలః ప్రియామ్ చుమ్బతి అయమ్ అమ్బుజస్థః ద్విరేఫః అపి కూజత్ ప్రియాయాః ప్రియమ్ చాటు ప్రకరోతి.

**ప్రతిపదార్థము:-** చూత=మామిడి చిగుళ్ళయొక్క, రస=రసమనియెడు, ఆసవేన= ఆసవముచే, మత్తః=మదించినదియు, రాగహృష్టః=అనురాగముచే సంతసించినదియు నగు, పుంస్కోకిలః=గండుకోయిల, ప్రియామ్=ప్రియురాలిని, చుమ్బతి=ముద్దాడు చున్నది, అయమ్=ఈ, అమ్బుజస్థః=తామరపువ్వునందున్న, కూజత్=ఝుంకారము చేయుచుండు, ద్విరేఫః=తుమ్మెద, అపి=కూడ,ప్రియాయాః=ప్రియురాలికి, ప్రియమ్= ఇష్టమైన, చాటు=నర్మకృత్యమును, ప్రకరోతి=చేయుచున్నది.

**తాత్పర్యము:-** మావిచిగురుయొక్క రసమనియెడు ఆసవముచే మదించినదియు, అనురాగముచే సంతసించినదియునగు గండుకోయిల ప్రియురాలిని ముద్దాడుచున్నది. తామరపువ్వునందుండు తుమ్మెదకూడ ఝుంకారముచేయుచుండు ప్రియురాలికి ఇష్టమైన ప్రేమకలాపములు చేయుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) చూతరసాసవేన-చూతస్య రసః, చూతరసః, - షష్ఠీతత్పురుషః-తస్యాసవేన-చూతరసాసవేన-షష్ఠీతత్పురుషః.

2) రాగహృష్టః-రాగేణ హృష్టః-తృతీయాతత్పురుషః.

3) పుంస్కోకిలః - పుమాంశ్చాసౌ కోకిలః - కర్మధారయః.

4) ద్విరేఫః - ద్వౌరేఫౌ యస్మిన్ సః- బహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) చ్యోతతి రసం స్రవతీతి చూతః. చ్యుతిర్ క్షరణే. రసమును స్రవించునది. **'ఆమ్ర శ్చూతో రసాలః.'**

c) **గుణము :- మాధుర్యప్రసాదములు** d) **రీతి :- వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతి వృత్తము.

f) **క్రియాదర్శము :-** ప్రకరోతి. పరస్మైపది. లట్‌ప్రథమపురుష ఏకవచనము. ప్ర= ఉపసర్గ. ఈ ధాతువు మిగిలిన వివరములు ఈ సర్గనందు 9వ శ్లోకభాగమున చూడదగును.

**శ్లో॥ తామ్రప్రవాళస్తబకావనమ్రా**
**శ్చూతద్రుమాః పుష్పితచారుశాఖాః।**
**కుర్వన్తి కామం పవనావధూతాః**
**పర్యుత్సుకం మానసమఙ్గనానామ్॥ 15**

**పదవిభాగము:-** తామ్రప్రవాళస్తబక+అవనమ్రాః+చూతద్రుమాః పుష్పితచారు శాఖాః కుర్వన్తి కామమ్ పవన+అవధూతాః పరి+ఉత్సుకమ్ మానసమ్+అంగనానామ్.

**అన్వయక్రమము:-** తామ్ర ప్రవాళ స్తబక అవనమ్రాః పుష్పిత చారు శాఖాః పవన అవధూతాః అంగనానామ్ మానసమ్ కామమ్ పర్యుత్సుకమ్ కుర్వన్తి.

**ప్రతిపదార్థము:-** తామ్ర=రాగిరంగులోఉండు, ప్రవాళ=చిగురాకుల, స్తబక=గుత్తులచే, అవనమ్రాః=వంగినవియు, పుష్పిత=విరబూసిన, చారు=అందమైన, శాఖాః=కొమ్మలు గలవియు, పవన=గాలిచే, అవధూతాః=కదలింపబడిన, చూతద్రుమాః=మామిడి చెట్లు,





అంగనానామ్=స్త్రీలయొక్క, మానసమ్=మనస్సును, కామమ్=మిక్కిలి, పర్యుత్సుకమ్= తొట్రుపాటు కలిగినవిగ, కుర్వన్తి=చేయుచున్నవి.

**తాత్పర్యము:-** రాగిరంగులో నుండు చిగురాకుల గుత్తులచే వంగినవియు, విరబూసిన అందమైన కొమ్మలు గలవియు, గాలికి రెపరెపలాడుచున్న మామిడిచెట్లు స్త్రీలమనస్సులను మిక్కిలి తొట్రుపాటు కలిగినవిగ చేయుచున్నవి.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) తామ్రప్రవాళస్తబకావనమ్రాః-తామ్రప్రవాళస్తబకైః అవనమ్రాః-తృతీయా తత్పురుషః.

2) చూతద్రుమాః - చూతాః ఇతి ద్రుమాః-సంభావనాపూర్వపదకర్మధారయః

3) పుష్పితచారుశాఖాః-పుష్పితాశ్చ తాః చారుశాఖాశ్చ-కర్మధారయః.

4) పవనావధూతాః - పవనేన అవధూతాః - తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) స్తూయతే స్తబకః. ష్టుఞ్ స్తుతౌ. స్తోత్రము చేయబడునది. **'స్యాద్గుచ్ఛకస్తు స్తబకః**

c) **గుణము - మాధుర్య ప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఇంద్రవజ్రా వృత్తము.

f) **క్రియాదర్శము :-** 'కుర్వన్తి' - పరస్మైపది. లట్ ప్రథమపురుషబహువచనము. ఈ ధాతువివరములు - ఇంతకు మునుపు చెప్పబడినవి.

**శ్లో॥ ఆ మూలతో విద్రుమరాగతామ్రం**
**సపల్లవాః పుష్పచయం దధానాః।**
**కుర్వన్త్యశోకా హృదయం సశోకం**
**నిరీక్ష్యమాణా నవయౌవనానామ్॥ 16**

**పదవిభాగము:-** ఆమూలతః+విద్రుమరాగతామ్రమ్ సపల్లవాః పుష్పచయమ్ దధానాః కుర్వన్తి+అశోకాః హృదయమ్ సశోకమ్ నిరీక్ష్యమాణాః నవయౌవనానామ్.

**అన్వయక్రమము:-** ఆమూలతః విద్రుమ రాగ తామ్రమ్ పుష్పచయమ్ దధానాః సపల్లవాః అశోకాః నిరీక్ష్యమాణాః నవ యౌవనానామ్ హృదయమ్ సశోకమ్ కుర్వన్తి.

**ప్రతిపదార్థము:-**ఆమూలతః=మొదలునుండియు వృక్షాగ్రమువరకు, విద్రుమ= పగడములయొక్క, రాగ=రంగువలె, తామ్రమ్=ఎఱ్ఱనైన, పుష్పచయమ్=పుష్ప సముదాయమును, దధానాః=దాల్చినవియును, సపల్లవాః=చిగుళ్ళతో కూడినవియును

నగు, అశోకాః=అశోకవృక్షములు, నిరీక్ష్యమాణాః=చూడబడుచున్నవై, నవ=నూతన మగు, యౌవనానామ్=యౌవనము కలవారియొక్క, హృదయమ్=హృదయమును, సశోకమ్=దుఃఖముతోకూడినదిగ, కుర్వన్తి=చేయుచున్నవి.

**తాత్పర్యము:-** మొదలునుండి వృక్షాగ్రము వరకు పగడపు రంగువలె ఎఱ్ఱనైన పుష్పసముదాయమును దాల్చినవియును, చిగుళ్ళతోకూడినవియును, అశోకవృక్షములు చూడబడినవై అప్పుడే యౌవనములోకడుగిడిన వారి హృదయమును దుఃఖముతో కూడినదిగ చేయుచున్నవి.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) విద్రుమరాగతామ్రమ్ - విద్రుమస్య రాగః, విద్రుమరాగః-షష్ఠీతత్పురుషః -తద్వత్ తామ్రమ్. ఉపమానపూర్వపదకర్మధారయః
2) పుష్పచయమ్ - పుష్పాణాం చయః - పుష్పచయః తమ్ - షష్ఠీతత్పురుషః
3) నవయౌవనానామ్ - నవం యౌవనం యాసామ్ తాసామ్ - బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) విశిష్టో ద్రుమో విద్రుమః-విశేషమైనచెట్టు. **'అథ విద్రుమః పుంసి ప్రవాళం పుంనపుంసకమ్'.**

c) **గుణము - మాధుర్యప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** త్రిష్టుభ్ ఛందస్సు - ఉపజాతి వృత్తము.

f) **క్రియాదర్శము :-** 'కుర్వన్తి' ఈ క్రియావివరములు ఇంతకుముందు చెప్పబడినవి.

**శ్లో॥ మత్తద్విరేఫపరిచుమ్బితచారుపుష్పా**
**మన్దానిలాకులితనమ్రమృదుప్రవాళాః।**
**కుర్వన్తి కామిమనసాం సహసోత్సుకత్వం**
**చూతాభిరామకలికాః సమవేక్ష్యమాణాః॥ 17**

**పదవిభాగము:-** మత్తద్విరేఫపరిచుమ్బితచారుపుష్పాః మన్ద+అనిల+ఆకులిత నమ్రమృదుప్రవాళాః కుర్వన్తి కామిమనసామ్ సహసా+ఉత్సుకత్వమ్ చూత+అభిరామ కలికాః సమవేక్ష్యమాణాః.

**అన్వయక్రమము:-** మత్త ద్విరేఫ పరిచుమ్బిత చారు పుష్పాః మంద అనిల ఆకులిత నమ్ర మృదు ప్రవాళాః చూత అభిరామ కలికాః సమవేక్ష్యమాణాః సహసా కామి మనసామ్ ఉత్సుకత్వమ్ కుర్వన్తి.





**ప్రతిపదార్థము:-** మత్త=మదించిన, ద్విరేఫ=తుమ్మెదలచే, పరిచుమ్బిత=ముద్దాడబడిన, చారు=మనోహరములగు, పుష్పాః=పూవులుకలవియును, మంద=మెల్లనైన, అనిల= గాలిచేత, ఆకులిత=కదల్చబడిన, నమ్ర=వంగిన, మృదు=మృదువైన, ప్రవాళాః=చిగు రాకులు కలవియును, చూత=మామిడి యొక్క, అభిరామ=అందమైన, కలికాః=పూ మొగ్గలు, సమవేక్ష్యమాణాః=దర్శింపబడినవై, సహసా=బలవంతముగా, కామిమనసామ్ =కాముకులయొక్క మనస్సులకు, ఉత్సుకత్వమ్=ఉత్కంఠను, కుర్వన్తి=చేయుచున్నవి.

**తాత్పర్యము:-** మదించిన తుమ్మెదలచే ముద్దాడబడిన అందమగు పూవులు కలవియును, మెల్లనైన గాలి చేత కదల్చబడిన, వంగిన, మృదువైన చిగురాకులు కలవియును, అందమైన మామిడి పూల మొగ్గలు దర్శింపబడినవై బలవంతముగా కాముకుల యొక్క మనస్సులను ఉత్కంఠపరచుచున్నవి.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) మత్త.... పుష్పాః-మత్తశ్చాసౌ ద్విరేఫః, మత్తద్విరేఫః-కర్మధారయః-తైః పరిచుమ్బితాని చారూణి పుష్పాణి - యాసాం తాః - బహువ్రీహిః.
2) మన్దానిల.... ప్రవాళాః-మన్దశ్చాసౌ అనిలః, మన్దానిలః-కర్మధారయః-తేన ఆకులితాః నమ్రాః మృదవః ప్రవాలా యాసాం తాః-బహువ్రీహిః.
3) చూతాభిరామకలికాః-అభిరామాః కలికాః అభిరామకలికాః - కర్మధారయః చూతస్య అభిరామ కలికాః - షష్ఠీతత్పురుషః
4) కామిమనసామ్ - కామినాం మనాంసి కామిమనాంసి తేషాం కామిమనసాం - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) కల్యతే ప్రసూనమితి శబ్ద్యతే కలికా. కల శబ్దసంఖ్యానయోః. పుష్పమగు నట్టిదని పలుకబడునది. **'కలికా కోరకో ౽ స్త్రియామ్'.**

c) **గుణము - ఓజస్సు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - 'వసంతతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము :-** 'కుర్వన్తి' - వివరములు పూర్వము చెప్పబడినవి.

**శ్లో॥ కాన్తాముఖద్యుతిజుషామపి చోద్గతానాం**
**శోభాం పరాం కురవకద్రుమమఞ్జరీణామ్।**
**దృష్ట్వా ప్రియే! సహృదయస్య భవేన్న కస్య**
**కన్దర్పబాణపతనవ్యథితం హి చేతః॥ 18**

**పదవిభాగము:–** కాన్తాముఖద్యుతిజుషామ్+అపి చ+ఉద్గతానామ్ శోభామ్ పరామ్ కురవకద్రుమమంజరీణామ్ దృష్ట్వా ప్రియే సహృదయస్య భవేత్+న కస్య కన్దర్ప బాణపతన వ్యథితం హి చేతః.

**అన్వయక్రమము:–** అపి చ ప్రియే కాన్తా ముఖ ద్యుతి జుషామ్ ఉద్గతానామ్ కురవక ద్రుమ మంజరీణామ్ పరామ్ శోభామ్ దృష్ట్వా కస్య సహృదయస్య చేతః కన్దర్ప బాణ పతన వ్యథితమ్ న భవేత్.

**ప్రతిపదార్థము:–** అపి చ=మరియు, హే ప్రియే=ఓ ప్రియురాలా!, కాన్తా=ప్రియురాలి, ముఖ=ముఖముయొక్క, ద్యుతి=కాంతిని, జుషామ్=పొందినవియు, ఉద్గతానామ్= ఆవిర్భవించిన, కురవకద్రుమ=ముళ్ళగోరింటచెట్లయొక్క, మంజరీణామ్=పూలగుత్తుల యొక్క, పరామ్=అధికమైన, శోభామ్=శోభను, దృష్ట్వా= చూచి, కస్య=ఏ, సహృదయస్య= సహృదయునియొక్క, చేతః=మనస్సు, కన్దర్ప=మన్మథునియొక్క, బాణ=బాణముల యొక్క, పతన=పాతముచే, వ్యథితమ్=పీడింపబడినది, న భవేత్?= కాదు?

**తాత్పర్యము:–** మరియు, ఓ ప్రియురాలా! ప్రియురాలిముఖకాంతిని పొందినవియు, ఆవిర్భవించిన ఎఱ్ఱగోరింట చెట్ల **పూగుత్తుల శోభను** చూచి ఏ సహృదయుని మనస్సు మన్మథబాణఘాతముచే పీడింపబడినది కాదు?

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కాన్తా.... జుషామ్ – కాన్తాయాః ముఖమ్, కాన్తాముఖమ్– షష్ఠీతత్పురుషః – తస్య ద్యుతిం జుషన్తి యే తే తేషామ్ – కృత్సమాసః

2) కురవక...మంజరీణామ్ – కురవకస్య ద్రుమాః, కురవక ద్రుమాః – షష్ఠీతత్పురుషః – తేషాం మంజరీణామ్ – షష్ఠీతత్పురుషః.

3) కందర్ప.... వ్యథితమ్ – కందర్పస్య బాణాః, కందర్పబాణాః – షష్ఠీతత్పురుషః – తేషాం పతనమ్ – కందర్పబాణపతనమ్ – షష్ఠీతత్పురుషః – తేన వ్యథితమ్ – తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) తస్మిన్ కురవకో ఽ రుణే, కురవక శబ్ద ఉక్తః.**'ఎఱ్ఱపూవుల ముళ్ళ గోరింట.'**

2) మన్యతే పికాదిభి ర్భృహుమన్యతే మంజరీ. మన అవబోధనే. కోకిలాదులచేత నిక్షేపమువలె దలచబడునది. **'వల్లరీ మంజరీ స్త్రియౌ'.**

c) **గుణము – మాధుర్య ప్రసాదములు** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.





f) **క్రియాదర్శము :–** 'భవేత్' – పరస్మైపది. విధి లిఙ్ ప్రథమపురుషఏకవచనము. త్ – తిఙ్ ప్రత్యయము.

**ధాతువు :–** భూ–సత్తాయాం. ఉండుట – భ్వాది (1) ప్రకరణ ధాతువు. 'అ' వికరణ ప్రత్యయము. కనుక భూ + అ + ఇత్ > భో + అ + ఇత్ > భవ్ + అ + ఇత్ > భవ + ఇత్ > భవేత్ గా మారును.(సార్వధాతుకార్ధ ధాతుకయోః అను సూత్రముచే ధాతువులోని 'ఊ' కారమునకు గుణము ఓ కారము, పిదప ఏచోఽ యవాయావః అను సూత్రముచే ఓకారమునకు 'అవ్' ఆదేశము వచ్చి 'భవ్' గా మారినది.)

**శ్లో॥ ఆదీప్తవహ్నిసదృశైర్మరుతావధూతైః**
**సర్వత్ర కింశుకవనైః కుసుమావనమ్రైః।**
**సద్యో వసన్తసమయేన సమాగతేయం**
**రక్తాంశుకా నవవధూరివ భాతి భూమిః॥ 19**

**పదవిభాగము:–** ఆదీప్తవహ్నిసదృశైః+మరుతా+అవధూతైః సర్వత్ర కింశుకవనైః కుసుమ+అవనమ్రైః సద్యః వసన్తసమయేన సమాగతా+ఇయమ్ రక్త+అంశుకా నవ వధూః+ఇవ భాతి భూమిః.

**అన్వయక్రమము:–** సద్యః వసన్తసమయేన సమాగతా ఇయమ్ ఆదీప్త వహ్నిసదృశైః మరుతా అవధూతైః కుసుమ అవనమ్రైః కింశుకవనైః సర్వత్ర భూమిః రక్త అంశుకా నవవధూః ఇవ భాతి.

**ప్రతిపదార్థము:–** సద్యః=అప్పుడే, వసన్తసమయేన=వసన్తకాలముతో, సమాగతా= కలిసిన, ఇయమ్=ఈ, ఆదీప్త= ప్రజ్వలింపజేయబడిన, వహ్ని సదృశైః=అగ్ని సమానము లైన, మరుతా=గాలిచే, అవధూతైః=కంపింపజేయబడిన, కుసుమ+ అవనమ్రైః=పూలచే వంగిన, కింశుకవనైః=మోదుగవనములచే, సర్వత్ర=అంతటను, భూమిః=భూమి, రక్త=ఎఱ్ఱని, అంశుకా=వస్త్రములు కలిగిన, నవ=క్రొత్త, వధూరివ=పెండ్లి కూతురివలె, భాతి=ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము:–** ఈ వసన్తకాలమునందు ప్రజ్వలింపజేయబడిన అగ్ని సమానములైన, గాలిచే కంపింపజేయబడిన పూలచే వంగిన మోదుగవనములచేత అంతటను నిండిన ఈ భూమి ఎఱ్ఱని వస్త్రములు కలిగిన క్రొత్త పెండ్లికూతురివలె ప్రకాశించుచున్నది.

**పదార్థవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) కింశుకవనైః – కింశుకస్య వనైః – షష్ఠీతత్పురుషః.

2) కుసుమావనమ్రైః – కుసుమైః అవనమ్రా యే తే తైః – తృతీయాతత్పురుషః
3) రక్తాంశుకా – రక్తమ్ అంశుకమ్ యస్యాః సా – బహుర్రీహిః.
4) వసన్తసమయేన – వసన్తస్య సమయేన షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) వహతి ప్రాపయతి హవ్యమితి వహ్నిః. వహ ప్రాపణే. హవ్యమును దేవతలకు చేర్చువాడు. **'అగ్నిర్వైశ్వానరో వహ్ని ర్వీతిహోత్రో ధనంజయః.**

c) **గుణము :– మాధుర్య ప్రసాదములు**

d) **రీతి :– వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :–** 'భాతి' – పరస్మైపది. లట్ ప్రథమపురుషఏకవచనము. తి – తిజ్ ప్రత్యయము.

**ధాతువు:– భా** – దీప్తౌ – ప్రకాశించుట – అకర్మకము. పరస్మైపది. అదాది (2) ప్రకరణ ధాతువు. ఈ ప్రకరణ ధాతువులకు వికరణ ప్రత్యయము లేదు. ఈ గణము నందలి 'ఆ' కారాంత ధాతువులకు నేరుగా తిజ్ ప్రత్యయములు చేరును. భా + తి > భాతి.

2) చకాస్తి భాసతే భాతి ద్యోతతే రోచతేఽ సతి (ఆఖ్యాతచంద్రికా 2-1-14)

**శ్లో॥ కిం కింశుకైః శుకముఖచ్ఛవిభిర్న భిన్నం**
**కిం కర్ణికారకుసుమైర్న కృతం న దగ్ధమ్।**
**యత్కోకిలః పునరయం మధురైర్వచోభి**
**ర్యూనాం మనః సువదనానిహితం నిహన్తి॥ 20**

**పదవిభాగము:–** కిమ్ కింశుకైః శుకముఖచ్ఛవిభిః+న భిన్నమ్ కిమ్ కర్ణికారకుసుమైః + న కృతమ్ న దగ్ధమ్ యత్+కోకిలః పునః+అయమ్ మధురైః+వచోభిః+యూనామ్ మనః సువదనానిహితమ్ నిహన్తి.

**అన్వయక్రమము:–** సువదనానిహితమ్ యూనామ్ మనః శుక ముఖచ్ఛవిభిః కింశుకైః కిమ్ న భిన్నమ్ కర్ణికారకుసుమైః కిం దగ్ధమ్ న కృతమ్ యత్పునః అయమ్ కోకిలః మధురైః వచోభిః నిహన్తి.

**ప్రతిపదార్థము:–** సువదనానిహితమ్=ప్రియురాంద్రపై లగ్నమైన, యూనామ్= యువకుల, మనః=మనస్సు, శుక=చిలుక యొక్క, ముఖచ్ఛవిభిః=ముఖమువంటి కాంతి కలిగిన, కింశుకైః=మోదుగపూలచే, కిమ్ న భిన్నమ్=చీల్చబడలేదా యేమి? కర్ణికార





కుసుమైః=కొండగోగుపూలచే, కిం దగ్ధమ్=కాల్చినదిగా, న కృతమ్–కిమ్=చేయబడలేదా యేమి? యత్=దేనినైతే, పునః=మరల, అయమ్=ఈ, కోకిలః=కోకిల, మధురైః =మధురమైన, వచోభిః=కూతలచే, నిహన్తి=చంపుచున్నది.

**తాత్పర్యము:–** ప్రియురాంద్రపైన లగ్నమైన యువకుల మనస్సు 1) చిలుక ముక్కువంటి కాంతిగలిగిన మోదుగపూవులచే చీల్చబడలేదా యేమి? 2) కొండగోగుపూవులచే కాల్చినదిగా చేయబడలేదా యేమి? మరల ఎందువలన ఈ కోయిల మధురమగు కూతలచే చంపుచున్నది?

**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) సువదనానిహితమ్ – సువదనాయాం నిహితమ్ – సప్తమీతత్పురుషః.
2) కర్ణికారకుసుమైః – కర్ణికారస్య కుసుమైః – షష్ఠీతత్పురుషః.
3) శుకముఖచ్ఛవిభిః – శుకస్య ముఖమ్ శుకముఖమ్ తస్య ఛవిరివ ఛవిర్యేషాం తైః – ఉపమానపూర్వపదబహువ్రీహిః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

c) **గుణము – ప్రసాదము** d) **రీతి – వైదర్భి**

e) **అలంకారము:** 'ఉపమా'. లక్షణము ఇంతకుమునుపుచెప్పబడినది. 'కిం కింశుకైః శుకముఖచ్ఛవిభిః న భిన్నమ్'.

f) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసంతతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము :–** 'నిహన్తి' – ఈ క్రియావివరములు. పూర్వసర్గశ్లోకభాగములందు చెప్పబడినవి. ని ఉపసర్గ. హన్ ధాతువు.

**శ్లో॥ పుంస్కోకిలైః కలవచోభిరుపాత్తహర్షైః**
**కూజద్భిరున్మదకలాని వచాంసి భృఙ్గైః।**
**లజ్జాన్వితం సవినయం హృదయం క్షణేన**
**పర్యాకులం కులగృహేఽపి కృతం వధూనామ్॥ 21**

**పదవిభాగము:–** పుమ్+కోకిలైః కలవచోభిః+ఉపాత్తహర్షైః కూజద్భిః+ఉన్మదకలాని వచాంసి భృంగైః లజ్జా+అన్వితమ్ సవినయమ్ హృదయమ్ క్షణేన పర్యాకులమ్ కులగృహే+అపి కృతమ్ వధూనామ్.

**అన్వయక్రమము:–** ఉపాత్త హర్షైః కలవచోభిః పుంస్కోకిలః ఉన్మదకలాని వచాంసి కూజద్భిః భృంగైః కులగృహేఽపి లజ్జాన్వితమ్ సవినయమ్ వధూనామ్ హృదయమ్ క్షణేన పర్యాకులమ్ కృతమ్.

**ప్రతిపదార్థము:-** ఉపాత్త=పొందబడిన, హర్షైః=సంతోషముగల, కలవచోభిః=అవ్యక్త మధురమైన కూతలు కలిగిన, పుంస్కోకిలైః=గండుకోయిలలచేతను, ఉన్మదకలాని =బయలువెడలిన అవ్యక్తమధురమైన, వచాంసి=ఝుంకారములను, కూజద్భిః= కూయు చుండు, భృంగైః=తుమ్మెదలచేతను, కులగృహేऽపి=అత్తవారింట కూడ, లజ్జాన్వితమ్= సిగ్గుతోను, సవినయమ్=వినయముతో కూడిన, వధూనామ్=కోడళ్ళయొక్క, హృదయమ్ =మనస్సు, క్షణేన=క్షణకాలములోనే, పర్యాకులమ్=వ్యాకులముగ, కృతమ్=చేయబడినది.

**తాత్పర్యము:-** పొందబడిన సంతోషమున అవ్యక్తమధురమైన కూతలు కలిగిన గండు కోయిలల చేతను, బయలువెడలిన అవ్యక్తమధురమైన ఝుంకారములు చేయు తుమ్మెదల చేతను, అత్తవారింట కూడ సిగ్గుతోను వినయముతోను కూడిన కోడళ్ళ యొక్క మనస్సు క్షణకాలములోనే వ్యాకులముగ చేయబడినది.

**సాహిత్యక విశేషములు:-**

a) **సమాసములు:-**

1) ఉపాత్తహర్షైః - ఉపాత్తో హర్షో యైః తే తైః - బహువ్రీహిః.
2) ఉన్మదకలాని - ఉన్మదాని కలాని చ యాని తాని తైః - కర్మధారయః.
3) లజ్జాన్వితమ్ - లజ్జయా అన్వితమ్ - తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) కలః మధురాస్ఫుటోధ్వనిః. కలమనగా మధురంబును అస్ఫుటంబునునైన ధ్వని. **'కాకలీ తు కలే సూక్ష్మే'.**
2) లజ్జనం లజ్జా. లజ్జించుట లజ్జ.
**లజ్జీ వ్రీడాయాం. 'మన్దాక్షం హ్రీ స్త్రపా వ్రీడా లజ్జా'.**

b1) **సంధులు:-** పుమ్+కోకిల > పుర్+కోకిల పుస్కోకిల, పుంస్కోకిల.
'అనునాసికానుస్వారౌ రుత్వమ్ చ'.

c) **గుణము - మాధుర్య ప్రసాదములు**

d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - వసన్తతిలకా వృత్తము.

f) **క్రియాదర్శము :-** 'కృతమ్' - 'క్త' ప్రత్యయాంతము.

**ధాతువు :-** 'కృ'. ధాతువునకు నేరుగా 'త' ప్రత్యయము చేర్చుటచే ఏర్పడు 'కృత' నామవాచకరూపమునననుసరించి మూడు లింగములలోనికి మారును కనుక కృతః (పుంలిం.) - కృతా (స్త్రీ లిం.) - కృతమ్ (నపుం. లిం.)





**శ్లో॥** ఆకమ్పయన్కుసుమితాః సహకారశాఖా
విస్తారయన్పరభృతస్య వచాంసి దిక్షు।
వాయుర్వివాతి హృదయాని హరన్నరాణాం
నీహారపాతవిగమాద్విమలో వసన్తే॥ 22

**పదవిభాగము:-** ఆకంపయన్+కుసుమితాః సహకారశాఖాః+విస్తారయన్+పరభృతస్య వచాంసి దిక్షు వాయుః+వివాతి హృదయాని హరన్+నరాణామ్ నీహారపాతవిగమాత్+ విమలః+వసన్తే.

**అన్వయక్రమము:-** వసన్తే నీహారపాతవిగమాత్ విమలః వాయుః కుసుమితాః సహకారశాఖాః ఆకమ్పయన్ పరభృతస్య వచాంసి దిక్షు విస్తారయన్ నరాణామ్ హృదయాని హరన్ వివాతి.

**ప్రతిపదార్థము:-** వసన్తే=వసంతకాలమునందు, నీహారపాతవిగమాత్=మంచుపడక పోవుటవలన, విమలః=మనోహరమైన, వాయుః=వాయువు, కుసుమితాః=పుష్పించిన, సహకారశాఖాః=మామిడి కొమ్మలను, ఆకమ్పయన్=కుదుపుచు, పరభృతస్య=కోయిల యొక్క, వచాంసి=కూతలను, దిక్షు=దిక్కులయందు, విస్తారయన్=వ్యాపింపజేయుచు, నరాణామ్=మానవులయొక్క, హృదయాని=మనస్సులను, హరన్=అపహరించుచు, వివాతి=వీచుచున్నది.

**తాత్పర్యము:-** వసంతకాలమున మంచు పడకపోవుట వలన మనోహరమగు వాయువు 1) పుష్పించిన మామిడి కొమ్మలను కుదుపుచు, 2) కోయిల కూతలను దిక్కులందు వ్యాపింపజేయుచు, 3) మానవుల మనస్సులను హరించుచు వీచుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) సహకారశాఖాః - సహకారస్య శాఖాః - షష్ఠీతత్పురుషః.
2) నీహారపాతవిగమాత్ - నీహారస్య పాతః, నిహారపాతః, షష్ఠీతత్పురుషః - తస్య విగమాత్ - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) సహకారయతి మేళయతి స్త్రీపుంసావితి సహకారః **డుకృఞ్** కరణే. స్త్రీ పురుషుల గలుపునది. మిక్కిలి పరిమళము గల (తియ్య) మామిడి పేరు.
**'అసౌ సహకారోऽతి సౌరభః'.**
2) నితరాం హ్రియతే అగ్నినా నీహారః, హృఞ్ హరణే. అగ్నిచేత మిక్కిలి హరింపబడునది. **'అవశ్యాయస్తు నీహార స్తుషార స్తుహినం హిమమ్',**

c) **గుణము – మాధుర్యప్రసాదములు**

d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము :–** 'వివాతి' – పరస్మైపది. లట్ ప్రథమపురుష ఏకవచనము. తి – తిజ్ ప్రత్యయము వి=ఉపసర్గ.

**ధాతువు :– వా** – గతిగన్ధనయోః – గమనము, పరిమళించుట. సకర్మకమ్. అదాది (2) ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయముండదు. వా + తి > వాతి గా మారును.

2) పవతే వాతి వాతస్య .........(ఆఖ్యాతచంద్రికా 2–3–45)

**శ్లో॥ కున్దైస్సవిభ్రమవధూహసితావదాతై**
**రుద్ద్యోతితాన్యుపవనాని మనోహరాణి।**
**చిత్తం మునేరపి హరన్తి నివృత్తరాగం**
**ప్రాగేవ రాగమిలితాని మనాంసి యూనామ్॥ 23**

**పదవిభాగము:–** కున్దైః+సవిభ్రమవధూహసిత+అవదాతైః+ఉద్ద్యోతితాని+ఉపవనాని మనోహరాణి చిత్తమ్ మునేః+అపి హరన్తి నివృత్తరాగమ్ ప్రాగ్+ఏవ రాగమిలితాని మనాంసి యూనామ్.

**అన్వయక్రమము:–** సవిభ్రమవధూ హసిత అవదాతైః కున్దైః ఉద్ద్యోతితాని మనోహరాణి ఉపవనాని నివృత్తరాగమ్ మునేః అపి చిత్తమ్ హరన్తి రాగమిలితాని యూనామ్ మనాంసి ప్రాగేవ హరన్తి.

**ప్రతిపదార్థము:–** సవిభ్రమవధూ=విలాసవతుల యొక్క, హసిత=నవ్వువలె, అవదాతైః =తెల్లని, కున్దైః=మల్లెలచే, ఉద్ద్యోతితాని=ప్రకాశింపజేయబడిన, మనోహరాణి= అందమైన, ఉపవనాని=ఉద్యానవనములు, నివృత్తరాగమ్=నశించిన విషయాభిలాషలు గల, మునేః=మునుల యొక్క, చిత్తమ్అపి=మనస్సును కూడ, హరన్తి=హరించు చున్నవి. రాగమిలితాని=విషయాభిలాషలు కలిసిన, యూనామ్=యువకులయొక్క, మనాంసి=మనస్సులను, ప్రాగేవ=పూర్వమే, హరన్తి=హరించుచున్నవి.

**తాత్పర్యము:–** విలాసవతుల నవ్వులవలె తెల్లని మల్లెలచే ప్రకాశింపజేయబడిన అందమైన ఉద్యానవనములు 1) నశించిన విషయాభిలాషలు గల మునులమనస్సును కూడ హరించుచున్నవి. 2) విషయాభిలాషలున్న యువకుల మనస్సును పూర్వమే హరించుచున్నవి. (ఇంతకు ముందే హరించెనని భావము).





**పదాదర్శవిశేషములు:–**

a) **సమాసములు:–**

1) సవిభ్రమ...... అవదాతైః – సవిభ్రమా చాసౌ వధూః సవిభ్రమవధూః – కర్మధారయః – తస్యాః హసితమ్, సవిభ్రమ వధూహసితమ్ – షష్ఠీతత్పురుషః – తద్వత్ – అవదాతైః – ఉపమానపూర్వపదకర్మధారయః.

2) నివృత్తరాగమ్ – నివృత్తో రాగో యస్మాత్ తథావిధమ్ – బహువ్రీహిః.

3) రాగమిలితాని – రాగేణ మిలితాని – తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:–**

1) 'అవదాత స్సితే పీతే శుద్ధే'–అవదాత శబ్దము తెల్లని దానికి, పసుపుపచ్చని దానికి, పరిశుద్ధమైనదానికిని పేరు.

c) **గుణము – మాధుర్య ప్రసాదములు** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:–** శక్వరీ ఛందస్సు – 'వసన్తతిలకా' వృత్తము.

f) **క్రియాదర్శము :–** 'హరన్తి' – ఈ క్రియావిశేషములు ఇంతకుముందు చెప్పబడినవి.

**శ్లో॥ ఆలమ్బిహేమరశనాః స్తనసక్తహారాః**
**కన్దర్పదర్పశిథిలీకృతగాత్రయష్ట్యః।**
**మాసే మధౌ మధురకోకిలభృఙ్గనాదై**
**ర్నార్యో హరన్తి హృదయం ప్రసభం నరాణామ్॥24**

**పదవిభాగము:–** ఆలమ్బిహేమరశనాః స్తనసక్తహారాః కందర్పదర్పశిథిలీకృత గాత్రయష్ట్యః మాసే మధౌ మధురకోకిలభృంగనాదైః నార్యః హరన్తి హృదయమ్ ప్రసభమ్ నరాణామ్.

**అన్వయక్రమము:–** మధౌ మాసే ఆలమ్బి హేమ రశనాః స్తన సక్త హారాః కందర్పదర్ప శిథిలీకృత గాత్రయష్ట్యః నార్యః మధుర కోకిల భృంగ నాదైః నరాణామ్ హృదయమ్ ప్రసభమ్ హరన్తి.

**ప్రతిపదార్థము:–** మధౌ మాసే=వసంతర్తువున, ఆలమ్బి=(పిఱుదులపై) వ్రేలాడు చుండు, హేమ=బంగరు, రశనాః=మొలనూళ్ళుకలిగిన, స్తన=స్తనములయందు, సక్త=తగిలి యుండు, హారాః=హారములు కలిగిన, కందర్పదర్ప=మదనుని తాపాధిక్యములచే, శిథిలీకృత=చిక్కిన, గాత్రయష్ట్యః=సన్నని శరీరములుగలవారునగు, నార్యః=స్త్రీలు, మధుర=కమ్మని, కోకిల=కోయిలలయొక్క, భృంగ=తుమ్మెదలయొక్క, నాదైః=కూతలచేత (ఝుంకారములు),నరాణామ్=మానవులయొక్క, హృదయమ్=హృదయమును, ప్రసభమ్ =బలవంతముగా, హరన్తి=హరించుచున్నారు.

**తాత్పర్యము:-** వసంతర్తువున 1) పిఱుదులపై వ్రేలాడుచుండు బంగరు మొలనూళ్ళు కలిగిన, 2) స్తనములందుతగిలియుండు హారములు కలిగిన,3) మదనతాపాధిక్యముచే చిక్కి శల్యమైన శరీరములు కలిగిన స్త్రీలు, కమ్మని కోయిల కూతలచేత, తుమ్మెదల ఝుంకారములచేత మానవుల హృదయములను బలవంతముగ హరించుచున్నారు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) ఆలమ్బిహేమరశనాః-హేమ్నః రశనాః, హేమరశనాః, షష్ఠీతత్పురుషః - ఆలమ్బిన్యః హేమరశనాః యాసాం తాః - బహువ్రీహిః.
2) స్తనసక్తహారాః - స్తనయోః సక్తో హారో యాసాం తాః - బహువ్రీహిః.
3) కందర్ప..... యష్ట్యః - కందర్పస్య దర్పః, కందర్పదర్పః, కందర్పదర్పేణ శిథిలీకృతాః గాత్రయష్ట్యో యాసాం తాః తథావిధాః - బహువ్రీహిః.
4) మధుర.. నాదైః - కోకిలాశ్చ భృంగాశ్చ కోకిలభృంగాః-ద్వంద్వః - తేషాం నాదాః - షష్ఠీతత్పురుషః-మధురాశ్చతే కోకిలభృంగనాదాః తైః - కర్మధారయః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) కార్ష్ణ్యం భరతీతి భృంగః. భృఞ్ భరణే. నలుపును భరించునది. **'ద్విరేఫ పుష్పలిట్ భృంగ షట్పద భ్రమరాళయః',**
2) 'ప్రసభం తు బలాత్కారో హఠః' అని అమరము. సభాశబ్దేన యుక్తాయుక్త విచారో లక్ష్యతే ప్రగతః యుక్తాయుక్త విచారోఽ త్రేతి ప్రసభమ్.

c) **గుణము - మాధుర్యప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - 'వసన్తతిలకా' వృత్తము.

g) **క్రియాదర్శము :-** 'హరన్తి'.

**శ్లో॥ నానామనోజ్ఞకుసుమద్రుమభూషితాన్తా**
**న్హృష్టాన్యపుష్టనినదాకులసానుదేశాన్।**
**శైలేయజాలపరిణద్ధశిలాతలౌఘా**
**న్దృష్ట్వా జనః క్షితిభృతో ముదమేతి సర్వః॥ 25**

**పదవిభాగము:-** నానా మనోజ్ఞ కుసుమ ద్రుమ భూషితాన్తాన్+హృష్ట+అన్యపుష్ట నినద+ఆకులసానుదేశాన్ శైలేయజాలపరిణద్ధశిలాతల+ఓఘాన్+దృష్ట్వా జనః క్షితిభృతః ముదమ్+ఏతి సర్వః.

**అన్వయక్రమము:-** నానా మనోజ్ఞ కుసుమద్రుమ భూషిత అన్తాన్ హృష్ట అన్యపుష్ట





నినద ఆకుల సానుదేశాన్ శైలేయజాల పరిణద్ధ శిలాతల ఓఘాన్ క్షితిభృతః దృష్ట్వా సర్వః జనః ముదమ్ ఏతి.

**ప్రతిపదార్థము:-** నానా=వివిధములైన, మనోజ్ఞ=సుందరములైన, కుసుమద్రుమ=పూల చెట్లతో, భూషిత=అలంకరింపబడిన, అన్తాన్=ప్రాంతములు కలిగినదియు, హృష్ట= ఆనందముగను, అన్యపుష్ట=కోకిలయొక్క, నినద=ధ్వనులచే, ఆకుల=వ్యాకులమైన, సానుదేశాన్=కొండచరియలు కలిగిన, శైలేయ జాల=గండ శిలల కుప్పలతో, పరిణద్ధ= కట్టబడిన, శిలాతల=ఱాతిప్రదేశముల, ఓఘాన్= సముదాయములు కలిగిన, క్షితిభృతః =పర్వతములను, దృష్ట్వా=చూచి, సర్వః=సమస్త, జనః=జనము, ముదమ్=సంతసమును, ఏతి=పొందుచున్నది.

**తాత్పర్యము:-** 1) సుందరములైన వివిధ రకముల పూలచెట్లతో అలంకరింపబడిన ప్రాంతములు కలిగిన, 2)ఆనందముగనున్న కోకిల ధ్వనులచే వ్యాకులమైన కొండ చరియలు కలిగిన, 3) గండశిలలతో పరివృతమైన శిలాప్రదేశములు కలిగిన, **పర్వతములను** చూచి సమస్త జనము సంతసమును పొందుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) నానా.... అన్తాన్ - నానా చ తాని మనోజ్ఞాని కుసుమాని, నానా మనోజ్ఞ కుసుమాని - కర్మధారయః - తేషాం ద్రుమాః, నానామనోజ్ఞకుసుమ ద్రుమాః - షష్ఠీతత్పురుషః, నానామనోజ్ఞకుసుమద్రుమైః భూషితా అన్తా యేషాం తాన్ - బహువ్రీహిః.
2) హృష్టాన్య... దేశాన్ - హృష్టా యే అన్యపుష్టాః, హృష్టాన్యపుష్టాః - కర్మధారయః - తేషాం నినదః, హృష్టాన్యపుష్టనినదః - షష్ఠీతత్పురుషః - తేన ఆకులః సానుదేశో యేషాం తాన్ - బహువ్రీహిః.
3) శైలేయ.... ఓఘాన్ - శైలేయానాం జాలః - షష్ఠీతత్పురుషః - తేన పరిణద్ధః శిలాతలౌఘః - యేషు తాన్ - బహువ్రీహిః

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) సనోతి సుఖం దదాతీతి సానుః. షణు దానే. సుఖము నిచ్చునది. **'స్నుః ప్రస్థ స్సాను రస్త్రియామ్'.**

c) **గుణము - ఓజస్సు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - వసన్తతిలకా వృత్తము.

g) **క్రియాదర్శము:-**ఏతి.వివరములు ఈ సర్గనందలి 7వ శ్లోకభాగమున చూడదగును.

శ్లో॥ నేత్రే నిమీలయతి రోదితి యాతి శోకం
ఘ్రాణం కరేణ విరుణద్ధి విరౌతి చోచ్చైః।
కాన్తావియోగపరిఖేదితచిత్తవృత్తి
ర్దృష్ట్వాధ్వగః కుసుమితాన్సహకారవృక్షాన్॥ 26

**పదవిభాగము:-** నేత్రే నిమీలయతి రోదితి యాతి శోకం ఘ్రాణమ్ కరేణ విరుణద్ధి విరౌతి చ+ఉచ్చైః కాన్తావియోగపరిఖేదితచిత్తవృత్తిః+దృష్ట్వా+అధ్వగః కుసుమితాన్+ సహకారవృక్షాన్.

**అన్వయక్రమము:-** కాన్తా వియోగ పరిఖేదిత చిత్తవృత్తిః అధ్వగః కుసుమితాన్ సహకారవృక్షాన్ దృష్ట్వా నేత్రే నిమీలయతి రోదితి శోకమ్ యాతి కరేణ ఘ్రాణమ్ విరుణద్ధి ఉచ్చైః విరౌతి చ.

**ప్రతిపదార్థము:-** కాన్తా=ప్రియురాలియొక్క, వియోగ=ఎడబాటుచే, పరిఖేదిత=పరిత పింపజేయబడిన, చిత్తవృత్తిః=మనఃస్థితికలవాడై, అధ్వగః=బాటసారి, కుసుమితాన్ =పుష్పించిన, సహకారవృక్షాన్=తీయ మామిడి వృక్షములను, దృష్ట్వా=చూచి, నేత్రే= కన్నులను, నిమీలయతి=మూసికొనుచున్నాడు, రోదితి=బిగ్గరగా ఏడ్చుచున్నాడు. శోకమ్=దుఃఖమును, యాతి=పొందుచున్నాడు, కరేణ=చేతితో, ఘ్రాణమ్=ముక్కును, విరుణద్ధి=మూయుచున్నాడు, ఉచ్చైః=బిగ్గరగా, విరౌతి చ=అరచుచున్నాడు.

**తాత్పర్యము:-** ప్రియురాలి ఎడబాటుచే పరితపించు మనః స్థితిగల బాటసారి 1)పుష్పించిన తీయమామిడి వృక్షములను చూచి కన్నులు మూసికొనుచున్నాడు, 2) బిగ్గరగా ఏడ్చుచున్నాడు, 3) దుఃఖమును పొందుచున్నాడు, 4)చేతితో ముక్కును మూయుచున్నాడు, 5)బిగ్గరగా (ఓ ప్రియా అని) అరచుచున్నాడు.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) కాన్తా..... వృత్తిః - కాన్తాయాః వియోగః - కాన్తావియోగః - షష్ఠీతత్పురుషః తేన పరిఖేదితచిత్తవృత్తిః యస్యాసౌ తథావిధః - బహువ్రీహిః.

2) సహకారవృక్షాన్ - సహకారస్య వృక్షాన్ - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) అధ్వానం గచ్ఛతీత్యధ్వనీనః, అధ్వగః, అధ్వన్యశ్చ. అధ్వనీనో ఽ ధ్వగో ఽ ధ్వన్యః పాన్థః పథిక ఇత్యపి.

c) **గుణము - మాధుర్య ప్రసాదములు** d) **రీతి - వైదర్భి**

e) **ఛందస్సు - వృత్తము:-** శక్వరీ ఛందస్సు - 'వసన్తతిలకా' వృత్తము.





g) **క్రియాదర్శము :-** 1) నిమీలయతి 2)రోదితి, 3)యాతి, 4)విరుణద్ధి, 5)విరౌతి.

1) విరుణద్ధి:- లట్ ప్రథమపురుష ఏకవచనము. కర్త్రర్థము. తి-తిప్ ప్రత్యయము. వి=ఉపసర్గ.

**ధాతువు:- రుధ్-రుధిర్-ఆవరణే** - అడ్డగించుట. రుధాది (7) ప్రకరణధాతువు. 'న' వికరణ ప్రత్యయము.

ప్రక్రియ:

1) (7) వ గణధాతువులకు 'న' అను వికరణ ప్రత్యయము చేరును. ఇది ధాతువులోని చివరి అచ్చునకు పరముగా చేరును. రుధ్ + తి > రునధ్+తి > రుణధ్ + తి

2) వర్గచతుర్థాక్షరములకంటే పరమయిన తకార థకారములకు ధ కారము ఆదేశమగును. (ఝషస్తథో ర్ధోఽ ధః) రుణధ్ + తి > రుణధ్ + ధి

3) వర్గచతుర్థాక్షరములు పరమగునపుడు అనునాసికేతర వర్గీయాక్షరములకు ఆవర్గమునందలి తృతీయాక్షరము ఆదేశమగును. (ఝలాం జశ్ ఝశి). రుణధ్ + ధి > రుణద్ + ధి > రుణద్ధి.

2) విరౌతి:- పరస్మైపది. లట్ ప్రథమపురుష ఏకవచనము. తి-తిప్ ప్రత్యయము. వి=ఉపసర్గ.

ధాతువు:- రు. అరచుట - అదాది (2) ప్రకరణ ధాతువు. వికరణ ప్రత్యయము ఉండదు.

ఏ) రెండవ గణమునందలి ధాతువుల చివరి ఉకారమునకు హలాది దృఢ ప్రత్యయము పరమగునపుడు వృద్ధివచ్చును. కనుక రు+తి > రౌతి.

బి) ఈ క్రియకు మరో రూపము - రవీతి. తు, రు, స్తు అను ధాతువులకంటే పరమయిన లట్, లఙ్, లోట్, విధిలిఙ్ అను లకారముల హలాది ప్రత్యయములు ముందు వికల్పముగా ఈ కారాగమము వచ్చును. కనుక రు+తి > రు+ఈతి > రవ్ + ఈతి > రవీతి

3) ఏ) విప్రియతేఽపరజతి ద్వేష్టి ద్వేషేఽపరజ్యతి, విరుణద్ధి విగృహ్ణాతి పంచామీ చాత్మనేపదే. (ఆఖ్యాతచంద్రికా 1-3-4)

బి) 1) శబ్దాయతే క్వణాతి చ రౌతి భ్రణతి రాసతే..

2) గవతే ఘోషతి రవీత్యపి స్యమతి కాయతి (ఆఖ్యాతచంద్రికా 1-5-1)

శ్లో॥ సమదమధుకరాణాం కోకిలానాం చ నాదైః
కుసుమితసహకారైః కర్ణికారైశ్చ రమ్యః।
ఇషుభిరివ సుతీక్ష్ణైర్మానసం మానినీనామ్
తుదతి కుసుమమాసో మన్మథోద్వేజనాయ॥ 27

**పదవిభాగము:-** సమదమధుకరాణామ్ కోకిలానామ్ చ నాదైః కుసుమితసహకారైః కర్ణికారైః+చ రమ్యః ఇషుభిః+ఇవ సుతీక్ష్ణైః+మానసమ్ మానినీనామ్ తుదతి కుసుమమాసః+మన్మథ+ఉద్వేజనాయ.

**అన్వయక్రమము:-** కుసుమితసహకారైః చ కర్ణికారైః రమ్యః కుసుమమాసః సుతీక్ష్ణైః ఇషుభిః ఇవ సమద మధుకరాణామ్ కోకిలానామ్ చ నాదైః మన్మథ ఉద్వేజనాయ మానినీనామ్ మానసమ్ తుదతి.

**ప్రతిపదార్థము:-** కుసుమితసహకారైః=పూచిన తీయమామిడిచెట్లచేతను, చ=మరియు, కర్ణికారైః=కొండగోగుల చేతను, రమ్యః=రమణీయమైన, కుసుమమాసః=వసన్తర్తువు, సుతీక్ష్ణైః=వాడియైన, ఇషుభిః ఇవ=బాణములవలె, సమద=మదముతోకూడిన, మధుకరాణామ్=తుమ్మెదలయొక్క, చ=మరియు, కోకిలానామ్=కోకిలలయొక్క, నాదైః =ధ్వనులచేత, మన్మథ+ఉద్వేజనాయ=కామునుద్దీపింపజేయుటకు, మానినీనామ్= మానవతులయొక్క, మానసమ్=మనస్సును, తుదతి=పీడించుచున్నది.

**తాత్పర్యము:-** విరగబూసిన మామిడి మరియు కొండగోగులచే రమ్యమైన వసన్తర్తువు, వాడియైన బాణములవలె మదముతో కూడిన తుమ్మెదల మరియు కోయిలల ధ్వనులచే కామోద్దీపనము చేయుచు స్త్రీల మనస్సులను పీడించుచున్నది.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) కుసుమిత సహకారైః - కుసుమితాశ్చతే సహకారాః తైః - కర్మధారయః.
2) కుసుమమాసః - కుసుమానాం మాసః - షష్ఠీతత్పురుషః.
3) సమదమధుకరాణామ్ - సమదాశ్చ తే మధుకరాః తేషామ్ - కర్మధారయః
4) మన్మథోద్వేజనాయ - మన్మథస్య ఉద్వేజనాయ - షష్ఠీతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) మధుకరోతీతి మధుకరః. డుకృఞ్ కరణే. పూఁదేనెను జేయునది.
**'మధువ్రతో మధుకరో మధులిణ్మధుపాళినః'** -

c) **గుణము - మాధుర్యప్రసాదములు**

d) **రీతి - వైదర్భి**

e) **అలంకారము:** 'ఉపమా'.

1. కోకిలలు, తుమ్మెదల ధ్వనులు వాడియైన బాణములని వర్ణించుటచే నిట ఉపమాలంకారమున్నదని చెప్పదగును.

f) **ఛందస్సు - వృత్తము:-** అతిశక్వరీ ఛందస్సు-మాలినీవృత్తము.





g) **క్రియాదర్శము :-** తుదతి - లట్ ప్రథమపురుష ఏకవచనము. పరస్మైపది. (6) వికరణ ధాతువు.

**ధాతువు :-** తుద్ - నొప్పించుట. ఈ ధాతువివరములు ఇంతకుమునుపు చెప్పబడినది.

**శ్లో॥ ఆమ్రీ మఞ్జులమఞ్జరీ వరశరః సత్కింశుకం యద్ధను**
**ర్జ్యా యస్యాలికులం కలఙ్కరహితం ఛత్రం సితాంశుః సితమ్।**
**మత్తేభో మలయానిలః పరభృతా యద్వన్దినో లోకజి**
**త్సోఽయం వో వితరీతరీతు వితనుర్భద్రం వసన్తాన్వితః॥28**

**పదవిభాగము:-** ఆమ్రీ మంజులమంజరీవరశరః సత్కింశుకమ్ యత్+ధనుః జ్యా యస్య+అలికులమ్ కలంకరహితమ్ ఛత్రమ్ సితాంశుః సితమ్ మత్తేభః మలయానిలః పరభృతాః యత్+వన్దినః లోకజిత్+సః+అయమ్ వః వితరీతరీతు వితనుః+భద్రమ్ వసన్త+అన్వితః.

**అన్వయక్రమము:-** యస్య ఆమ్రీ మంజుల మంజరీ వరశరః సత్కింశుకమ్ యత్ ధనుః యస్య అలికులమ్ సితాంశుః యస్య కలంకరహితమ్ సితమ్ ఛత్రమ్ మలయానిలః యస్య మత్తేభః పరభృతాః యద్ వందినః వసన్తాన్వితః యః వితనుః లోకజిత్ సో ఽయమ్ వః భద్రమ్ వితరీతరీతు.

**ప్రతిపదార్థము:-** యస్య=ఎవనికి, ఆమ్రీ=మామిడి సంబంధమగు, మంజుల=మనోహరమగు, మంజరీ=పూగుత్తి, వరశరః=శ్రేష్ఠమగు బాణమో, సత్కింశుకమ్=యోగ్యమగు మోదుగపుష్పము, యద్ధనుః=ఎవనివిల్లో, యస్య=ఎవనికి, అలికులమ్=తుమ్మెదల సమూహము, జ్యా=నారియో, యస్య=ఎవనికి, సితాంశుః=చంద్రుడు, కలంకరహితమ్= కళంకములేని, సితమ్=తెల్లని, ఛత్రమ్=గొడుగో, యస్య=ఎవనికి, మలయానిలః =మలయానిలమే, మత్తేభః=మత్తగజమో, పరభృతాః=కోయిలలు, యద్వందినః=ఎవనికి స్తుతిపాఠకులో, సః=ఆతడు, అయమ్=ఈ, లోకజిత్=లోకములను జయించు, వితనుః =మన్మథుడు, వసన్తాన్వితః=వసన్తునితో కూడినవాడై, వః=మీకు, భద్రమ్=కళ్యాణమును, వితరీతరీతు=కలిగించుగాక.

**తాత్పర్యము:-** ఎవనికి మావిపూలగుత్తి శ్రేష్ఠమగుబాణమో, మోదుగపుష్పము ఎవనికి శ్రేష్ఠమగు విల్లో, ఎవనికి తుమ్మెదలసమూహము నారియో, ఎవనికి చంద్రుడు కళంకములేని తెల్లని గొడుగో, ఎవనికి మలయమారుతమే మత్తగజమో, కోయిలలు ఎవనికి స్తుతిపాఠకులో అతడు ఈ లోకములను జయించు మన్మథుడు. మన్మథుడు వసన్తునితో కూడి మీకు కళ్యాణమును కలిగించుగాక.

**పదాదర్శవిశేషములు:-**

a) **సమాసములు:-**

1) మంజులమంజరీ – మంజులా చాసౌ మంజరీ – కర్మధారయః.
2) కలంకరహితమ్ – కలంకేన రహితమ్ – తృతీయాతత్పురుషః.
3) సితాంశుః – సితాః అంశవో యస్యాసౌ తథావిధః – బహువ్రీహిః.
4) మత్తేభః – మత్తశ్చాసౌ ఇభః– కర్మధారయః.
5) వసన్తాన్వితః – వసంతేన అన్వితః – తృతీయాతత్పురుషః.

b) **నిఘంటు ప్రమాణములు:-**

1) మాద్యతీతి మత్తః. మదీ హర్ష గ్లేపనయోః మదించునది. **ప్రభిన్నో గర్జితో మత్తః**

c) **గుణము – మాధుర్యప్రసాదములు** d) **రీతి – వైదర్భి**

e) **ఛందస్సు – వృత్తము:-** అతిధృతి ఛందస్సు – శార్దూలవిక్రీడితము

లక్షణము:- 1) ప్రతిపాదమునందు 19 అక్షరములుండును.
2) 'సూర్యాశ్వైర్యది మః సజౌ సతతగాః శార్దూలవిక్రీడితమ్'
3) మ, స, జ, స, త, త, గ అను గణములుండును.
4) యతి (12.7)

ఉదా: ఆ మ్రీ మం | జు ల మం | జ రీ వ | ర శ రః – స త్విం శు | కం య ద్ధ | ను
U U U | I I U | I U I | I I U | U U I | U U I | U
మ స జ స త త గ

పాదాంతలఘువు గురువు.

f) **క్రియాదర్శము :-** 'వితరీతరీతు' – పరస్మైపది. లోట్ ప్రథమపురుష ఏకవచనము. వి=ఉపసర్గ.

**ధాతువు :-** వితరీతరీతు

1) యఙ్లుగంతము. యఙ్ ప్రత్యయము వికల్పముగ లోపించును. ధాతువుపై యఙ్ ప్రత్యయముచేసి యఙ్‌నకు లోపముచేయగా దానికి సంబంధించిన మార్పులు ధాతువులో వచ్చినపిదప – యఙ్‌లు గంతము ఏర్పడుచున్నది. యఙ్లుగంతము పరస్మైపదములో ఉండును. వీటి ప్రయోగము తక్కువ.

**ధాతువు :-** వి+తౄ = భ్వాది (1) కరణ ధాతువు. పరస్మైపది. వి ఉపసర్గ వలన ప్రసాదించుట అను అర్థము వచ్చును.

ప్రక్రియ:-1) తౄధాతువునకు 'పునఃపునః అతిశయేన వా తరతి' అను అర్థమున యఙ్ చేర్చిన పిదప 'తౄ+య' అనియుండగా యఙో చిచ అను సూత్రముచే, యఙ్‌కులోపము. యఙన్తముగాన ద్విత్వాభ్యాసకార్యములు. కనుక తౄతౄ 'తర్





తర్' అనియుండగా ఇది ధాతుసంజ్ఞకముగాన లడాదిలకారములు చేరును. 'శేషాత్కర్తరి పరస్మైపదమ్' అను సూత్రముచే పరస్మైపది ప్రత్యయములు మాత్రమే చేరును. అనగా యఙ్లుగన్తరూపములన్నియు పరస్మైపదమునందు మాత్రమే ఉండును.

2) 'యఙోవా' అను సూత్రముచే సార్వధాతుకమునకు ఈట్ వర్తించును. కనుక తర్ తర్+ ఈ + తు > తరీ తరీ + తు > తరీతరీతు. వి అను ఉపసర్గను చేర్చుటచే ఇది 'వితరీతరీతు' గా నుండును.

3) 'వితరత్యర్పయతి చ చణత్యతిసృజత్యపి' అని 'ఆఖ్యాతచన్ద్రికా'.

**శ్రీః**

## వృత్త విషయ సంగ్రహః

| సర్గలు / వృత్తములు | ఇంద్రవజ్రా | ఉపేన్ద్రవజ్రా | ఉపజాతి | వంశస్థవిలము | వసన్తతిలకా | మాలినీ | శార్దూలవిక్రీడితమ్ |
|---|---|---|---|---|---|---|---|
| 1వ సర్గ 28 శ్లోకములు | – | – | – | 1–21 | – | 22–28 | – |
| 2వ సర్గ 28 శ్లోకములు | – | – | – | 1–19 | 20, 21 | 22–28 | – |
| 3వ సర్గ 26 శ్లోకములు | – | – | – | – | 1–20, 25 | 21–24, 26 | – |
| 4వ సర్గ 18 శ్లోకములు | – | 2 | 1, 3–12 | – | 13–17 | 18 | – |
| 5వ సర్గ 16 శ్లోకములు | – | – | – | 1–10 | – | 11–26 | – |
| 6వ సర్గ 28 శ్లోకములు | 10, 15 | 6 | 2–5, 7–9, 11–14, 16 | 1 | 17–26 | 27 | 1 |
| 144 | 2 | 2 | 23 | 51 | 38 | 27 | 1 |

1వ సర్గ – 18 శ్లోకము – 3వ పాదము – 'ఇంద్రవంశా'

**లక్షణములు:–**

ఎ) ఇంద్రవజ్రా – స్వాదిన్ద్రవజ్రా యది తాజగౌగః।
బి) ఉపేన్ద్రవజ్రా – ఉపేన్ద్రవజ్రా ప్రథమే లఘౌ సా ।
సి) ఉపజాతి – అనన్తరోదీరిత లక్ష్మభాజౌ పాదౌ యదీవావుపజాతయస్తాః ఇత్థం కిలాన్యాస్వపి మిశ్రితాసు వదన్తి జాతిష్విదమేవ నామ.
డి) ఇంద్రవంశా – తచ్చేన్ద్రవంశా ప్రథమాక్షరే గురౌ।
యి) వంశస్థ – వదన్తి వంశస్థమిదం జతౌ జరౌ।
యఫ్) వసన్తతిలకా – ఉక్తా వసన్తతిలకా తభజా జగౌగః।
జి) మాలినీ – ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః।
హచ్) శార్దూలవిక్రీడితమ్ – సూర్యాశ్వైర్యది మః జసౌసతతగాః శార్దూలవిక్రీడితమ్ ।





## ఉపయుక్త గ్రంథాః


1. The Rthusamhara of Kalidasa - M.R. Kale
2. ఋతుసంహారమ్ ఆంధ్రానువాదము – జి.వి.యస్.యస్. శర్మ
3. ఋతుసంహారమ్ – వ్యాఖ్యాకారః – రవిప్రసాదద్వివేదీ
4. ఋతుసంహారమ్ – 'హరిప్రియా' వ్యాఖ్యా – లక్ష్మీప్రసన్నాచార్యః
5. ఋతుసంహారమ్ – ఆంధ్రటీకాతాత్పర్యము – వావిళ్ళ రామస్వామిశాస్త్రులు & సన్స్
6. 'శబ్దసాగరః' – Sanskrit English Dictionary- Chowkhamba S.S.Office
7. బృహత్ ధాతుకుసుమాకరః – Chowkhamba Samskrit Prathistan
8. క్రియాదర్శము – శ్రీ కాశీ కృష్ణాచార్య
9. బృహత్ శబ్దకుసుమాకరః – Chowkhamba Samskrit Prathistan
10. Pratical Sanskrit English Dictionary - APTE
11. కుమార వ్యాకరణము – పింగళి లక్ష్మీకాంతం
12. సంస్కృత వ్యాకరణము – డా॥ R.V.R. కృష్ణశాస్త్రి, కృష్ణానంద మఠం.
13. సంస్కృత భాషా ప్రవేశిక – కె.యస్. రామానుజాచార్యులు
14. సంస్కృత వ్యాకరణము – ఆచార్య దివాకర్ల వేంకటావధాని
15. సంస్కృతవ్యాకరణప్రకాశిక – కె.ఏ. కృష్ణమాచార్యులు
16. మధుమాసము – జ్యోతిరాణి గారి వ్యాసము.
17. అమరకోశమ్

## అకారాది శ్లోకానుక్రమణికా

గ్రీష్మ - 1    ప్రావృట్ - 2    శరత్ - 3
హేమంత - 4    శిశిర - 5    వసంత - 6

* * * *





# క్రియలు - క్రియా సంబంధ ప్రత్యయాంత పదములు

## 1వ సర్గ

1) ఉపాగతః, 2) యాన్తి, 3) భవన్తి, 4) శమయన్తి, 5) క్రియతే, 6) ప్రకుర్వతే, 7) నివేశయన్తి, 8) విబోధ్యతే, 9) యాతి, 10) శక్యతే, 11) ప్రధావితా, 12) కుర్వతే, 13) నిషీదతి, 14) హన్తి, 15) బిభ్యతి, 16) ఘ్నన్తి, 17) విశతి, 18) నిషీదతి, 19) కృతమ్, 20) హన్తి, 21) నిస్సృతమ్, 22) విదధతి, 23) ప్రోద్ధరతి, 24) పరిదగ్ధాః, 25) జ్వలతి, స్ఫుటతి, ప్రసరతి, గ్లపయతి, 26) స్ఫురతి, భ్రమతి, 27) సంవిశన్తి, 28) వ్రజతు.

## 2వ సర్గ

1) సమాగతః, 2) సమాచితమ్, 3) ప్రయాన్తి, 4) దధతః, తుదన్తి, 5) విభాతి, 6) నృత్యమ్, 7) ప్రయాన్తి, 8) హరన్తి, 9) ప్రకరోతి, 10) ప్రయాన్తి, 11) పరిష్వజన్తే, 12) స్థితాః, 13) ప్రయాతి, 14) పతన్తి 15) చితాః, 16) జనయన్తి, 17) కరోతి, 18) సంజనయన్తి, 19) హరన్తి, 20) బిభ్రతి, 21) ప్రవిశన్తి, 22) అపహృతమ్, 23) ధత్తే, 24) రచయతి, 25) దధతి, 26) పరిహరతి, 27) హ్లాదయన్తి, 28) దిశతు.

## 3వ సర్గ

1) ప్రాప్తా, 2) కృతాని, 3) ప్రయాన్తి, 4) సంలక్ష్యతే, 5) ఉత్కణ్ఠయతి, 6) విదారయతి, 7) ప్రయాతి, 8) కుర్వన్తి, 9) దహతి, 10) చలయతి, 11) ఉత్కణ్ఠయన్తి, 12) పశ్యన్తి, 13) స్ఫురతి, ధున్వన్తి, 13) ఉపగతా, 14) ఉత్కణ్ఠయన్తి, 15) ఉత్కణ్ఠయతి, 16) జనయన్తి, 17) జితా, 18) హరతి, 19) నివేశయన్తి, 20) విభూషయన్తి, 21) వహతి, 22) వాన్తి, 23) లీయతే, 24) రోదితి, 25) ప్రయాతి, 26) ప్రతిదిశతు.

## 4వ సర్గ

1) సముపాగతః, 2) అలంక్రియన్తే, 3) ప్రయాన్తి, 4) భూషయన్తి, 5) కుర్వన్తి, 6) హసన్తి, 7) ఆక్రందతి, 8) ఉత్సుకయన్తి, 9) హసన్తి, 10) యాతి, 11) శేతే, 12) సంసూచ్యతే, 13) నిరీక్షతే, 14) ప్రయాతి, 15) కుర్వన్తి, 16) పరిదధాతి, 17) విదధతి, 18) ప్రదిశతు.

## 5వ సర్గ

1) శృణు, 2) ప్రయాన్తి, 3) రమయన్తి, 4) భవన్తి, 5) విశన్తి, 6) విసస్మరుః, 7) భ్రమన్తి, 8) భూషయన్తి, 9) స్వపన్తి, 10) పిబన్తి, 11) వ్రజతి, 12) త్యజతి, 13) స్థితాః, 14) దధతి, 15) భూషయన్తి, 16) అస్తు.

## 6వ సర్గ

1) సముపాగతః, 2) చారుతరమ్, 3) దదాతి, 4) అలంక్రియన్తే, 5) ప్రయాన్తి, 6) ప్రయాన్తి, 7) ఉపైతి, 8) భవన్తి, 9) కరోతి, 10) స్థితః, 11) చకార, 12) ఆలిప్యతే, 13) ధత్తే, 14) ప్రకరోతి, 15) కుర్వన్తి, 16) కుర్వన్తి, 18) భవేత్, 19) భాతి, 20) నిహన్తి, 21) కృతమ్, 22) వాతి, 23) హరన్తి, 24) హరన్తి, 25) ఏతి, 26) యాతి, నిమీలయతి, రోదితి, విరుణద్ధి విరౌతి, 27) తుదతి, 28) వితరీతరీతు.